# ఆంధ్రశిల్పి

## సచిత్ర మాస పత్రిక

సంపాదకులు:

వి. ఆర్. చిత్రా: పి. గణపతిశాస్త్రి



౧౦, నరసింగపురం వీథి,

మౌంట్ రోడ్, మద్రాసు.

# వి ష యా ను క్ర మ ణి క

పుట.



## శిల్పాలు



సారనాథ్ ధ్యానబుద్ధుడు

# సంపాదక సమీక్షలు

## ప్రజారక్షణ శాసనం

మద్రాసు ప్రభుత్వం ఈ మధ్యన ప్రకటించి ప్రజారక్షణశాసనం ప్రజల్లోనేమి పత్రికల్లోనేమి తీవ్ర వాదోపవాదాలకు గురిఅయింది. తీవ్రప్రజాస్వామ్యవాది అయి ప్రజాహృదయాన్ని చూరగొన్న ప్రధాన మంత్రి ఈ శాసనం ప్రకటించడం ఎక్కువగా సంచలనం కలిగించడంలో ఆశ్చర్యంలేదు.

కాంగ్రెసు అనేకమైన ఆర్డినెన్సులకు గురి అయి అత్యధికమైన ప్రజాభిమానంతో ప్రభుత్వాధికారం స్వీకరించగలిగింది. ఇంతకు పూర్వం కాంగ్రెసునాయకులు అనేకమారులు ప్రత్యేక శాసనాలమీద దుమ్మెత్తి పోశారు. ఆ కాంగ్రెసు ప్రధానే ఇప్పుడు ఆర్డినెన్సు ప్రకటించడం హర్షించతగినవిషయం కానేరదు.

ఎవరూకూడా ఆర్డినెన్సు పరిపాలన సమర్థించలేరు. అయితే ఈ సందర్భంలో కొన్నివిషయాలు నిష్పాక్షికం విమర్శించుకోవలిసి ఉంటుంది.

ప్రజారక్షణంగాని, ప్రజాస్వామ్యంగాని ఎప్పుడూ ఒక వర్గానికి సంబంధించినవి కాగూడదు. ధనమదాంధులు నోరువాయీ లేని అనాథుల్ని పీల్చి పిప్పిచెయ్యడంగాని, లేక అనేకులు బలవంతులు చేరి ఒక ధనికునికి అన్యాయాలు చెయ్యడంగాని ప్రజాస్వామ్య ప్రభుత్వం సహించలేదు ; సహించగూడదు.

ఇక మలబారులోను, ఇంకా ఇతరత్రా కమ్యూనిస్టులు చేశారన్న దురాగతాలవిషయంలోకి వద్దాము.

ఈ విషయంలో ప్రభుత్వప్రకటనం ఎంత అతిశయోక్తితో నిండినదనుకున్నా—కమ్యూనిష్టుల ఆందోళనవల్ల అక్కడక్కడ ప్రమాదకరమైన ప్రత్యేకపరిస్థితులు ఏర్పడడం వాస్తవము. అందులోను 'ఇది కాంగ్రెసు ప్రభుత్వంగదా!' అన్నధీమా కూడా కమ్యూనిష్టుల్ని కొంత రెచ్చగొట్టి ఉంటుంది.

ఈ విషయంలో కమ్యూనిష్టుల ఆందోళనమాత్రం ఎంత మాత్రమూ సమంజసంగా లేదు. అచిరకాలంలో మద్రాసుప్రభుత్వం ఏకగ్రీవంగా జమీందారీశాసనం ప్రవేశపెట్టి జమీందారీ భూములన్నీ రైతులపరం అయ్యేటట్లు చెయ్యబోతూంది. ఇంతలో తొందరపడి కూలీలు బలవంతంగా భూములు ఆక్రమించుకోవడం దేనికి? అదీగాక దేశంలో ఆహారపరిస్థితి ఇంత తీవ్రంగా ఉన్నప్పుడు ఈ ఆందోళన నిజంగా ప్రజాక్షేమకరం కాగలదా? ఇక్కడ కమ్యూనిష్టుల ఆందోళన సరియైన దారిని పడలేదు.

అయితే, అంతమాత్రాన ప్రభుత్వం ప్రత్యేకశాసనం ప్రకటించకూడదు. ఒకవేళ అత్యంతావసరమైన పరిస్థితుల్లో అది తప్పనిసరి అయినా—ప్రభుత్వం వెంటనే ఒక శాసనం శాసనసభ ఎదట పెట్టి ఆమోదింపజెయ్యాలి. ఈ విషయం చాలామంది శాసనసభ్యుల్లోకూడా కలవరం కలిగించినట్లు వింటున్నాము. అందుచేత కాంగ్రెసుమంత్రివర్గం ప్రత్యేకశాసనం వెంటనే తొలిగించి, అవసరమైతే వెంటనే మరి ఒకశాసనం శాసనసభలో ఆమోదింపజెయ్యాలి. అంతవరకూ ఈ ఆర్డినెన్సువల్ల నిరపరాధులకు, సామాన్యపౌరులకు అన్యాయాలు జరగకుండా కనిపెట్టిచూడాలి. కార్మికుల్లోను, కర్షకుల్లోను బయలుదేరుతూన్న అసంతృప్తి ఏదైనాఉంటే అది న్యాయమార్గాల్లో తొలిగించాలి. కేవలం నిర్బంధవిధానంవల్ల ప్రజాశాంతి రక్షించడం దుష్కరం అన్నసంగతి కాంగ్రెసు ప్రభుత్వానికి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదనుకుంటు న్నాము. ప్రధానమంత్రి, ఈ విషయంలో ప్రజాహృదయస్పందనాలు గుర్తించుకుంటూ త్వరలో ఆర్డినెన్సు అంతం చెయ్యగలరనీ, ప్రజామోదం పొందిన శాసనంప్రకారమే ప్రజాశాంతి కాపాడగలరనీ ఆశిస్తున్నాము.

## అ భ్యు ద య ర చ యి త లు

అభ్యుదయరచయితల సభలు ఇంతకుపూర్వం మూడు జరిగాయి. ఆ సభలకి కొంతమంది సాహితీప్రముఖులు రావడమూ, అవి కొంతవరకు దేశంలో సంచలనం రేకెత్తించడమూ మనం ఎరుగుదుము. అయితే మద్రాసులో జరిగిన నాలుగో సమావేశానికీ, వాటికీ సామ్యమే లేదని చెప్పాలి.

మద్రాసులో జరిగిన చతుర్థసమావేశానికి ఎన్నుకోదగిన సాహితీప్రముఖులు చాలామంది వచ్చారు. సభలు దిగ్విజయంగా జరిగాయి. ఈ సందర్భంలో అభ్యుదయరచయితలు ఏర్పరిచిన చిత్రకళా ప్రదర్శనం చూచి విజ్ఞులందరూ చకితులై ముగ్ధులైనారు. చిత్రకళా ప్రదర్శన ప్రారంభకులయిన శ్రీ. వి. ఆర్. చిత్రాగారు ఈ చిత్రకళా ప్రదర్శనం చూచి, ఆంధ్రుల చిత్రకళాయుగంలో ఒక జాజ్వల్యమానమైన నూతనోత్తేజం ప్రారంభమయిందని అన్నారు. ముఖ్యంగా ప్రదర్శనం చూచినవారిలో చాలామంది "ఆంధ్రులు చిత్రకళలో ఇంత ఉచ్చస్థితిలో ఉన్నారే అని గ్రహించుకోలేక పోయామే!" అని ఆశ్చర్యపోయారు.

సాహితీరంగంలో వివిధాభిప్రాయాలు కలవారందరూ ఒకచోట నిలబడి తమ అభిప్రాయాలు నిష్పాక్షికంగాను, నిర్భయంగానూ ప్రకటించారు. ఈ విధమైన అభిప్రాయ ప్రకటనలవల్ల పెద్దలలోనూ, పిన్నలలోనూ సాహిత్యదృక్పథాలలో కొన్నిమార్పులు రావడానికి అవకాశం కలిగిందని చెప్పాలి. ఈ అభ్యుదయరచయితల సభలు ఇంత జనాకర్షకంగా జరగడానికి మదరాసులో అనేకప్రముఖులు అనేకవిధాల తోడ్పడ్డారు. ముఖ్యంగా నవ్యవాఙ్మయ సుప్రసిద్ధులయిన ఇద్దరు న్యాయమూర్తులు, ఆహ్వాన సంఘాధ్యక్షులుగాను, అధ్యక్షులుగాను ఉండడం ఈ సభలు ఇంత చక్కగా జరగడానికి కారణం అయింది. ఈ ఇద్దరూకాక ఇంకొక ఇద్దరు ఈ సభలకోసం ఎక్కువగా పరిశ్రమించి కృతకృత్యులైనారు. వారిలో మొదటివారు శ్రీ కృష్ణశాస్త్రిగారు; రెండవవారు శ్రీ చదలవాడ పిచ్చయ్యగారు.

అయితే సభలు సమాప్తికాగానే అనేకమంది అనేకవిధాల గుసగుసలు ప్రారంభించారు.

కొందరు "శ్రీకృష్ణశాస్త్రిగారు స్వయంగా పనికట్టుగుని ఉత్తరాలు వ్రాయడంవల్ల ఇంతమంది వచ్చారుగాని, లేక ఈ సభలకి ఇంతకు పూర్వం ఇంతమంది ఎప్పుడైనా వచ్చారా?" అన్నారు. కొంతమంది "కమ్యూనిష్టులు దేశంలో తమ పలుకుబడి పోతోందని గ్రహించి, ఈ అభ్యుదయరచయితల సభలద్వారా మళ్లీ పలుకుబడి సంపాదిస్తున్నా"రన్నారు. మరికొంతమంది "కమ్యూనిష్టులకి ఈ అభ్యుదయ రచయితల సభ ఒక ఉపాంగం" అన్నారు. మరికొందరు "రచయితల నందరినీ అభ్యుదయ రచయితలు బుట్టలో వేశా"రన్నారు. మరికొందరు "అభ్యుదయ రచయితలే టోపీలో పడ్డా"రన్నారు. ఈవిధంగా పరిపరివిధాల గుసగుసలు వ్యాపించాయి.

ఇవి కేవలం నిరాధారమైన నీలాపనిందలే కాని, వీటిని ఋజువు చెయ్యడానికి తగిన ఆధారాలేవీ కనబడవు. అయితే ఈ గుసగుసలు బయలుదేరడానికి కొన్ని కారణాలు లేకపోలేదు. ఈ అభ్యుదయ రచయితలు ప్రారంభంలో కొంతమంది సుప్రసిద్ధ రచయితలమీద, రచనలమీద, తీవ్రమైన ప్రతికూల విమర్శనాలు చేశారు. అందువల్ల చాలా మంది సుప్రసిద్ధ రచయితలు మొదట్లో ఈ సభలకి దూరదూరంగానే ఉండి పోతూవచ్చారు. అయితే క్రమేణ అభ్యుదయరచయితలు తాము చేసిన పొరబాట్లు సరిదిద్దుకున్నారు. క్రమక్రమంగా సాహిత్యమూల్యాలు, నాంఘికమూల్యాలు బాగా అవగాహనచేసుకున్నారు. ఈ నాడు నన్నయ మొదలు నవ్యాతినవ్య రచయితవరకూ పరిగణనీయులే అని నిశ్చయించుకున్నారు. నవ్యత వాఙ్మయానికి ఎంత అవసరమో సంప్రదాయం అంత ఆవశ్యకమని ఊహించారు. అల్లాంటప్పుడు సాహితీ పరులందరూ సహకరించడంలోనూ, సభాసాఫల్యానికి తోడ్పడంలోనూ ఆశ్చర్యం ఏమి ఉంది! సభలు జయప్రదంగా జరగడంలో మాత్రం విడ్డూరం ఏమి ఉంది!

అయితే సాహితీసమితి, నవ్యసాహిత్యపరిషత్తు, మొదలైన సాహిత్యపరిషత్తులుండగా ఈ అభ్యుదయ రచయితల సంఘం దేనికని

ప్రశ్న రావచ్చును. అభ్యుదయ రచయితల సంఘం సాహిత్యమూల్యాలు ఎంతగా గుర్తించుకున్నా, ఇది ప్రత్యేకంగా సాహిత్యంలో సాంఘిక మూల్యాల ప్రాధాన్యంకోసం ఏర్పడిన సంస్థ. అందుచేత అది ఆ విధమైన సాహిత్యానికి ఎక్కువగా ప్రోద్బలం ఇస్తూఉంటుంది. సాహితీసమితి, నవ్య సాహిత్య పరిషత్తు మొదలైన కేవలం రసమూల్యాలు కలిగినవి సాహిత్యం ఎక్కువగా ఆదరించవచ్చును. ఇది సమంజసమైన మార్గము.

అభ్యుదయ రచయితల సంస్థ ఇంకా జనాదరణపొంది, సాహితీ పరుల అభిమానం చూరగొనాలంటే దేశంలో ఏ విధమైన అపోహలకూ తావులేకుండా చెయ్యాలి. ముఖ్యంగా దీని సాహిత్యదృక్పథం నిర్వచించాలి. అభ్యుదయ రచయితల సంఘం ఏ రాజకీయ పక్షానికీ సంబంధించనిదే అన్నా, అపోహలకు ఏ మాత్రమూ తావు ఇవ్వడానికి వీల్లేని మార్గాలు అవలంబించాలి. ప్రత్యేక రాజకీయపక్షానికి చెందిన ఏ వ్యక్తులకూ ప్రధానాధికారపదవులు సంక్రమింప చెయ్యకూడదు. కేవలం రచనా సామర్థ్యం కలవారికే కార్యనిర్వాహక వర్గంలో స్థానం ఇవ్వాలి. అందులోనూ సజీవమైన అభ్యుదయరచన చెయ్యగలవారికి ఎక్కువ అవకాశం ఇవ్వాలి. ఎప్పటికప్పటికి ఏమరకుండా సంస్థ ప్రజాస్వామ్య పద్ధతులమీద నడిచేటట్లు చూడాలి. కేవలం ఉపన్యాసాలతోను, కావ్యపఠనాలతోను తృప్తిపడక వాఙ్మయరంగంలో నిర్దిష్టమైన కార్యకలాపం ఏర్పరుచుకుని నిర్వహించుకోవాలి.

అభ్యుదయ రచయితల సంఘం వాఙ్మయరంగంలో బాగా గట్టి పని చెయ్యగలదని ఆశ కలుగుతూ ఉంది. అభ్యుదయరచయితలు సంఘం సరియైన మార్గాల్లో నడుపుకుంటూ సజీవమైన అభ్యుదయసాహిత్యం సృజించగలరని హృదయపూర్వకంగా విశ్వసిస్తున్నాము.

# గుడిగంటలు

ఏలికవై జగమ్ములకు నేడు మలల్ పయిమెట్ట మీఁద శ్రీ
నీళలు జోలవాడ శయనించిన దేవర! మేలుకో. దయా
వాల! శ్రితానుకూల! శ్రుతిపారచర త్పదపద్మ! మేలుకో,
నీలసరోజపత్ర రమణీయవిలోకన! మేలుకోవయా!

అరుణగభస్తి సీగిరుల యంఘ్రులుముట్టి, ప్రదక్షిణించి, గో
పురశిఖరమ్ములం బాదివి, పుష్కరిణీ జలజాతకోశముల్
విరియఁగఁజేసి, పుప్పొడులు వేయుగరమ్ములఁ దాల్చినిల్చె, దే
వరతిరుమజ్జనమ్ము తఱివార్చి, జగత్పతి! మేలుకోగదే!

ఆడెదరచ్చరల్, కరము తోఁదలమోడ్చి బలారి మున్నుగా
వేఁడెద రాద్యులౌ మునులు, విప్రవరుల్ ద్రవిడ ప్రబంధముల్
పాడెదరోయి! శేషగిరివాస! హజారపుఁగొల్వువాఁకిటన్
గూడిరి విందులై హరిజనుల్, తెఱపించవె ద్వాఃకవాటముల్

చీమలబారులై, నగముచెంత విహంగమపంక్తులయ్యు, శా
ఖామృగతండమౌచు, మునిగాళుల దాఁటెడి మేకమందలై,
వామనమూర్తులై, దరియవచ్చిరిదే! నరనారు లో పరం
ధామనివాస! యీహరిజనమ్ములు విందయి తల్పుదీయవే

ఏడుకొండల నెక్కి యీ రేడు లోకముల్
పాలించుకొనెడి మాపాలి వేల్ప!
చేఁదుకోవె మమ్ము శ్రీనివాసా! వడ్డి
కాసులవాఁడ! వెంకన్నసామి!
అడుగడ్గు దండమ్ము లాపద మ్రొక్కుల
దేవరా! మముఁజేదుఁకోవె వరద!
వేంకటరమణ! గోవింద! హరీ! చేఁదు
కోవయా, దేవాదిదేవ! మమ్ము

# గుడిగంటలు

ఆందుకొమ్మింత చేయిచ్చి, జేదుకొమ్ము
చేదుకో, చేదుకోయంచుఁ జేతులెత్తి
హరిజనులు కొండలెగఁబ్రాకి రభయముద్ర
మెఱయఁ బ్రత్యక్షమగుమయ్య! తిరుమలయ్య!

అదె యిదె! శేషశైలమని యాదట నొండొరుఁ బిల్చుచున్, శ్రమ
బాదవిన నిన్నుఁ బేర్కొనుచు, నొక్కొకచో మలలెక్కివచ్చి, నీ
పదములు జూచు వేడ్కవిరబాఱిన వీరలకన్ను లెంతగా
గాదగాని యున్నవో, తలఁచుకో, కడకన్నులఁ గౌఁగిలించుకో!

వేంకటసామి, కొండపయి వేలుపు, భక్తులపాపపంక మి
ట్టింపుల నింకఁజేయఁగల యేలిక, దాసజనమ్ము కోరికల్
కొంకక నాల్గుచేతులను గొల్చి యొసంగెడిదాత యంచు నీ
వంకకుఁ బుట్టెఁడాస మెయిఁబర్విడివచ్చిరి తల్పుదీయవే!

దిద్దిన పట్టెనామములు, దీర్చిన తిర్మణిబొట్లు, మోములం
దొద్దిక, చూపులన్ నెనరు నుప్పతిలం గయిమోడ్పుమాలికల్
పెద్దలు బిన్నలున్ వరుసవెంబడి దాలిచి, వేచియుండ, దీ
వ్యద్దయ! డాగికోఁదగదయా! కడుదొడ్డ దొరాదులేవయా!

వేదశిఖాధ్వనీన, మరవిందసఖ,మ్మమరేంద్ర పూజిత,
మ్మాదిమసర్గమూల, మఖిలాశ్రితరక్షణ దక్షమైన శ్రీ
పాదయుగమ్ము దాలఁగని, పాణితలమ్ములుమోడ్చి, ధన్యులై
పోదురు వీరు; వాకిళులు మూయకు నీగుడికో దయాలయా!

అడుగఁగ రారు రాచరిక, మాపద మ్రొక్కుల వారుగారు, నీ
కుడుగర లీయలే, రడుగనొల్లనియర్థము వేఁడఁబోరు, పీ
రడిగిన దొక్కటే! విరచితాంజలి మాలలు మాలలెల్ల నీ
యడుగుగవన్ ప్రసన్నజనతార్తిహరమ్మును జూడనీయవే॥

శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు.

# జీవతంత్రి

విన్నాణముల వన్నెవన్నెచుక్కల జిల్గువల్వ లన్నిటిఁ జేసి వామి వేసి
విలువ ముత్తెముల పేరులతోఁడ పగడాల రతనాల హారాలు రాశివోసి
విరబూఁచుమల్లె పందిరియాచు మది కించు లలితకళాలయమ్ములకుఁ దొలఁగి
నగిషీలయరల దంతపు బీరువాలలో వెలుఁగు జాడలపొత్తములు త్యజించి
పుడమి విడచియు విడువఁడు పూర్వసార్వభౌమపదవీ ముహుస్స్వప్న భగ్నహృదయుఁ
డతఁడు మిగిలెను దేహమాత్రావశేషి యాంజనాహార యుడిగము లందుకొనుచు.

మనుమఁడు ఖిన్నముఖుండై
వెనువెన్కనె యొదిగి తాత బెంపుదనమ్మున్
గనుచును నిల్వఁ, గళారా
ధనఖని చిత్తరులు చూచి తత్తఱపడుచున్.

"కుంచియకుచ్చునుం గొనకుఁగూర్చిన మేల్తరమైన యూర్ధ్వభా
వాంచల సంచయం, బలుపమానాక రేఖకె వంగివచ్చి రో
మాంచముఁ గూర్చి తేర్చెడి రసానుభవమ్మును, జిత్రలేఖనా
భ్యంచిత దోహదాలు తడియారిన నాయెడకుం గుమారకా!
ఇదిచూవే ముముతాజిచిత్ర, మిది నాకెన్నన్నొ లోఁద్రవ్వి పై
నొదిగించెన్ సుచిరానుభూతు, లిట నేయొక్కండొ మజ్జీవికం
గదిలించెన్ బ్రదికించు నన్నిటులఁ, దత్కల్యాణమూర్తి ప్రభా
భ్యుదితానంద మరంద వీచికలలో నూఁగించు రాయంచేఁగా."

అని యాచిత్రముఁ గంటనద్దుకొను చోయన్ బాష్ప బిందుద్వయిం
దన ముంతాజి కరానరాల్చి, నవరత్నాంబు ప్రసాదంబు చో
ల్పున దీపించు రసప్రవాహ రుచిరంబున్ వాయులీనంబు నొ
య్యన ముద్దాడి పురస్థ్సలిన్ నిలిపి రోమాంచమ్ముతో నిట్లనున్.

''ఏతద్వాయు విలీనతానములె రేకెత్తించు నాలోఁ గళా
శ్రీతన్వీ పదకంజ మంజురవ కుంజీరోచ్చర ద్ఘంటికా
వ్రాతోద్భూత ఘులంఘులాఘులఘులప్రారంభ సంరంభమున్
చేతః ప్రీతికరమ్ము తాపహరమున్ నిశ్శ్రేయపాదమున్.

అదిగో మద్రాజ్యపాలన మంతదెచ్చె
ఇదిగో మత్పుత్రసంతాన మింతయుచ్చె
మిగిలినది యొక్కఁడే కళామృతకణాళి
ఒడలు పిడిచిన నాతోలి గడనలంచు.

ఇది పాయన్ మనసొప్పదు
తుదితో డిదియైన నగుచుఁ దోషము నిడు సం
చెద నమ్మితి, నూరట యె
య్యదో చితికినగుండె'' కనుచు నవియు నొసఁగుచున్.

పితలను దుర్గతి పఱచిన
సుతులకుఁ దమసుతులచేతి చోద్యప్రతిపా
దిత ప్రతిఫల మిదె కాదా
అతిచిత్రము భగవదిచ్ఛ!'' యని కనుమొగిచెన్.

శ్రీ పువ్వాడ శేషగిరిరావు.

# హృదయోపహారము

హృదయనిధాన! రాగభరమియ్యది నీకెటులో యెఱుంగఁజే
యుదునని తీవ్రనిశ్చయ సముత్సుక మానసతన్ మనోజ్ఞతా
స్పదమహితాంధ్రవాణి సరసస్వరశబ్దము లేర్చికూర్చి, నా
యెద వలపించుకైనఁ దలపింపగనేరమి వెచ్చనూర్చెదన్.

ఎదనుప్పొంగు తరంగభంగిమలతో నెంతే గభీరత్వ భీ
ప్రద మీ ప్రేమరసాబ్ధి నెంచి, కవితాప్రావీణ్య మున్నంతఁ జూ
పెదనేనిం బ్రణయమ్ముప్రతిమవార్చిందు స్ఫుటమ్మైనఁగా
నిదియుం జూచియు, నాకవిత్వమిది తన్వీ! వ్యర్థమం చెంచెదన్!

నినుదలపం దలంపఁ దరుణీ! యెదలోతుల నీలినీలిక్రొ
న్ననుమొయిళుల్ దళుక్కను మనోహరవైద్యుత భాస్సహస్ర స
ర్తనముల నైల్యభారవశతన్ మెలమెల్లగజారు; వానిభా
సనలవవేళ మిక్కవిత జాల్కొను నింద్రధనుః సహస్రమై!

భావము లెన్నియో ప్రణయభారమునం బరిపక్వగుచ్ఛద్రా
క్షావశతన్ నినున్ దలచినంత నెదన్ వడి నుద్భవించి, ని
ద్రావహ మాధురిన్ హృదయ మల్లన జల్లుమనంగఁజేయు, నిం
దేవి రచించుటోయని యొకింతయు నిశ్చయమందనేగదా!

నాహృదయమ్ము వోలెలలనా! భవదంతరముం బ్రపూర్ణరా
గాహృతమయ్యెనేని వృథయాగద! యీసకలమ్ము, కానిచో
నేహరియింపనేర్తునో! మరెన్నివిధమ్ములనైన నీమన
మ్మోహరినీలకుంతల! కృపోర్మిక నీ వలపున్ క్షమింతువో!

ఎదగలఁ బ్రేమలోన నొకయించుక నీకెరిగింపనేర్తునే
నదయహృదంతరా! నిమిషమైన నుపేక్షయొనర్ప కీవు వ
చ్చెద విక నన్ క్షమింపుమని చేడ్పడి వేడెదు; తథ్యమైన నే
నిదియెరిగింపలేమి రమణీ! మరి నీ విటరామియేగదా!

* * * * * *

శ్రీ పి, గణపతిశాస్త్రి.

# రాక్షసుని స్వగతం

సాహసిక యాత్రలేని
సాయంత్రం
సాయించదు నాకు
కోరలుతీసిన రాత్రి
కోరిన ఆనందం ఇవ్వదు.

చీకటి దట్టంగా క్రమ్మి
భయాన్ని వర్షించని
రోజంటే కిట్టదు నాకు.

నిర్జనమైన సాయంత్రపు
అడవులలో
దౌర్జన్యంతో క్రీడిస్తాను.

కొమ్ములు తిరిగినరాత్రి
అగడ్తలలో
భీభత్సంతో రమిస్తాను.

అప్రతిష్ఠతో నిందలతో
తడిసిన
జీవితాన్ని విప్పి
లోకంమీద ఆర వేస్తాను.

సభ్యత విడాకులిచ్చిన
సత్యాలను నేసి
ధరిస్తాను.

నీతి నియమాలను
శాసించే
జాతిమీద కాండ్రిస్తాను.

తంబీ! ఇదుగో
ఒకేఒక్క సత్యం
పిడికెడు బూడిదలో
భీభత్సం.

'ఆరుద్ర'

# గీతాంజలి

[శ్రీ రవీంద్రుని వంగమాతృకకు అనువాదం]

రేయి స్వప్నరాజి మాయ
  మాయె, మాయ మాయెరా!
పోయె బంధనమ్ములు, తెగి
  పోయెరా!

ఎడద తెర తొలంగె, బయలు
పడితి నిక విశాల జగతి
హృదయాంబుజ దళసంచయ
మెల్ల వికాసిల్లెర, వికసిల్లెరా!

ద్వారము భేదించి తుదకు
  కోరివచ్చి నిలిచెనతఁడె,
అశ్రుసిక్త హృదయము త
  చ్చరణమ్ముల సాగిలెన్!

ఆకసపు ప్రభాత రశ్మి
నా కొరకై చేయిసాచె!

మద్విభగ్న కారాగా
రాంగణమున మ్రోగెరా!
  జయనిధ్వని రేగెరా!

కడచె సంధ్య క్రమ్మె చాయ
  ధరణీతలమున!

రేవు జేరబోవుమోయి
  కలశము నించికొన!

జలవాహిని కలనిధ్వని
సంధ్యానభమున!

ఆ నిస్వన మనుసరింప
నందనిమంత్రణ!

  రేవు జేరబోవుమోయి
  కలశము నించికొన!

విజనపథమునను జనముల
  రాకపోక లాగె!

ప్రేమనదిని అనిలాహతి
  తరంగములు తూగె!

తిరిగి వత్తునో రానో
ఎవరి నచట దరియనౌనో!

రేవున నావ నెదో య
జ్ఞేయ వల్లకీ గుంజన!

  రేవు జేరబోవుమోయి
  కలశము నించికొన!

శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు.

# కృతిసమర్పణం

## శ్రీ బులుసు వేంకటరమణయ్య

కవులూ, గ్రంథకర్తలూ తాము రచించిన గ్రంథాల్ని తమ ప్రభువులకో, హితులకో, బంధువులకో అథవా దేవతలకో అంకితం చెయ్యడమనేది మన తెలుగువారిలో నన్నయనుంచి నేటిదాకా వ్యాపించి వున్న సంప్రదాయం. ఈ రచనలని అంకితమియ్యడమే కృతిసమర్పణమంటూ ప్రసిద్ధికెక్కినది.

నన్నయ తన భారతాన్ని ప్రభువైన రాజరాజనరేంద్రుడికి అంకితం యిచ్చాడు. తిక్కన హరిహరనాథుడనే దేవుడికిచ్చాడు. ఇలాగ కొందరు నరులకీ, మరికొందరు దేవతలకీ వారివారి కోరికలనుబట్టి అంకితంచేశారు. ప్రభువులకి అంకితంచెయ్యడంలో ధనాపేక్ష కారణము! మిత్రులు మున్నగువారికిచ్చారంటే ప్రీతి, మొగమోటము ఇత్యాదులు కారణాలు కావచ్చు. దేవతలకి అంకితం ఇవ్వడంలో సాక్షాత్తుగాగాని, పరంపరగాగాని భక్తికారణం! ప్రభువులుగాని, ధనికులుగాని కవిని గ్రంథం వ్రాయాలని కోరి, ఆగ్రంథాన్ని ఫలానాదేవతకి కృతి యివ్వవలసిందంటూ కూడా కోరవచ్చును కదా! పోతన్న మున్నగువారు తమగ్రంథాల్ని భగవదంకితాలుగా చేసినసంగతి అందరికీ తెలుసును.

నరాంకితాలయిన గ్రంథాలు కృతికర్తని 'అభ్యుదయ పరంపరాభివృద్ధి' కోసమున్నూ, దేవాంకితాలు భగవదర్పితాలుగానున్నూ రచింపబడినట్లు కృతికర్తల వచనాలనిబట్టి తెలుస్తూవున్నది.

మరోచిత్రం యేమిటంటే— గ్రంథకర్త కన్యాదాతగాను, గ్రంథం కన్యకగాను, దాన్ని గ్రహించినవాడు కృతికి పతిగాను చాలచోట్ల వర్ణింపబడినది. ఈ పద్ధతి యిప్పటికీవుంది. ఇలాంటిబాంధవ్యంలో జాతి, మతవిచక్షణకి అవసరం ఎంతమాత్రమూ లేదు.

తిక్కన నిర్వచనోత్తరరామాయణంలో వున్న

'ఏనిన్ను మామ యనియెడు
దీనికిఁ దగనిమ్ము భారతీకన్యక, నా
కీనర్హుఁడ వగుదని నను
భూనాయకు పల్కు చిత్తమున నింపగుదున్'

అనే పద్యాన్నిబట్టి పయిఅభిప్రాయం తిక్కనకాలానికే బాగా వ్యాప్తమై ఉన్నట్లు కనబడుతున్నది. పోతరాజుగారుకూడా భాగవతంలో

'బాల రసాలసాల నవ
పల్లవ కోమల కావ్యకన్యకన్
గూళలకిచ్చి......'

అంటూ పయిపద్ధతినే అనుసరించారు.

కృతిని కన్యకగా నిరూపించేపద్ధతి తెలుగువారిలోనే వ్యాపించునట్లు కనబడుతున్నది. 'కృతి'అనే స్త్రీలింగపదం మనకి సంస్కృతంలోంచే వచ్చింది కాబట్టి, దాన్నిబట్టి కవులు కృతిని-అంటే గ్రంథాన్ని ఆడదానినిచేసి, తాము కన్యాదాతలయి, ఏ ప్రభువుకో దాన్నిచ్చేవారంటూ తేలుతున్నది.

శ్రీకృష్ణరాయలు పెద్దనలో చెప్పినట్టుగా మనుచరిత్రలో వున్న

'సప్త సంతానములలోఁ బ్రశస్తిఁగాంచి
ఖిలము కాకుండునది భువిఁగృతియచూవె!
కృతి రచింపుము మాకు శిరీషకుసుమ
పేశల సుధామయోక్తులఁ బెద్దనార్య!'

అనే పద్యాన్నిబట్టి కృతిఅనేది గ్రంథకర్తకు

అయినా, కాకపోయినా, కారయితకు సంతానమయి నట్లు స్పష్టంగా తెలుస్తున్నాది. తక్కిన సంతానా లయిన తటాకాదులని తవ్వినవారు కూలీలు, తక్కిన పనివారూ అయినా, డబ్బుఖర్చుపెట్టి తవ్వించిన ప్రభువులకే అవి సంతానాలయి వున్నాయికదా! ఆమాదిరిగానే గ్రంథాలుకూడా కవులని పోషించిన ప్రభువులకే సంతానాలగుటధర్మం. ప్రభువు డబ్బిచ్చి, పోషించకపోతే కవిమాత్రం కావ్యాన్ని ఎలా నిర్మించ గలడు?

ఒకవేళ కారకులకు మాదిరిగా కవులక్కూడా గ్రంథాలు సంతానాలవుతే కావచ్చు; కాని గ్రంథ కారకులకు అవి కాంతారూపాలగుటమాత్రం సరి కాదు.

కృతికీ, కృతిపతికీ గల యీ దాంపత్యసంబంధం మన వాఙ్మయంలో గతానుగతికంగా ఏర్పడిందే గాని, ఆలోచనపూర్వకంగా ఆమలులోనికి వచ్చినదికాదు!

అసలు అంకితమియ్యడమనేపద్ధతి తెలుగులోకి ఎలావచ్చిందో! సంస్కృతంలో ఈరీతి ఉన్నట్టు కనబడదు, ప్రాచీనవాఙ్మయంలో ఒకవేళ అర్వాచీనగ్రంథాల్లో యీ పద్ధతి కనబడితే బహుశా ఉండనే ఉండదనుకోండి— అది తెలుగువారు వ్రాసినగ్రంథాల్లోనే ఉండవచ్చు. తదితరుల గ్రంథాల్లో ఒకవేళ కనబడితే- యీ పద్ధతి బాగా ప్రచారంలోకి వచ్చాక సంస్కృతంలోకన్నీ ఎక్కివుండవచ్చు.

తనపేరుతోటీ, తన గ్రంథంతోటీ పాటు తన పోషకుడిపేరుకూడా శాశ్వతంగా ఉండేటట్టు చేసే టందుకయి, కవి తన గ్రంథరచనకీ, తన జీవనానికీ కారణమైనవారిని గ్రంథంలో ఆదిలోనో, అంతంలోనో స్మరించడమనేది సాధారణంగాకద్దు. భాసుడు తననాటకాల్లో చివర "రాజసింహుడిని" స్మరించాడు. ఆంగ్ల వాఙ్మయంలో గ్రంథాలకి ముందరగానే ఈ పద్ధతి "Dedication" రూపంగా కనబడుతూ ఉంది.

వాఙ్మయాంతర విలక్షణమైన యీపద్ధతి తెలుగులోకి రావడమనేది వింతగావుంది. దీన్ని అన్ని విధాలా అభ్యుదయాన్ని ఆకాంక్షించే యిప్పటివారు కూడా అనుసరించడం మరీవింతగావుంది. అంకిత మివ్వడమనేది బాగులేదని నా అభిప్రాయం కాదు; గ్రంథకర్త తనరచనకి ప్రోత్సాహం యిచ్చేవారిని గాని, పోషించేప్రభువునుగాని గౌరవించడమనేది తనగ్రంథానికీ, గ్రాహకుడుకీ భార్యా, భర్తృసంబంధాన్ని కల్పించడం అనవసరమనిన్నీ, గ్రంథంలో అట్టివారి పేరు స్మరిస్తూ కృతజ్ఞతను తెల్పడం ఉచితమనిన్నీ మాత్రం మననిచేస్తున్నాను.



# సాహిత్య వికాసము

శ్రీ దేశిరాజు కృష్ణశర్మ

సాహిత్యం, వికాసం, ఈ రెండుపదాలకూగల సన్నిహిత అర్థసంబంధం ఏమిటో తెలుసుకుంటేనేగాని మానవజీవితంలో వికాసానికి సాహిత్యం ఏవిధంగా తోడ్పడుతుందో తెలియదు. జీవితవికాసమే నాగరికతగనుక, అది సాహిత్యానికి అనుబంధంలాంటిది. వికాసమనేది ఒకానొకగుణమై అది వికసించిన పుష్పాన్ని గౌణంగా స్ఫురింపచేస్తున్నది. సాహిత్యం పొందిన వికాసమా? సాహిత్యం ఇచ్చే వికాసమా? ఒకటి ఉంటేనేగాని రెండోది సాధ్యంకాదు గనుక ఈ రెండిటికీ విప్రతిపత్తిలేదు. సాహిత్యవికాసం అనే రెండుమాటలలో అర్థమయ్యేది: సాహిత్యం ఒక వికాసం ఇస్తుందనీ, అది ఇతరవికాసాలకంటె భిన్నమయిందనీ, అసలు వికాసమే సాహిత్యంయొక్క పరమగుణమనీ—అర్థచమత్కారసాహిత్యం ఒక పుష్పమనీ, అది వికసించగా వచ్చిన పరిమళమే వికాసమనిన్నీ. సాహిత్యపుష్పానికి మొగ్గ, తీగ, వేరు అనేవి ఏవి అనేప్రశ్న పుట్టుతుంది. దీనికి ఒక సమాధానం ఊహించవచ్చు; సాహిత్యమనేది, ఆ సాహితీవేత్తయొక్క మనస్సు, హృదయం-వీటికంటె అతిరిక్తముకాదు కనుక, అది వ్యుత్పత్తి, అభ్యాసములతో కూడుకొనిన ప్రతిభతో నిండిన ఒకానొక మూలకందాన్నుంచి బయటికివచ్చిన తీగాయి, ప్రాకి, పెద్దదై, అంతమున మొగ్గగా విరిసి, అది పుష్పమై వికసించి ఒకానొక పరిమళవికాసాన్ని ప్రసాదిస్తుందని. ఇది ఒక పరిణామప్రకరణాన్ని సూచిస్తున్నది. ఈ పరిణామం, బీజదశలో సాహితీవేత్తయొక్క హృదయంలోనే అంతర్నిహితమై ఉండి, అంతఃచేతనంయొక్క ఉత్తమలక్షణంవల్ల అనంతప్రతిభాశక్తితోసహా వెలికివచ్చి, తీగ, మొగ్గ, పూవు, సారముగా క్రమికసంభూతిని (Evolutionary becoming) పొందుతున్నదా? అయితే సాహిత్యం మానవజీవితంతో అవినాభావాన్ని పొందుతున్నది. ఉత్తమజీవితం ఉత్తమసాహిత్యాన్ని సృష్టిస్తుంది అన్నమాట. ఉత్తమజీవితం అని అన్నప్పుడు వ్యష్టిసమిష్టుల సామంజస్యంద్వారా వ్యక్తమగునట్టి ఉదాత్తత అని అర్థమవుతున్నది-ఈ ఉదాత్తతకూ, సామంజస్యానికీ - వ్యక్తి - అందులో సాహితీవేత్త అయినవాడు తోడ్పడవలసిన బాధ్యతను కలిగి ఉన్నాడు. వికాసస్ఫూర్తిని పొందిన ప్రతిభావంతునిలో సాహిత్యం అంతరస్పందనాన్ని పొంది సాహిత్యప్రపంచంలోకూడా అదే స్పందనాన్ని కలిగిస్తుంది. ఈదృష్టిలో సాహిత్యవికాసం, ఒకానొక విశిష్టమైన, దార్శనికమైన, తత్త్వమూలమైన పరిణామవాదాన్ని సూక్ష్మంలో స్ఫురింపచేస్తున్నది. అసలు సృష్టిప్రక్రియనుగూర్చిన ఆరంభ, పరిణామ, వివర్తము లను మూడువాదాలలోనే వివిధమతాల, నాగరికతలమూల సూత్రాలు ఇమిడివున్నవి.

ఈవిధంగా సాహిత్యానికీ వికాసానికీగల అర్థసంబంధం-పరిణామతత్వ మవుతున్నది. కర్తయొక్క వికాసము లేక శైలిభి-అతనికావ్యములో వ్యక్తమగునట్లు, సాహిత్యంలోని వికాసం ఆ సాహితీకారుని యొక్క వికాసాన్ని తెలియజేస్తుంది. కనుక సాహిత్యవికాసమంటే జీవితపరిణామంలో ఉచ్చభూమికయందలి వికసనము అని స్ఫురణ. కనుక జీవితపరిణా

మానికి తోడ్పడని సాహిత్యానికి వికాసంలేదు. వికాసవంతమైన సాహిత్యం, జీవితాన్ని ఒక ఉను కువనుండి అంతకంటె పరమమైన స్థితికి తీసుకువెళ్ళి ఆ భూమికలలోని చైతన్యంతో రూపవ్యక్తతనుపొంది, అదిగా అగుట-అనగా సంభూతినిపొందుట అని అర్థ మవుతున్నది.

ప్రబంధయుగంలో సాహిత్యం ఏవిధజీవితదృక్ప థాన్ని కలిగించింది? అప్పటికంటె ఆతర్వాతవచ్చిన పరిణామం ఏమిటి? ఆ పరిణామం నేటికవులలో ఏయే ముఖాలుగా ఉన్నది? పరిణామం నిత్యజీవి తంలో కాలపరిభ్రమణంవల్ల దానంతట అదే కలుగు తున్నదా? లేక కవియే ముందుగా ఈ పరిభ్రమ ణానికి దారితీయుచున్నాడా? అనేప్రశ్నలకు సమాధానం వేరొకపరి పరిశీలిద్దాము.

సహితస్యభావః సాహిత్యం-సహితమంటే కూడి వున్నట్టిది - ఏవేని కూడుకొనివున్నది? శాస్త్రాలు, పురాణాలు, వేదాలు, ఉపనిషత్తులూ-సకలధర్మాలూ-వీటితో కూడుకొనివున్నా సాహిత్యానికి ఒక విశిష్ట రూపం వున్నది. దేహంలో వివిధ అవయవాలు కూడి వున్నా "నేను" అనునది వీటిఅన్నిటికి అతిరిక్తమై, అంతర్నిహితమై, అనంతసచ్చిదానందరూపమైన ఆత్మ ఎటులో-అట్లే సాహిత్యంకూడా. సకలధర్మశాస్త్రా లనే దేహంలోని ఆత్మ, సాహిత్యం. ఇటువంటి సాహిత్యాత్మను మహాకవులు సవికల్పకసమాధిలో సాక్షాత్కరింపచేసుకొని సాహిత్యసృష్టికి ఉపక్ర మించుతారు - అందలి భావాభివ్యక్తిలోని శక్తియే, యోగపారిభాషలోని శక్తిపాతముగానయి - మాన వునికి మనస్సులోని ఊర్ధ్వతచేతన ద్వారములను తెరచి ఉచ్చపథానువర్తినిగా చేయును. కనుక మహాకవిని మహాయోగిగా భావించవచ్చును. గొప్ప కవిత్వంలోని భావనను, రాజయోగంలోని సవికల్పక ధ్యానస్థితిగా ఊహించవచ్చును. మనస్సులోని ఊర్ధ్వ చేతనమున ధర్మమేఘ మొకడు ఆవిర్భవించును. అది మనస్సులోని దిగువలోయలపై ధర్మవర్షమును కురి యును. ఈ ధర్మములో క్రియాశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తులు సమ్మేళనము నందియుండును - ఈ వర్ష పాతమున ఆయాశక్తులు మానవునిలో మొలకలెత్తి అతనిలో ఒకానొక నవ్యమానవుని సృష్టించును; వృద్ధిచేయును. క్రమేణా నేటి అసమగ్రమానవుడు-ఒక దివ్యమానవుడుగా ఉత్తమసాహిత్యసృష్టివలన పరిణమించగలడు. అసలు సాహిత్యం ఈవిధపరిణామ స్థితికి దారితీయవలెనన్న బాహిరమైన శబ్దాలంకార ములనుండి ఆంతరమైన అర్థము-రసము-అలంకారముల వైపు దృష్టిని మరలించి, యోగికి కావలసిన అంత ర్ముఖతను కలిగించవలయును. ఈ మహాపరిణామం, కొద్దిలో మొదట్లో సాహితీసమితికవులలో కొందరిలో ప్రారంభమయి బహుముఖాలుగా, బహువిధస్పంద నాలను సాహిత్యప్రపంచంలో కలిగించినది. ఈ సూత్రమును సోదాహరణంగా ముందు నిరూపించ వలయునని సంకల్పము కలదు. నాటి ఒక నవ్యశక్తి, నేటివరకు మొక్కపోవనిదీక్షతో తన కర్తవ్యమును నెరవేర్చుకొనుచున్నది-కవిసమ్రాట్టు విశ్వనాథ సత్య నారాయణ మొదలు, రాయప్రోలు, కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి, నాయనిసుబ్బారావు, జాషువా, ప్రభృతులున్నూ, నేడు శ్రీ శ్రీ, పి. గణపతిశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వరరావు, ప్రభృతు లున్నూ - నేటి మానవునిలో బహుముఖపరిణామ స్పందనాలను కలిగించినారు, కలిగిస్తున్నారు. ఇది వేరే ఒక వ్యాస సమీక్ష కాగలదు.

"తదేవార్థమాత్ర నిర్భాసం, స్వరూపశూన్య మివ సమాధిః" అని శ్రీ పతంజలి. "రూపములను విడచి అర్థమునుమాత్రమే భాసింపజేయు నప్పుడది సమాధి

అనబడును.'' ఈ అర్థమునందలి భావముయొక్క గుణాగుణములనుబట్టి అది కలిగించు రసానందస్థితిని నిర్ణయించవలయును. భావము స్వాతిశయమే, స్వోత్కర్షయే, ప్రధానముగా కలిగిన, అది కలిగించు గుణము రాజసమై, ఈర్ష్యా ద్వేషములను అతిశయముగా ప్రకోపింపజేసిన అది అధఃచేతనమును మాత్రమే పొందును. సత్వగుణ ప్రధానమైన భావము ఊర్ధ్వచేతన లక్షణయుక్తమయినది. ఈవిధమైనఊర్ధ్వచేతనమే నేటి మానవునికి పరిణామస్థితిని ఇవ్వగలిగినది. అంతర్ముఖత్వంలో కవి జాగ్రత్ స్థితిని (Consciousness) కోలుపోక భావగుణమును విచక్షణ శక్తిచే పరిశీలించి దానిని అవరగుణ రహితముగా వేరుచేసి గ్రహించవలయును. ఒక్కొక్క భావము దాని గుణమునుబట్టి సహృదయుని హృదయంలో నిశ్శబ్దత, నిశ్చలతలలోనుంచి ఉన్ముఖస్పందనాన్ని కలిగించును. వేరొకభావము సంక్షోభమును కలిగి, ఆంతరస్థితిని కూడ తదనుగుణముగా చేయును—ఇది మెచ్చుకోదగ్గ పరిణామంకాదు. వికాసలక్షణమూ కాదు. రసవంతమైన సత్వగుణభావము, శ్రవణేంద్రియమునుండి బాహ్యస్పర్శద్వారా మనసేంద్రియమున అదే గుణముతో కూడిన ఆంతరస్పందనాన్ని కలిగించును. అప్పుడు మనస్సువలన కలుగునట్టి ప్రతిక్రియయే ప్రత్యయము లేక జ్ఞానమని అనబడును.

ఈ ఆంతరస్పందనము, మనస్సును ఉత్కాంక్షచే విస్తృతంచేయు సాధారణ ఉపమానుపమేయములకు అతీతమైన ప్రతిభచే వ్యక్తముచేయబడు స్వతఃస్ఫురణమును కలిగినట్లయిన, ఆ భావము మనోభూమికకు పైనిదగు విజ్ఞానమయ భూమికకు చేర్చును. ఈ స్వతఃస్ఫురణము శుద్ధ విద్యుల్లతవంటిది. ఇది ధర్మమేఘము చాటున మెరయుచుండును. ఈ ధర్మమేఘము భావరహితమై, నిశ్చలమైయున్న మనస్సున ఉద్భవించును. భావరహిత స్థితియన సాధారణముగా ఏదో ఒక గ్రంథమును బాగుగా చదివి మననం చేసుకున్నమీదట మనస్సులో కలిగిన ఊర్ధ్వసంచలనం వల్ల తాత్కాలికంగా ఏర్పడిన ఒకానొక నిశ్చల స్థితికాదు. అది వట్టి వృత్తిని మాత్రమే తెలియజేయును. అట్టి వృత్తిని సంయమము చేయగా కలిగినస్థితిలో—ఈ భావము నేనుకాదు—ఈ మనస్సు నేనుకాదు అని వేరుపరచుకొనుచూ స్వరూప సాక్షాత్కారమునకై పోవుచున్న దారిలో ప్రకాశించిన బుద్ధిని కలిగిన భావరహితస్థితి భావస్పందనబుద్ధిని గుర్తించి, చేరినప్పుడు ప్రతిభ కలది అగును. ఆపైస్థితి ధర్మమేఘస్థితి—అది స్వతఃస్ఫురణములకు పుట్టినిల్లు—అది విజ్ఞానమయ భూమికకు ప్రతినిధిగా మనఃస్ఫురణకు ఎగువగా నుండును. ఎక్కువగా స్వతఃస్ఫురణములను కలిగిన మహాకవి మనస్సుపైని దగువిజ్ఞానమయ భూమికకు సన్నిహితమైన చిదానంద స్ఫూర్తినికలిసి సాధారణ మానవుని కంటె ఉత్తమస్థితి నందుచున్నాడు—ఈ విధంగా ఉత్తమ దివ్యమానవసిద్ధికి తోడ్పడుతున్నాడు—ఈ ప్రయత్నంలో ప్రపంచం మిథ్య, బ్రతుకు దుర్భరము—అని వైదొలగు శుద్ధ వైరాగ్య లక్షణములేదు. ఇదియే సాహిత్య ప్రయోజనము—ఇదే సాహిత్య వికాసము.



# 'ఆగ్ లగావో'

## 'జమదగ్ని'

౧

రాయ్ చౌదరి ఇంట్లో ఖీర్‌సాహెబు క్లార్లెనెట్ కచేరి చేస్తున్నాడు.

చౌదరి చుట్టాల మధ్య ఊళ్లో పెద్దలు మున్షి ఇస్మాయిల్, హకీమ్ దావూద్ మొదలైన వారందరూ ఆ గానమాధుర్యంలో తన్మయులై యున్నారు. ఎండిపోతున్న పందిరి తోరణాలు కూడా పచ్చబారి చిగురుస్తాయా అనిపించేటంతగా పాట ఊపేస్తోంది. శ్రోతలందరూ పై మీది గుడ్డలు గాలి కెగురుతున్నా గమనించడమే లేదు.

పెండ్లిండ్లలో కచేరీలు ఆహూతుల ఆనందం కోసంగాని అసలు వారి కందులో కూర్చొనే పావకాశంగాని మనస్స్వాస్థ్యంగాని ఉండడం అసంభవం. అందులో రాయ్ చౌదరి వంటివాడి కసలే ఉండదు. అవును మరి! ఎల్లా ఉంటుంది? ఉన్న ఒక్క కూతురు వివాహమయి ఆనాడే అత్తవారింటికి వెళ్లబోతోంది. రాత్రి ఎనిమిది గంటలకు ప్రయాణం. ఇక నాలుగు గంటలే వ్యవధి. తన జీవితానికంతకూ జ్యోతిగా పదహారేళ్లుగా నిరంతర సౌఖ్యం సమకూరుస్తున్న ఏకైక సంతానం. ముసలి తండ్రి మంచంలో పడుకునే మాటిమాటికీ చౌదరిని పిలిచి చెప్తున్నాడు. 'అబ్బాయి! లలితను ఇవాళే పంపాలిటరా! అయితే నేనూ దాని వెంబడి వెళ్తాను' అంటూ.

చౌదరి కచేరీలో కూర్చోలేక పోయాడు. నడివసారాలో ముత్తైదువుల మధ్య అలంకృతయై కాటుక కళ్ల వెంట కన్నీళ్లు కారుస్తూ పాట వింటున్న అమ్మాయిని ఒక్కమాటు చూద్దామని లోపలికి వచ్చాడు. అమ్మాయి ప్రక్కనే కూర్చున్న మధుబిందు అకస్మాత్తుగా లేచి 'ఏం కావాలి?' అంటూ ఎదురు వెళ్లింది. తన వంక చూస్తున్న లలితనుండి చూపు ఎట్లాగో మరల్చుకొని చౌదరి 'అబ్బే! ఏం లేదు' అని పని ఉన్నట్లు పక్క గదివైపు తిరిగాడు. గదిలోనుండి తండ్రి సైగచేశాడు చౌదరి నొక్కమాటు రమ్మని.

చౌదరి అటు వెళ్లాడో లేదో గుమ్మంలో నిలబడి ఉన్న మీర్ ఖాసిమ్ కనబడ్డాడు.

'ఏమోయ్! మనవాళ్లంతా భోంచేశారా? ఈ హడావిడిలో ఎవరికేం పెట్టారో ఏమో!' అన్నాడు చౌదరి.

'అదేంమాట బాబయ్యా! అమ్మగారు స్వయంగా దగ్గర ఉండి వడ్డించారు. ఇప్పుడే చేతులు కడుక్కున్నాం. అమ్మగారు అట్లా వెళ్లారు, నే నిట్లా తమకోసం నుంచున్నా ఒక్కమాట కనుక్కుందామని' అన్నాడు ఖాసిమ్.

"అయితే పోయి త్వరగా సిద్ధం చెయ్యి. అవి ఎక్కేన్నా కావాలి. మన టాంగా సంగతికూడా ఎంతవరకైందో చూసి మరీ వెళ్లు. మిఠాయిని పూల దండలు కట్టిస్తున్నాను. మరొక్క అరగంటలో అన్నీ తయారుగా ఉండాలి."

'చిత్తం! చిత్తం! ఇప్పుడు రానూ' అంటూ సెలవు తీసుకొని ఖాసిమ్ వెళ్లిపోయాడు.

అప్పుడే పాటకచ్చేరి అయిపోయి నట్లుంది. పందిట్లో పెద్దలు లేస్తున్న అలజడి వినబడింది. చౌదరి ఒక్క గంతులో పందిరి చేరుకున్నాడు

...లాసబాబును కేక వేస్తూ. విలాసబాబు అందరికీ తాంబూలం, అత్తరు, మంచిగంధం ఇచ్చి సత్కరిస్తూనే ఉన్నాడు పందిట్లో. కాని వచ్చిన పెద్దలకు మర్యాదలలోపం ఏం జరుగుతుందో అని చాదరికి వట్టి హడావుడి. ఇంట్లోకి వెళ్తున్న కిశోర్‌ను కేక వేసి 'మరొక పళ్లెం పుచ్చుకొని నువ్వుగూడా ఇయ్య' అని పురమాయించాడు. అప్పటికీ అతనికి తృప్తికలగ లేదు. తానుగూడా మరొక పళ్లెంలో స్వయంగా పెద్దలను సత్కరించడం మొదలు పెట్టాడు.

తాంబూలం పుచ్చుకుంటూ మున్షీ ఇస్మాయిల్ 'అయితే, అమ్మాయి ఇవాళే వెళ్లిపోతుందా చాదరీ?' అన్నాడు.

చాదరికి కళ్లవెంట నీళ్లు వచ్చేశాయి. ఉత్తరీయంతో తుడ్చుకొంటూ 'అవును భయ్యా! పెళ్లి అయ్యాక వెళ్లక తప్పుతుందా! రా లోపలికి రా! ఒక మాటు చూద్దుగాని' అన్నాడు.

'ఎప్పుడెందుకులే చాదరీ! వెళ్లేలోగా మళ్లీ వస్తాగా. ఆడంగులంతా హడావిడిలో ఉన్నారు' అన్నాడు మున్షీ.

'ఎప్పుడైనా ఇల్లాగే ఉంటుంది. నీకభ్యంతరం ఏమిటి? రా!' అంటూ చాదరి చెయ్యిపట్టుకొని లోపలికి తీసుకువెళ్లాడు.

వరండామీది గదిలోనే తాత మంచం ప్రక్కన కూర్చొని ఉన్నది లలిత.

'అమ్మాయ్! ఉస్తాద్‌జీ వచ్చారు' అన్నాడు చాదరి అటు చూస్తూ.

లలిత ఉలిక్కిపడిలేచి, సిగ్గుతో తలవంచుకుంటూ వచ్చి, వంగి గురువుగారి పాదాలకు నమస్కారం చేసింది.

ఇస్మాయిల్ మనసులో ఆశీర్వదిస్తూ లలిత బుజం పట్టుకొని లేవనెత్తి 'అమ్మా' అంటూ దగ్గరకు తీసుకుని మెల్లగా చేత్తో వీపుమీద తట్టాడు. లలిత తల్లో మల్లెపూలు ఇస్మాయిల్ తెల్ల గడ్డంలో కలిసిపోయాయ్. అతని కన్నీళ్లు ఆ పూలమీద పడి మంచు బిందువుల్లా మిలమిలలాడాయి.

సిగ్గుతో లలిత ముసుగు సద్దుకుంటూ ఒక్క అడుగు వెనక్కు వేసి నిల్చుంది.

'తల్లీ! ఈ ఊరు అప్పుడప్పుడు వస్తూ ఉండు. మమ్మల్ని మరచి పోకేం!' అన్నాడు ఇస్మాయిల్ బాష్పరుద్ధమైన కంఠంతో.

కొంగుతో కళ్లు అద్దుకుంటూ లలిత ముఖం తిప్పుకుంది.

మధుబిందు లోపలనుంచే లలితను పిలుస్తోంది. లలిత విని కూడా కదలలేదు గురువు ఆజ్ఞకోసం ఎదురు చూస్తూ.

ఇస్మాయిల్ చాదరి వంక చూచాడు. కాని ఇరువురికీ ఎవ్వరూ కనిపించలేదు కన్నీళ్ల వల్ల.

'అబ్బాయ్' అన్నాడు తండ్రి, గదిలోనుంచి ఎందుకో!

చాదరి ఉలిక్కిపడి 'భాయీ! నువ్వు ఇప్పుడు ఇంటికి వెళ్తావా? న్యాయమేనా!' అన్నాడు.

'వెంటనే వస్తాగా భయ్యా!' అన్నాడు ఇస్మాయిల్.

'వీలుకాదు. అయినా ఇప్పుడు నువ్వు వెళ్లి ఏం చేస్తావు? వదినా, ఫాతిమాగూడా ఇక్కడే ఉన్నారు. నా మాట విని నువ్వు అలా సోఫాలో కూర్చో! నువ్వు ఇక్కడ ఉన్నావంటే నాకు అదొక శాంతి.' అంటూ చాదరి తండ్రి గదిలోకి వెళ్లాడు.

౨

అప్పుడే భోజనాలవుతున్నాయి. మధుబిందుకు పిల్ల అత్తవారిని గౌరవించడం ఒక ఎత్తూ, పందిట్లో భోంచేస్తూన్న ఊళ్లో ముత్తైదువులను కనుక్కోవడం

ఒక ప్రత్తూ అవుతోంది. దీనికి తోడు పెండ్లికొడుకు పంక్తిలో కూర్చోవడం తటస్థిస్తే ఆవిడ ఆపూట సెగ్గ గలిగేదేకాదు. అతను అందరికంటే ముందే కిశోర్ చేత వడ్డింపించుకొని తిని వీధిగదిలో కూర్చున్నాడు. తన భోజనం మాట ఎట్లా ఉన్నా లలితను 'ముందు కూర్చొని కాస్త తినవే అమ్మాయీ!' అంటే అది 'ఫాతిమా భోజనం అయితేనేగాని నేనేం తిన'నంటూ దానికి నడివసారాలో స్వయంగా వడ్డిస్తోంది. అప్పుడే ఏడుగంటలైంది. ఎనిమిదింటికి నాన్నా బళ్లల్లో కూర్చుంటేగాని స్టేషనుకు పదిగంటలకు చేరుకోవడం కష్టం. 'రాత్రి ప్రయాణం వద్దట్రా!' అంటే విన్నారుకారు పెళ్ళివారు. ఎల్లా తెములుతారో ఏమో! మధుకేందు ఉన్నచోటు ఒక్క నిముషం ఉండకుండా తొక్కిడి పడిపోయింది.

ఇక రాయ్‌చౌదరి విషయం చెప్పనే అక్కర్లేదు. ఇటు ఒక వంక భోజనాలూ, అటు మరొక వంక బళ్లూ, లైట్లూ ఒకటేమిటి ఎన్ని కనుక్కోవాలో అన్ని కనుక్కోవాలిసి ఉన్నది. మనిషివెంట మనిషిని పంపుతున్నాడు కాని ఒక్క లైటూ రాలేదు, ఒక్క బండీ రాలేదు. అప్పుడనగా వెళ్లిన ఖాసిమ్ ఎక్కడ బాతాఖానీ కొడుతున్నాడో ఏమో! నాలుగు రోజుల కింద చెప్పి ఉంచిన బళ్లు కట్టించుకు రావడానికి ఎందు కింత ఆలస్యం? ఇంకానయం! కరువులో అధిక మాసం వచ్చిపడలేదు. అదృష్టం బాగుండి ఇవాళ ఆ టాంగాకు ఏ రోగమూ రాలేదు. పాపం మీర్జా దాన్ని కష్టపడి చక్కగా పూలదండలతో అలంకరించి సిద్ధంచేసి ఉంచాడు. ఇంట్లో తుపుకూ తుపుకూ మంటున్నవి కాక బాగా వెలుగుతున్న పెట్రోమాక్సు లైట్లు అరడజనన్నా ఉన్నాయి. ఈ లైట్లవాళ్ల కిదేం పోయేకాలం? రోజూ తెస్తూనే ఉన్నవాళ్లు ఇవాళ ఎందుకు తేలేదు? సరే ఏది లేకపోతే మాత్రం పబ్బం ఆగుతుందా ఏమిటి? ఏదో ఉన్నదానితోనే ఎట్లాగో అట్లాగు గడుపుకోవాలి. ఇంతకీ అమ్మాయీ అల్లుడూ భోజనం చేశారో లేదో!

'ఒరేయ్ కిశోర్!'

ముందు పందిట్లో మగవాళ్ల పంక్తిలో తిరుగుతూ లడ్డూలబుట్ట చేత్తో పుచ్చుకునే రాయ్‌చౌదరి కేక వేశాడు ఆకు లెగిరిపోయేటట్లు.

కిశోర్ పరుగెత్తుకు చక్కా వచ్చాడు వడ్డిస్తున్నవాడు వడ్డిస్తున్నట్లుగా.

'అల్లుడుగారు భోంచేశారో లేదో కనుక్కున్నావురా? ఎక్కడా కనపడరేం?'

'అందరికంటే ముందే భోంచేసి గదిలో కూర్చున్నారు' అన్నాడు కిశోర్ నవ్వుతూ.

'సరే! వెళ్లు వెళ్లు — అందరినీ సరిగ్గా కనుక్కో' అంటూ చౌదరిగూడా మళ్లీ వడ్డనలోకి దిగాడు.

నాలు గడుగులు వేశాడోలేదో అమ్మాయి మాట జ్ఞాపకం వచ్చింది. ఇందాక కిశోర్‌ను అడగడం మరచిపోయాడు. వట్టి మందమతి. చౌదరి చటుక్కున ఆగి లోపలికి వెళ్లాడు. దారిలో ఫాతిమా కనపడింది.

'లలిత ఎక్కడమ్మా! భోంచేసిందా?' అన్నాడు చౌదరి.

'నే తింటే కాని తిననని కూర్చుని ఇప్పుడే లోపలికి వెళ్లింది బాబుగారూ' అన్నది ఫాతిమా.

చౌదరికి జాలీ వేసింది, కోపమూ వచ్చింది. లలిత వట్టి తెలివి తక్కువది. ఎప్పుడేం చెయ్యాలో తెలియదు. కాకపోతే ఇటువంటప్పుడెవరన్నా ఇంత ఆలస్యం చేసుకుంటారా? ప్రయాణం కావలసి ఉండె కదా! ఆ తినేది కాస్త పెందరాడే తినవద్దూ! ఏమో ఏంచేస్తుందో నూరేళ్లు బతకాలి పిచ్చితల్లి. ఇల్లా

అనుకుంటూ చౌదరి మళ్ళీ పందిట్లోకి వెళ్ళిపోయాడు.

ఇంకా భోజనాలు కానేలేదు. ఇదేం కర్మమో వట్టప్పుడు ఇట్టే అయిపోతాయి. తొందరపడ్డకొద్దీ మరీ ఆలస్యం అవుతుంది.

'ఒరే విలాస్!' రాయ్‌చౌదరి కేక.

విలాస్ వచ్చి నిలబడ్డాడు 'ఏం బాబాయి?' అంటూ.

'ఆ! వచ్చావూ! బాబ్బాబు నువ్వన్నాపోయి ఆ బళ్ళమాట కనుక్కొని రారా!'

'అలాగే బాబాయి. ఈ బుట్టలోపల పడేసి వెళ్తాను.

'అదక్కడ పారెయ్యవోయ్. నేను చూసుకుంటాను. నువ్వు పో!'

విలాస్ అంట చేతుల్తో అట్లాగే వీధి గుమ్మం, భోజనాల పంక్తి ఉండబట్టి తెరవడానికి వీల్లేక, దొడ్డిగుమ్మం వైపుకి వెళ్లాడు.

అప్పుడే లలిత భోజనంచేసి ఫాతిమా దగ్గరకు వచ్చింది.

విలాస్ దొడ్డిగుమ్మం తలుపు తియ్యబోతున్నాడు.

'ముస్లిం రాజ్ - జిందా బాద్'

వందగొంతులు ఒక్కమాటు వినిపించాయి.

'కాఫర్ కా ఘర్ హై. హమ్ ఆగే బఢేంగే! జో కోయీ బచ్ నే దౌడ్ మార్ డాలో!'

ఇవి నాయకుల మాటలు.

విలాస్ గడగడలాడుతూ లోపలికి వచ్చేశాడు.

ఇంటి చుట్టూరా చుట్టుగోడ కవతలనుంచి 'మారో! మారో! తల్వార్ సే మారో!' అనేధ్వనులు వినిపిస్తూనే ఉన్నాయి. వీధిలో పెండ్లి పందిరి గుంజలు సేవకుల రక్తాలతో ఎఱ్ఱబడిపోతున్నాయి.

లోపల పందిళ్లలో ఎక్కడివాళ్ళక్కడనుండి లేచి ఇంట్లోకి పరుగెత్తుకు పోతున్నారు.

రాయ్‌చౌదరి 'ఏమిటది? ఏమిటది?' అని పిచ్చిగా అరుస్తున్నాడు.

దొడ్డి తలుపు పగిలిపోయింది. వీధి తలుపు పగిలిపోయింది.

ఆ అరుపులకు హడిలిపోయి ఇద్దరిలోకీ చిన్నదైన ఫాతిమా లలితను గట్టిగా కౌగలించుకొన్నది. లలిత గోడకానుకొని కూర్చున్నది కూర్చున్నట్లు నిశ్చేష్టమైపోయింది.

కత్తులూ, కఠార్లూ, బాకులూ, బల్లాలూ పుచ్చుకున్న జనం గుంపులు గుంపులుగా లోపలికి వచ్చేస్తున్నారు.

ఆడా మగ భేదం లేకుండా రాయ్‌చౌదరి చుట్టాలూ ఊళ్లోవాళ్లూ ఎవరికందిన తలుపులు వాళ్లు వేసి ఇంట్లో దూరిపోయారు. కాని వెయ్యవలసిన తలుపులు ఇంకా అనేకం ఉన్నాయి. చాలామంది ఎక్కడివాళ్లు అక్కడ ఒకళ్లమీద ఒకరుగా చతికిలబడిపోయినా ధైర్యవంతులు ఒకరిద్దరు అందుబాటులో ఉన్న తలుపులు వెయ్యబోగా వచ్చి పడ్డకత్తులు తలలు నరికేశాయి.

కొత్త ఇంటి గుమ్మంలో కొబ్బరికాయలు కొట్టినట్లు రాయ్‌చౌదరి ఇంటి గుమ్మాల్లో అప్పటికప్పుడే తెగిపడిన తలలు దొల్లిపోతున్నాయి.

హాహాకారాలు చెలరేగిపోతున్నాయి. తల్లులు పిల్లలతో సహా గొల్లుమంటున్నారు.

ఆ ఆక్రందనాలతో చచ్చుబడ్డ కొన్ని సంజీవ కంకాళాలకు కూడా శౌర్యం వచ్చింది. చేతుల్లో ఉన్న చెంబులూ, కనబడ్డ రోకళ్లూ, కత్తిపీటలూ, పీటచెక్కలూ ఆయుధాలుగా జనంలేచింది. స్త్రీలు కూడా చివరకు తెగబడి చేతికందిన వస్తువులు పుచ్చుకొని స్వప్రాణ మానరక్షణలకోసం సాహసిస్తున్నారు.

పిల్లలు కొందరు మంచాలక్రిందకూ, పరుపుచుట్టల లోనికీ, ఆల్మారులలోకీ పోయి దాక్కుంటున్నారు.

వచ్చిన దండు అంతా రాయ్‌చౌదరి ఇంట్లోకే వచ్చింది. వచ్చిన ప్రతివాడూ 'ముస్లింరాజ్—జిందాబాద్' అని అంటూనే ఉన్నాడు. చేతులలో ఆయుధాలు మెరుస్తూనే ఉన్నాయి. అందిన మనిషి గుండెల్లో దూసుకుపోతూనే ఉన్నాయి. ప్రతిఘటించిన మనిషి తలను నరికి పారేస్తున్నాయ్.

ఒక్కొక్కడు 'తూ కౌన్ హై?' అంటున్నాడు. అమాయకులు అసత్యదోషం రాకుండా 'హిందువు'అనీ 'ముస్లిం'అనీ నిజంచెప్పుతున్నారు. హిందువుల దేహాలు అవ్యవధిగా నేలమీద పడిపోతున్నాయి. 'సచ్ బోల్ రే బద్మాష్' అన్నమాటతో ముస్లిం అన్నవాళ్ల దేహాలు బాకుపోటు రుచి చూస్తున్నాయి.

ఒక్కొక్కడు తన కత్తిపదును మూర్ఛపడ్డ వ్యక్తుల మీద చూపుతున్నాడు. అమ్మ కౌన్చుకున్న బిడ్డను తల్లినుండి లాగివేసి పాలిండ్ల యాథార్థ్యం పరీక్ష చేస్తున్నా డొకడు కత్తితోకోసి, తాను స్థాపించే ముస్లిం రాజ్యంలో వైజ్ఞానికాభివృద్ధి కోసం!

ఆనాటి ప్రళయభీకర మృత్యువిహారంలో రాయ్‌చౌదరి పెండ్లిఇల్లు—అబ్బబ్బ!—బలవంతంగా వల్లకాడుగా పరిణమించింది.

ఇంతవరకూ ఆ యింటిలో ముష్కరులచాడి చూడకుండా రెండే రెండు గదులున్నాయి. వాటికి తలుపులన్నీ వేసిఉన్నాయి. అది వీధివైపు గదులు.

క్రౌర్యం ఆవేశించనే కూడదుగాని పుట్టిన తరువాత దానికి అంతేమిటి?

ఆ గదుల తలుపులుగూడా వచ్చిన జనం కాళ్ల దెబ్బలతో పగిలిపోయాయి.

కాని రెండు గదులలోనుంచీ తుపాకులు పేలసాగాయి. దండు మూర్ఖపు పట్టుతో బెదరకుండా రెండు భాగాలుగా చీలి రెండు గదులనీ ముట్టడిస్తోంది మొట్టమొదట్లో కొంచెం చలించినప్పటికీ 'ముస్లిం రాజ్—జిందాబాద్' అన్న నినాదంతో వచ్చిన నూతనావేశంతో! ఒకటి—రెండు—మూడు—వరుస వరుసగా దండులోని జనం 'అల్లా' అంటూ నేలబడుతున్నారు. మనుష్యులు పడ్డకొద్దీ వారిలో క్రౌర్యం హెచ్చు పెరిగిపోతోంది. ఇంతలో ఒక వంకనుంచి తుపాకిమ్రోత ఆగిపోయింది. ఇంకేముంది అది వారి ఆవేశాగ్నికి ఆజ్యం పోసింది. జనం ఒక్కుమ్మడిగా గదిలోకి దూరబోయారు. కాని తుపాకి మళ్ళీ పేలింది. అందరికంటె ముందరివ్యక్తి కిందపడిపోయాడు. జనం ఒక్క అడుగు వెనక్కు వేసింది. కాని అధైర్యానికి కప్పుడవకాశంలేదు. సంఘీభావమే బలం. ఒక్కుమ్మడిగా దూకడానికి ఉరికిపోతోంది దండు. అంతలో ఒక సునిశితబుద్ధి గురిచూచి తుపాకి పేల్చుతున్న వ్యక్తి మీదికి బాకు విసిరాడు. అదిపోయి సరాసరి అతని గుండెల్లో తాకింది. అతడు బాధపడుతూనే తుపాకి పేలుస్తున్నాడు. కాని ఏం లాభం? ఒక్కడుగా నొక తుపాకి. దండెత్తిన వ్యక్తులు సమూహమంది. పైగా మందుకూడా అయిపోయింది. అప్పటికి బాకుపోటు బాధ మరీ ఎక్కువయింది. ఇక ఓర్వ తాళుకోలేక 'అల్లా! రహమ్‌కరో! రహమ్‌కరో!' అంటూ నేలబడిపోయాడు. ఆ వ్యక్తి ముస్లిం ఇస్మాయిల్.

ఇస్మాయిల్ పడిపోవడంతోటే వెనుక మంచం కిందనుండి 'అబ్బా' అన్న మాటలను వినిపించింది. అప్పటికి జనం మందగా లోపలికి పోయింది. ఆ గదిలో మూలుగుతున్న ఒక్క వ్యక్తిని లేపి మంచో జెట్టి ముక్కలు ముక్కలు చేశాయి కత్తులు. ఆ వ్యక్తి రాయ్‌చౌదరి తండ్రి, పెండ్లివాళ్ల వృద్ధు.

ఇంతసేపూ ఇవతలి గదిలోనుంచి తుపాకి పేలుతూనే ఉంది. అందుచేత ఎంత ప్రయత్నించినా జనం

దాని దగ్గరకు పోలేక పోతున్నారు. అతనిదగ్గర మందు కూడా ఉందేమో ఆ వ్యక్తి నిర్భయంగా పేల్చేస్తున్నాడు మధ్యమధ్య ఆపి జనం మూక వచ్చినప్పుడల్లా !

అతడు రాయ్‌చౌదరి. ఆ గదిలో కూతురూ, అల్లుడూ, కూతురు కౌగిలి విడవని ఫాతిమా ఉన్నారు. వీరినైనా రక్షించుకుందామని చౌదరి అక్కడ ఉండిపోయాడు.

అప్పటికే వచ్చిన గుంపులో అతిసాహసంవల్ల తుపాకి దెబ్బలకు మాత్రం గురియై పది పదిహేను మందివరకూ చచ్చిపోయారు. రాయ్‌చౌదరి ఎక్కుపెట్టిన తుపాకీతో తలుపుచాటుగా నిలబడి ఉన్నాడు.

అతన్ని ఎట్లా తుద ముట్టించాలో జనానికి తెలియలేదు. ఆ స్థితిలో వారిలో ఒక సూక్ష్మబుద్ధి గట్టిగా అరచాడు 'ఆగ్ లగావో!' అని.

అంతే! ఆ మరునిమిషంలో రాయ్‌చౌదరి పెండ్లి ఇల్లు అగ్నిహోత్ర జ్వాలలలో క్రొత్త అలంకారాలు సమకూర్చుకుంది. కూతుర్ని అత్తవారింటికి విడిచిపెట్టలేని చౌదరి బంధుమిత్ర పరివారసమేతంగా దేవలోక ప్రయాణం చేశాడు.

ఆ ఇంటి వెలిబూడిదచూచి మరీ వెళ్లింది దండు, కాకుంటే ఊరి కనారోగ్య హేతు వవుతుందని. కాని ఈ జరిగిన దంతా 'అల్లా' చూస్తున్నాడని మాత్రం అనుకోలేదు పాపం!



# నేను శిల్పిని

## శ్రీ యమ్. నరసింహాచార్య

నేను శిల్పిని. నాలో ఒక తీవ్రమైన కదలిక ఏదో పనిచేస్తోంది. నేను సృష్టించకుండా ఉండలేను. నన్ను అన్ని వేపులా చుట్టువారుకొని ఉన్న ఈ ప్రకృతి అనుక్షణమూ ఎన్నో అనుభూతుల్నీ స్మృతుల్నీ భావాల్నీ నా మనోసముద్రంలోకి వెదజల్లేస్తోంది. నా మనస్సుకి వాటన్నిటినీ ఆకర్షించే ఒక అద్భుతశక్తి ఉన్నట్లు కనిపిస్తుంది. కాని భౌతికమైన విచక్షణాజ్ఞానం విమర్శనాశక్తి స్వాభావికంగా కలదవడంచేత నామనస్సు దేశకాలపాత్రలకి యథాతథంగా కట్టుబడిపోతోంది. అయితే—ఈ మనస్సుకీ లేక బుద్ధికీ అతీతమైన ఒక మహాతత్వం—గంభీర అంతర్యం—నాలో పర్వతంలా పాతుకుపోయి ఉంది. అదే నా ఆస్తిత్వానికి పునాది. నాలోని ఈ కేంద్రస్థలం నాకే కాక ఈ సమస్త సృష్టికీ కూడ మధ్యబిందువనే ధారణ నాలో అంతకంతకి ధృవపడిపోతోంది. ఆ కేంద్రబిందువుని గుర్తించి మన్నించే శక్తిమాత్రం నా మనస్సుకిలేదనే చెప్పాలి.

ఈ మనస్సనేది నాకూ ఈ కేంద్రబిందువుకీ మధ్య పెద్ద అఖాతం ఏర్పరుస్తోంది. ప్రకృతి వెదజల్లిన అనుభూతులూ స్మృతులూ భావాలూ నా సంక్షుభిత మనోసాగరంలోపడి కొట్టుకుపోతో అట్టడుక్కి దిగి నా ఆత్మాంతర్యభూమిలో స్థాణుత్వం ఏర్పరుచుకుంటున్నాయి. రత్నగర్భ అయిన సముద్రంలాగే నా అంతర్యం అమూల్యసౌందర్యనిధులకి ఆకరమై ఉంది.

ప్రకృతికి మనస్సు, విమర్శనా, జ్ఞానం ఆలోచనా శక్తి మొదలయినవి లేకపోవడంవల్లనే సృష్టికి మధ్య బిందువనబడే ఆత్మచైతన్యం ప్రకృతిలో అనుక్షణం స్పందింపబడుతూ దానిలో సహజంగానే నిత్య నూతనత్వం,అనంత సౌందర్యం,మధుర సంచలనం కలిగేట్లా చేస్తోంది. ఫలాని విధంగా పరివర్తితమవుదామని గాని, తాననుకొనే పద్ధతిని ప్రవర్తిద్దామనిగాని, ఒక నిశ్చితరూపంలో వ్యక్తమవుదామనిగాని రూపాల్నీ స్థితుల్నీ ఏర్చి కూర్చుకున్ననాడు ప్రకృతికి సౌందర్యమే లేదు. అప్పుడది కృత్రిమమైన వికృతిగా తయారవుతుంది.

ప్రకృతికన్య తన స్వాభావిక సారళ్యంతో ఒకప్పుడు మబ్బుతెరల్లోంచి తన తళుకు చూపులు మిలమిల మెరిపిస్తూ తొంగిచూస్తోంది. వేరొకప్పుడు స్వర్ణకాంతులీనే బాలారుణాతపంలో సుస్నాతయై దివ్య సౌందర్యమూర్తిగా ప్రత్యక్షమౌతోంది. ఇంకొకసారి ప్రళయభీభత్సాగారంతో, ఉరుముగర్జనలతో ప్రణయకోపన అవుతోంది. నవ్వు పువ్వులతో, శ్యామల శాద్వలవసనంతో, నీలాకాశావగుంఠనంతో, కలకలస్వనితనిర్ఝరిణీగమనంతో ఒక్కొకసారి సౌమ్యమూర్తి అవుతోంది. ఆమె చైతన్య నర్తనంలో ఎక్కడ చూసినా సౌందర్యం తొణికిసలాడుతోంది. ప్రకృతిలో ఈ నిత్య నూతన సౌందర్యం ఎక్కడి నుంచి వచ్చింది? మనస్సూ, బుద్ధీలేని ఈ జడప్రకృతిలోనూ మనస్వినైన నాలోనూ మధ్య బిందువుగా సర్వత్ర సమానంగా వ్యాపించిన ఆత్మచైతన్యమే—ఆత్మవికాసమే ఈ సౌందర్యం.

ప్రకృతికి సౌందర్యం ఎల్లాగో నాకు కళ అల్లాగ. కాని నామనస్సనేది నాకూ నా కళకీ మధ్య వికృతా

కారంతో నిలిచి రసభంగంచేస్తోంది. ఆత్మచైతన్యం ఆత్మవికాసం వ్యక్తంకావాలంటే ఈ మనస్సు అడ్డు తగలకుండా ఉండడం అత్యవసరం. అప్పుడే నా నిజమైన సౌందర్యం నా సత్యస్వరూపం నా కళ ద్వారా వ్యక్తమయేందుకు వీలవుతుంది. ఈ విషయంలో ప్రకృతే నాకు ఆదర్శం.

నా ఆత్మాంతర్య భూముల్లో స్థాణుత్వం పొందిన నా అనుభూతులూ, స్మృతులూ, భావాలూ వీలు చూసుకొని నామనస్సముద్రతలంలోంచి పద్మాలుగా, ముక్తాఫలాలుగా, రత్నాలుగా చిత్రచిత్రజీవులుగా పైకి తేలడానికి చూస్తూన్నాయి. కాని ఇవి సహజ సౌందర్యంతో ఆత్మచైతన్యంతో సద్యోవ్యక్తం కావాలంటే అన్నిటికంటె ముందు నా మనస్సముద్రం ప్రశాంతస్థితిని అధిగమించవలసి ఉంటుంది. నా కృతులు రూపాలు తేలేందుకు, ఆలోచనాశక్తీ విమర్శనాశక్తీ నశించి పరిపూర్ణ యోగస్థితినిపొందిన మనస్సు కావాలి. ప్రశాంత సముద్రంలోంచి పద్మాలు మొదలయినవాటిలాగే నా నిశ్చలమైన—నిర్మలమైన మనస్సులోంచి కళాకృతులు తేల్తాయి.

ఈ ప్రశాంతమైన మానసికస్థితే యోగం. యోగస్థితినందుకున్ననాడే నేను సృష్టికార్యానికి యోగ్యుణ్ణవుతున్నాను. "యోగస్థః కురుకర్మాణి" అన్న గీతావాక్యం నాకాదర్శం.

నా మనస్సు గంభీరమైన అనంత సాగరంలా విశ్వమంతటా పరుచుకుపోయి ఉంది. సమస్త సృష్టి సౌందర్యాన్నీ ఆకర్షించుకొని తన ఆంతర్యంలోకి ఇముడ్చుకొనే అత్యద్భుతశక్తి ఈ మనస్సుకి ఉంది. అయితే తన ఆత్మాంతరాల్లో పాదుకుపోయిన సౌందర్యాన్నీ, సత్యాన్నీ వ్యక్తపరచే శక్తిమాత్రం చంచల స్వభావంకల యీ మనస్సుకి లేదు. ఈ మనస్సు కారణంగా ఆత్మాంతరాల్లోని అనుభూతులు విషయ వాసనలుగానూ స్మృతులువిస్మృతులుగానూ రసం విరసంగానూ తయారై నా సహజప్రకృతి వికృతిగా మారిపోతోంది. ఈ మనస్సు కలుగజేసుకోడంవల్ల నా కళాకృతుల్లో సహజత్వం, సృజనశీలతా, ఆత్మచైతన్యం అంతకంతకి లోపించిపోతున్నాయి.

విషయేంద్రియాలకి సంబంధించిన రసానుభూతులకి పరమై—విస్మృతిలోంచి స్మృతిని జాగృతం చేసే ఆత్మరసానుభవమే శిల్పానికాధారం. ఆ రసానుభవాన్ని వ్యక్తపరచగల శక్తి ఒక్క పరిశుద్ధాత్మకే ఉంది. పరిశుద్ధాత్మ చైతన్యంతో స్పందింపబడిననాడే నాకు రససిద్ధి.



# నా కవిత్వం

## శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు

చాలాకాలం క్రిందట—తారీఖు సరిగా గుర్తు లేదు—సుమారు పదేళ్లక్రితం అనుకుంటాను—భీమవరంలో జరిగిన ఒకసభలో నా గీతాలు చదువుతున్నాను:

తలుపు గొళ్లెం,
హారతి పళ్లెం,
గుర్రపు కళ్లెం—
కాదేదీ కవిత కనర్హం!
ఔనౌను శిల్పమనర్ఘం!

* * *

ఒక మారిచటా, ఒక మారచటా...
నీ హృదయములో నా హృదయములో—
గంటలు, గంటలు!
గంటలు, గంటలు!

* * *

పోనీ
పోనీ
పోతే పోనీ
పోనీ;
సతుల్ సుతుల్ హితుల్
రానీ
రానీ
వస్తే రానీ
కష్టాల్ నష్టాల్ కోపాల్ తాపాల్
కానీ
కానీ
గానం, ధ్యానం

దారిపక్క చెట్టుకింద
ఆరిన కుంపటివిధాన
కూర్చున్నది ముసిల్దొకతె
మూలుగుతూ ముసురుతూన్న
ఈగలతో వేగవేక

* * *

ఇలాంటివే ఏవోవో చదువుతున్నాను. వెనక నుంచి ఎవరో కుర్రాడు "ఓస్—ఇలాంటి కవిత్వాలు నేనూ రాయగలను." అనడం వినబడింది. ఆ మాటలో "ఇదీ ఒక కవిత్వమేనా?" అనే ఈసడింపు ఉందేమో నాకు తెలియదు. కాని "ఇలా రాయడం చాలా సులువైన పని." అని మాత్రం సారాంశం తేల్చాడు. ఆ నాటి నా వ్యాఖ్యాత. దాన్ని నాటికీ నేటికీ ఒక ప్రశంసగానే స్వీకరిస్తున్నాను. ఆ కుర్రాడెవరో ఇప్పటికీ నాకు తెలియదుగాని అతని యాదృచ్ఛిక విమర్శ, కవిత్వరచనమీద నాకున్న విశ్వాసాన్ని మరింత బలపరిచింది. ఔను, కవిత్వం చెప్పడం ఒక కష్టమైనపని కాకూడదు. కష్టమైన పనులే ఘనమైన పనులనుకొనే మనస్తత్వమే మన కష్టాలన్నింటికీ కారణం. సౌలభ్యం, జీవితంలో—కవిత్వంలో సౌలభ్యం, ఇంకా సౌలభ్యం ఇదీ మనకు కావాలి.

జీవితంలో సౌలభ్యం లేనంతకాలం కవిత్వంలో సౌలభ్యం సాధించే ప్రయత్నమంతా కష్టభూయిష్ఠమే. జీవించడమే కష్టమైన కాలంలో కవిగా జీవించడం మరీ కష్టం. నిజానికి ఊపిరిపీల్చడం ఎంత సులభమో కవిత్వం చెప్పడం కూడా అంత సులభమే. కాని ఎంతమంది ధారాళంగా ఊపిరిపీల్చి బతకగలుగుతున్నారు. అడుగడుక్కీ ఎన్నో అభ్యంతరాలూ, ఆందోళనలు. మానవుడి జీవితం కష్టపరంపరల

# నా కవిత్వం

జాబితా, దుఃఖసమూహాల తోరణం. ఎవరైనా కవి, శాస్త్రజ్ఞుడు, రాజకీయవాది ఎక్కడైనా సౌలభ్యాన్ని సాధించాడంటే దాని వెనక ఎంతో శ్రమ, తపన, అన్వేషణ అణిగిఉంటాయి. పైకి కనిపించే సౌలభ్యం ఒక చిరదీర్ఘ సంక్షోభకి ఫలితం.

చీకటిగదిలో చిన్నమీట నొక్కగానే విద్యుద్దీపం వెలిగి గదినంతటినీ కాంతివంతం చేస్తుంది. మిక్కిలి సులువుగా కనిపించే ఈ చిన్నపనికి వెనక ఎంత మానవప్రయత్నం ఇమిడిఉందో వేరే చెప్పాలా? ఇది ఒక్క ఉదాహరణ మాత్రమే. ఇటువంటివి ఎన్నైనా ఇవ్వవచ్చును. న్యూటన్ పండితుడు చెట్టుమీదనుంచి కిందకు రాలిపడ్డ పండును చూచి గురుత్వాకర్షణ సిద్ధాంతాన్ని చేశాడంటారు. కాని న్యూటన్‌కి ముందు ఎంతమంది ఆ దృశ్యాన్ని చూడలేదు? ఏకాగ్రతతో ఒక ముఖ్యమైన సమస్యకు పరిష్కారాన్ని అన్వేషిస్తున్న న్యూటన్ పండితుడికి ఈదృశ్యం సరియైనమార్గాన్ని సూచించింది అంతే.

సునాయాసంగా నేలనుంచి లేచిపోయి గాలిలో ప్రయాణంచేసే విమానాన్ని చూసి ఈనాడు మనం ఆశ్చర్యపడక పోవచ్చును. ఏభైఏళ్ల కిందట ఎవరైనా ఆకాశంలో విహరించడానికి అవకాశం ఉందంటే అతణ్ణి చూసి అందరూ నవ్వేవారే అని అనుకోవచ్చును. గణాలు లేకుండా పద్యాలు వ్రాయడానికి వీలుంది అంటే ఇదివరకు కొంతమంది ఎగతాళి చెయ్యలేదూ? కాని గణాలులేని పద్యాలకు కూడా కొన్ని నియమాలు లేకపోలేదు. ఈ నియమాలు గణబద్ధచ్ఛందస్సులకు చెందిన నియమాలు కావు. ఒక్కొక్కప్పుడివి వెనకటి నియమాలకు కేవలం వ్యతిరేకంగా కూడా ఉండవచ్చును. వెనకటి కాల బద్దలను తెచ్చి వీటికి విలువకట్టడానికి ప్రయత్నించకూడదు. జలాంతర్గామి అనుసరించే నియమాలతో విమానం కట్టుబడే ధర్మాలకు కొలవకూడదనే నే ననేది.

జీవితంలోనూ కవిత్వంలోనూ సంప్రదాయవాదానికీ, విప్లవవాదానికీ మధ్య ఎడతెగని పోరాటం ఎప్పుడూ సాగిపోతూనే ఉంటుంది. నిన్నటి విప్లవవాది నేటి సంప్రదాయ వాదిగా, ఘనీభవించడం కూడా, మనం చూస్తూ ఉన్నదే. యతిప్రాసలు వదిలిపెట్టవచ్చుగాని గణాలు కూడా వదిలిపెట్టడమే! అమ్మో! అనే సాహిత్య సంస్కర్త—వితంతువుకి పునర్వివాహం చెయ్యవచ్చుగాని ఆడది అసలే పెళ్ళి మానేస్తే ఎలాగ అయ్యో! అనే సంఘసంస్కర్త వంటివాడే! ఇటువంటివారే కొన్ని కొన్ని నియమాలు చేసుకొని వాడుకభాషను కూడా స్వీకరించవలసిందే అని ఒకానొక మధ్యేమార్గం ఉపదేశిస్తూ ఉంటారు. వీరి ఉపదేశాలకోసం వాడుకభాష ఉద్యమం వేచుకొని ఉంటే కాదూ!

ఛందస్సుకీ, వ్యాకరణానికీ, అలంకారాలకీ, అన్నింటికీ అవతల స్వచ్ఛమూ స్వచ్ఛందమూ, నీరవమూ నీరూపమూ అయిన కవిత్వ పదార్థం ఒకటి ఉంది. ప్రతికవీ దాన్ని అందుకోవడానికే ప్రయత్నిస్తాడు. ఈ ప్రయత్నానికీ స్వాతంత్ర్యాభిముఖంగా జీవితంచేసే ప్రయాణానికీ భేదమేమీలేదు. సంపూర్ణ స్వాతంత్ర్యం ఎలాగయితే ఒక ఆదర్శప్రాయంగానే ఉండి ఎన్నటికీ అందుకోరానిదో అలాగే అచ్ఛ కవిత్వం కూడా ఎంతవాడికీ అందరానిదే. కవిత్వమూ, స్వాతంత్ర్యమూ ఎవ్వరికీ ఎప్పటికీ అందని అందాలే అయినప్పటికీ వాటిని సాధించాలనే ప్రయత్నంలోనే, ఆ ప్రయత్నంలోని ఆవేగంలోనే, ఆ వేగంలోని అశాంతిలోనే, అశాంతిలోని ఆనందంలోనే ఉంది జీవితానికి సార్థక్యం.

వేళకాని వేళలలో
లేనిపోని వాంఛలలో
దారికాని దారులలో
కానరాని కాంక్షలతో
దేనికొరకు దేనికొరకు

దేవులాడుతావ్
ఆకటితో అలసటలో
ప్రాకులాడుతావ్
దేనికొరకు దేనికొరకు
దేవులాడుతావ్
శ్రీనివాసరావ్
అని నే నొకమా రన్నాను.

ఇప్పుడు నేను చదివిన గీతభాగం Free Verse కాదు. దీనికి ఛందస్సు ఉంది. యతిప్రాసలున్నాయి అక్కడక్కడ. Vers Libre నియమాలు వేరు. దీనికి రెండు ఉదాహరణలు ఇస్తాను. ఒకటి "కవితా ఓ కవితా!" అనే నా రచననుంచి.

కవితా ఓ కవితా
నాయువకాశల నవపేశల
సుమగీతావరణంలో
నిను నే నొక సుముహూర్తంలో
అతి సుందర సుస్యందన మందున
దూరంగా వినువీథుల్లో తిరిగే
అందని అందానివిగా భావించిన రోజుల్లో
నీకై బ్రదుకే ఒక తపమై
వెదుకాడే నిమిషాలందు నిషాలందున
ఎటు నే చూచిన మటుమాయపు నటనలలో
నీ రూపం కనరానందున
ఎటు నే చూచిన మటుమాయపు నటనలలో
నీ రూపం కనరానందున
నా గుహలో కుటిలో చీకటిలో
ఒక్కడనై బ్రుక్కినరోజులు లేవా!
యువకాశల
నవపేశల......
నిమిషాలందు నిషాలందున......

గుహలో, కుటిలో, చీకటిలో అనుప్రాసలూ, సజాతీయ శబ్దాలూ, నడిగల నడకా.

అగ్నిసరస్సున వికసించిన వజ్రం
ఎగిరే లోహశ్యేనం
ఫిరంగిలో జ్వరంధ్వనించే మృదంగనాదం
ఇంకా నేనేం విన్నానా ?

అని కొన్ని దృశ్యాల, రూపచిత్రాల జాబితా. దీనిని catalogue poetry అని ఒకాయన అన్నాడు. ఆమాట కొత్తదికాదు. Eliot, Auden మొదలైన కవులు ఈ Evocative పద్ధతిని అవలంబించారు. వేదాలనాటినుంచి నేటిదాకా Evocation అనేది కవిత్వపు ముఖ్యలక్షణాలలో ఒకటి.

అనాఘ్రాతం పుష్పం, కిసలయమలూనంకరరుహైరనావిద్ధం రత్నం.
'ఇయం గేహే లక్ష్మీరియమమృతవర్తిర్నయనయోః'
'దీర్ఘవాసరనిశలవిలసన్నవ నందనమ్ములన్'
'ఘనసారకాంతులన్
తలిరుల శయ్యలన్
సలిలధారల
చందనచారు చర్చలన్.'
'మరుదీశద్వీపదాన శోభశిఖి ధూమ్యాళిరోచి
కీనాశకాసర దేహప్రభ'
'ఇది మనోహర కాంతికింపైన బింబంబు
బింబంబుకాదిది పెడగుకెంపు
కెంపుకాదిది తేటిమొంపనిమంకెన'

ఇక్కడ మనస్సు ఆకర్షించేది ఛందస్సుకాదు. వరుసగా ఒకదాని తర్వాత ఒకటిగా వచ్చే images ఒకానొక మానసికావస్థను, ఒక mood ను సృష్టిస్తాయి. సినీమా ప్రపంచంలో Podovkin, Eiesnstein లు కనిపెట్టిన montage technique కి ప్రాతిపదిక ఇదే. ఉత్తర రామచరిత్రలో సీతాదేవి చిత్రపట సందర్శనం, అనిరుద్ధచరిత్రలో ఉషకు చిత్రలేఖ నానారాజకుమారుల చిత్రపటాలు చూపించడం మనం ఎరగనివికాదు.

Poetry is evocation. అయితే ఒక్క evocation మాత్రమే Poetry కాదు. కాని ఒక జాబితా

ఇవ్వడం అనాదినుంచీ కవులు అవలంబించిన ఒక ముఖ్యపద్ధతి.

ఛందస్సునుంచి స్వాతంత్ర్యాన్ని కోరడంలో కవి రసావిష్కరణకు కావలసిన కొన్ని మూలద్రవ్యాలను సంతరించుకుంటాడు. ఈ మూలద్రవ్యాలు ఉన్నంతకాలం కవిత్వానికి ఛందోరాహిత్యం ఒక లోపంకాదు.

వచనం నడుస్తుంది. కవిత్వం పరిగెడుతుంది. వచనంచేత పరిగెత్తించి దాన్ని కవిత్వం చెయ్యవచ్చును. అప్పుడు వచనంలోవలె, లేదా గణిత శాస్త్రంలోవలె అన్ని మెట్లమీదా అడుగువెయ్యనక్కరలేదు. ఒకానొక కాలానికీ, స్థలానికీ సంబంధించిన దృశ్యంనుంచి వెంటనే ఇంకొక స్థలకాలాల దృశ్యానికి గంతువేసి ఒప్పించుతుంది కవిత్వం. T. S. Eliot వ్రాసిన Waste Land లో ఇందుకు చాలా ఉదాహరణ లున్నాయి.

ప్రతీమాటకీ ఒక కొలతా, ఒక బరువూ, ఒక ఒరపూ ఉంటాయి. రెండుమాటలను సరియైన, ఉద్దిష్టమైన అర్థంవచ్చేటట్లు కలపడం చాలా కష్టం. కొన్ని మాటలను ఒక వాక్యంచెయ్యడం వాటితో ఒక పద్యం, కొన్ని పద్యాలతో ఒక ఆశ్వాసం, కొన్ని ఆశ్వాసాలతో ఒక కావ్యం.

కాని ఒక కావ్యంయొక్క ప్రశస్తి దాని పరిమాణం మీద ఆధారపడదు. వెయ్యిపద్యాల చెత్తకంటె ఒక పనివాడితనంతోకూడిన భావగీతం గొప్పది. A long poem is a contradiction in terms అని Edgar Allan Poe ఇందుకే అన్నాడనుకుంటాను. Lyric గొప్పదా? Epic గొప్పదా? అనే వివాదంలోని కిప్పుడు నేను ప్రవేశించను. కాని దీర్ఘతతో నిమిత్తంలేకుండానే ఒక మహాకావ్యం ఇచ్చిన ఆనందాన్ని ఇవ్వగల చిన్న గీతం వ్రాయవచ్చునంటాను. పరమాణువుకీ బ్రహ్మాండానికీ ఆకారంలో ఏమి భేదం ఉంది!

కవిత్వం పరిగెడుతుందన్నాను. ఈ వేగాన్ని సాధించే ఒక ఉపాయం ఛందస్సు. ఛందస్సు సహాయంలేకుండా కూడా ఈ వేగాన్ని తీసుకు రావచ్చు. ఉత్తమమైన Prose poems అన్నింటిలో ఈ గుణం కనబడుతుంది. అనుప్రాసలవల్లనూ, ఒక మాటగాని, కొన్ని మాటలనుగాని పునశ్చరణ చెయ్యడంవల్లను, యమకంవల్లను, వాక్యరూపాన్ని మార్చడంవల్లను వచనగీతంలో ఈ గుణాన్ని సాధించవచ్చును. ఇందుకుగాను కవికి మాటలయొక్క కొలత, బరువు, ఒరపు (texture) బాగా తెలియాలి. మాటలోనుంచి ఎంత అర్థం పిండడానికి వీలుందో అంతా అతను పిండుకోగలగాలి. వాటిని ఏరకంగా అమర్చితే ఎక్కువ effect తీసుకు రావచ్చునో తెలిసి ఉండాలి. అందుకే ఒక భాషలోని కవిత్వాన్ని ఇంకో భాషలోనికి తర్జుమా చెయ్యడం కష్టం. Charmed magic casements opening on the foam of perilous seas by Joining hands forlorn అనే కీట్స్ పద్యపాదాలకు ప్రతి పదార్థం చెప్పుకోగలంగాని మళ్ళీ ఇంకో భాషలోకి మార్చలేము.

నేను ఉదాహరించదలిచిన రెండో వచన గీత భాగం "వ్యత్యాసం" అనే నా రచననుంచి.

మాకు గోడలు లేవు.

గోడలు పగలగొట్టడమే మా పని.

ఇది కవిత్వంగా అంగీకరించమని అడగడం సాహసంగా కనబడవచ్చును. యతిప్రాసలూ, గణాలూ లేకపోతే మానిపోయె, కనీసం ఇందాకా నువ్వు చెప్పిన యమకం, అనుప్రాసాలాంటివేనా లేవు. దీన్ని కవిత్వం అనగలమా అని చాలామంది ఎదుర్కోవచ్చును. నేను కూడా లాలిత్యం, మాధుర్యం, మొదలైన కవితాద్రవ్యాలను గురించి కలలుకనే రోజులలో ఈ నగ్నపదాల సముదాయాన్ని కవిత్వం అనకపోయి ఉండేవాడిని. ఇటువంటిది కవిత్వం

కొజాలదనేవాళ్లు అలా యెందుకంటూరో నేను ఊహించుకోగలను. కాని నా దృష్టినుంచి ఇది ఎందుకు కవిత్వం అనుకోవాలో గ్రహించండి అని అట్టివారిని అడగవలసి ఉంది.

బైబిలులోని అన్నిగీతాలలోకీ చిన్నది ఒకటి. Jesus Wept అనేది. దీన్ని నేను కవిత్వంగా అంగీకరించడం మానలేను. కిందటి యుద్ధంలో Battle of Stalingrad అనే వార్తాశీర్షికను వరుసగా ఎన్నోరోజులు పత్రికలో చదివి ఉంటాను. అన్నిసార్లూ నాకు ఆ మూడుమాటలు ఎంతో ఉద్వేగాన్ని కలిగించాయి. William Sarojan తన నాటకం ఒక దానిలో ఒక కవిని ప్రవేశపెడతాడు. అతడు వ్రాసేవి అన్నీ ఏకపద మహాకావ్యాలు. సముద్రం అంటాడు. అదే ఒక కావ్యం. ఆకాశం. ఇంకో కావ్యం. చుంచు, వృక్షం ఇత్యాది. ఇందులో కొంతవేళాకోళం లేకపోలేదు. అయితే ఇందలి పరిహాసాన్ని కాస్త వడబోసిచూస్తే చాలా నిగ్గు నిజమైనది తేలకపోదు.

నా గేయాలను చాలామంది వచనగీతా లనుకొని పొరపడ్డారు. కాబట్టి వచనగీతం గురించి ఇంత విపులంగా ముచ్చటిస్తున్నాను. ఇందువిషయమై చెప్పవలసింది ఇంకా ఉన్నది. ఇతరులలోనుంచి కూడా ఎన్నో ఉదాహరణలు ఇవ్వాలి. క్లుప్తంగా మాత్రం చెప్పి ఈ విషయం ముగిస్తాను.

Walt Whitman వచనగీతానికీ Ezra Pound వచనగీతానికీ చాలా తేడాలున్నాయని ఒక విమర్శకుడన్నాడు. అలాగే నారాయణబాబు వచనగీతానికీ పఠాభి వచనగీతానికీ భేదముంది. ప్రతి వచనగీతాన్నీ దేన్ని దానికగా విశ్లేషించి సమాలోచించాలి. చాలా వచనగీతాలు good poetry కాక bad prose మాత్రమే. కందపద్యాన్ని ఖండించితే వచనగీతం కాదు. ఛందోగమనం రైలుబండి నడకయితే వచనగమనం విమాన విహారంవంటిది.

జంతుపరిణామ నిశ్రేణిలో సరీసృపానికీ, పక్షికీ నడుమ Archaeo ptiryx అనే ప్రాచీనపక్షి ఒకటి ఉండేది. దీనిని సరీసృపలక్షణాలు కొన్నీ పక్షిలక్షణాలు కొన్నీ. అలాగే ఛందోగీతానికీ వచనగీతానికీ మధ్యస్థంగా నిలిచేవి కొన్ని. ఉదాహరణకు

ఎగిరించకు లోహవిహంగాలను
పలికించకు మానవమృదంగాలను
ఉండనీ
మస్తిష్క కులాయంలో,
మనోవల్మీకంలో

ఇందులో మొదటి రెండుపాదాలూ సమానదైర్ఘ్యం ఒకేనడక కలిగినవి. ఆఖరి రెండు విషమపాదాల మధ్యని "ఉండనీ" అనేమాట రెండింటినీ వేరుచేస్తూంది.

దువ్వూరి రామిరెడ్డిగారి నైవేద్యం సంపుటిలో కాబోలు ఒక Prose poem ఉంది. అడవి బాపిరాజుగారు కురుక్షేత్రయుద్ధం అని Polyphonic prose లో వ్రాశారు. శిష్ట్లా ఉమామహేశ తన విష్ణుధనువులో ఈ Polyphonic prose విరివిగా ఉపయోగించాడు. ముద్దుకృష్ణ గ్యాలలో కొంత Free verse వ్రాశాడు. అతని "త్రిశతి" ఇప్పటికీ ప్రకటితంకాలేదుగాని అందులో Prose poems కి చాలా ఉదాహరణ లున్నాయి.

ఇదంతా 1930-35 మధ్యని. అది నా కవితాయాత్రలో ప్రధానఘట్టమే కాని... ప్రథమఘట్టం కాదు. ఎందువల్లనంటే ఇప్పటికి చాలా సంవత్సరాల క్రితంనుంచీ నేను పద్యాలు వ్రాస్తున్నాను. 1920 నుంచి 30 దాకా సాహితీసమితి సాహిత్యరంగాన్ని పరిపాలించింది. ఆరోజులలోనే నేనూ, పురిపండా, కాళ్ళకూరి నరసింగరావు, నారాయణబాబు మొదలైనవాళ్లం కవితావ్యాసంగం చేసేవాళ్లం. కాళ్ళకూరి నరసింగరావును దీర్ఘమైన గీతమాలికలూ, ద్విపదమాలికలూ వ్రాసేవాడు.. వాటికి వెంకట

పార్వతీశ్వరకవులది ఒరవడి. వృత్తాలలో కొల్లూరిది అందెవేసిన చెయ్యి. ప్రబంధాలూ, రాయప్రోలు, అబ్బూరివారల రచనలూ కొల్లూరి వృత్తాలకు ప్రోద్బలం. అతని పద్యం ఒకటి.

ఈ విపినాంతరాస్ఫుట సితేతర గర్భ నవీనభావిభా
గ్యావరణమ్ములై తిరుగులాడెడి నీడల నీలిమేడలన్
నా విరహైక వేదనల నాటకరంగములందు
ప్రాలెడిన్
దేవవధూకటాక్ష మృదుదీధితులీ సునుసోగ
వెన్నెలల్.

కవితాసమితిగా గుమిగూడి మేమందరమూ విశాఖపట్టణం జిల్లానుంచి కొంత సాహిత్యం ఎగుమతి చేసేవాళ్లం. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు మా అధ్యక్షుడు. పూడిపెద్ది రమణయ్యగారిని కవిగా కథకునిగా గౌరవించేవాళ్లం. ఆచంట సాంఖ్యాయన శర్మ, సెట్టి లక్ష్మీనరసింహం మున్నగు వయోవృద్ధులంతా మాసమితి సభ్యులు. పురిపండా, వడ్డాది సీతారామాంజనేయులు, నేనూకలిసి ఒకరోజు కవితా సమితి స్థాపించాం. పురిపండా దానికి అఖిలాంధ్ర ఖ్యాతి తీసుకొచ్చాడు. అతని సంఘటనశక్తి అమోఘం. కవితాసమితి తొలినుంచీ అతని భుజస్కంధాలమీదనే సాగింది.

1928 లో నేను మొట్టమొదటిసారి మద్రాసులో కొంపెల్ల జనార్దనరావును కలుసుకున్నాను. ఆయేడే నా "ప్రభవ" ఖండకావ్య సంపుటి ప్రకటితం. ఆంధ్రసాహిత్య పత్రిక దీన్ని అనుకూలంగా విమర్శించింది. భారతిలో జనార్దనరావు తలచుకుంటే దాన్ని అథఃపాతాళానికి అణగద్రొక్కగలిగి ఉండును. ఇందులో "సార్థకతకంటె సమాసతత్పరత ఎక్కువగా గోచరించుచున్నది." అని వదలిపెట్టివేశాడు.

ప్రభవనుంచి ఒక Sample.

అలఘుధ్వాంత వితాన సంభరితగోత్రాంతర్మహా
గహ్వర
స్థలియంభోనిధియయ్యె సంతతజల స్రావాతి
రేకంబునన్
విలయాంభోధరఘోష......

పూర్తిచెయ్యనక్కరలేదు. జనార్దనరావు విమర్శ సరియైనదే అని స్పష్టమే. ఇద్దరమూ విశ్వనాథ సత్యనారాయణ భక్తులం. కానిఇద్దరికీ సొంత గొంతుక వెదుక్కునే తహతహ అపరిమితం. అప్పటి మా రచనలన్నీ secondrate poetry అని మాకుబాగా తెలుసును. ఈ పద్యంలోవిశ్వనాథ influence. ఇంకోదానిలో కృష్ణశాస్త్రిది. ఇంకోదానిలో ఇద్దరిదీ. ఈ విధంగా ప్రతిగీతాన్నీ మమ్మల్ని మేము మోసగించుకోకుండా తీవ్రంగా విమర్శించుకొనేవాళ్లం. మా చర్చలలో మల్లవరపు విశ్వేశ్వరరావు కూడా చేరేవాడు. అతడు కృష్ణశాస్త్రి అనుయాయి. ముఖ్యంగా గేయచ్ఛందస్సులు అతనిపాలం.

1928 నుంచి 30 వరకు చెన్నపట్నం క్రైస్తవ కళాశాలలో నేను B. A. చదువుతున్నాను. ఆ రోజులలోనే ఆధునిక కవులనేకులతో నా పరిచయం. 29 లో కొల్లూరి B. L. కు చెన్నపట్నం వచ్చాడు. ట్రిప్లికేన్ బీచి మా సంకేతస్థానం. తెలుగులో భావకవిత్వం, ఇంగ్లీషులో షెల్లీ, కీట్స్ ఇత్యాదుల కవిత్వం. కృష్ణశాస్త్రి, వేదుల మా అభిమాన కవులు. హృదయేశ్వరి మా ఉద్గ్రంథం. తెలుగు కవిత్వంలో స్వర్ణయుగం ప్రవేశించిందని భారతిలో ఎవరో వ్రాసినవిమర్శలతో మేము ఏకీభవించము.

Shelley, Tagore, రాయప్రోలు, కృష్ణశాస్త్రి అదీవరస! రాయప్రోలు పక్కన అబ్బూరి, కృష్ణశాస్త్రి ప్రక్కన వేదుల, నండూరి ఎంకిపాలు, విశ్వనాథ—నాయని! వీరూ మా కవులు. బసవరాజునీ కవికొండలనీ కవులనడం కరుణించి. గురజాడ కవిగా మా దృష్టిలోనే లేడు, మనుచరిత్ర చదివితే చాలదా మహాభారతం ఎందుకూ?

1929 లో నేను "సుప్తాస్థికలు" వ్రాశాను. దానితో నాలో ఒకఘట్టం పూర్తి అయింది. ఇంకో ఘట్టం ఇంకా ప్రారంభంకాలేదు.

హైదరాబాదు రేడియోవారి అనుమతిని,

# తాపీమేస్త్రీ రామదీక్షితులు బి. ఏ.

## శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

ఇద్దరూ గోదావరిఒడ్డున తారసిల్లారు.

"మీ దేవ్రూ రండీ ?" అనడిగింది, నల్లటావిడ.

"కోనసీమ" అని బదులుచెప్పి "మరి మీదే పూరండి" అని యెగురడిగింది, యెర్రటావిడ.

"జల్లిసీమ"

"మీ పేరు ?"

"రత్తమ్మ"

"వైదీకులా"

"అవును, మీ పేరు ?"

"సుందరమ్మ"

"నియోగులా ?"

"కాము, వైదీకులమే"

అప్పటి కిద్దరూ కత్తిరీవొడ్డు దిగారు.

"మీరిక్కడ యెందు కున్నారూ ?" అనడిగింది రత్తమ్మ.

"మా అబ్బాయి వుద్యోగంకోసం వచ్చాం"

"దొరికిందా ?"

"ఇంకాలేదు"

"ఎన్నాళ్ళయిందీ మీరు వచ్చీ ?"

"నిన్న నేనండీ! మీ రెందుకువచ్చారూ ?"

"మేమూ మా అబ్బాయీ వుద్యోగంకోసమే, నిన్ననే వచ్చాం. అయితే, మీకిల్లు దొరికిందా ?"

"ఆ, దొరికింది. ముట్లగదీ, దానికి చేరివున్న మూడుగజాల వసారాయిచ్చా రెనిమిది రూపాయలు కట్టి."

"మాకూ దొరికింది. స్నానాలగదీ, పుడకలూ పిడకలూ పెట్టుకునే పంచపాళీ ఆరు రూపాయల కిచ్చారు"

సుందరమ్మ బుగ్గలు నొక్కుకుంది, గాజులు గలగలా డేటట్టు చెయ్యి కొంచెం వూపుతుంటూ.

గాజులు గలగలా ఆడాయి, మిలమిలా మెరిశాయి, అవి చూసి రత్తమ్మ కళ్లు జిలజిలా మన్నాయి.

"నాలుగు జతల బంగారుగాజులు. ఇంకా యెన్ని నగ లున్నాయో ? పెట్టిపుట్టింది" అనుకుం దామె.

చివరి కామె "మీ రెంతమందీ వచ్చినవారూ ?" అనడిగింది.

"ఇద్దరు కొడుకులూ నేనూను, పెద్దబ్బాయి బి. ఏ. అతని వుద్యోగంకోసమే వచ్చాం. చిన్నబ్బాయికి తొమ్మిదో యేడు"

"నాకొక్క కొడుకూ కూతురూనూ" అంటూ అనుకుంది రత్తమ్మ.

"మా అబ్బాయి కూడా బి. ఏ. అయిని సెక్కుల మీద మాత్రకడానికే మేము వచ్చాం. మా అమ్మాయికి పదోయేడు వెళుతుంది రేపు కార్తీకపున్నమకి."

అది వింటూనే, మొహ ముగిసిపోతున్నట్టు నటిస్తూ సుందరమ్మ పైట కొంచెం సడలించుకుంది.

దాంతో, మెడకింది పట్టు కొంచెం కనిపించింది. వెంటనే రెండుపేటల గోవర్ధనంగొలుసు జిగాల్ జిగాల్ అంది.

అది చూసి రత్తమ్మ చలిత అయింది.

అది గుర్తించి సుందరమ్మ గర్వించి వెన్నుపూసుకుంది.

"మీ అబ్బాయికి పెళ్ళయిందా ?" అనడిగింది రత్తమ్మ.

"ఆ, పదహారేళ్లు నిండకుండానే అయింది పెళ్ళి, కోడలి కిప్పుడు మూడోనెల కూడానూ."

"బాగుంది. ఉద్యోగస్థుడయేటప్పటికి కొడుకు పుడతాడు. అదృష్టవంతుడు"

"మరి మీ అబ్బాయికి పెళ్ళి—"

"ఇంకా చెయ్యలేదండీ!"

"చెయ్యలేదంటే—"

"ఆదిలో, బి. ఏ. అయితే గాని పెళ్ళి చెయ్యనని తండ్రి ప్రతిజ్ఞపట్టారు." ఉద్యోగం దొరికేదాకా పెళ్ళి వద్దని నా నాయనే పట్టుపట్టుకూర్చున్నాడు తరవాత"

"కాకపోయినా పెళ్ళి చెయ్యడం మాటలా?" అంది సుందరమ్మ, కళ్లు తిప్పుకుంటూనూ, తనచేతి రాళ్ళవుంగరం చూసుకుంటూనూ.

ఆవుంగరమున్నూ చూసింది రత్తమ్మ.

"ఒక్కజత అయినా నాకు బంగారుగాజులు చేయించాలనీ, తమకలాంటి వుంగరం చేయించుకోవాలనీ యెంతో ముచ్చటపడేవారు నామహారాజు" అనిన్నీ అనుకుందామె.

అప్పటికిద్దరూ సేవు చేసుకున్నారు.

రత్తమ్మ, బింకెలో వున్న బట్టలుతీసి, తడిపి రాతిమీద పడేసి, చేతికి నీళ్ళందేటట్టు కూచుని బింకె తోమసాగింది.

సుందరమ్మ, బింకె బోర్లించి దానిమీద కూచుని "మీ కేమన్నా భూమీ పుట్రా—" అంటూ మాట తేల్చేసింది.

"భూములు నాడే లేవు. కొంప తెగనమ్మి నాయనకి చదువుచెప్పించాను నేను" అని బదులుచెప్పింది రత్తమ్మ.

"మా కేమాత్రమో వున్నాయిసుమండీ! అయితే మాత్రం కూచుని తినమా? అంచేత వచ్చాం, మేము ఉద్యోగంకోసం" అనిచెప్పి సుందరమ్మ, మొగం పక్కకి తిప్పుకుని కళ్లు చికిలించుకుంది.

క్షణంలో మళ్ళీ యిలా చూస్తూ "మీ కెన్నాళ్ళయిందీ ఈయోగం పట్టీ?" అని కూడా అడిగింది.

"మూడేళ్లయిందండీ! కలరావచ్చి యెత్తుకుపోయింది నాకేవుణ్ణి. ప్రయివేట్లు చెప్పి పోషించేవారు మమ్మల్ని"

"నాకూ మూడేళ్లే అయింది. ఆసుపత్రి మింగేసిందాయన్ని"

అప్పటికి బింకె తోమడం అయిపోగా, రత్తమ్మ, తనపంచా, తన కొడుకు పంచా, కూతురు పరికిణీ వుతకసాగింది.

వెంటనే సుందరమ్మ రెండుచేతులతోనూ నీళ్లు చిమ్ముకుంటూ "బాబోయ్ బాబోయ్" అని యెగిసెగిసిపడుతూ మొలలోతుకి వెళ్లి నుంచుని! "అబ్బ! చలిచలి! వేన్నీళ్ళేగాని యెరగనైతిని నిన్నటిదాకా" అంటూ కంఠందాకా మునిగి లేచి వొళ్లు తోముకో సాగింది.

౨

ఎలెక్ట్రిక్కు కార్పోరేషన్ దగ్గిర యెదురుపడి సినీమాకేనా వెడుతున్నారు?" అనడిగింది సుందరమ్మ.

అప్పుడే విప్పిన గ్లాస్గోమల్లు మడతకట్టుకుని, తల చక్కగా దువ్వుకుని జారుముడి వేసుకుని వుందామె.

రత్తమ్మ కట్టుకున్నదిన్నీ చాలా పరిశుభ్రంగా వుంది; కాని అది నీరుకావిపంచె.

ఆమె కూడా తల దువ్వుకుని జారుముడి వేసుకునే వుంది.

"కాదండీ! నేనున్న విద్యమానంలో నాకు సినీమా కూడానా? మార్కండేయస్వామి గుడికి వెడుతున్నాను"

"మీ అబ్బాయి కేమయినా వుద్యోగం—"

ఇంకా దొరకలేదండీ! ఉద్యోగం ఆశ వొదులుకున్నాడు నాసాయన. మరి మీ అబ్బాయికి దొరికిందా?"

"ఎందరెందరో యిస్తాం రమ్మన్నారు; కాని మావాడే వొప్పుకోలేదు"

"అదేం?"

"దిక్కుమాలిన వుద్యోగాలు కాసి-ఈవుద్యోగా లిచ్చేవాళ్లకి అవసరమే కాని బుద్ధి వున్నట్టులేదండీ!"

"ఏం జరిగిం దేమిటి?"

"ఒక జమీందారన్నాట్ట, ఇచ్చేని పదిహేను రూపాయలట యింతాచేస్తే, కాని రాత్రింబగళ్లు తనని కనిపెట్టుకునివుండాలట. చుట్టలూ, సిగరెట్లులూ నోటి కందిస్తూ. పైగా, సంవత్సరం దాకా జీతం యెక్కువ చెయ్య మని అడగ ననీ, నౌకరీ చేస్తా నని రాసి కూడా యివ్వాలి టండోయ్"

"ఆయనే కాబోలు, నానాయనతోనూ అలాగే అన్నాట్ట"

"ఇంకో వర్తకు డున్నాట్ట. కొన్నైతే యిరవయి రూపాయ లిస్తాడుట లెండి; అయితే, నెల కిరవై దినాలు సికిందరాబాదనీ, శ్రీకాకుళం అనీ, బంద రనీ తిరుగుతూ వుండాలట. ఊళ్లో వుండిన పది దినాలూ తన యింటోకూచుని వుత్తరాలకి నకళ్లు రాయాలట, విన్నారా?"

"నా నాయనతో అటు కర్నూలు దాకానూ, యిటు భద్రాచలంపైకీ కూడా వెడుతూవుండాల న్నాట్ట ఆయనే కాబోలు"

"మరో పెద్ద ఆస్తిపరు డున్నాట్టండీ!" వడ్డీ కట్టడం చేతవునా?" అనడిగాడుట. బి. ఏ. ని అదా అడగడం చెప్పండీ, పోయేకాలం కాకపోతే? తీరా, అందు కయినా సరే అని సిద్ధపడితే—"

"జీతం లేకుండా మూడుమాసాలు పనిచెయ్యా లన్నమాటేనా మీరు చెబుతున్నది?"

"మీ అబ్బాయికీ అయిందీ అదీ?"

"ఆ"

"ఇంకోటి కూడా అన్నట్టు మీ అబ్బాయితో అన్నాడో లేదో మరి. తన కొడుక్కీ తన మనమ డికీ యింగ్లీషు కూడా చెప్పాలటండీ"

"అదెందుకో తెలుసా?"

"వాళ్ల కింగ్లీషు తెలిస్తే గాని, యింగ్లీషు గుమాస్తా యెందు కంటూరుట, చూశారా?"

"డబ్బున్నవాళ్లెన్ని చిలకపలుకు లయినా పలుకు తారు, మానేం చెయ్యగలము?"

"మానేం చెయ్యగలమా? వాళ్లకే కండా మహా? ఊరికే కూచోడం యెందుకు కని గాని—యింట్లో కాఫీఖర్చుకి చాలదు వా డిస్తానన్న"

మీమాట నేమో గాని నాకు మాత్రం ఆది కొన్నాళ్లపాటు మహా మేలు గానేవుండేది; కాని రాత్రిళ్లు తరుచు తన యింటివద్దగ పడుకోడం కూడా తప్పదన్నాట్ట కాదూ?"

"మరేటండోయ్! కళ్లూ, కాళ్లూ వున్నతాయా ఆ అబ్బికి? బ్రాహ్మణపిల్లాగా, బి. ఏ., తన యింటికి కాపలా?"

"అలా వుంది కాలం"

"ఎవరో సినిమావాళ్లుటండీ! రాత్రి వొంటిగంట దాకా రెండాటలకీ కథ చెప్పా లన్నారుట. పొడి కలు పుచ్చుకుని కుర్రాళ్లు రోడ్డువీధికీ తిరుగుతున్నారో లేదో చూడడానికి మధ్యాహ్నంపూట అంతా వాళ్ల వెనకవెనకనే తిరుగుతూ కూడా వుండాలిట. మరి జీతం—"

"ఇరవయ్యేగా?"

"మీ అబ్బాయీ వెళ్లాడూ అక్కడికి?"

"వెళ్లాడమ్మా, వెళ్లాడు"

"ఒకప్లీడరుట. తన కొడుకులకి రాత్రీ పగలూ ప్రయివేటు చెబితే అన్నమూ బట్టా యిస్తాట్ట. తనకే కాని మరెవరికీ కుటుంబం లేదనుకున్నాడు కాబోసు వెర్రినాయన"

"ఆయనే కాబోలు, మావాడికి జీతమే కావాలంటే పదిహేనురూపాయ లిస్తా నన్నాట్ట; కాని, తనకోసం కోర్టుకి కాఫీ పట్టుకువెడుతూవుండాలిట"

"బ్రాహ్మణజన్మేనా ? వాడిదీ ?"

"......................"

"నవ్వుకుని వూరుకుంటే కాదండీ! ఇలాంటి వాళ్ళకి తగినట్టి గడ్డిపెట్టకపోతే యింకా పెచ్చిపోతారండీ!"

"ఎవరో వొకరు పెట్టకపోరు, మనకెందుకూ ?"

"ఇంకో వర్తకు డున్నాట్ట బ్రాహ్మడేట. కొత్తగా కూరల అంగడిపెట్టాడుటండీ! ఊళ్ళో యింటింటికీ తిరిగి కూరలు కొనుక్కునేవాళ్ళ నందర్నీ తన అంగడికి మళ్ళించాలట. అలా మళ్ళిస్తే—ఆవచ్చినవాళ్లు తన పేరు చెబితే—వాళ్లు కొన్నసరుకులమీద వచ్చే లాభంలో నూటి కయిదురూపాయలు—"

"కావడి ఖజానవేసుకుని వూళ్లో తిరిగి అమ్ముకు రావాలనలేదు, నయమే కాదూ ?"

"బాగా చెప్పారు. మరి మీ అబ్బాయి యేమి చేశాడూ ?"

"ఏటి కడ్డపడ్డాడండీ!"

"అంటే ?"

"ఆదిలో, దినాని కొక రూపాయి కిడుతుందను కున్నాట్ట కాని వొకవారం అయింది ప్రవేశించి, పదిరూపాయలు వచ్చా యంటూ పొంగిపోతూ పట్టుకువచ్చాడు నా నాయన"

"మా వాడు చిల్లరపనులు చెయ్యడు సుమండీ!. పుట్టింది బ్రాహ్మణపుట్టుకాయె. ఆపైని బి. ఏ. మాకు లోటూ లేదు. మంచిపనిదొరికితేనే"

"మీ కేమమ్మా బంగారు పిచికలు. మరి వెడుతా స్వామిదర్శనం చేసుకుని, నా నాయన యింటికి వచ్చేటప్పటికి వంటచెయ్యాలి"

"నేనూ వెళ్లాలి, ఆలస్యం అయితే టిక్కెట్లు దొరుకుతాయో లేదో, ఏదో కొత్తఫిలిం వచ్చిందిట. ఇక అవి ఫేషన్లు కావుట, పాటలు కావుట, డాన్సులు కావుట—బాబోయ్........"

## 3

ఇద్దరూ మార్కండేయస్వామి గుడిదగ్గరే కలుసుకున్నారు.

"గుడినుంచి వస్తున్నారా ?" అనడిగింది రత్తమ్మ.

"లేదండీ, బజారుకి వెళ్ళాను గ్లాస్గోతానులు రెండో మూడో పుచ్చుకుందా మనీ. లేవు రమ్మన్నాడు వర్తకుడు. ఇలా తిప్పడమే కాదు, వొకటికంటే యెక్కువ యివ్వడుట. ఇకముందు దొరకడమే కష్టంట"

"ధర పెరిగిపోయినందుకే గోలగా వుండగా అదికూడానా ?"

"ఏమి చెప్పుకోనండీ! ఆదికాలాన నేను మధుర చీరలూ, బెంగుళూరుచీరలూ, కంచిచీరలూ, పుల్లంపేటచీరలూ, ఉప్పాడచీరలూ తప్ప మరొకటి యెరుగను. ఈయోగంపట్టాక కొన్నాళ్ళనుంచి గ్లాస్గోనుల్లు కడుతున్నాను, ఇకముం దేలాగో మరి"

"చిక్కగానే వుంటేటట్టుంది. వద్దువద్దంటూ వుంటే, నిన్న, చెల్లెలికి నాలుగు పరికిణీగుడ్డలూ, నాలుగువొక్కాగుడ్డలూ, నాకు మూడు మెట్టూరు మల్లుపంచెలూ తెచ్చిపడేశాడు నా నాయన. ముందుముందు మీరన్నట్టు దొరకడం కష్టమేట"

"బాగా కిడుతోంది కామోసు నేం ?"

"ఆ, స్వామిదయవల్ల చెప్పవద్దూ? రెండువారాలనుంచి నా నాయన దినానికి రెండున్నర సంపాదిస్తున్నాడు"

"దినానికి రెండున్నర తెస్తున్నా డంటే జ్ఞాపకం వచ్చింది, విన్నారా ? ఎవరో బ్రాహ్మణపిల్లాడుటండీ! బి. ఏ. కూడానుటండీ! కాని శూద్రకుర్రాడు

లాగ తాపీపని చేస్తున్నాడుటండీ! మావాడు చెప్పి యెంతో యిదయాడు, అదేం కర్మమండీ?"

"............అయితేనేం, మీచేతిని గాజులు రెండుజతలే కనపడతాయేం, నాలుగుజతలుంటేగా కాదూ?"

"అవును, వుంటేవి నిజమే—ఇప్పుడూ వున్నాయి; కాని, బరువనీ దినమ్మా యెందు కనీ రెండుజతలే పెట్టుకుంటున్నాను"

ఇలా అంటూ సుందరమ్మ పైటచెంగు కంఠం చుట్టూ సవరించుకుంది.

దాంతో, ఆదాంగతనం కనిపెట్టేసి, రత్నమ్మ" అదేం, గోవర్ధనం గొలుసేది?" అనడిగేసింది.

"సరదాపడితే మాచిన్నబ్బాయి మెడలో వేసి వచ్చాను" అని బదులుచెప్పింది సుందరమ్మ, మొగం వంచుకుని.

"మీ అబ్బాయికి వుద్యోగం—"

చెప్పు లరిగేలాగ—చెప్పు లంటే బూడ్సులు సుమండీ! అవి అరిగేలాగ తిరుగుతున్నాడు. కొళ్లలు కావలసినన్ని వున్నాయిట; కాని వొక్కటీ దర్జా అయింది కాదుట. చూసిచూసి పాడుపనిలో ప్రవేశించడం యెలాగండీ మరీ?"

"మనస్కరించకపోతే యెలా గా ప్రవేశించడం?"

"కానయితే రెండునెలలు కావస్తోంది వచ్చి అయినా—"

"కష్టమే. ఉప్పుతో తొమ్మిదీ కొనుక్కోవాలి డబ్బుపెట్టి. అయినా, వొక్కటీ మంచిది దొరకదు. నెయ్యీ మజ్జిగా దొరుస్తున్నారా?"

"బాధగానే వుందండీ"

"మీకోడలికి గాజులు పెట్టించారా?"

"అయిదోమాసం రేపటితో వెడుతుంది. చెప్పకో గూడదు; కాని విన్నారా? సంతోషం కొద్దీ నెల తప్పగానే రాశాం, వెంటనే వచ్చి పుట్టింటివారు తీసుకుపొయ్యారు. గాజులు వారే పెట్టించు కుంటా రనుకున్నాం. ఎంత గతి కడుక్కుపోయినా గాజులు పెట్టించడం పుట్టింటివారే—అన్నరంటూరా కాదంటూరా?"

"లోకధర్మం అంతేగా?"

"మా అబ్బాయి పెళ్ళాన్ని విడిచి క్షణం ఫండ లేడు. వారాని కోసారైనా వెళ్ళి వారందినా లుంటూనే వుంటాడు, మొదటే వాడితో చెప్పకోవచ్చునా? తీరా, అయిదోనెల నెళ్ళిపోతుం దనగా, నాలుగు దినాలకిందట వాడితో ..ంపేసి వూరుకున్నారు"

"అదేం?"

"వారికి ఆనవాయితీ లేదుట"

"పా—పం"

"పాపమో పుణ్యమో వారు చేసెం పది. దాని మీద మేమే పెట్టించుకున్నాం నిన్న, మాకు తప్ప తుంగిటండీ?"

"తప్పితే యెలాగా? లాంఛనాలూ ముచ్చట్లూ యెలాగో వొకలాగ—"

"ఎలాగో వొకలాగ యేంకర్మం, రాజాగా జరిగించుకున్నాం, మాకుమాత్రం తీరవద్దూటండీ?"

"అదే నేనన్నదీని. అయితే తల్లీతండ్రీ—"

"రానూ వచ్చారు, గాజులు పెట్టించిన ఉత్తర క్షణాన తీసుకువెళ్ళనూ తీసుకువెళ్ళారు మళ్ళీ"

"అదేమిటండీ? ఇవాళ తీసుకువెళ్ళగూడదనూ?"

"ఇరుగూ పొరుగూ అలాగే అడిగారు, వింటేనా?"

"మరి మీ అబ్బాయి—"

"అయితే నేనూ వస్తాను పదండి" అంటూ వెంట పడ్డాడు. మనలో మనమాట, ఏహూ వాణ్ణి నేనే పంపించాను సుమండీ"

ఇలా అని సుందరమ్మ, ముక్కూమూతీ తిప్పుకుంటూ చురుగ్గా చూసింది.

"తెలిసింది కాదు, వచ్చి మీకోడల్ని చూస్తును" అంది రత్నమ్మ.

"చూస్తూరుగాని, చూస్తరుగాని, మరిపోవాలి. ఇవాళ చింతామణి నాటకంట. రెండరాడే రెండు మెతుకులు నోట్లో వేసుకుని—నా చిన్నకొడుకు గంటనుంచి తొందరపెట్టేస్తున్నాడు"

ఇలా అంటూనే సుందరమ్మ తుర్రుమంది.

రత్తమ్మ, ముంగురిచ్చపడి, తరవాత మెల్లిగా గుడికి వెళ్ళింది.

౪

ఇద్దరూ మిషన్ ఆసుపత్రి ఆవరణలో యెదురు పడ్డారు.

"ఇలా వచ్చారేం ?" అనడిగింది సుందరమ్మ.

"మా బంధువుల్లో వొకమ్మాయికి రకరాక కడుపు వచ్చింది. ఎందుకయినా మంచిదని పురిటికి ఆసుపత్రికి వచ్చారు. చూసి వస్తున్నాను."

"పురుడు వచ్చిందా ?"

"ఆ, నాలుగు దినాలయింది వచ్చి, గుమ్మడి పండులాంటి పిల్లాడు పుట్టాడు. పుట్టింటివారూ అత్తింటివారూ పొంగిపోతున్నారు"

"అబ్బ[illegible]మా ? అయితే, అందరికీ అలాంటి పుట్టింటివారు దొరకవద్దూ ?"

"కూతురుబాగు చూసి ఆనందించని పుట్టిళ్ళవాళ్ళు ఉంటారా, లోకంలో ?"

"అయ్యో వెర్రిద, అడిగారూ మా వియ్యాల వారి సంగతి ?"

"ఆరేమిటండీ ?"

"ఆరేమిటంటే ? మాకోడలికి వొళ్ళంతా నీరు పట్టింది. అక్కడి డాక్టరు భయపెట్టాడు. తీసుకు వచ్చి మాయింటిమీద పడేశాడు తండ్రి"

"పురుడు వచ్చిందా ?"

"ఇంకా లేదండీ ! తల్లీతండ్రీ వచ్చి మానెత్తిమీద కూచున్నారు విందులు కుడుస్తూ. కూతుర్ని కనిపెట్టుకుని తల్లీ, గోదావరిరేవు కనిపెట్టుకుని తండ్రీ కూచుంటారు. ఎక్కడో పనికిమాలిన సంబంధం వచ్చిపడింది మాకు, చచ్చిపోతున్నాను చాకిరీ చెయ్యలేక"

"మీ అబ్బాయికి వుద్యోగం—"

"ఇంకా దొరకలేదండీ! ఏమిటేమిటో వున్నాయిగాని మావాడు పెద్దమనుష్యుల దగ్గిరే కానీ—అదయినా దర్జాగా కూచుని పురమాయింపులు చేసే పెద్దగుమాస్తాపనే కానీ చెయ్యడండీ ! నాలుగురాళ్లు పైగా కూడా దొరుకుతూ వుండాలి. అలాంటిది వచ్చినప్పుడే అని చూస్తున్నాడు"

"మా కలా సాగదండీ మరి ! అబ్బాయి యేటికి కడ్డపడ్డాడు. దినానికి మూడు రూపాయలు తెస్తున్నాడిప్పుడు. ఎవరో పెద్దరెడ్డిగారుట. పెద్దపెద్ద కంట్రాక్టులు చేస్తూవుంటారుట. నాలుగు లక్షలికి వొప్పుకుని యిప్పుడు పెద్దఆసుపత్రి కట్టిస్తున్నారుట. జీతానికి రమ్మంటున్నారట వారు, పైని వుండి పనులు చేయించడానికి నా నాయన్ని"

"కూలీలమీద మేస్త్రీపనా ?"

"ఏమిటో చెప్పాడు, ఆపేరు జ్ఞాపకంలేదిప్పుడు, కానీ—నువ్విలా రా తల్లీ ! ఇది నా చిట్టితల్లి. మీరు మార్కండేయస్వామి గుడిదగ్గిర కనపడ్డారూ ? ఆ వేళ, మధ్యాహ్నం యెండవేళ, యెవరో వొకావిడ రెండు జతల గాజులూ, గోవర్ధనం గొలుసూ అమ్ముకుందిట బజార్లో. అప్పుడక్కడే వుండిన మా అబ్బాయి, పాతికరూపాయల లాభం యిచ్చి అవి కొనేశాడు. ఇదిగో, ఆ గాజల జతలు చెరిపించి నా చిట్టితల్లికి రెండు జతల గాజులూ, మిగిలిన బంగారంతో చెవులికి గుద్దులూ లోలకులూ, ముక్కుకి కేసరీ ముక్కుపుడకా చేయించినాడు. గొలుసు మెరుగు పెడుతున్నాడు పనివాడు"

"డబ్బంతా యిప్పుడు కూలీలకేనండీ, యేం చేయించకా ?"

"...అదేం, మీ చేతిని వుంగరమూ, తక్కిన గాజుల జతలు రెండూ కనపడవేం ?"

"అలాంటివి చూస్తే యీ ఆసుపత్రివాళ్లు డబ్బు దోచేస్తారు, అంచేత, తీసి దాచివచ్చాను"

"రాత్రి యిక్కడ పడుకోవాలి కాబోలు పాపం, పాతబట్టలతో వచ్చారు"

"అవునండీ"

"కోడలి కేమయినా సుళువుగా వుందా?"

"ఏం, ఉండకేం? వారంనాలకి ఇంజక్షన్లకే తొంభై రూపాయ లయినాయి. సుళువుగానే తిరుగుతోంది, యివాళో రేపో పురుడు వస్తుందంటోంది దొరసాని"

"మంచి ముహూర్తాన మా అబ్బాయి కొమాళ్ల తండ్రి కావాలి. మరి యింటికి వెడతానండి"

"నడుస్తూ వుండండి నేనూ వస్తాను, స్థానమూ గట్రయ్యా వచ్చారుట సావిత్రి ఆడడానికి, యిది తప్పితే మళ్ళీ యెన్నాళ్లకో గాని దొరకదు"

రత్తమ్మ తెల్లబోయింది; కాని చేసేది లేక మంచిదండీ" అంటూ మెల్లిగా చక్కాపోయింది.

ఇద్దరూ జయాటాకీసుపక్కన, రాజక్ ప్రెస్సు దొడ్డిగుమ్మం దగ్గిర కలుసుకున్నారు.

రత్తమ్మ తెల్లని మల్లుపంచె కట్టుకుని వుంది, చేతులకు రెండుజతలబంగారుగాజులూ, మెడలో గోవర్ధనం గొలుసూ వున్నాయి.

ఆమె కూతురు, పువ్వులపరికిణీ గళ్ళఫ్రాక్కూ తొడుక్కుని వుంది. ఆమెచేతికిన్ని గాజులూ, చెవులకి దుద్దులూ లోలకులూ, ముక్కున బేసరీ ముక్కుపుడకా వున్నాయి.

సమీపాన, రత్తమ్మ కొడుకు ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

సుందరమ్మ, మాసిపోయిన పాతబట్ట కట్టుకుని వెలవెలబోతున్నట్టుంది; కాని రత్తమ్మని చూసి గాంభీర్యం తెచ్చుకుంది.

ఆమె చిన్నకొడుకు శూద్రపిల్లలతో ఆడుతూ పేచీపడుతున్నాడు.

"అదిగో, సూటువేసుకుని దొరటోపీ పెట్టుకున్నాడదూ, అతనే నండీ నా నాయన? రెడ్డిగారు నెలకి నూటయాభై రూపాయ లిస్తున్నారిప్పుడు" అంది రత్తమ్మ.

"కూలీలమీద మేస్త్రీ కంత జీతం యిస్తారా యెక్కడైనా?" అనడిగింది సుందరమ్మ, బుగ్గలు నొక్కుకుంటూనూ, కళ్లు తిప్పుకుంటూనూ.

"మేస్త్రీ కాదుగా? సూపర్వైజ రన్నానుగా?"

"తాపీపనివాడి కంత పెద్దవుద్యోగం యిస్తారా యెవరయినా?"

"అంత పెద్దపని యిస్తారా" అని వింతా "అంత జీతం యిస్తారా?" అని ఆశ్చర్యమూ యెందుకూ? ఆ మనిషి బుద్ధిపట్టీ తాహతుపట్టీ, నడతని పట్టీ వుంటుంది. ఆ రెడ్డిగారి దగ్గర వొక బ్రాహ్మణ పిల్లాడు, బి. ఏ., అట్టెండరుగా చేరాట్ట, ఆరు మాసాలు తిరిగితిరిగి నౌకరీకొరకు, ఎవరికో ఎక్కి వేలు కొంతం యిచ్చి సిఫారసులు చెప్పి జవాబు తొరగా పంపమని చెప్పి నమ్మన్నాడట రెడ్డిగారు, అంటే, ఆ బ్రాహ్మణుడు బి. ఏ, "నే నలాంటి నా మోస్కీ పనులు చెయ్య" నన్నాట్టండీ! అదేమిటండీ, అట్టెండరుగా చేరాక ఇడిచిపోటు కాకపోతే?" అని బుదలకించి చురుగ్గా చూసింది రత్తమ్మ.

"ఏమో" అంది సుందరమ్మ, మొగం పక్కకి తిప్పేసుకుని.

"అప్పుడక్కడ వొక పెద్దమనిషి వున్నాట్టండీ!" అంటూ మళ్ళీ అందుకుంది రత్తమ్మ, మరి కాస్త దగ్గిరికి వెళ్లి,

"ఆయన, ఆ పిల్లాడి పుట్టుపూర్వోత్తరా లన్నీ యెరుగునుట. ఇంతా చేస్తే, ఆ అబ్బాయి తండ్రి వంట బ్రాహ్మడుటండీ! ఎందుకో ఆపరేషను చేయించుకుని, చీముపట్టిగా విషమించి, చివరికి ఆసుపత్రిలో దిక్కుమాలిన చావు చచ్చాడుట తండ్రి. ఆ అబ్బాయితల్లి మొగు ణ్ణెప్పుడూ పనిపెట్టలేదుట. సినీమాతారల్లాగ

వేషాలు వేసుకుని షష్టిగడియలూ పూరమ్మట తిరుగుతూ వుండేది టావిడ. ఒకమూల, మొగుణ్ణి ఆసుపత్రిలో కిందికి దింపుతూవుండగా, మరోమూల, ఆవిడ, నాటకశాల దగ్గిర టిక్కెట్టుకోసం స్వయంగా యెగబాకుతోందిట. ఇదంతా యేకరువుపెట్టి, "ఎస్టిమేటుపట్టుకువెళ్లడం నీబతుక్కి నామోషీఅయిందా?" అని డెకొరించాట్ట ఆపెద్దమనిషి ఆపిల్లాణ్ణి. దీనిమీద రెడ్డిగారు "నువ్వికమా కక్కర్లేదు, దయచెయ్యి" అనేశారుట, బ్రాహ్మడైతే మాత్రం నీతీ జాతీ లేకపోయాక పూజిస్తారుటండీ లోకులూ ?"

సుందరమ్మకి మాట రాలేదు. కాలిబొటనవేలితో నేలమీద రాస్తూ మొగం వంచేసుకుం దామె.

సుతారంగా తల పంకించుకుంటూ చూసి, రత్తమ్మ "ఆవేళా ? మనం ఆసుపత్రిలో కలుసుకున్నామూ?" అంటూ మళ్ళీఅందుకుంది.

"అక్కణ్ణుంచి నే నింటికి వెళ్లాటప్పటికి, నా నాయన, రెండుజతల బంగారు గాజులూ, వొక రాళ్లవుంగరమూ కొనుక్కువచ్చాడు. అంతకితమే యెవరో వొకావిడ అమ్ముకుందిట అవి. మళ్ళీ పాతిక రూపాయలు లాభం యిచ్చి అవిన్నీ కొనేశాడు నా నాయన. "పెళ్లిలో నీపెళ్లానికి పెట్టుకుందువుగాని దాచుకో నాయనా" అన్నాను నేను ; కాని యెంత చెప్పినా నామాట వినక "నేను నాన్నని సుఖపెట్ట లేకపోయాను. కనక, నీబదులూ నాన్నబదులూ నిన్నే సంతోషపెట్టాలి నేను. నా పెళ్లి నాటికి నేను మళ్ళీ సంపాదించుకోలేకపోను, నువ్వే పెట్టుకో" అని గాజులూ, గోవర్ధనంగొలుసూ నేను పెట్టుకునేదాకా తొందరపెట్టాడు నా నాయన, ఇవిగో చూశారా?"

ఇలా అడుగుతూ వొకచేత గొలుసు యెత్తి పట్టుకునీ, గాజులు కనపడడాని కొక చెయ్యి ముందుకి చాపి మరీ దగ్గిరగా వెళ్లింది రత్తమ్మ ; కాని సుందరమ్మ కిక్కురుమనలేదు.

రత్తమ్మకి చిరునవ్వు వచ్చింది ; కాని అది ఆపుకుని, ఆమె "నేను నా నాయన మాట తీసెయ్యలేకపోయానండీ ! ఉంగరం మాత్రం నానాబలవంతాన అతనే పెట్టుకుంటున్నాడు సుమండీ ! మొలిచినట్టు సరిపోయింది అతని అనామిక కది. మార్కండేయస్వామి దయవల్ల మాకిక లోటులేదు. నా నాయనకి, వెయ్యిన్నూటపదహార్లూ, వెండిచెంబూ వెండికంచమూ, పట్టుతాపితాలూ యిస్తామనీ, నాకూ నా చిట్టితల్లికీ చెరో నూటపదహార్లూ తక్కిన లాంఛనాలూ యిస్తామనీ యెవరో కాకినాడ కాలేజీలో ప్రొఫెసరుట, తన కూతుర్ని చేసుకోమంటూ నిన్ననే వచ్చారు. ఏలూరినుంచి "రేపు వస్తున్నా"మని ఆయన వుండగానే వొకప్లీడరుగారు ఉత్తరం రాశారు. తొందర యేమని మేమింకా యెవరికి మాటయివ్వలేదు. ఇద్దరుపిల్లలూ రజస్వల లయినవాళ్లేట. బంగారబొమ్మలు కూడానుట. నా నాయన పెళ్ళికి మీరు తప్పకుండా రావాలి సుమండీ! ఏదీ, నాయనా. యిలా రావోయ్ ! ఒకమాటు నీవుంగరం సుందరమ్మగారికి చూపించూ, బాగుందేమో చూస్తారూ" అంది కళ్లు చికిలించుకుంటూ.

సుందరమ్మ మొగం యెత్తలేదు.

ఇటయినా తిప్పలేదు.

మాట్లాడలేదు.

నుంచోనే లేదు.

ఒక్క అంగలో వెళ్ళి చిన్నకొడుకు రెక్కపట్టుకుని వొక్క గుంజుగుంజింది.

ధుమధుమలాడుతూ, వాణ్ణి బరబరా యీడ్చుకుపోతూ, రెండో అంగలో నాళంవారి సత్రం దాటేసింది.

చిరునవ్వు నవ్వుకుంటూ, తల పంకించుకుంటూ, రత్తమ్మ, చూస్తూ వూరుకుంది.

అప్పటికి తల్లిదగ్గిరికి వచ్చి తాపీమేస్త్రీ రామదీక్షితులు బి. ఏ., ఇదేమిటో తెలియక చకితుడై తల్లిని విడిచి సుందరమ్మనీ, సుందరమ్మని విడిచి తల్లిని చూస్తూ నిలిచిపోయాడు.

ఇదంతా చూసి పకపక నవ్వుతున్నట్టు జయా టాకీస్‌వారి లౌడ్‌స్పీకరు బ్రహ్మమంది.

# పాకిస్థాన్ నిజస్వరూపము

## శ్రీ జి. సుందరరెడ్డి.

1940 లో లాహోరులో జరిగిన ముస్లింలీగు మహాసభ మనభారతీయచరిత్రలో చాల ముఖ్యమైనది. దీనిలోనే పాకిస్థాన్ కావలెనని ఆసభ తీర్మానించినది. అంతకుముందే పాకిస్థాన్‌స్కీముకి మన భారతీయ రాజకీయాలలో ఏస్థానము లేకపోయినా అది ఒక క్రొత్త ఉద్యమముగాదు. కాని దీనిని మనరాజకీయ ప్రపంచము ఎన్నడూ గుర్తించలేదు. దానికి ఒక స్వరూపము, పరిభాష లేనందువల్ల, పాకిస్థానమనే పేరుతో కొందఱు ముసల్మానులు గాలిలో మేడగట్టుటకు ప్రయత్నించుచున్నారని ప్రజలు భావించుచుండిరి. కాని జిన్నాగారి నాయకత్వముక్రింద, లాహోరులో యీప్రస్తావనము ముస్లింలీగు స్వీకరించినది. అప్పటినుంచి దానిని అమలులోకి తెచ్చుటకు ముస్లింలీగు రాత్రింబగళ్లు ప్రయత్నించుచున్నది. ఇది కేవలము ముస్లింలీగుయొక్క అదూరదర్శిత్వమని అనుకొనవచ్చును; మందబుద్ధి పరిణామ మనుకొనవచ్చును; నవాబ్‌ల నవాబ్‌జాదాల స్వార్థాలను సంరక్షించుకొనుటకు ప్రహరీగోడ అనుకొనవచ్చును, లేక దీని వెనుక బ్రిటిష్‌ప్రభుత్వముయొక్క డిప్లొమసీ ఉన్నదనుకొనవచ్చును. కాని ఏదోఒకవిధముగ యీ సమస్యను పరిష్కరించనిదే మనకు గత్యంతరములేదు. మంచిగాని చెడుగాని పాకిస్థాన్‌యొక్క చిత్రము నేడు కండ్లఎదుట ఉన్నది. హిందూస్థానంలో ఉన్న యావన్మంది ముస్లిములు యీస్కీమును సమర్థించుట లేదన్నమాట నిజమే. కాని దీనిని సమర్థించెడి వారి సంఖ్యగూడ తక్కువగా లేదు. జిన్నాగారి 14 సూత్రములు నేడు పాకిస్థాన్ స్వరూపముగా మారినవి. ఈ పాకిస్థాన్‌అను అగ్నిగుండములో, మన స్వాతంత్ర్యాభిలాష నెయ్యివలె హుతమై పోవుచున్నది. మనస్వాతంత్ర్యసముపార్జనకు పాకిస్థాన్ ఒక జ్వాలాముఖిపర్వతమువలె అడ్డుతగిలినది. ఈ జ్వాలాముఖిని ఏదోఒకవిధముగ చల్లార్చనిదే, దేశస్వాతంత్ర్యము ఒక స్వప్నమువలె దూరమగుటయేగాక, ఈ దేశములో మన నివాసము గూడ కష్టసాధ్యమగునేమో !

పాకిస్థానమనగా పవిత్రస్థానము, పవిత్రులు నాగరికులు నివసించెడిస్థానము. పాన్‌యిస్లాం—అనగా ప్రపంచములోఉన్న సమస్త మహమ్మదీయదేశాలను ఐక్యముజేయవలెనన్న ఆందోళన చాలకాలమునుంచి సాగుచునే యుండెను. "చీనీ అరబ్ హమారా సారా జహాన్ హమారా" చైనా, అరబ్ సమస్త ప్రపంచము మాదేనన్న నినాదనము నలుదెసలయందు మ్రోగుచునే యుండెను. కాని పాకిస్థాన్‌యొక్క స్కీమునుగురించి ప్రప్రథమము మిస్టర్ రహమత్ అలీ 1933 లో ఒక పుస్తకము వ్రాసినాడు. యీ స్కీమును ప్రస్తుత భారతీయ ఫెడరల్ గవర్నమెంటుకి విరుద్ధముగా తయారుజేసినాడు. స్వతంత్ర భారతదేశములో ఫెడరల్ గవర్నమెంటు స్థాపించబడిన మైనారిటిగా ఉన్న ముసల్మానుల ధర్మము సభ్యత, సంస్కృతి మహావిపత్తిలో పడిపోవునని అతనిభయము. కనక హిందూదేశాన్ని రెండుగా విభజించితేనే ముసల్మానులు స్వతంత్రముగా యిస్లాంయొక్క సుందరసాంస్కృతికభవనాన్ని నిర్మించుకొనగలరు.

అప్పటినుంచి, కొందరు ముస్లింనాయకులు హిందూదేశముయొక్క రాజకీయ స్వాతంత్ర్యమువల్ల ముస

ల్మానులకు ఏమీ లాభములేదని ప్రచారముజేసినారు. అలాంటి స్వాతంత్ర్యమువల్ల మైనారిటీలో ఉన్న ముసల్మానుల జీవితము అంధకారమయమగునని వారికి బోధించినారు. ఈసిద్ధాంతముయొక్క పునాదిమీద నే లీగు స్థాపించబడ్డది. యీసిద్ధాంతముయొక్క ప్రచారము, ప్రాబల్యమువల్ల నే అది ఒక శక్తిమంతమైన ముస్లింసంస్థ అయినది. కాఫర్లు అనగా నాస్తికులతో కలిసిఉండి ఆదర్శవంతమైన యిస్లాంను స్థాపించుట అసంభవమని నేడుగూడ ముస్లింలీగు ప్రెసిడెంటు,దాని వర్కింగుకమిటీ మెంబర్లు చెప్పుతున్నారు. ముసల్మానులరాజకీయస్వాతంత్ర్యానికీ పాకిస్థాన్ అత్యవసరము. ముసల్మానుల జీవితములకంటే అది ఇస్లాంకి పరమావశ్యకము. ఇటువంటి ఉపన్యాసాలద్వారా వీరు మహమ్మదీయుల ధార్మికభావాలను రెచ్చగొట్టుచున్నారు.

## మహమ్మదీయులు, జాతిసిద్ధాంతము

హిందూస్థానములో ఉన్న మహమ్మదీయులు హిందూజాతికి జెందినవారుకారు. వారు ఒక భిన్న జాతివారు. కనుకహిందూమహమ్మదీయులలో ఐక్యత అసంభవమని జిన్నాగారివాదన. కాని యీ సిద్ధాంతాన్ని సమర్థించుటకు జిన్నాగారిదగ్గర తర్కము లేదు. మహమ్మదీయులలో 100 కి 90 మంది హిందువుల బిడ్డలే యని ఐతిహాసికప్రమాణ మున్నది. కొన్ని కారణములచే వారు యిస్లామును స్వీకరించినారు. ఒక ధర్మమునువదలి రెండవధర్మమును స్వీకరించిన మాత్రమున నే వారు రెండవజాతికి జెందజాలరు. రక్తము మారజాలదు. వారి ఆచారవ్యవహారములు మారజాలవు. ఒక మహమ్మదీయుడు క్రిస్టియానిటీని పుచ్చుకొన్నంతమాత్రమున నే వాడు యింగ్లీషు లేక అమెరికన్ జాతివాడైపోవునా? దీనిని జిన్నాగారు ఒప్పుకొనెదరా? అలాంటప్పుడు హిందువులు కొందరు యిస్లాంను స్వీకరించినవారు అరబ్ లేక పర్షియన్ జాతికి ఎలా జెందగలరు? భాషను పట్టిజూచినా ఫ్రాంటియర్ ముసల్మానులు పస్తో, సింధు ముసల్మానులు సింధి, పంజాబీ ముసల్మానులు పంజాబీ, బంగాలీ ముసల్మానులు బంగాలీని మాట్లాడుచున్నారు. కాని హిందూదేశములోని ముసల్మానులందరు ఏకభాషను మాట్లాడుట లేదు. ప్రస్తుత పరిస్థితినిబట్టి వారు మామాతృభాష ఉర్దూ అని జెప్పినను అది సత్యము గాదని అందరికీ తెలుసు. మన సాంఘికవ్యవస్థనిపట్టి జూచినా హిందూదేశములోని విభిన్నప్రాంతాలలో నివసించెడి ముసల్మానుల సాంఘికవ్యవస్థ ఆయాప్రాంతాలలోఉన్న హిందువులసంఘువ్యవస్థ మాదిరిగానే యున్నది. కాని విభిన్నముగాలేదు, అరబ్‌దేశీయ ముసల్మానుల సాంఘికవ్యవస్థ మాదిరిగా వారిదిలేదు. ఆర్థికవ్యవస్థనుబట్టి జూచినా హిందువులలో ముసల్మానులలో ఏమీ భేదములేదు. హిందూమహమ్మదీయ కేపిటలిస్టుల మనస్తత్వాలలో (Mentality) ఏమీ భేదములేదు. హిందూమహమ్మదీయ జమీందార్ల పద్ధతులలో ఏమీ భేదములేదు. హిందూమహమ్మదీయ శ్రమజీవులు, కర్షకులు ఒకే మాదిరిగా కష్టపడి జీవించుచున్నారు.అయితే, భేదాభిప్రాయా లెచ్చట? ఒక్క రాజకీయక్షేత్రములో మాత్రమే. రాజకీయక్షేత్రములో నేడు హిందూమహమ్మదీయులకు పోరాటము సాగుతున్నమాట నిజము. ఈ పోరాటములో తమవిజయముకొరకు సృష్టించబడ్డ అస్త్రమే పాకిస్థాన్.

పదికోట్ల ముసల్మానులను మైనారిటీ అనడమూ, హిందువులు వారిని మ్రింగివేస్తారనడమూ ఒకబూటకము. ప్రపంచములో పెద్దరాజ్యాలను స్థాపించి, పైగంబర్ మహమ్మద్‌యొక్క పవిత్రసిద్ధాంతాలను నిరాటంకంగా ప్రచారంజేసి, ప్రపంచాన్నంతా వశ

కించిన ముసల్మానులను హిందువులు మ్రింగివేస్తారనడము హాస్యాస్పదము. యిస్లాం విపత్తిలో ఉన్నదనడమూ, ముసల్మానుల సంస్కృతి నశించు ననడమూ యిస్లాంను అవమానము జేయడమే. తమ రాజకీయ విజయసాధనకు, ముస్లింప్రజల ధార్మికభావాలను రెచ్చగొట్టి వారిని ఉపయోగించుకొనుటకు, ఇది ఒక రాజకీయ తంత్రము.

## పాకిస్థాన్, మైనారిటీ సమస్య

పాకిస్థాన్ స్కీము చాల పాతది. సమయానుకూలముగా అది మారుతూ వచ్చినది. ఇప్పుడుగూడ దాని స్వరూపము స్పష్టముగా గన్పించుటలేదు. కారణము ఇకమీదట సమయానుకూలముగా అది మారగలదనే. కాని జిన్నాగారి ప్రస్తుత పాకిస్థాన్ స్వరూపమిది; దానిని మూడుభాగాలుగా మనము విభజింపవచ్చును.

1. ఫ్రాంటియర్, పంజాబు, సింధు, బెలూచిస్థాన్, కాశ్మీర్.
2. బెంగాల్, అస్సాం.
3. హైదరాబాద్ స్టేటు.

ఈ స్కీములో అన్నిటికన్న హాస్యాస్పదమైన విషయమేమిటంటే, కాశ్మీరులో ముసల్మానులసంఖ్య హెచ్చును గనుక అది పాకిస్థాన్‌లోకి రావాలి. కాని హైదరాబాద్‌లో 100 కి 90 మంది హిందువులుండినా నవాబ్ ముసల్మాను గనుక—అదిగూడ పాకిస్థాన్‌లోకి రావాలి! ఐతే కాశ్మీర్‌రాజు హిందువుగదా అది పాకిస్థాన్‌లోకి ఎలా వచ్చును? ఎలాగైతేనేమి నేడు పాకిస్థాన్ అస్త్రప్రయోగముచే హిందూస్థాన్ అపవిత్రస్థానము చేయబడ్డది. అది హిందూస్థానాన్ని తగవులకు కొట్లాటలకు పుట్టినిల్లుగా జేసింది. మన రాజకీయ సమరముయొక్క వైఖరిని మార్చి అది మన స్వాతంత్ర్యానికి అడ్డుగా నిలబడినది.

హిందూదేశాన్ని విభజించుటకు మూలకారణము మెజారిటీసంఘములయొక్క బారినుండి మైనారిటీ సంఘములయొక్క హక్కులను, స్వార్థాలను సంరక్షించుటయని జిన్నాగారివాదన. కాని పాకిస్థాన్‌చే ఈసమస్య పరిష్కరించబడుటలేదు. దీనికి విరుద్ధముగా అనేక క్రొత్తసమస్యలను ఇదే లేవదీయుచున్నది. విభజనతరువాతగూడ మెజారిటీ మైనారిటీ సమస్య ఉండక తప్పదు. అప్పుడింకా ధార్మిక ఉద్రేకము అంధవిశ్వాసాలు ఎక్కువ కాగలవు. తగాదాలు కొట్లాటాలు ఎక్కువ కాగలవు. అప్పుడేమిచేయాలి? వాటిని మళ్ళీ చిన్నచిన్నస్థానాలుగా విభజంచవలెనా? ఈ పాకిస్థాన్ పంజాబులో సిక్కు సమస్య నెలా పరిష్కరించగలదు? మద్రాసులో బ్రాహ్మణ బ్రాహ్మణేతరసమస్య నెలా పరిష్కరించగలదు? బెంగాల్ అస్సాంలో హిందూముస్లింసమస్య నెలాపరిష్కరింపగలదు? ఉరియాలో ఆంధ్ర ఉత్కళ సమస్య నెలా పరిష్కరించగలదు? హైదర్‌బాద్‌లో హిందూ ముస్లింసమస్య నెలా పరిష్కరించగలదు? ఆఖరికి డాక్టర్ అంబెద్కర్‌చే లేవదీయబడ్డ హిందువుల హరిజనులసమస్యని పాకిస్థాన్ ఎలా పరిష్కరించగలదు? వెనుక, కాంగ్రెసు మంత్రివర్గాలున్నప్పుడు హిందువులుముస్లిములపై అన్యాయాలు అత్యాచారాలు చేశారని జిన్నాగారన్నారు. ఇప్పుడు జిన్నాగారు పాకిస్థాన్‌లోఉన్న హిందువులపై అన్యాయాలు అత్యాచారాలు జరుగవని ఎలా హామీ ఇవ్వగలడు? బహుశా ఈ తర్కానికి జవాబు మైనారిటీలహక్కులను సంరక్షించుటకు భావి పాకిస్థాన్‌విధానములో కొన్ని ఏర్పాట్లు చేసెదమని జిన్నాగారనవచ్చు. అలాంటప్పుడు హిందూదేశముయొక్క విభజనే అనవసరము. అర్థములేనిది. ఎందుకనగా మైనారిటీల హక్కులను సంరక్షించుటకు భావిపాకిస్థాన్‌విధానములో ఏర్పాటు జేయగలిగినపుడు హిందూస్థానము

యొక్క భావివిధానములోనే మైనారిటీలహక్కు లను సంరక్షించుట కేర్పాటెందుకు చేయకూడదు?

## పాకిస్థాన్, కమ్యూనిస్టులు

పాకిస్థాన్ స్కీమువల్ల పైసమస్యలు పరిష్కరించ బడవని స్పష్టము. ఈ స్కీమువల్ల సామాన్యప్రజల కేవిధమైన ప్రయోజనములేదు. కాని మన భారతీయ కమ్యూనిస్టులు యీ స్కీము సమర్థించుచున్నారు. పాకిస్థాన్‌వల్ల మైనారిటీసమస్య పరిష్కరించబడదని తెలిసిగూడ వారు దీనిని సమర్థించుచున్నారంటే దానిలో ఏదో రహస్య ముండితీరాలి. బహుశ యిలా గైనా ముస్లింప్రజల సహాయసానుభూతులను సహాను భూతిని చూరగొనవచ్చునని వారిఉద్దేశ్యమై యుండ వచ్చు. లేక హిందూదేశములో కాంగ్రెసు ఒక్కటే బలీయమైన సంస్థ. ఆసంస్థని ముస్లింలీగుతో చేతులు గలిపి బలహీనముగా జేసిన కమ్యూనిస్టుపార్టీ శక్తి అధికమగుననీ, అప్పుడు ముస్లింలీగువారిని ఏమీ చేయలేరనీ వారి నమ్మకమై ఉండిఉండవచ్చు. కాని ఇటువంటి అవకతవకపద్ధతులపై ఆధారపడి ఒక సంస్థ ఎంతకాలము జీవించగలదు. నేడు పరిస్థితులు వారికి అనుకూలముగా లేవు గనుకనే పాకిస్థాన్ అనగా మా డిక్షనరీలో స్వయంనిర్ణయహక్కు Self-determination. స్వయంనిర్ణయహక్కునే (దీనిని కాంగ్రెసు సమర్థించుచున్నచో) మేము సమర్థించాము గాని జిన్నాగారి పాకిస్థానాన్ని మేము సమర్థించడం లేదని వారిలో కొందరు ఈరోజున జెప్పుచున్నారు. పాకిస్థాననగా ఏభాషలో స్వయంనిర్ణయహక్కు అని అర్థమో అది మన భారతీయకమ్యూనిస్టులకి తెలియ వలసినదేగాని యితరులకు తెలియదు. గట్టిపునాది లేకుండా ఖచ్చితమైన పాలిసీలేకుండా మన కమ్యూనిస్టులు ప్రవర్తించుటచేతనే కమ్యూనిజంయొక్క ఉన్నతమైన ఆదర్శాలను ప్రజలు తెలుసుకోజాల కున్నారు.

## పాకిస్థాన్, దాని ఆర్థికసమస్యలు

రాజకీయముగా పాకిస్థాన్‌యొక్క స్వరూపమును జూచినతరువాత దాని ఆర్థికస్థితినిగురించిగూడ ఆలోచించుట చాల అవసరము. ఆర్థికంగా పాకిస్థాన్ యొక్క పెద్దలోపము దాని ఉత్తర పశ్చిమప్రాంతాల ఆర్థిక దౌర్బల్యము. పాకిస్థాన్‌లోని యీనాలుగుప్రాంతాలలో పంజాబు, సింధు, ఫ్రాంటియర్ బెలూచిస్థాన్‌లలో, ఒక్క పంజాబుతప్ప మిగత మూడు ప్రాంతాలదగ్గర తమశాసనవ్యవస్థ ఖర్చుకి గూడ ధనములేదు. ఆ మూడు ప్రాంతాలు తమశాసన వ్యవస్థ ఖర్చుకి కేంద్రప్రభుత్వముపై ఆధారపడి ఉన్నవి. కేంద్రప్రభుత్వము ప్రతిసంవత్సరము ఫ్రాంటియర్‌కి ఒకకోటి, సింధుకి ఒకకోటి అయిదులక్షలున్నూ ఇచ్చుచున్నది. బెలూచిస్థాన్‌యొక్క స్థితి యింకా చాల హీనమైనది. ఇంచుమించు అచ్చటి ఖర్చునంతా కేంద్రప్రభుత్వమే భరించుచున్నది.

పాకిస్థాన్‌యొక్క ఉత్తర పశ్చిమ ప్రాంతాల నాలుగులో మూడుప్రాంతాలస్థితి యిది. పోతే పంజాబుయొక్క సాలీనా ఆదాయము షుమారు 12 కోట్లు. యీ ధన మా ప్రాంతీయ వ్యవస్థ ఖర్చులకి మాత్రము సరిపోవును. పంజాబు చాల వెనుకబడి ఉన్న ప్రాంతము. ఆప్రాంతీయ ఉన్నతికి యింకా చాలధనము కావాలి. ఎలాగైన పంజాబు మాత్రము తనశాసనవ్యవస్థ ఖర్చులకి కేంద్రప్రభుత్వాన్ని ఆశ్రయించ నవసరములేదు. కాని తనప్రక్కనున్న ముస్లిం ప్రాంతాలకి మాత్రము అది ఆర్థికంగా సహాయము జేయలేదు.

ఇటువంటి పరిస్థితులలో మొదటిప్రశ్న ఏమిటంటే హిందూదేశముయొక్క విభజనజరిగిన ఫ్రాంటియర్, సింధు, బెలూచిస్థానులకు ఆర్థిక సహాయమెవరుజేసెదరు? ఇప్పుడు ఉత్తర పశ్చిను సరిహద్దు

రక్షణకొరకు కేంద్రప్రభుత్వము షుమారు 35 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టుచున్నది. దానిని ఎవరు ఇచ్చెదరు? పాకిస్థాన్ ఇవ్వాలి. పాకిస్థాన్ యివ్వగలదా?

ఇప్పుడు కొందరు లీగునాయకులు పాకిస్థాన్ హిందూస్థానాల విభజన జరిగినతరువాత వాని మధ్య ఏవిధమైన సంబంధ బాంధవ్యాలుండగూడదని జెప్పుచున్నారు. అప్పుడు పాకిస్థాన్ స్వతంత్రముగా ఏ ఆఫ్గనిస్థాన్ లేక యీరానుగనో ఉండిపోవును. అప్పుడు దానియొక్క రక్షణభారము దానిపైనే యుండును. పాకిస్థాన్ రక్షణకు రెండువైపుల బందోబస్తుచేసుకోవాలి. ఒకటి ఉత్తర—పశ్చిమ సరిహద్దు-రెండవది హిందూస్థానము పాకిస్థాన్ మధ్యనున్న సరిహద్దు. ఉత్తర పశ్చిమ దేశాలలో చైనా, ఆఫ్గనిస్థాన్, రష్యాలున్నవి. వీనిలో ఏదేశము పాకిస్థాన్‌పై ఆక్రమణజేయకపోయినాజర్మనీఫ్రాంసులమధ్యనుండిన బెల్జియంగతి పాకిస్థాన్‌కి బట్టును. సదా యీదేశాల యిష్టానుసారముగా అది నడవవలసి వచ్చును. లేకపోతే పోరాటము తప్పదు. రెండవవైపున హిందూస్థానము పాకిస్థాన్ మధ్యనున్న సరిహద్దు జూడండి. సిమ్లా పర్వతశ్రేణిదగ్గరనుంచి అంబాలా, సింధుమీదుగా యీ సరిహద్దు కథియవాడ్‌వరకు పోవును. వీనియొక్క పొడవు ఇంచుమించు 1400 వందల మైళ్లు గలదు. యీసరిహద్దుపై తన రక్షణకు ఒక పెద్దసేన నుంచక తప్పదు. ఒక్కదేశములో ఎప్పుడైతే హిందూముసల్మానులు సఖ్యభావముతో ఉండజాలకపోయిరో అప్పుడు రెండురాజ్యాలలో తగాదాలు, కొట్లాటలు లేకుండా ఉండజాలదు. వీనికెల్ల హిందూస్థానము పాకిస్థాన్‌మధ్య మనస్పర్థలు హెచ్చగును. కనుక సిమ్లాపర్వత శ్రేణులు మొదలుకొని కథియవాడ్‌వరకు అనగా 1400 వందల పొడవున ఏమెజినోలైనో లేక సీజ్‌ఫ్రీడ్‌లైనో నిర్మించక తప్పదు. లేకపోతే యిస్లాం విపత్తిలోనే ఉండిపోవును. ఇలాంటి పరిస్థితులలో యూరపుయొక్క యేదేశమునుండియైనా పాకిస్థాన్ ఆర్థికసహాయము తీసుకోవలసివచ్చును. అప్పుడు ఆర్థికంగా ఆదేశానికి పాకిస్థాన్ బానిసకాక తప్పదు. [సశేషము.]



హోర్యూజీ దేవాలయము — నారా, జపాను



ధ్యాన బుద్ధుడు

# జపానులోని బౌద్ధకుడ్య చిత్రాలు

శ్రీ శ్యామప్రసాద చక్రవర్తి ఎమ్. ఎ.

జపాను వైజ్ఞానిక చరిత్రకు యమటోజాతి చేసిన సేవ చాలాముఖ్యమైనది. యమటోజాతీయులు చాలా గౌరవకుటుంబాలకు చెందినవారనీ, వీరులనీ ప్రసిద్ధి పొందారు. వీరు చాలా ప్రాచీనకాలంలో ప్రవాహాలు ప్రవాహాలుగా రెండుసారులు జపానులో ప్రవేశించి పాచీన యమటో విశ్వాసాలన్నీ క్రొత్తవిధంగా మార్చి వేసి వాటిలో దార్ఢ్యము, మాధుర్యము ప్రవేశపెట్టారు. అసలు యమటో విశ్వాసంఅంటే చక్రవర్తి దివ్యాంశ సంభూతుడనీ, అతనియెడల అనన్య సామాన్యమైన భక్తి, ఉదారమైన దేశాభిమానము ఉండాలనీ చెప్పే ఒక సంప్రదాయము. ఈసంప్రదాయము మళ్లీ బౌద్ధ విజ్ఞానంచేత పరిణతమైన చైనా నాగరకతను సంపూర్ణంగా అంగీకరించి క్రొత్తక్రొత్తపరిణామాలకు దారి తీస్తూంది.

జపాను యే విదేశీయవిజ్ఞానమైనా అతి శీఘ్రంగా ఆకళించుకొని అత్యంతాభివృద్ధి పొందకలదని ప్రపంచంలో అందరూ అంగీకరించిన విషయం. అయితే జపాను వైదేశికవిజ్ఞానాలను ఆకళించుకునే విధంలో తనస్వీయవిశిష్టత కనబరస్తూనే ఉంటుంది. ఈ విషయానికి మనం ఈమధ్యన జపాను పాశ్చాత్యనాగరికతను ఆకళించుకొన్నవిధానం ఉదాహరణంగా తీసుకొనవచ్చును. బౌద్ధధర్మం క్రొత్తగా జపానులో ప్రవేశించినపుడు సరిగా ౧౪ శతాబ్దాలకిందట సరిగ్గా ఇటువంటిపరిణామమే ఒకటి జరిగింది.

అసలు జపాను బౌద్ధధర్మం అంగీకరించడంలో ప్రధానకారణం అది మొట్టమొదట-చైనా సామ్రాజ్యములో సువిస్తృతమై వ్యాపించిఉండడమే. జపాను ఎప్పుడూ ప్రపంచవిజ్ఞానంలో విజ్ఞానసారం ఆకళించుకుంటూనే ఉంది.

జపానులో బౌద్ధమతం ప్రవేశించిన సంవత్సరం క్రీ. శ. ౫౫౨ అని నిశ్చయంగా చెప్పవచ్చును. అప్పుడిది చైనాద్వారా రావడానికి బదులుగా కొరియా ద్వారా ప్రవేశించింది. షోటుకు అనే జపాను చక్రవర్తి ఈ బౌద్ధమతం జపానులో ప్రవేశించడానికి వ్యక్తిగతంగా చాలా దోహదం చేశాడు. ఈయన గొప్ప ప్రతిభాశాలి; దైవభక్తితోపాటు నిష్కల్మషమైన హృదయంకూడా కలిగినవాడవడంచేత పరమ పవిత్రశీలి అని చరిత్రలో ప్రసిద్ధికెక్కాడు.

ఇతడు బౌద్ధధర్మానికి షింటో మతంతో సరిసమానమైన గౌరవం ఇచ్చాడు. కాని షింటో మతస్థులు సైనికాధికారులు దీనికి వ్యతిరేకించారు. కాని చక్రవర్తి ఎలాగో అల్లాగ రెండిటికీ సామరస్యం కుదిర్చాడు. అతడు మొట్టమొదట షోగా వంశస్థులు బౌద్ధధర్మం స్వీకరించడానికి అనుమతి ఇచ్చాడు. కాని తానుమాత్రం బౌద్ధధర్మం స్వీకరించలేదు. అయితే కొరియాలో ఉన్న కుదరరాజ్యం నుంచి వచ్చిన బౌద్ధధర్మ గ్రంథాలు, ప్రతిమలు, షోగా వంశీయులు ఉపయోగించుకోడానికి అనుమతి ఇచ్చాడు. వారి రాజ్యాలలో బౌద్ధదేవాలయాలు నిర్మించుకోడానికి కూడా ప్రోత్సాహంచేశాడు. సెమ్మెట్ అనే కొరియారాజు కిమ్మెట్ టెన్నో అనే జపాను చక్రవర్తికి కొన్ని పవిత్ర బౌద్ధగ్రంథాలు

మతస్వీకృతి కనుకూలమైన ఉపకరణాలు, బాల శాక్యముని ప్రతిమ ఒకటి సాదరంగా బహూకరించాడు. క్రీస్తుశకం ౬౦౬ వ సంవత్సరంలో కురాట్ సుక్కురి అనే చైనా శిల్పి గంగోజి అనే జపాను దేవాలయంలో మొట్టమొదటగా బౌద్ధప్రతిమ ప్రతిష్ఠించాడు. దాంతో జపానులో బౌద్ధకళ ప్రారంభించినదని చెప్పవచ్చును. ఆ పిమ్మట షోటుకు చక్రవర్తి ఆదరణకింద హోర్యూజి (నారా) మొదలైన నలభైయైదు సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రాలు వెలిశాయి. ఇవన్నీ క్రీస్తుశకం ౬౦౪ లో నిర్మించినవి. వీటిలో సుమారు వెయ్యిమంది బౌద్ధశ్రమణకులకూ సన్యాసులకూ వసతులు నిర్మించారు. అపైన షోటుకు చక్రవర్తి మూలదేవసూత్రము, విమలకీర్తి సూత్రము, సద్ధర్మపుండరీక సూత్రము, అనే మూడు మహాయాన ధర్మసూత్రాలకు వ్యాఖ్యానాలు కూడా రచించాడు. వీటివల్ల బౌద్ధధర్మానికి మరింత బాగా ప్రోత్సాహం కలిగింది. ఈ సూత్రాల్లో ఆఖరు సూత్రము క్వానన్-అంటేఅవలోకితేశ్వరుడు,పూజ్యుడని ప్రతిపాదిస్తుంది. షోటుకు చక్రవర్తి సద్ధర్మ పుండరీకసూత్రం మీద రచించిన వ్యాఖ్యానానికి 'హోజిగీపో' అని పేరు. చక్రవర్తి స్వహస్తాలతో లిఖించిన ఈ గ్రంథం అనేక శతాబ్దాలవరకు హోర్యూజిలో భద్రంగా సంరక్షితమై ఉంది. ఇది ఇప్పటికీ టోకియోలో ఉన్న రాజభవనంలో భద్రంగా సంరక్షింపబడి ఉంది.

జపానులో బౌద్ధకళా పరిణామ రెండు విధాలుగా విభజిస్తారు. క్రీస్తుశకం ౫౯౩ — ౭౩౦ సంవత్సరాల మధ్యకాలాన్ని 'సూకో' యుగమని అంటారు. అది సూకో చక్రవర్తి పరిపాలించిన కాలం అయిఉండడమే దానికి కారణము. తరవాతిది నారాయుగం (క్రీస్తుశకం ౭౧౦-౭౮౪.). హోర్యూజీలో ఈ నారాయుగానికి చెందినవి. బహురమ్యమైన శిల్పాలున్నాయి.

మనకి జపానులో దొరికిన ప్రాచీనతమమైన బౌద్ధ శిల్పం అవలోకితేశ్వరునిది. ఇది దారువుతో తయారుచేసిన ప్రతిమ. ఇది కొరియాలో తయారుచేశారు. ఆ తరవాత ఇది చక్రవర్తి భవన వస్తుప్రదర్శనశాలలో ఉంచారు. శైలిబట్టిచూస్తే అది క్రీస్తుశకం౪౮౦ కీ, ౫౯౧ కీ మధ్యన రచింపబడి ఉండాలి.

ఆ పిమ్మట జపాను బౌద్ధ కళలో పరిగణింపదగినది ౭౩౪ లో తయారైన విశ్వవిఖ్యాతమైన అవలోకితేశ్వర విగ్రహము. ఇది షోటుకు చక్రవర్తికి సమాన కాలీనమని అంటారు. ఆ పిమ్మట చైనాలోని టాండ్ కళాసంప్రదాయం వెల్లువలు వెల్లువలుగా జపానులో ప్రవేశించింది. ఆ తరవాత వచ్చిన కళా విజృంభణకి చైనా ఆదర్శంగా ఉన్నమాట నిజమే. కాని ఆ ఆదర్శాలనిపట్టి జపాను జాతీయకళాసృష్టి చేసుకుంది. నారాయుగం జపాను జాతీయ శిల్ప సృష్టికి పట్టుగొమ్మ అని చెప్పవచ్చును.

అయితే ఈ యుగానికి మహోన్నత శిఖరం వంటివి—హోర్యూజీ కుడ్యచిత్రాలనే చెప్పాలి. ఇవి హోర్యూజీ దేవాలయ కుడ్యాలమీద చిత్రించారు. ఈ దేవాలయాలు ౭౦౮—౭౧౫ సంవత్సరాల మధ్యన శిథిలమైపోతే బాగుచేయించి మళ్లీ కట్టించారు. ఈ దేవాలయ శిల్పాలు పరిశీలిస్తే భారతీయ శిల్పాలవలె ఉంటాయి. ఇంతేకాదు; దృఢరేఖలతో చిత్రించిన ఆ మూర్తులూ, ఆ రేఖాలయవిన్యాసాలూ, ఆ భావమూర్తి చిత్రణలూ పరిశీలిస్తే అవి అచ్చంగా అజంతా చిత్రాలలాగే ఉంటాయి.

అయితే ఈ నారాకుడ్యచిత్రాలు అజంతాకుడ్య చిత్రాలు చూసి తయారుచేసినవా? అనే ప్రశ్న బయలుదేరుతుంది. అలాగ తయారుచెయ్యడమే నిజమయితే అది ఆ రోజుల్లో భారతదేశానికీ, జపాను



బోధిసత్త్వుడు —హొర్యూజీ దేవాలయ చిత్రాలనుండి

దేశానికీ మధ్య వైజ్ఞానికాధ్యాత్మిక సంబంధా లుండేవని అనడానికి ఒక ప్రబలనిదర్శనము. అయితే జపాను చిత్రకారులుగాని, కొరియా చిత్రకారులు గాని భారతీయ బౌద్ధ చిత్రకారులతో పరిచితులై ఉండేవారని చెప్పడానికి వీల్లేదు. అయితే చైనా టర్కీస్థానంలో తవ్వగా లభించిన పత్రాలలో కొంతమంది చైనీయచిత్రకారులు భారతదేశం వచ్చి, భారతీయ బౌద్ధ శిల్పాలూ, చిత్రాలూ చూచి నకళ్లు తయారు చేసుకున్నారని వ్రాసి ఉంది.

ఈ విషయంలో రేనీ గ్రోసే అనే ఫ్రెంచి విమర్శకుడు ఈ విధంగా వ్రాశాడు.

"మనం బౌద్ధ యాత్రికులతోబాటు సముద్రాలు దాటి మళ్లీ మళ్లీ వాళ్లతోనే తిరిగివద్దాము. వీరందరు చైనా వెళ్లి హ్యుయాన్ త్సాంగ్ బోధనలతోబాటు మహాయానశాఖకూడా జపానుకి తీసుకునివచ్చారు. క్యోండో కుడ్యచిత్రాలలోనూ, హోర్యూజీలో ఉన్న సువర్ణదేవాలయ కుడ్యాలమీదను, మనకి అజంతాలో కనబడినట్లుగానే అసామాన్యమైన దివ్యచిత్రాలు కనిపిస్తాయి.

"ఈ చిత్రాలు దివ్యసౌందర్యంతో తళతళలాడుతూంటాయి. సామాన్యంగా వీటి శిరస్సులమీద బంగారు కిరీటాలుగాని, మకుటాలుగాని మెరుస్తూ కన్నులకు మిరుమిట్లు గొలుపుతాయి. ఈ మకుటాలపై చిత్ర విచిత్రమయిన పుష్పాలంకారా లుంటాయి. వీటి అన్నిటిలోను, ఆర్ద్రత, వ్యక్తం చెయ్యడానికి వీల్లేని లాలిత్యమూ గోచరిస్తాయి. అజంతాలో వీటికి సజాతీయంగా ఉన్న చిత్రాల్లో మోస్తరుగానే మహనీయమైన గౌరవమూ, అతిలోకమైన మాధుర్యమూజాజ్వల్యమానంగా మెరుస్తూన్నా అవి ఈ చిత్రాల్లోన్ని మహాశక్తిని కొంచెమైనా తగ్గించడంలేదు. ఈ చిత్రాల కన్నిటికీ మకుటాయమానమైన శాక్యముని చిత్రంలాగే ఇవి మానవ సింహాలవంటి పురుషోత్తముల పుణ్యాకృతులు."

బహుశః జపానుకూడా వాటిలో సహజంగా ఉన్న ఆర్య పవిత్రత్వమూ, సౌందర్య పూర్ణితమైన మహత్త్వమూ ఎక్కువగా అభివృద్ధి పొందించిందనే చెప్పవలసి ఉంటుందేమో! హోర్యూజీ చిత్రాలు చూస్తే, అజంతా చిత్రాలకంటె కొన్నివిషయాల్లో ఇవి ఎక్కువనే చెప్పాలి. లలితమైన జఘన రేఖల్లోను, మనోహరమయిన హారాద్యలంకార విన్యాసాలలోనూ, నగ్నములైన వక్షస్థలాల్లోను, మధ్యభాగాల్లోను అజంతా చిత్రాలకంటె కొంతవరకు ఆధిక్యం ఉన్నదని అంగీకరించాలి.

"ఈ విగ్రహాల్లో గాంభీర్యమూ, మార్దవమూ పరస్పర సమ్మిళితాలై మెరుస్తూ ఉంటాయి. అంతే కాదు; వీటిలో మేధాశక్తి జాజ్వల్య మానమయిన ఆధ్యాత్మికత కూడా కనిపిస్తాయి. అప్పుడప్పుడు వీటికేసి చూస్తూంటే ఒక విధమయిన జీవితవిషయమయిన వైరాగ్యం ప్రతిభాసిస్తూ ఉంటుంది.అజంతాచిత్రాల్లో ధ్యాన నిమీలితములైనభ్రూలతాభంగిమలుచూస్తూంటే ఆధ్యాత్మిక సమస్యలన్నీ పరిష్కరించడానికి ఆకాశం వైపు ఎగిరిపోతూన్నట్లు భాసిస్తాయి. హోర్యూజీ చిత్రాలుకూడా అచ్చంగా అలాగే ఉంటాయి. ఆ అర్ధనిమీలితాలయిన కనురెప్పల్లో ఏ అంతరాంతరమయిన రహస్యం ఇమిడిఉన్నదో ఎవరు చెప్పగలరు?అర్ధనిమీలితాలయినా ఆ కనులలోనించి అతి గంభీరమూ సుసూక్ష్మమూ అయిన దృష్టి వెలువడుతూనే ఉంది! ఆ పెదవుల్లో ఏ అతి రహస్యమయిన వార్త అనుచ్చారితమై అణిగిఉందో ఎవరెరుగుదురు! వాటికి సమస్త జీవనాహంకారాల్లో ఉండే నైష్ఫల్యమూ తెలుసును! అయినా వాటిల్లో ఎంత మాధుర్యమూ కరుణా జాలువారు తున్నాయి!

"ఇంకా ఆపైన అంగభంగిమలలోకి వద్దాము. ఆ పవిత్రాంగభంగిమలలో—ఆ లలిత లలితములైన అంగుళీవిన్యాసాలలో ఎంత సౌకుమార్యం తళతళ లాడుతూ ఉంది! నడుంతో సహానంగా ఎత్తిన ఆ సుకుమార హస్తంలో ఒక వికసితపద్మం మెరుస్తూ ఉంది. ఆ అభయ హస్తముద్రికలో ఎంత ధైర్యం విద్యోతితమవుతూ ఉంది! ఆ విగ్రహాల్లో జరామరణ దుఃఖాతిరిక్తమయిన ఆత్మనిర్వృతి భాసిస్తూ ఉంది. ఆ మూర్తులకేసి నిరీక్షిస్తూంటే లియనార్డో డావిన్సీ ఒక్కడే ఆ చిత్రాలు చిత్రించగలడని అనిపిస్తుంది. ఆ పైన ఆ ప్రార్థనాహస్తాలు తిలకిద్దాము. అవి కేవలం భారతీయ అంజలి ముద్రలలాగ కాని, క్రైస్తవ చిత్రాల్లోలాగ బాగా కలిసిగాని ఉండవు. కాని కేవలం అంగుళ్యంచలాలు మాత్రం అతి సున్నితంగా పెనవేసుకుని ఉంటాయి. హోర్యూజీ అంగభంగిమలూ, అజంతా అంగభంగిమలూ అంతరధ్యాన ముద్రా సూచకాలు. వాటిల్లో అతి సున్నితమయిన లాలిత్యమూ, సౌకుమార్యమూ స్ఫురిస్తూంటాయి. గంభీరమయిన భక్తిభావం అంతటా తాండవిస్తూ ఆ ఉంటుంది. గంభీర భక్తిభావంలోనే మహాయాన యుగాల అంతరాత్మ ఇమిడిఉన్నది."

ఇదీగాక అస్సాము ద్వారా భారతదేశం చేరదలచిన కొందరు జపానుయాత్రికుల చరిత్రలు మనకు లభిస్తున్నాయి. కాని వాళ్లందరూ మార్గమధ్యంలోనే మరణించారు. అయితే మరికొంతమంది జపాను యాత్రికులు భారతీయ బౌద్ధకుడ్యచిత్రాలు దర్శించి తత్సంప్రదాయాలతో పరిచయం సంపాదించి ఉంటారు. ఈ విషయంలో జపానుకీ భారతదేశానికీ జరిగినపరిచయం ఒకటి మనం స్మరించుకోవలసి ఉంది.

ఈ విధంగానే మిగిలిన పరిచయాలు సంభవించి ఉండవచ్చునని ఊహించవచ్చును. ఈ విషయంలో ఒక కథ ఒకటి అనుశ్రుతంగా వస్తోంది. ఇది సత్యమో అసత్యమో నిర్ధరించడానికి వీల్లేదు. ఒక భారతీయుడు తాను ఎక్కివచ్చిన ఓడ మునిగిపోతే, ఈదుకుంటూ వచ్చి జపానుతీరం చేరుకున్నాడట! అతనితో కూడా కొన్ని ధాన్యపు విత్తనాలు కూడా జపాను చేరాయట. ఆ విధంగా జపానులో ధాన్యపు పంట వ్యాపించిందట!

అయితే టర్కీస్థానంలోని ప్రాత ప్రతులు పరీక్షిస్తే, జపాను చిత్రకళలో భారతీయ విధానం చైనా ద్వారా ప్రవేశించినట్లు తెలుస్తూంది. అందుచేత భారతీయ సంప్రదాయం తెలిసిన చిత్రకారుడు చైనా కొరియాలద్వారా జపానులో ప్రవేశించి ఉండవచ్చును. సామాన్య లక్షణాలలో హోర్యూజీ చిత్రాలకీ, అజంతా చిత్రాలకీ పోలిక ఉన్నదని చెప్పవచ్చును.

ఈ విషయంలో ఇ. మట్సమోటో ఇల్లాగ అంటున్నాడు.

"హోర్యూజీ చిత్రాలలో భారతీయ సంప్రదాయాలూ, పెర్షియను సంప్రదాయాలూ, ఇంకా మధ్యాసియా చిత్ర చిహ్నాలూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. అయినా వాటిలోని చిన్న చిన్న విషయాలన్నీ పరిశీలిస్తే అవి తప్పకుండా ఏడవ శతాబ్దంలోని చైనీయ బౌద్ధ ప్రభావంవల్ల ఉద్భవించినవనే చెప్పాలి. ఈ విషయంలో బాగా పరిశ్రమచేసిన తైచిటాకి అనే ప్రఖ్యాత బౌద్ధ విమర్శకుడు హోర్యూజీ చిత్రాలలో గాంధారు మధ్యభారత, పారశీక ప్రభావాలేమన్నా ఉన్నాయేమోనని జాగ్రత్తగా పరిశీలించాడు. అతను ఈ చిత్రాల్లో భారతీయ మధ్యాసియా సంప్రదాయాలే ఎక్కువగా కలిగిన ఒక ప్రత్యేక చిత్రకళా ప్రభావం ఎక్కువగా ప్రసరించి ఉండాలని అభిప్రాయపడ్డాడు. ఆ సంప్ర

---

Revelation of Indian art Page 337—Rene Groussit.

# జపానులోని బౌద్ధకుడ్య చిత్రాలు

డాయం నూటాంగ్ రాజవంశాల పరిపాల నా మధ్య కాలంలో ఎక్కువగా ఉద్భవించి ఉండాలని, అతని అభిప్రాయము.

అయితే ఈ సందర్భంలో ఒక చిక్కు ఎర్పడుతూ ఉంది. హారోర్యూజీ కుడ్యచిత్రాలు అజంతా చిత్రాలకి బాగా దగ్గరగా ఉన్నాయి. మరి ఏ చైనీయ కుడ్యచిత్రాలతోటీ వాటికి అంత దగ్గిర సంబంధం లేదు. ఖోటాన్‌నుంచి వెళ్ళిన కొంతమంది చిత్ర కారులు చైనాలో స్థావరం ఏర్పరుచుకొన్నట్లు మనకు నిదర్శనాలు కనబడుతున్నాయి. అయితే వాళ్ళలో కొంతమంది జపానువెళ్ళి ఈ చిత్రాలు చిత్రించిటంటారా? అన్నదే ప్రశ్న.

హారోర్యూజీలో శాక్యముని, అమితాభ, భైషజ్య గురు, రత్నసంభవ అనే నలుగురు బౌద్ధదేవతల చిత్రాలు కనిపిస్తున్నాయి. ఇప్పుడు ఈ కుడ్య చిత్రాలు క్రీస్తుశకం ౭౧౨ లో చిత్రించినవని నిశ్చయించారు. అక్కడ జన ప్రవాదంలో ఇవి ఒక కొరియా చిత్రకారుడు చిత్రించాడని అంటారు. ఏది ఏమయినా ఇవి భారతీయ చిత్ర సంప్రదాయానికి బాగా దగ్గిరిగాఉన్న ఏడవశతాబ్ది చైనీయ బౌద్ధకళ శైలిలో చిత్రించిన మాట వాస్తవము.

క్రమంగా ఈ హారోర్యూజీ బౌద్ధచిత్రాలు ఒక జాతీయమైన జపానీయ చిత్రకళకు దారితీసినమాట వాస్తవము. ఈకళ మొదట ఏషిన్ అనే జపాను పరివ్రాజకుడు ప్రారంభించాడు. అవి క్రమక్రమంగా వృద్ధిపొందింది. ఈ ఏషిన్ రచించిన చిత్రాలలో 'యమగోషి అమిడ' అనే చిత్రం చాలా విశ్వ విఖ్యాతమైనది. ఆ చిత్రకారునికి సుందరమయిన చంద్రోదయం స్వప్నంలో కనిపించిందట. దానివల్ల అతనికి బుద్ధుడు పర్వతాల్లోనించి పైకిలేచి వస్తూ న్నట్టున్న ఒక జాజ్జ్వల్యమానమైన చిత్రం స్ఫురించిందట. ఈ చిత్రంలోను, ఇంకా తరవాత వచ్చిన చిత్ర భంగిమలలోను, అతి సున్నితమయిన సార ళ్యంతో ఒక విధమయిన అలౌకికత్వమూ, సజీవమైన ప్రశాంతభావమూ చిత్రించబడ్డాయి. ఈ చిత్ర సంప్రదాయానికే చెందినవి, ఇంకొక రెండు చిత్రాలున్నాయి. వాటిలో అమిదబుద్ధుడు దివ్యులతో కలిసి అనుగృహీతులయిన భక్తులకు స్వాగతం ఇస్తూన్నట్టు చిత్రించబడ్డాడు. ఈ చిత్ర ప్రాద్భాగంలో కొంచెం అస్పష్టమైన నీలవర్ణము, ఆపైన స్వర్ణవర్ణంతోనూ స్ఫటికవర్ణంతోనూ తళతళ లాడు తూన్న దివ్యాకాంతులూ తళతళ లాడుతూ కనులకు మిరుమిట్లు గొలుపుతూ ఉంటాయి. వాటికేసి అవలో కిస్తూ ఉంటే అవి ఏవేవో దివ్యరాగాలకు సంచలించి పోతూన్నట్లుంటాయ.

అయితే ఈ చిత్రాలు చిత్రించిన అనతికాలం లోనే జపాను వైదేశిక ప్రభావాలు తనమీద పడకుండా తలుపులు బిడాయించుకుని కూర్చుంది. ఆ పైన భారతీయ సంప్రదాయాలతోగాని, చైనీయ సంప్రదాయాలతోగాని ఏ మాత్రమూ సంబంధంలేని ఒక స్వతంత్ర శైలిలో చిత్రాలు చిత్రించుకోవడం ప్రారంభించింది. ఆఖరికి బౌద్ధ దేవాలయాల్లో ఉన్న ప్రతిమలు కూడా మారిపోవడం మొదలు పెట్టాయి. వాటిల్లో అంతకుపూర్వం ఉన్న లాలిత్యమూ, మాధుర్యమూ, అంతరించిపోయి, గొప్పశక్తీ, దార్ఢ్యమూ ఆవేశించాయి. అయితే ఈపైన జపానీయ కళ ఏయే మార్గాలు తొక్కిందో చర్చించడం మన పనికాదు. ఆ తరవాత మళ్ళీ భారతదేశాన్నించి జెన్ బౌద్ధమతం జపానుల్లో ప్రవేశించింది. ఇందులో ఉన్న ధ్యాన సంప్రదాయాలు, జపానీయ బౌద్ధ చిత్రకళలో కొన్ని కొన్ని కొత్త సంప్రదాయాలు ప్రవేశపెట్టాయి. ఈ కొత్తమతం ఆచారాలు, కర్మకాండ, మంత్రపారాయ

ణలూ మొదలయినవి న్యూనపరిచి, ధ్యానమార్గం ద్వారా ముక్తి, జ్ఞానజ్యోతీ లభిస్తాయని బోధించింది. ఈ మతంవల్ల జపాను బౌద్ధ కళకు ఒక నూత్న చైతన్యం వచ్చిందనడంలో సందేహంలేదు.

జపాను ఆసియా వస్తు ప్రదర్శనశాల వంటిది. అది చైనీయ సంప్రదాయంలోను, భారతీయ సంప్రదాయం లోను బయలుదేరిన మహత్తరమైన ధ్యాన చిత్రాలన్నీ వడబోసి అతిసున్నితమైన చిత్రాలు సృష్టించు కుంది. ఇంక జపాను బౌద్ధమత విషయము. గ్రోసే అన్నట్లు అది ప్రపంచంలో కల్లా అతి మనోహరమైన ఆధ్యాత్మిక కుసుమము. పాశవికమైన పరమాణు ప్రళయాలు ఎన్నివచ్చినా దాన్ని మార్చలేవు!

అనువాదకుడు : 'శిల్పి'

---

# గ్రంథస్వీకృతి

౧. 1857 విప్లవం
అశోక మెహతా ౧-౮-౦

౨. అన్నపూర్ణా సుభాషితరత్నావళి
రచయిత్రులు :
ఇందిరా భారతీదేవులు ౦-౮-౦
జాతీయ జ్ఞానమందిరము
హిందీ ప్రచారసభ,
టి. నగర్, మద్రాసు.

3. లోభి (మోలియర్)
అనువాదం : మూర్తిరాజు
పి. వి. యస్. మూర్తిరాజు,
మెక్‌లారెన్ హైస్కూలు,
కాకినాడ. ౦-౧౨-౦

౪. హరిజన విజయము (బుఱ్ఱకథ)
కవికిశోర్
శ్రీ మునగపాటి విశ్వనాథశాస్త్రి. ౦-౬-౦

౫. స్వరాజ్యగేయములు
శ్రీ విశ్వనాథశాస్త్రి ౦-౬-౦
దొరకు స్థలము :
సుందరరాం అండ్ సన్సు, తెనాలి.

౬. చిత్రాంగి (నాటకము)
ఉపద్రష్ట వేంకటసీతారామయ్య,
ఆనందవాణి ప్రచురణ ౧-౦-౦
దొరకుస్థలము :
ఉపద్రష్ట వేంకటసీతారామయ్య,
50 హావిలాక్ స్క్వేర్, న్యూఢిల్లీ.

౭. కథానికా రచన
మొహమ్మద్ ఖాసింఖాన్, ఎం. ఏ., ౧-౦-౦
హైదరాబా దాంధ్రసాహిత్యపరిషత్తు,
హైదరాబాద్ — దక్కన్.

# గ్రంథ విమర్శనము

## శ్రీ అరవింద జీవిత సంగ్రహము

శ్రీ అరవింద వాఙ్మయ గ్రంథమాల ప్రచురణ: అనువాదకుఁడు శ్రీ రూపనగుడి నారాయణరావు. క్రౌను ౨౦ పుటలు. వెల అరణాలు: ప్రకాశకులు: శ్రీ సి. సీతారాం, శ్రీ అరవిందాశ్రమము, పాండుచేరి.

ఇది 'Sri Aurobindo. A life sketch' అను గ్రంథమునకు, 'The teachings and the Ashram of Sri Aurobindo' అను గ్రంథము ప్రథమభాగమునకును అనువాదము. ఈ చిన్న గ్రంథమున శ్రీ అరవిందుల పుట్టుక, పాశ్చాత్యదేశమున విద్యాభ్యాసము, బరోడాలో ఉద్యోగము, వాఙ్మయకృషి, జాతీయోద్యమమునఁ బాల్గొనుట, రాజద్రోహపు నేరము నారోపించుట, విడుదల, శ్రీ యరవిందుల యాధ్యాత్మికసాధన, పుదుచ్చేరినివాసము, ఆశ్రమస్థాపనము, శిష్యోపదేశము, ఆశ్రమమునుగూర్చిన దురూహాలు, వాని కరవిందు లొసంగిన జవాబు మున్నగువిషయములు మిక్కిలి సంగ్రహముగ వర్ణింపఁబడినవి. శ్రీ యరవిందుల యాధ్యాత్మికతత్త్వము సంగ్రహింపఁబడినది. శ్రీవారి వర్ణచిత్రము పుస్తకమునకు వన్నెఁ గూర్చుచున్నది. మహాపురుషుల నారాధించి, వారి యాశయముల నెఱుంగఁగోరువారందఱు చదువఁదగిన గ్రంథము ఇది.

## గాంధీదేవుడు

శతకము. కర్త: శ్రీ మునగపాటి విశ్వనాథశాస్త్రి, క్రౌను ౧౭ పుటలు: వెల నాలుగణాలు: ప్రాప్తిస్థానము: సుందరరాం అండ్ సన్సు, తెనాలి.

ఈశతకమున కవిగారు 'గాంధిదేవప్రభూ !' అనే మకుటముతో 'మత్తేభశార్దూల ప్రోజ్జ్వల పద్యమాలిక (?)' లలో గాంధీతత్త్వమును తేటతెల్లముగా వివరించిరి. జనసామాన్యమునకు అందుబాటులో నున్న కూర్పుతోను, లోకోక్తులతోను రచన నిరాఘాటముగా ప్రవాహరూపమున కొనసాగినది.

గ్రంథకర్త ప్రాచీనపద్ధతి ననుసరించి నియమబద్ధముగా గ్రంథమును రచించినాడు. ఇందలి విషయము గొప్పది; కాని దానికి దగిన భాషావాఙ్మయ పరిజ్ఞానము కుంటువడినది. తత్ఫలితముగ నిందు లెక్కకు మిక్కిలి దోసగులు దొరలినవి. గ్రంథకర్త పరిశ్రమించినచో మంచి భవిష్యత్తుండునని తోఁచుచున్నది. అతని యుత్సాహము ప్రశంసింపఁదగినది. గాంధీతత్త్వమునం దాస్థకలవారును, ఆతత్త్వమేమో తెలిసికొనఁ దలచినవారును ఈ శతకమును తప్పక చదవఁదగుదురు. గ్రంథకర్త తగిన కృషి చేసి యుత్తమ గ్రంథములను రచించి వాఙ్మయసేవ నొనర్చును గాక !

బు. వేం. ర.

ఇది 37, ఆచారప్పన్ వీథిలోని బి. యన్. కె. ప్రెస్సులో, బి. నాగిరెడ్డిగారిచే ముద్రింపబడి, 10, నరసింగపురం వీథిలోని ఆంధ్రశిల్పి కార్యాలయంలో శ్రీమతి డి. అర్. చిత్రాగారిచే ప్రకటింపబడినది. సంపాదకులు: వి. అర్. చిత్రా : పి. గణపతిశాస్త్రి.




శిల్పి ప్రచురణలు :

# 'నా జీవిత యాత్ర'

ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు

బాల్యం మొదలు పంచాశద్వర్షాలవరకూ గడిచిన మహోజ్జ్వల జీవిత గాథ.

ప్రథమ ఖండము

వెల రూ. ౩/—

౧౯౪౬ ఆగస్టు ౨౩ వ తేదీనాడు శ్రీ ఆంధ్రకేసరి జన్మదినోత్సవ సందర్భంలో వెలువడింది.

## 'ఆంధ్ర శిల్పి'

ఆంధ్ర సాహిత్యానికీ, లలిత కళలకీ,

సంస్కృతికి దోహదమిచ్చే

సచిత్ర మాస పత్రిక

సంపాదకులు :

**వి. ఆర్. చిత్రా**

**పి. గణపతి శాస్త్రి**

సాలు చందా ౯ రూపాయలు.

విడి కాపీ ౧౨ అణాలు.



రాబోవు

## 'శిల్పి' ప్రచురణలు

ఆంధ్రకేసరి

శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు

రచించిన

౧. 'నా జీవిత యాత్ర'
ద్వితీయ ఖండము

౨. యోగసూత్ర సిద్ధాంతము

౩. ఈశావాస్యోపనిషత్తు

౪. ప్రశ్నోపనిషత్తు

౫. కఠోపనిషత్తు.

౬. భగవద్గీతా భాష్యము

---

వివరాలకు :— మేనేజరు :

'ఆంధ్ర శిల్పి'

౧౦, నరసింగపురం వీధి,

మౌంటురోడ్, మద్రాసు.



సంపాదకులు

వి. ఆర్. చిత్రా: పి. గణపతిశాస్త్రి




౧౦, నరసింగపురం వీథి,
మౌంట్ రోడ్, మద్రాసు.

# విషయానుక్రమణిక



## శిల్పాలు



రాధ

శ్రీ ధీరేన్ కె. దేవ్ వర్మ



# సంపాదక సమీక్షలు

## విశ్వాసరాహిత్యము

ఈమధ్యన మద్రాసు శాసనసభ్యుల్లో ౧౩౫ మంది కలిసి ఏకమై ప్రధాని ప్రకాశంమీద విశ్వాసరాహిత్యం తీర్మానించడమూ, ప్రధాని అది అశాస్త్రీయమని తోసివెయ్యడమూ, దానిమీద అధికసంఖ్యాకులు వేరే సమావేశమై మరి ఒక నాయకుణ్ణి ఎన్నుకోవడమూ రాష్ట్రంలో చాలా కలవరం కలిగించాయి.

దీనితో ఆంధ్రదేశం అంతా అట్టుడికిపోయిన ట్టయిపోయింది. పల్లెల్లోను, పట్టణాల్లోను విశ్వాసరాహిత్యతీర్మానానికి అనుకూలంగా ఓట్లిచ్చిన శాసనసభ్యుల్ని ఖండిస్తూ, వెంటనే వారు తమ పదవులకు రాజీనామాలివ్వవలిసిందని తీర్మానాలు చేశారు. ఆంధ్రదేశంలో సంచారానికి బయలుదేరిన ఆంధ్రకేసరికి అంతటా అఖండస్వాగతం ఇచ్చి తమ అచంచల విశ్వాసం వెలిబుచ్చారు. విశ్వాసరాహిత్యానికి అనుకూలంగా ఓట్లిచ్చిన ఆంధ్రసభ్యులకు ఎక్కడకు వెళ్లినా నల్లజెండా లెదురైనాయి. కొంతమంది ఆసామీలు అసలు మద్రాసు విడిచి ఆంధ్రదేశంలో అడుగుపెట్టడానికే జంకిపోతున్నారనీ, తమకి మద్దత్తుకోసం వేలాది ఖర్చుపెట్టి రౌడీలను రప్పించుకొన్నారనీ వింటున్నాము.

ఇక్కడ ప్రజాసామాన్యం ప్రధానిమీద తమ సుస్థిరవిశ్వాసం ప్రకటిస్తున్నారు. కాని ఆ ప్రజలే ఇంతకుపూర్వం ఎన్నుకున్న శాసనసభ్యులకు హఠాత్తుగా ప్రకాశంమీద విశ్వాసం ఎగిరిపోయింది!

సామాన్యప్రజలకి ఎవరికీ ఈవిధంగా హఠాత్తుగా విశ్వాసం పోవడానికి కారణం తెలియదు! విశ్వాసరాహిత్యతీర్మానం అనేసరికి ఆంధ్ర

దేశం అంతా ఒక్కసారిగా దద్దరిల్లిపోయింది! అయితే శాసనసభ్యుల్లో నిలుచున్న పాటుగా కలిగిన ఈ అవిశ్వాసానికి కారణం ఏమిటి?

ఈ ప్రశ్నకి ఎటుచూచినా న్యాయమైన కారణం కనబడడం లేదు. ఈమధ్యన రాజేంద్రప్రసాదు మాట్లాడుతూ మద్రాసుప్రభుత్వం ధాన్యసేకరణ విధానంలో ఇతరరాష్ట్రాలకు మార్గదర్శకంగా ఉన్నదని శ్లాఘించాడు. మద్రాసుప్రభుత్వవిధానాలన్నీ మహాత్ముని ఆశీర్వాదం పొందాయి. అన్ని విషయాల్లోను మద్రాసుప్రభుత్వం అగ్రగామిగా ఉన్నదని అందరూ అన్నారు! మరి ఈ విశ్వాసరాహిత్యానికి కారణం?

దీనికి ప్రత్యేకంగా కారణాన్వేషణకి పూనుకోవలిసిన అవసరం లేదు! త్యాగాదర్శాలతోటీ, సేవాదర్శాలతోటీ ప్రారంభించిన చాలామంది కాంగ్రెసువాదులలో నేడు స్వార్థం పెరుకుంది; కేవలం పదవీవ్యామోహం ప్రధానమైంది. వీరు పదవులకోసం ఎటువంటి నైచ్యాలకైనా సిద్ధపడుతున్నారు. తమ స్వార్థాలకోసం కాంగ్రెసులో కులకక్షులమీద ఆధారపడిన కుటిలవిభేదాలకి దారితీస్తున్నారు. చివరికి కాంగ్రెసు ప్రతిష్ఠ మంటలో కలపడానికికూడా వెనకాడడం లేదు.

ఈ విషయంలో కొందరు ఆంధ్రనాయకుల ప్రవర్తన మరీ గర్హ్యంగా ఉంది. ఇన్నాళ్లనించీ ఆంధ్రజాతి అనేకవిషయాలలో వెనకబడి ఉండడానికి ఇల్లాంటి స్వార్థపరుల సంకుచిత దృక్పథాలే కారణము. ఆంధ్ర ప్రజానీకం వీరిని ఒకకంట కనిపెడుతూ, ఇల్లాంటి స్వార్థపరులు ప్రజాప్రతినిధులమని ఊరేగకుండా చూడవలిసిన అవసరం ఎంతైనా ఉంది. వారిని శాసనసభలనించి తరిమివేసేదాకా సామాన్యప్రజలు నిద్రించకూడదు!

ఈ రాష్ట్రంలో పరిస్థితులన్నీ కాంగ్రెసుకార్యవర్గం జాగ్రత్తగా గమనిస్తున్నారో లేదో తెలియదు. ఈ పరిస్థితుల్లో కాంగ్రెసుకార్యవర్గం మెలకువతో ప్రవర్తించాలి. ప్రజాద్రోహులు తలపెడుతూన్న కుతంత్రాలన్నీ నిర్మూలించి, కాంగ్రెసుప్రతిష్ఠ నిలబడేటట్లు చూడాలి. నిజమైన ప్రజాసేవకు లెవరో, స్వార్థపరు లెవరో గమనించాలి. ప్రకాశంవంటి ప్రజాపక్షపాతికి ధనికవర్గాలవల్లా, పెట్టుబడిదారులవల్లా, స్వార్థపరులవల్లా కలుగుతూన్న ఒత్తిడి తొలిగించి, అవసరమైతే కొనిమార్పులుచేసి ప్రకాశం మంత్రి

వర్గానికి సహకరించి, ఈ రాజధానిలో కాంగ్రెసుప్రతిష్ఠ సుస్థిరమయ్యేటట్లు చూడాలి. స్వార్థపరులనీ, దేశద్రోహులనీ కాంగ్రెసు సమీపానికైనా రాకుండా తరిమివెయ్యాలి!

ఈవిధంగా జరగకుండా మరిఒకవిధంగా జరిగితే మద్రాసు రాజధానిలో కాంగ్రెసుప్రతిష్ఠ అంతరించడం తథ్యము. అంతేకాదు; స్వార్థపరులతో ఏర్పడిన కొత్తమంత్రివర్గాలుకూడా ఆట్టేకాలం నిలబడవు. మళ్లీ అనతికాలంలో గూడుపుఠాణీలూ, విశ్వాసరాహిత్యాలూ బయలుదేరి తీరతాయి.

అందుచేత కాంగ్రెసు కార్యవర్గము, ప్రజలు, ప్రకాశం మంత్రివర్గంమీద స్వార్థపరులు లేవదీస్తూన్న గాలిదుమారాలన్నీ అవగాహనచేసుకోగలరనీ, ప్రజాప్రతినిధులమని చెప్పుకుంటూ ప్రజాద్రోహం తలపెడుతున్న స్వార్థపరుల ప్రయత్నాలన్నీ భగ్నంచెయ్యగలరనీ కాంగ్రెసుప్రతిష్ఠ మళ్లీ సుప్రతిష్ఠితం చెయ్యగలరనీ ఆశిస్తున్నాము.

# విశ్వనాథ పంచశతి

తొడిమపట్టు, మెల్లఁదొలఁగి తప్పించుక
పండు, నేలరాలి పడినయంత
చూతశాఖ, చివురుజొంపంబు మొగముతోఁ
బండువంకనల్లె తొంగిచూచు.

తాటిమొవ్వుమీఁదఁ దావచ్చి మరికొంత
సేపు నిలచె నిరుటిచిన్నమొయిలు
తోట క్రొత్తమొగ్గ తొడిగిన కడిమికా
కాకునందు గగురుగదుర తోఁచె.

సమరస మృదుకుల సతిసిత
కమలాపాంగములఁబోలు గద్యము, పద్యం
బమృతరసవ్యంజకనా
ట్యమనోహార్యప్సరోదృగంతముఁబోలున్.

ప్రేమలేద యిద్దఱికి నగ్నిసాక్షిగా
నైన పెండ్లియందు నాదరమున
గంగయమునవోలెఁ గలసియే పోదురు
గంగయమునవోలెఁ గలసిపోరు.

మొదటిసారి ప్రియుఁడు ముద్దిడుకొన్నంత
కన్నెబెదరి, క్రొత్తకాల్వక్రింద
సాగుపొలముదంపనాఁగలి లాఁగినఁ
బెళ్లవిరిగినట్లు తెల్లవోయె.

చిన్నపూవుకంటెఁ జివురాకు మెత్తన
దానికంటెఁ జిన్నదానితలపు
తలపుకంటెఁగూడఁ దొలియీఁత యావెన్నఁ
బెట్టినట్టి దివ్వెపిల్లవలపు.

## విశ్వనాథ పంచశతి

పెల్లుగ వర్షర్తువు మఱ
నల్లని భూచక్రగొడుగునాఁ జనుదెంచెన్
చెల్లీ! బావకు సెలవులు
మల్లడి వేసంగి మూఁడుమాసములేలో.

అరకోడి యన్ననెంతా
దరమోతానంత పెద్దతల్లికిఁ దోలిచూ
ల్బరువున బొంగరము నభం
గురగతిఁ దిరుగాడు చిన్నికోడలిఁగన్నన్.

ఒడలఁ జెమటపోసెఁ గడురొప్పుచుంటివి
కొసబుజాననంటెఁ గుసుమరజము,
పడుచు దానిమగడ! నడియెండఁ బూచిన
బీరపాదు త్రవ్వపెట్టనేల.

పూవు, చిన్నిపసరుమొగ్గ కాకయమున్న
సన్నయీనెవోలె నున్నయట్లు
వలపు సిగ్గుగాఁగఁ బరిణమింపకమున్న
బాలయందు భయమువోలె నుండు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

# బాధపడి కావ్యాలు

బాధపడి కావ్యాలు
ప్రసవించమంటావు
ధళితహృదయములోన
తలపు పూచేనా ?

రేగుబడ బాళిఖల
క్రాగుసాగరుగుండె
కలవరించేరొదలు
కలగానమేనా ?—

పడుచుపూవుల తేనె
వలపు వాసిన తేటి
బీటవారిన గొంతు
పాట బాడేనా ?—

ఓసరిలు మోసరిలు
మోసఖా ! ఇకనైన
ఏశాంతిలోకాల
కోసమో పోనిమ్ము !

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

# హృదయోపహారము

ప్రేమశిరీషమోహన పరిమళ మంతయుఁ గోయఁబోవ, లో
లో మనసైనయంతనె - విలుప్తమగున్ లవమేనిలేక; త
స్వీ ! మరి నేను సౌరభసమేతముగాఁ గుసుమమ్ముఁ గోసి, నీ
కై మృదుపాదధూళి నిడగాఁదలతుం గృపతో క్షమింపుమీ !

ప్రతినిమిషమ్మునుం బరుగువారెడు జీవిత మాపి, మాధురీ
ప్రతికృతి ! నిన్ను నా కవనరంజిత భావమునం గ్రహింపఁ గో
రితి ! వృథ ! యీ ప్రయత్నము! సరే మరి నా హృదయమ్ము మాత్ర మీ
జతనము మానలేని వివశత్వమునం బడియెన్ క్షమింపుమీ !

*　　*　　*　　*

నీ నిరతప్రతీక్షరమణీ! మరి నిద్దురమై, భరింపగా
లేని మహాప్రమోహమయి, లీనహృదంతర మృత్యునీరవ
మ్మైన నయనమ్ములొక్కపరియైనఁ గనుంగొననీయదో ! మరే
మో ! నిమిషమ్ముఁదాళక ముహూర్తమునన్ వెలిగింపు వీక్షలన్.

భూతభవిష్యదర్థ పరిభూతము ! సర్వము వర్తమాన కా
లాతి మనోహరత్వ మబలా! మరి తద్విషయప్రసక్తి పో
నీ ! తరుణాతిమోహనమనీదృశ మీ క్షణనౌక నీదు కే
లూతగఁ నెక్కి జీవితమహోదధి నే నవలీల దాటుదున్ !

కనుగొనఁగంటి నిన్నని యఖండముదమ్మునఁ బొంగి పొంగి లే
చిన హృదయమ్ము నీ విటకుఁ జెచ్చెర వచ్చెదవేని లోక మో
హన కవనప్రవంతిగ సహస్రవిధమ్ములఁ బారుచున్ భవ
న్మనన మొనర్చు నిత్య మొకమారికనైనను రమ్ము నెచ్చెలీ !

ఈ వొకవేళ వచ్చుసరికే మెయి జీవనదీప మారియే
పోవునో ! దానికే తరలిపోయెదవో సుమి ! దివ్యదీప్తి ! బా
ష్పావృతమైన నీయధర మల్లన సోకినయంతలోన తా
రావిచలత్కనీనిక లరాళత నిస్సనిచొక్కు నిర్వృతిన్ !

*　　*　　*　　*

2—A　　　　శ్రీ పి. గణపతిశాస్త్రి.

# జపానుకళలో భారత సంప్రదాయాలు

## శ్రీ వి. ఆర్. చిత్రా

మస్నవీర్ అనే పారశీక మహా కావ్యంలో గ్రీకులు, చైనీయులు కళలో ఎవరు గొప్పవారమని వివాదపడినట్లు వర్ణితమైఉంది. వాళ్లిద్దరూ తమ తగువు తీర్చవలసిందని సుల్తానుని ప్రార్థించారట. ఆతను దానికోసం ఒక పోటీ ఏర్పరిచాడు: ఒక భవనం చూపించి దాన్ని మీమీ అభిరుచులకు అనుకూలంగా అలంకరించమని ఆజ్ఞాపించాడు. ఆపైన చైనీయులు ఆ భవనకుడ్యాలమీద పెద్దపెద్ద చిత్రాలు చిత్రించారట. గ్రీకులు ఆభవనం గోడలు శుభ్రంగాతోమి, అద్దాలలాగ తళతళలాడేటట్లుచేసి అంతమాత్రంతో ఊరుకున్నారట. సుల్తాను చైనీయులచిత్రాలు అత్యద్భుతంగా పొగిడాడట; కాని ప్రథమబహుమానం గ్రీకులకే ఇచ్చివేశాడట! కవి ఇక్కడ సాంకేతికంగా ఒకవిషయం వర్ణించడానికి మాత్రమే ఈకథ ఇక్కడ చేర్చాడు. ఇది కేవలం చారిత్రికంగా పరిశీలించకుండా, చూస్తే ఇందులో ఒక సత్యం ప్రతిఫలిస్తూన్నమాట వాస్తవము.

'దీన్నిబట్టి ప్రాచ్య దేశీయులకు కళమీద, సౌందర్యం మీదఉన్న ఆసక్తి కేవలం భౌతిక దృక్పథం కలిగిన పాశ్చాత్యదృష్టికంటె విభిన్నమైనదని నిర్ధారణచేయవచ్చును.

ఈ ప్రాచ్యఖండంలో కళ ఎంతో పురాతన కాలం నించీ అభివృద్ధిపొందుతూ వచ్చింది. ఇల్లాగ అభివృద్ధి పొందుతూన్న ఈ ప్రాచ్యకళలో క్రమంగా చిన్న చిన్నమార్పులు ప్రారంభించాయి. ఈ కళావిధానంలో మంచిచెడ్డలమాట ఎల్లాగఉన్నా, దీనిలో ఏషియాఖండం ప్రతిభ జాజ్వల్యమానంగా ప్రతిఫలించినదని చెప్పవచ్చును. అయితే ఈ కళా పరిణామం అంతా సమీక్షచేయడం ఇప్పుడు నాపనికాదు. కాని భారతీయకళవల్ల జపానుకళలో జరిగిన మార్పులు తెలుసుకోవాలంటే అత్యంత ప్రాచీనమైన ప్రాచ్యకళ దానిపరిణామమూ బాగా అవగాహన చేసుకోవాలి. మొట్టమొదట ఈ కళావిజ్ఞానం ఏకమైనా క్రమక్రమంగా మూడువిభాగాలై, మూడు మహావిజ్ఞానాలకు దారితీసింది. అదే భారతీయ గ్రీకు, చైనాజపాను నాగరికతలై పేరు మోసింది.

ఈ మూడు నాగరికతలూ కూడా, ఆసియా కళాభ్యున్నతికి తోడ్పడ్డాయి. అస్సీరియా, సంప్రదాయమూ, భారత సంప్రదాయమూ, షాంగ్ సంప్రదాయమూ ఒకేసంప్రదాయంలో నించి బయలుదేరాయి. ఈ మూడింటిలోనించీ మళ్లీ ప్రపంచంలో భిన్నభిన్నసంప్రదాయాలు కొత్తదారులు తొక్కాయి. అస్సీరియా సంప్రదాయంలోనించి, గ్రీకు రోమను కళా సంప్రదాయాలూ, భారతీయ సంప్రదాయంలో నించి, చైనీయ సంప్రదాయమూ బయలుదేరాయి. నిజానికి పాశ్చాత్యసంప్రదాయం అలెగ్జాండరు దండయాత్రానంతరం మళ్లీ భారతదేశంవైపు వచ్చింది. అలెగ్జాండరు గ్రీకు సంప్రదాయమూ, నాగరికతా, ప్రాచ్యదేశాల్లో ప్రవేశించడానికి కారణభూతుడయ్యాడు. అయితే అలగ్జాండరు చాలా చిన్నతనంలో మరణించడంచేత మళ్లీ ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయాలు రెండూ దూరదూరంగానే ఉండిపోతూ వచ్చాయి. కాని అలెగ్జాండరు ఆశయాలూ, అభీప్సలూ గాంధారశిల్పంలో సాఫల్యంచెందినట్లు కనిపిస్తాయి. ఆ కాలంలో భారతదేశం కొంతవరకూ అతని ఆదర్శాలు అంగీకరించింది.

ఈపైన భారతీయకళ చైనాజపాను దేశాల్లో ప్రవేశించిన ఘట్టాల్లోకి ప్రవేశిద్దాము. శాక్యముని క్రీస్తు పూర్వం ౬వ శతాబ్దంలో కొంతవరకు జీవించి

# జపానుకళలో భారత సంప్రదాయాలు

ఉండి, ఆపైన దివంగతుడైనాడు. ఆ తరవాత మూడు శతాబ్దాలు గడిచిపోయాయి. అనంతరం అశోక చక్రవర్తి బౌద్ధమతం స్వీకరించాడు. అతను అలగ్జాండరుకాలంలో భారతీయకళలో జరిగినమార్పులు గమనిస్తూ, క్రమంగా స్వీయకళాసంప్రదాయం అభివృద్ధిచెయ్యడం ప్రారంభించాడు. దీన్ని మనం యవన భారతీయ సంప్రదాయం అని పిలవవచ్చును. అశోకుడు తనకాలంలో ఉన్న విజ్ఞానంఅంతా ఆకళించుకొన్నవాడవడంచేత, తన కళాసంప్రదాయం భారతదేశంలో వ్యాప్తిచెందించడంతో తృప్తిపడక క్రమంగా ఇతరదేశాల్లోకూడా వ్యాపింపచెయ్యాలని నిశ్చయించాడు. అతని ప్రయత్నాలవల్ల బౌద్ధమతం క్రమక్రమంగా ఆసియాఖండం అంతా వ్యాపించసాగింది. దానివల్ల అనేకజాతుల్లో ప్రబలమైన భావసంచలనం కలిగింది. క్రీస్తుశకం ౬౭ లో మింగ్ టి అనేచైనాచక్రవర్తి బౌద్ధమతసత్యాలు తెలిసికోడానికి హిమాలయాలద్వారా తన వార్తాహరుల్ని భారతదేశానికి పంపించాడు. ఆ పిమ్మట వారంతా ఎంతోఆప్యాయంగా బౌద్ధమతంలో ప్రవేశించి, భారతదేశంనించి తిరిగి వచ్చేటప్పుడు బుద్ధదేవునికి సంబంధించిన కొన్నిచిత్రాలూ, శిల్పాలూ తమ దేశానికి తీసుకువచ్చారు. క్రమంగా చైనాదేశానికీ భారతదేశానికీ మధ్య తీర్థయాత్రికులమార్గం ఒకటి ఏర్పడింది. ఆ తరవాత క్రీస్తుశకం నాలుగో శతాబ్దిలో ఫాహియాన్ భారతదేశంలో మగధరాజ్యానికి రావడం మనం అందరమూ ఎరిగిఉన్నదే. ఫాహియాన్ తిరిగి చైనా వెళ్లగానే తాను సందర్శించిన పుణ్యక్షేత్రాలనుగురించీ, బౌద్ధ ప్రతిమలనిగురించీ, ఇంకా భారతదేశంలో ఉన్న కొన్ని విచిత్ర విషయాలనిగురించీ ఒక గ్రంథం వ్రాశాడు. క్రమంగా చైనీయులందరికీ ఆ గ్రంథం ఒక బైబిలు అయింది. ఇంకా ఫాహియాన్ తనతో కొన్నిబౌద్ధశిల్పాలూ చిత్రాలూకూడా తీసుకువచ్చాడు. చైనీయులు వాటికి నకళ్లు తయారుచేసుకుని వాటిని ఎంతో భక్తిభావంతో ఆరాధించడం ప్రారంభించారు.

క్రమక్రమంగా బౌద్ధమతం చైనా జయించి ప్రాగుత్తరదిశవైపు ప్రయాణించి, కొరియావెళ్ళి, క్రమంగా అక్కడినించి జపాను చేరుకుంది. అందుచేత బౌద్ధమతప్రవేశంతోనే జపానులో చిత్రకళ ప్రారంభించిందని నిశ్చయించవచ్చును. ఈ ప్రారంభకాలంలో 'తమముషి' అనే పుణ్యస్థలంలో చిత్రించిన చిత్రాలు ఇప్పటికీ మనం చూడవచ్చును. ఇవి చైనా బౌద్ధమతసంప్రదాయంలో చిత్రించిన తైలవర్ణచిత్రాలు. వర్ణ సమ్మేళనంలోను, సారళ్యంలోను వీటికీ అజంతాకుడ్యచిత్రాలకీ చాలా దగ్గిర సంబంధం ఉంది. ఇంతేకాదు; రంగులూ అవీ అక్కడ, ఇక్కడ ఒకటే. ఇవే జపానుచిత్రకళకి ప్రారంభం అని చెప్పవచ్చును. క్రమంగా ఇవే ప్రత్యేక జపాను చిత్రకళకి దారితీశాయి. ఆ పిమ్మట ఏడవ శతాబ్దిలో సింకో చక్రవర్తిని పరిపాలన కాలంలో బౌద్ధమతము, చిత్రకళ, జపానులో బాగా వ్యాపించాయి. నారాలో ఉన్న సుప్రసిద్ధ హొర్యూజీ దేవాలయ చిత్రాలన్నీ ఈమె కాలానికి సంబంధించినవే. ఆ తరవాత అనేకమైన చిత్ర సంప్రదాయాలు బయలుదేరాయి. కాని అవన్నీ బౌద్ధ సంప్రదాయానికి చెందినవే. ఈ చిత్రాలు చిత్రించినవారిలో క్రీస్తుశకం ౧౦౧౭ లో అస్తమించిన ఏషిన్ సోజు అనే చిత్రకారుడు ఉత్తమోత్తముడు. అతనికి అమిద బుద్ధుడు స్వర్గలోకంలోనించి అవతరిస్తూ భక్తులనందరినీ అనుగ్రహిస్తూన్నట్లుగా తీయని తీయని దృశ్యాలు ప్రత్యక్షమయ్యేవని చెబుతారు. వాటికీ వాటికి సమకాలీనములైన భారతీయచిత్రాలకీ చాలా దగ్గిరసంబంధా లున్నాయి.

ఆ తరవాత వచ్చిన సంప్రదాయాలన్నీ సుసూక్ష్మంగా పరిశీలించడం ఇప్పుడు మన పనిగాదు. మనం ప్రస్తుతం అధునాతనయుగానికి వద్దాము. దీన్ని 'మేజియుగం' అంటారు. ఇది ౧౮౬౮ కీ, ౧౯౧౧ కీ మధ్యభాగాన్ని ఏర్పడింది. ఈ యుగంలో ప్రాచ్యకళ ప్రత్యేకత బాగా కనిపిస్తుంది. ఈ కాలంలో జపానీయులు తమకి చిత్రకళ బోధించడానికి ఫాన్లెస్

విర్గ్‌మార్క్, ఎంఫోంటనేసి, ప్రొఫెసరు ఫెనొల్లోసా వంటి చిత్రకారుల్ని తమ దేశానికి రప్పించుకుని, జపానువిద్యార్థులకు వారిచేత చిత్రకళ బోధింప జేశారు. అయినా జపానీయులు తమ ప్రాచ్యసంప్రదాయం నిలబెట్టుకోవడంలో చాలా జాగ్రత్తపడ్డారు. నిజం ఆలోచిస్తే, తకంచీసైహో, కవైగ్యోకుడోవంటి సుప్రసిద్ధ చిత్రకారుల్లో ప్రాచీనవిజ్ఞానజ్వాల జాజ్వల్యమానంగా వెలిగిందనే చెప్పాలి. పాశ్చాత్య సంప్రదాయాలు పరిశీలించడంవల్ల జపాను చిత్రకారుల మానసికదృక్పథంలో ఎంత మార్పు వచ్చినా, అది వారిసంప్రదాయాన్ని తుడిచిపెట్టి వేస్తుందని చెప్పడానికి వీల్లేదు. బాగా పరిశీలిస్తే ఈ అధునాతన జపాను చిత్రకారుల చిత్రాలకీ, అవనీంద్రుడు, నందలాల్ బోసు మొదలైన సుప్రసిద్ధ భారతీయచిత్రకారులు చిత్రించిన చిత్రాలకీ చాలా దగ్గిరపోలికలు కనిపిస్తాయి.

జపానులోను భారతదేశంలోను, ఉన్న చిత్రకళ పరీక్షిస్తే ప్రాకృతికత, భావనాసంపత్తీ గొప్ప గొప్ప ఔన్నత్యశిఖరాలు అందుకున్నాయని చెప్పవచ్చును. ఏది ఏమైనా జపానీయులు మనదగ్గిర నేర్చుకొన్నది బాగా అభివృద్ధి పొందించారనే చెప్పాలి. వాళ్ల చిత్రకళల్లో కొన్నికొన్ని కొత్త విషయాలు చేర్చుకున్నారు. జపానీయులు ఎప్పుడూ చైనావైపు ఆదర్శప్రాయంగా చూస్తూ ఉంటారు. జపానీయచిత్రకళ చైనానించి, అనేకమైన విషయాలు, రీతులు ఎరువు తెచ్చుకుంది. జపాను ౧౯ వ శతాబ్దిలో పాశ్చాత్యదేశాల భౌతికనాగరికత ఆకళించుకొని జీర్ణించుకున్నట్లుగానే, అంతకు పూర్వం ఒక వెయ్యేళ్లవెనక చైనా నాగరికతాకళావిజ్ఞానాలు ఆకళించుకుని జీర్ణించుకుంది. ఆ చైనాలోని విజ్ఞానానికీ, కళకు, నాగరికతకూ భారతదేశమే మూలాధారము. అనేకసారులు జపాను చిత్రకారులు ఆసియాఖండంనించి నూత్న కళా సంప్రదాయాలు ఎరువు తెచ్చుకుని తమ కళాభాండారాలు నింపించుకున్నారు. టాంగ్ రాజవంశకాలంనించి ౧౭ వ శతాబ్దిలోని మింగ్ యుగందాకా జపాను అనేకసారులు ఆసియాఖండంనించి, అనేకమైన కళా సంప్రదాయతరంగాలు ఆహ్వానించి, తనకళ అభివృద్ధి పొందించుకుంది.

ఇంకా జపానులోను శిల్పకళకు వద్దాము. జపానులో మాటిమాటికీ పెద్ద పెద్ద భూకంపాలు అగ్నిపర్వత ప్రమాదాలు వచ్చి, భవనాలు, గృహాలు భస్మావశేషం అయిపోతూ ఉంటాయి. అయినాగాని జపానీయులు ఇంకా శిల్పాలు జాగ్రత్తపెట్టడం చూస్తే చాలా ఆశ్చర్యం వేస్తుంది. కాని దానికి కారణాలు లేకపోలేదు. ౧౫ వ శతాబ్దంలో జపానులో తేనీరు త్రాగడం ఒక చిత్రమైన ఆచారంలాగ ప్రవేశించింది. ఈ తేనీరు సంప్రదాయానికి ఆచార్యుల నేవాళ్లున్నారు. వాళ్లు గృహాల్లో అలంకారార్థం ఉన్న శిల్పాలు చూచి ఎంతో గౌరవించేవారు. అందుచేత శిల్పకళకుకూడా జపానులో సముచితమైన స్థానం లభించింది. నిజం చెప్పవలసివస్తే జపానులో శిల్పం కొరియానించి బౌద్ధమతం వచ్చినప్పుడే ప్రారంభించిందని చెప్పాలి. అప్పటినించే జపానులో జాగ్రత్తపెట్టిన శిల్పాలన్నీ చైనా భారతదేశాలలోని శిల్పాలని స్మృతికి తెస్తూంటాయి. ఇంక జపానీయుల అవలోకితేశ్వరవిగ్రహం ఒకటి ఉన్నది. అది సారనాథ బుద్ధ విగ్రహంలాగ ఎంతో సొగసైన విగ్రహం. ఇల్లాగ ప్రాచీనకాలంలో బయలుదేరిన బుద్ధవిగ్రహాలన్నిటికీ ఆర్యలక్షణాలు కనిపిస్తాయి. చాలావరకు ఇవి అన్నీ ఒకవిధమైన కంచుతో తయారుచేసిన విగ్రహాలే.

ఆ తరవాత జపానులో మాంత్రిక బౌద్ధమతం ప్రవేశించింది. దానివల్ల ఆవిష్టులైన బౌద్ధశిల్పులు వినూతన విధాల్లో శాస్త్రప్రకారం శిల్పరచనలు ప్రారంభించారు. ఇది ఏడెనిమిది శతాబ్దాలలో జరిగింది. ఆ తరవాత వచ్చిన చిత్రకారులందరికీ ఈ నూత్న శిల్పరచనలు కొంతకాలంవరకూ ఆదర్శప్రాయాలయ్యాయి.

ఆ తరవాతకాలంలో వచ్చిన ఒక ముఖ్యమైన శిల్పాన్నిగురించి ఇప్పుడు చర్చిస్తాను. అది చైబత్సు

అని పిలవబడే ఒక బ్రహ్మాండమయిన బౌద్ధప్రతిమ. ప్రపంచశిల్పా లన్నింటిలోను అది అత్యుత్తమమైనది. అయితే ఆ ప్రతిమ ఉంచి నిర్మించిన దేవాలయం ఎన్నో శతాబ్దాలకు పూర్వమే నశించిపోయింది. ఆ ప్రదేశం పూర్వం యరటోమో అనే చక్రవర్తికి ప్రధాననగరంగా ఉండేదట. కాని అది ఇప్పుడు చాపలు పట్టుకునేవాళ్ల పల్లెటూరులాగ మారిపోయింది. అనేక తరతరాల మనుష్యులు గతించిపోయారు. కాని ఆ మహాబుద్ధుని ప్రతిమ అల్లాగే అచంచలంగా చూస్తూ ఉంటుంది. ఆమూర్తి చుట్టూర కరకాల పువ్వులు రాలుతూ ఉంటాయి. శిల్పి దృక్పథంనించి చూస్తే అది సుమారు యాభైఅడుగుల ఎత్తు ఉంటుంది. దానికి అనుకూలమైన ఒక పెద్ద శిలావేదిక నిర్మించి, దానిమీద ఆ ప్రతిమ ప్రతిష్ఠించారు. ఇది మనోహరమైన అంగ ప్రత్యంగసామ్యంతో నిర్మించబడిన ప్రతిమ. దీనికీ బుద్ధగయదేవాలయంలోని ప్రతిమకీ చాలా దగ్గిర పోలికలున్నాయి. శైలిలోను, ఆకృతిలోను ఇది భారత సంప్రదాయానికి చెందిందని చెప్పవచ్చును. ఇల్లాంటి ఉదాహరణలు అనేకమైనవి చెప్పవచ్చును. ఈ విధంగా జపానీయశిల్పకళలో కూడా భారతీయసంప్రదాయచిహ్నా లున్నాయని నిరూపించవచ్చును.

ఇల్లాగ శిల్పాన్ని గురించి వ్రాస్తూంటే నాకు చిన్నపిల్లలాడుకునే బొమ్మలవిషయం జ్ఞాపకానికి వస్తూంది. ఈ ఆటబొమ్మలు చిన్నపిల్లల సృష్టి అని అందరికీ తెలిసిన విషయమే. ఇది ఇల్లాగ ప్రారంభించినప్పటికీ క్రమంగా జనసామాన్యం అవలంబించే కళగా మారింది. ఇప్పుడు ప్రతిదేశానికీ ఆదేశానికి ప్రత్యేకమైన ఆటబొమ్మ లున్నాయి. అల్లాగే మన ఆంధ్రదేశానికి కూడా ప్రత్యేకమైన బొమ్మల సంప్రదాయం ఉంది. తిరపతి చందనపు బొమ్మలు, పెందుర్తి మట్టి బొమ్మలు, కొండపల్లి బొమ్మలు దీనికి ఉదాహరణంగా ఇవ్వవచ్చును. అల్లాగే జపానులో వాళ్లకి ప్రత్యేకమైన బొమ్మ లున్నాయి. ఇంతేకాదు: ఈ బొమ్మలని గురించి మనకి ఎల్లాంటి నమ్మకాలున్నాయో ఇంచుమించుగా వాళ్లకీ అల్లాంటి నమ్మకాలే ఉన్నాయి. పిల్లలు కావలిసిన స్త్రీలు కీటోలో ఒక పుణ్యక్షేత్రంలో అందరికీ బొమ్మలు పంచిపెడతారు. మరీ కొత్తతరాలకి చెందినవాళ్లు దిష్టిబొమ్మల్లాంటివి తయారుచేసి, చిన్నపిల్లల పీడవదలిపోవడానికోసం అవి వృద్ధస్త్రీలకు దానంచేస్తూంటారు. ఇవికాకుండా ఆడపిల్లలాడుకునే బొమ్మలు వేరుగా ఉన్నాయి. అవి సామాన్యంగా ఆడుకునే బొమ్మలనీ ఏవైనా ప్రత్యేక సందర్భాల్లో వాడుకునేవనీ రెండురకాలు. ఈ రెండోరకం బొమ్మల్లో చక్రవర్తినీ అతని పరివారాన్నీ, బుద్ధుణ్ణీ, అతని శిష్యుల్నీ చిత్రిస్తూ ఉంటారు. ఈ బొమ్మలన్నీ ప్రత్యేకంగా జాతీయ బాలికోత్సవాల్లో ప్రదర్శిస్తూ ఉంటారు. ఇది సామాన్యంగా మే మొదటివారంలో వస్తూంటుంది. కొరియాలో ఈ చిన్నపిల్లల ఉత్సవం బుద్ధదేవుని జన్మదినోత్సవంతో కలిసి ఏప్రెలు మొదటివారంలో వస్తుంది. ఈ ఉత్సవం జపానులో చాలా సుప్రసిద్ధమైన ఉత్సవం. ఇందులో కొరియా దేశీయులు 'బౌద్ధదారుమా' వంటి బొమ్మలు తయారుచేసి అమ్ముతారు. చిన్నపిల్లలంతా ఈ బొమ్మలు ఎంతో ఆప్యాయంగా కొనుక్కుంటారు. బొమ్మలుకొన్న తరవాత పిల్లలు వాటిని ఇంటికి తీసుకుపోయి, దేవతార్చన పెట్టెలో పెట్టి నైవేద్యము మొదలైనవిపెట్టి ప్రార్థనలు చేస్తారు. ఇంకా ఇల్లాంటివి అనేకమైన ఉత్సవాలున్నాయి. వీటికీ మనఉత్సవాలకీ చాలా దగ్గిర పోలిక లున్నాయి. ఇప్పుడు చెప్పిన ఉత్సవం మన నవరాత్రి ఉత్సవం వంటిది. జపానులో మే ౫వ తారీఖున వచ్చే ఉత్సవం మనబొమ్మలపండుగ లాంటిది. ఇది మనకిప్పుడు పట్టణవాసాల్లో అంతగా కనిపించడం లేదుగాని, పల్లెటూళ్లలో ఇంకా బాగా ప్రచారంలో ఉంది.

జపానులో బాగా అత్యున్నత స్థితికివచ్చినది నాట్యకళ. నాట్యంలోను, వేషాల్లోను, నాట్య అభివ్యక్తిలోను, అహ్లాదకరత్వంలోను దాన్ని ఏమహానాటకరంగాలతోనైనా పోల్చవచ్చును. నాటకంలో

వచ్చే పాత్రల్లోను, నాటక నిర్మాణంలోను వాళ్లల్లో ఒక విశిష్టమైన ప్రత్యేకత కనిపిస్తుంది.

జపానులో పదిహేనవ శతాబ్ది ప్రారంభంలో సారుగాకు అనే ఒక సంగీత విధానం ప్రారంభించింది. దానికి 'వానర సంగీతం'అని అర్థము. అందులో చిన్న చిన్న తమాషాలు, వేళాకోళం మాటలు, వాటికి తగిన అభినయాలు, ఉంటాయి. దీనినించే క్రమంగా జపాను నాటకం అభివృద్ధిచెందింది, జపానులో దీన్ని 'నో' నాటకం అంటారు.

ఈ 'నో' నాటకాలు సుమారు రెండువందల యాభై ఉన్నాయి. వీట్లల్లో ప్రధాన విషయాలు మతము బౌద్ధ ధర్మాలున్నూ. చిత్రవిచిత్రమైన వేషాలు వేసుకుని ఒక రకమైన సంగీతశ్రుతితో వీటిని అభినయిస్తూ ఉంటారు. వర్ణనాత్మకములు వ్యాఖ్యానాలు అయిన చిన్న చిన్న పాటలు తెరవెనకాల ఉన్న వాళ్లు పాడుతూ ఉంటారు. ఆ సంగీతం మెల్లిగా సామవేదంలా వినిపిస్తూ ఉంటుంది. జపానుసంగీతానికి దానికి స్వరాలు ఒకటే అని నేను విన్నాను. ఇంక నృత్యం కొంచెం వెనకాల ఉన్నవాళ్లకి ఒదిలివేస్తారు. వాళ్లు నేలమీద జీరాడే కుచ్చెళ్లతో అందంగా నృత్యం చేస్తూంటారు. నాట్యకవిత అంతా పద్యాల్లోనే ఉంటుంది. అక్కడక్కడ కొన్ని కథకి సంబంధించినవి—కొన్ని శాస్త్ర మర్యాదలు కూడా ప్రవేశిస్తూఉంటాయి. అయినా కథలు సామాన్యప్రజకి సులభంగా బోధపడడానికి వీలుగానే ఉంటాయి.

ఈ ప్రదర్శనమంతా ముందు 'ఓకినా' అనే ప్రార్థనతో ప్రారంభమవుతుంది. ఇది సూర్యదేవత నుద్దేశించిన ప్రార్థన. ఇది సరిగా మనం నాటకాలముందు చేసే ప్రార్థనలాగే వుంటుంది. నాటకాల్లో నటులు ఆయా దేవతలకు అనుకూలమయిన దుస్తులు ధరించి ఉంటారు. ఈ నటులకు సంగీతపాఠకులు సహాయంచేస్తూ ఉంటారు. వారు నాట్యరంగానికి ఆ మూలా, ఈ మూలా కూర్చుని ఉండి మురళిమీద, మృదంగం వంటి మరియొక వాద్యంమీద, 'ఓకావా' అనే అంతకంటె పెద్దవాద్యం మీద వాయిస్తూ ఉంటారు. ఈ 'నో' నాటకాలకీ మన నాటకాలకీ అన్ని విషయాలలోను చాలా దగ్గిర సంబంధం ఉంది. మనవీ వారివీ సామాన్యంగా మతానికి సంబంధించిన ప్రదర్శనాలు. దీనివల్ల జపానీయులలో మంచి మతవిశ్వాసమూ, బౌద్ధ జీవిత గాథలలో భక్తీ కుదురుకున్నాయి. జపానులో సాంఘిక నాటకాలు చాలా తక్కువ. సినిమాలు రేడియోలు మొదలయిన అనేక పాశ్చాత్య రూపకాలతో పరిచయం కనిపిస్తూన్నా జపానువారికి ఈ 'నో' రూపకాలమీద ఆప్యాయం తగ్గలేదు.

ఈ రోజుల్లో జపానులో మన రామలీల వంటివి, ప్రజానాట్యోత్సవాలు కూడా ఉన్నాయి. సారళ్యము ఈ రెండిటిలోను ఉండే సమానధర్మము. ఎన్నివిధాల చూచినా జపాను నాటకాలకీ మన నాటకాలకీ చాలా దగ్గిర పోలికలే కనిపిస్తాయి.

జపానువారి నృత్యంకూడా వారి నాటకాలలాగ చాలా ప్రాచీనమైనది. ప్రాచ్యదేశాలలో నృత్యం చరిత్ర అత్యంత ప్రాచీనమైనది. క్రీ. శ. ౫౪౦ లో వెయ్యి పై నాకుటుంబాలు జపాను వలసవెళ్ళాయి. అప్పుడు అవి తమతో కొన్ని దేశీయనృత్యాలు తీసుకొని వెళ్ళి ఉండవచ్చునని ఊహించవచ్చును. మళ్ళీ క్రీస్తుశకం ౫౫౨ లో ఒక కొరియా చక్రవర్తి జపానుకి బౌద్ధ భిక్షువుల్ని పంపించాడు. ఆ బౌద్ధ భిక్షువుల మతసంప్రదాయంలో నృత్యంకూడా ఒక భాగంగా ఉండేంది. కన్ఫ్యూషియస్ అనుచరులు చైనాలోను, కొరియాలోను ఆరు నెలల కొకసారి అంగప్రత్యంగాలతో ఈ ప్రాచీననృత్యాలు చేస్తూంటారు. ఆ తరవాత కొంత కాలానికి 'నో' నాటకాలలో కొంత కొత్తదనం ప్రవేశపెట్టబడింది. దాంతో నృత్యానికి లలితకళలో చాలా ప్రాముఖ్యం వచ్చింది. కాని ఈ కొత్తనృత్యం పాశ్చాత్యనృత్య పద్ధతులవల్ల కొంచం మార్పుచెందింది. ౧౯ వ శతాబ్దంలో ప్రాచీననృత్యం మళ్ళీ అభివృద్ధికి వచ్చింది.

కొత్తగా జపాను వెళ్ళిన వాళ్లకి అక్కడ కనిపించే చెర్రీ పుష్పాలు, గీసాస్త్రీల మనోహరాంగ

# జపానుకళలో భారత సంప్రదాయాలు

సౌకుమార్యము మనస్సులని ఆకర్షిస్తాయి. ఈ నృత్యాలు గీషాస్త్రీలేకాక ఇతరులు కూడా చేస్తాంటారు. 'నో' రూపకాలలో ఈ నృత్యావసరం చాలా ఉన్నదని అనుకున్నాము. 'కాబుకి' అనే ప్రాచీన నాట్యంలో కూడా నృత్యావసరం ఉంది. ఒక సుప్రసిద్ధనటుడు నృత్యచాతుర్యంలేని నటుడు బలంలేనివస్తాదు వంటివాడు అన్నాడు.

ఇంకా కొన్నికొన్ని పుణ్యస్థలాల్లో కన్యకలు 'కాగురా' అనబడే పవిత్ర నృత్యాలుకూడా చేస్తాంటారు. ఈ నృత్యాల్లో నర్తకులు వివిధములయిన అంగవిన్యాసాలద్వారా ప్రేక్షకులకు తమ అభిప్రాయాలు వ్యక్తీకరిస్తూ ఉంటారు. ఉదాహరణకు, విసనకఱ్ఱ మెల్లిగా విప్పుతూ నృత్యంచేస్తూంటే అది ఉదయ సూర్యుణ్ణి సూచిస్తుంది. అలాగే మూసివేసిన విసనకఱ్ఱ ధనుస్సు మొదలయినవాటిని సూచిస్తుంది. ఆ విసనకఱ్ఱ గబగబా విప్పుతూ మూస్తూంటే వర్ష ప్రవాహం సూచించవచ్చును. ఇవ్వీ ఇంకా అనేక విధములైన నృత్యభంగిమలు పరీక్షిస్తే దానికీ, భరత నాట్యానికీ చాలా దగ్గిరపోలిక లున్నాయని తెలుస్తుంది. మన భరతనాట్యంలో ముద్రలు మొదలయిన వానివల్ల ఒక ఆదర్శభావం వ్యక్తీకరిస్తాము. జపాను నర్తకులుకూడా తమ నృత్యానికి ఆదర్శసౌందర్యం కలిగించాలనే చూస్తూ ఉంటారు. దీన్నిబట్టి మనకూ జపానుకూ కూడా అనేకవిషయాల్లో పోలిక లున్నాయని చెప్పవచ్చును.

జపాను చిత్రకళనిగూర్చి వ్రాస్తూ తేనీటి సంప్రదాయాన్నిగూర్చి కొంత వ్రాశాను. దాన్నిగూర్చి ఇప్పుడు కొంచెం విస్తరించి వ్రాస్తాను. ఇది జపానులో చాలాకాలంనించి వస్తూన్న సంప్రదాయము. ఇది ధ్యాన బౌద్ధ సంప్రదాయంలోనించి బయలుదేరింది. అసలిది ఆహారము, తేనీరు మొదలైనవి తయారుచేసే విషయాల్లోకూడా సౌందర్యదృష్టి ఉండాలనే లక్ష్యం మీద బయలుదేరింది. ఈ తేనీరు తాగే ఆచారానికి జపానుభాషలో 'చనోయు' అని పేరు. అంటే మర్యాదానుసారంగాను, ఆనందంగాను, అతిథులను సత్కరించడం అన్నమాట. ఈ తేనీరు తాగడం సంగ్రహంగా ఈ కిందివిధంగా జరుగుతుంది. సామాన్యంగా అతిథులని సత్కరించే గది తొమ్మిది అడుగుల వైశాల్యం గలదిగాగాని, అంతకంటె తక్కువ వైశాల్యం గలదిగాగాని అయిఉంటుంది. ఇందులో అలంకారాలుంచుకోవడానికి అనుకూలమైన ఒక అలమారుగాని, టీ కాచడానికి తగిన పొయ్యిగాని ఉంటుంది. పొయ్యి భూమిలోకి అమర్చబడిఉంటుంది. ఆ గదిలోకి ఒక ప్రవేశం ఉంటుంది. దాని వైశాల్యం మూడు చదరపు టడుగులకు తక్కువగా ఉంటుంది. ప్రతీ అతిథీ అందులోంచి అతివినయంగా లోపలికి ప్రవేశిస్తాడు. సామాన్యంగా అతిథులు ఆగదిలోకి రాకపూర్వమే కాళ్లూ, చేతులూ కడుక్కుంటారు.

ఇంతవరకూజపానులోని వివిధకళలనిగురించి సంగ్రహంగా మాత్రమే వ్రాయడానికి వీలైంది. ఇక్కడ ప్రతి చిన్నవిషయాన్నిగురించి సవిస్తరంగా వివరించడానికికూడా వీలులేదు. కాని ఈ వ్రాసినదాన్నిబట్టి భారతీయకళకూ జపానుకళకూ ఉన్న సన్నిహిత సంబంధం బోధపడుతుంది. నిజం ఆలోచిస్తే భారతీయకళవల్ల జపానుకళలో గట్టిమార్పు వచ్చిందని చెప్పవచ్చును. ఆసియా ప్రాచీనకాలంలో ఒకేఖండంలా ఉండేది. అప్పుడు ఈరోజుల్లో ఉన్నంత పెద్ద పెద్ద విభాగా లేమీ లేవు. ఒక దేశాన్నించి ఇంకొక దేశానికి వాణిజ్యం బాగా సాగుతూ ఉండేది; ఆధ్యాత్మిక భావాలుకూడా అతివేగంగా ప్రసరిస్తూ ఉండేవి. అందుచేత ఆరోజుల్లో ఆసియాఖండాని కంతటికీ ఒకే విధమైన కళాశైలి ఉండేదనీ, భారతదేశంలో ఆశైలి మొట్టమొదట ప్రారంభించినదనీ చెప్పవచ్చును. మొట్టమొదట ఆసియాఖండంలో బౌద్ధమతం వెల్లువలై ప్రవహించినపుడు భారతదేశకళ క్రమక్రమంగా చైనా, మంచూరియా, కొరియా దేశాల్లో వ్యాపించింది. ఆపైని క్రమంగా ప్రాగ్భారత ద్వీపాలకీ, జపానుకీకూడా వ్యాపించింది. మొట్టమొదటి రోజుల్లో ఉత్సాహవంతులైన చిత్రకారులకు బుద్ధుని జీవితంలోను, జాతకకథల్లోను అనేకమైన చిత్రవిషయాలు గోచ

రించేవి. అదీగాక బుద్ధ బోధిసత్త్వుల మనోభావాల్లో కలిగే మార్పులన్నీ చిత్రించడంవల్ల అనేకవిధమైన ప్రతిమలు తయారుచెయ్యడానికి వీలయేది.

ఆతరవాత క్రమంగా ఆసియాఖండ దేశాల శైలిలో ప్రత్యేకత్వం వ్యాపించింది. చిత్రకళకి సంబంధించిన ఆరులక్షణాలు మొట్టమొదట చైనాలో వ్యాపించి, క్రమంగా జపానులోకి వెళ్లాయి. ఇవి మొదట భారతీయుల దగ్గిరనించే చైనాకి ప్రయాణం చేశాయి. ఇక్కడ చిత్రలక్షణాలనిగూర్చి ప్రత్యేకంగా చర్చించడానికిది సమయంకాదు. కాని జపానీయ చిత్రకళలోను, చైనీయ చిత్రకళలోను, భారతీయ కళా ప్రభావం బాగాపడిందనీ, క్రమంగా కాలానుసారంగా ఆ ప్రభావం అనేకమైన మార్పులు చెందిందనీ చెప్ప వచ్చును. ఈవిధంగా జపాను భారతదేశ సంప్రదాయాలు రెండూ ఒకే సంప్రదాయానికి చెందిన విషయం రుజువుచేస్తున్నాయి. ఆ తల్లిసంప్రదాయం అనేకమంది చిత్రకారులద్వారా రెండువేల ఏళ్లవరకు అవిచ్ఛిన్నంగా ప్రవహించింది. అసలు ఈ మాతృ సాంప్రదాయం మధ్యాసియాలో జన్మించింది. అది అనేకవిధాల మారుతూ ఒక బలమైన శక్తితో భారత జపాను దేశాల కళకి బలం చేకూర్చింది.

ఈవిధంగా ఈ ఆసియా సంప్రదాయం పరిశీలిస్తే, జీవితంలో ఏకత ఉన్నట్లే కళలోకూడా ఉన్నదని బోధపడుతుంది. ముందుముందుకూడా ఇరుగుపొరుగు వారమైన మనం ఈకత ఏనిలబెట్టుకోగలమని ఆశిస్తాను.





అబిసీనియనుల బాధలు

శ్రీ పి. దాస్ గుప్తా

# నా కవిత్వం

## శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు

కిందటిసారి మాట్లాడి వదలిపెట్టిన చోటినుండి ప్రస్తుతపు నా ప్రసంగాన్ని ప్రారంభించడానికి ముందు——

సరే ఈ వాక్యాన్ని పూర్తిచెయ్యడం ఎందుకు. ఎలాగూ శ్రోతలు నేను చెప్పబోయేదాన్ని వినబోతున్నారు కదా——

ఒక వాక్యాన్ని పూర్తిచెయ్యకుండా ఇంకో వాక్యాన్ని ప్రారంభించకూడదు. నిజమే! కాని ఒక్కొక్కప్పుడు వాక్యం పూర్తికాకముందే వక్తవ్యం పూర్తిఅయిపోతుంది. అటువంటప్పుడు వ్యాకరణ మర్యాదను పాటించడానికి వ్యర్థ పదాలను వాడవలసివస్తుంది. మనమర్యాదలు చాలావరకు ఇలాంటివే. ఓహో! మీరా? బాగున్నారా? ఉద్యోగం? పిల్లలు? ఇందులో ఒక్కటీ మనస్ఫూర్తిగా పలికేది కాదు. అయినప్పటికీ ఎదటివాణ్ణి సంతోష పెట్టడానికి ఈ మాటలు అనితీరాలి. ఎదటివాడు కనుచాటు కాగానే పీడవదిలింది అనుకున్నా సరే.

వాక్యంలాగే పద్యం. పద్యానికికూడా కొన్ని మర్యాదలున్నాయి. వాటిని సంతృప్తిపరచుకుంటూ కవి నిశ్చింతగా బతకవచ్చును. నే నెరిగిన ఒకాయన కవిత్వం అంటే చెవికోసుకుంటాడు. అంటే - అదే కవిత్వం అంటే ఆయనకు చాలా అభిమానం. చక్కని గొంతుకతో సాఫీగా పద్యాలు చదువుతూ ఉంటే ఆయన ఒళ్లంతా కళ్లుచేసుకొని——చూస్తూ——కాదు, వింటూఉంటాడు. ఎక్కడైనా యతిపోయినా, ప్రాసజారినా, వ్యాకరణపు సీల ఊడినా——హఠాత్తుగా తేలుకుట్టినప్పటికన్నా ఎంతో బాధపడతాడు. ఇవన్నీ పద్యంయొక్క బాహ్య స్వరూపం అని ఆయనకి నచ్చచెప్పడానికి నేను చాలా ప్రయత్నించాను. గొప్పకవులు తాము చెప్పినదానికంటె చెప్పకుండా వదలిపెట్టినచోట్ల అమూల్యమైననిధులు దాస్తూ ఉంటారన్నాను. ఆయన ఒప్పుకుంటేనా? నేను చెప్పేది "కేవలం రజ్జుసర్పభ్రాంతిరా అబ్బాయీ!" అనేస్తాడు. (నా కంటె ఆయన నాలుగయిదేళ్లు పెద్ద-అదీ వొచ్చిన ఇబ్బంది) 'తాతగారూ! సర్పరజ్జు భ్రాంతికికూడా అవకాశం అందులోనే ఇమిడిఉంది సుమండీ' అని నాకు అనాలని అనిపిస్తూ ఉంటుంది.

ఇంతకూ కవిత్వం గురించి ఇదమిత్థమని ఎవ్వరూ చెప్పలేరు. కవిత్వం ఒక జబ్బు. అది పడ్డవాడికేదాని సంగతి తెలుస్తుంది. అదయినా పూర్తిగాకాదు. ఆ జబ్బుపడి దానితోనే కొందరు మరణిస్తారు. అటువంటి వారిని స్మరించి నాతలను నమ్రంగా వంచుకోవడంతప్ప ఇంకో అభినయం ఏదిచేసినా అంతకన్న అపచారం మరోటి ఉండబోదు.

కన్యాశుల్కంలో ఒకచోట కొంతమంది అజ్ఞానులు (లోకందృష్టిలో) సారాకొట్లో కూర్చుండి శాస్త్రచర్చ సాగిస్తారు. సృష్ట్యాదినుంచి మానవుణ్ని కలవరపరచిన సమస్యలనే వాళ్లూ చర్చిస్తారు. ఒకడు అడుగుతాడు. "ఆకాశంముందా? బూవిఁముందా" అని. మనవాళ్ళయ్య అనే ఒక సాతాని, "గణిత శాస్త్రంలో ఆకాశం బన శూన్యంబు అనగా ఏమీ లేదన్న మాట" అని జవాబిస్తాడు. వీరేశ అనే జంగానికి కోపంవస్తుంది. "ఏటీలేదా గుడ్డోళ్ళకి ఏటీలేదు" అంటూ "ఉన్నది" అనే భావానికి కొన్ని ఉపపత్తులు

చూపిస్తాడు. కొంతసేపు ఈ అస్తినాస్తివిచికిత్స సాగుతుంది. మనవాళ్ళయ్యకి తాత్కాలికంగా వాగ్బంధం అవుతుంది. విజయసూచకంగా వీరేశ శంఖం పూరిస్తాడు. అక్కడ ఓమూల "తపస్సు" చేసుకుంటూన్న "గురూజీ"కి కోపం వస్తుందని దుకాణదారు యుద్ధ విరామ సంధి చేయిస్తాడు. చర్చ మళ్ళీ సాగిపోతుంది. ఈ సారి సాక్షాత్తూ శివవిష్ణువులే చర్చనీయవిషయాలవుతారు. "ఎందుకు పోట్లాట భాయీ! నీ శివుడూ నిజమే. అదుగో ఆ సీసాలో వెలుగుతున్నాడు. నీ విష్ణువూ నిజమే. ఇదిగో ఈ సీసాలో వెలుగుతున్నాడు" అనేవాక్యాలతో మళ్ళీ రాజీ కుదర్చబడుతుంది.

ఆధ్యాత్మిక జిజ్ఞాసలోవలె రసస్వరూప వివేచనలో కూడా ఇలాగే సిద్ధాంత పూర్వపక్షాలూ, కరణ వ్యతికరణ సమీకరణలూ తప్పవు. ఈ చర్చ అనంతమే కాదు అనాద్యంతంకూడా. ఎవరిమట్టుకువారు ఈ చర్చలో పాల్గొని ఎవరి శక్తిసామర్థ్యమెనది వారు సమర్పిస్తూ ఉంటారు.

> నేను సైతం
> ప్రపంచాగ్నికి,
> సమిధ నొక్కటి ఆహుతిచ్చాను.
> నేను సైతం విశ్వవృష్టికి
> అశ్రు వొక్కటి ధారపోశాను
> నేను సైతం భువనఘోషకు
> వెర్రిగొంతుక విచ్చి మ్రోశాను.

నామట్టుకు కవిత్వం ఒక ఎడతెగని అన్వేషణ. నా జీవితంకూడా అంతే. కవిత్వంలో జీవితాన్నీ జీవితంలో కవిత్వాన్నీ వెదుక్కుంటూ ఉంటాను. ఒక్కొక్కసారి ఏదో కనిపెట్టినట్లు సంతృప్తి కలుగుతుంది. కాని అది తాత్కాలికం మాత్రమే. అసంతృప్తిని దాచుకొని నేను ఆగిపోలేను. అది నాది కానేకాదని కూడా నా నమ్మకం. దాన్ని అందరి సమక్షంలో వదలిపెట్టి మళ్లీ నా గవేషణ మార్గంఅందుకుంటాను. ఒక్కొక్కప్పుడు నా పరిశీలన ఫలితాలు నాకిచ్చినంత ఆనందాన్ని నలుగురికీ ఇవ్వకపోవచ్చును. అయినా ఆ ఫలితాలను అందరియెదుటా ఉంచవలిసిందే. ఈ సందర్భంలో నేనొక సంగతి స్పష్టం చెయ్యాలి.

అది కవిత్వం కానివ్వండి, గణిత శాస్త్రం కానివ్వండి, చిత్రలేఖనం కానివ్వండి. వైద్య శాస్త్రం కానివ్వండి—వీటన్నింటిలో రెండేసి రకాలుంటాయి. Pure and applied అనేవి. Pure Art, Applied Art, Pure Science, Applied Science ఈ విధంగా.

ఇది ఇంకా స్పష్టంచెయ్యాలంటే—కవిత్వం ఉంది. దీనిలో Pure Poetry శుద్ధ కవిత్వం, కేవలకవిత్వం, అకల్మష కవిత్వం కవిత్వం తప్ప మరేదీకాని, మరి దేనితోనూ కలుషితం కాని కవిత్వం ఒకటి. Applied Poetry ఇంకొకటి—అనగా ఉపయోగ్య కవిత్వం', వ్యవహార కవిత్వం.

తానుతప్ప మరేదీ కాని కవిత్వం బ్రహ్మపదార్థం వంటిది. అది కవుల అన్వేషణకు లక్ష్యం. అది ఎన్నడూ, ఎక్కడా దొరకకపోయినా దాన్ని వెదకడాన్ని మానడానికి వీలులేదు. ఈ అన్వేషణ మార్గంలో కవిని నిరాశ ఎదుర్కోవచ్చు. అశాంతి ఎదుర్కోవచ్చు. అయినా యాత్ర సాగవలసిందే.

> పోనీ పోనీ
> పోతే పోనీ
> సతుల్ హితుల్ సుతుల్ పోనీ
> పోతే పోనీ
> రానీ రానీ
> వస్తే రానీ
> కష్టాల్ నష్టాల్ కోపాల్ తాపాల్
> శాపాల్ రానీ
> వస్తే రానీ
> తిట్లూ రాట్లూ పాట్లూ రానీ
> రానీ రానీ

# నా కవిత్వం

కానీ కానీ గానం ధ్యానం
హాసం లాసం
కానీ కానీ
కళారవీ, పవీ, కవీ.

కాని ఈ పరిశోధనాలయంలో పనిచేసే కవిమీద నేనొక షరతు విధించక మానలేను. నీ ఫలితాలు నీ ఒక్కడివీ కావు. వాటికి సాంఘిక ప్రయోజనముంది. వాటిని ఉపయోగించుకొనే హక్కు సంఘానిది. సంఘంచేతిలో అది Applied Poetry అవుతుంది. వెనకటి Applied Poetry అంతా, నీ అనంతర పరిశోధనలకు ముడిసరుకు. కవిత్వాన్ని నీ సొంత ఉపయోగాలకు వాడుకుంటే కవిత్వానికే నువ్వు ద్రోహం చేస్తున్నావన్న మాట.

ఇది సామాన్యమానవుని యుగం. కాని, సామాన్య మానవుడంత అసామాన్య మానవుడెవడూ లేడు. సామాన్య మానవుడంటే ఎవరు? నువ్వూ, నేనూ, వాడూ, వీడూ, అంతమందీ. ప్రతి సామాన్య మానవుడూ ఒక ప్రత్యేకమానవుడు కూడా. ఈ ప్రత్యేకత్వం చాలా అమూల్యమైనది. దీన్ని గుర్తించుకోవడం, పెంపొందించుకోవడం ఇదే జీవితానికి సార్థకత.

కవి ఒక ప్రత్యేక మానవుడు. అతనికొక విశిష్టత్వం ఉంది. ఒక వ్యక్తిత్వం ఉంది. అది తనదితప్ప మరెవ్వరిదీ కానిది. అతడు దానిని గుర్తించుకోవాలి. అదొక వింతగొంతు. అది మరెవ్వరి గొంతుకవంటిదీ కాదు. చీకటిలోకూడా అతనిదే అని పోల్చుకోదగినది. అందుకే ఇద్దరూ సీసపద్యమే వ్రాసినా ఇది తిక్కనపద్యం, ఇది శ్రీనాథుని పద్యం అని మనం పోల్చుకోగలం. ఆయా పద్యాలమీద తిక్కన శ్రీనాథులు తమ తమ సంతకాలను స్పష్టంగా చెక్కినట్లుగా మనకు సంస్ఫుటం అవుతాయి. వాటికీ వాటి క్షుద్రప్రతిబింబాలకీ ఎంత భేదమైనా ఉంటుంది. తజ్ఞులైన విమర్శకులు సునాయాసంగా ఈ విభేదాన్ని పోల్చుకోగలరు. ప్రతికవి రాసిన పద్యానికీ, అందులోనే ఒక ఆంతరంగికసాక్ష్యం ఉంటుంది. కవి విమర్శకుణ్ని మోసగించలేడు.

నా కవితాయాత్ర యావత్తూ ఇలా సొంత గొంతుకను వెదుక్కునే ప్రయత్నమే అని చెప్పవచ్చును. అయితే నే నొప్పుకుంటూన్న ఈ నిజాన్ని రెండుగా విశ్లేషించి ఒకభాగం technique కి సంబంధించినదీ ఇంకోభాగం content కి చెందినదీ అని వెల్లడిస్తేనే తప్ప దీనివిషయమై సవిస్తరంగా వివరించడానికి వీలు పడదు. బహుశా నన్నెదుర్కొన్న సాంకేతిక సమస్యలు (Technical Problems) సామాన్య పాఠకుల ఉత్కంఠను రేకెత్తించక పోవచ్చును. కాని ప్రతికవికీ తాను చెబుతూన్న విషయం (Matter)తో పాటు చెప్పేవిధానం (Manner)కూడా ఉంటుంది. చాలామందికి ఈ విధానంమీద అట్టే నిఘా ఉండదు. జనసామాన్యం మాట అలావుండగా పూర్వకవులను గతానుగతికంగా అనుకరించే సామాన్య కవులలో కూడా ఇట్టిదృష్టి మృగ్యమే. మిగిలిన అలవాట్లలాగే పద్యాలు వ్రాయడంకూడా ఒక అలవాటుగా వీళ్లకి పరిణమిస్తుంది. పద్యరచన అంటే కేవలం ఛందో నిబంధనలను శిరసావహించడం కాదు.

విషయానికి సంబంధించిన వివేచన సాగించడంలో కవిత్వం అంటే ఏమిటి? అనే ప్రశ్న వేసుకుంటాము. విధానంగురించి ఆలోచించేటప్పుడు కవిత్వం అంటే ఎట్లు? అనే ప్రశ్న బయలుదేరుతుంది, కాని, విమర్శన సౌలభ్యంకోసం మాత్రమే ఈ విభజన చెయ్యడంతప్ప విషయాన్నీ విధానాన్నీ ఒకదానినుండి ఒకటి వేరుచెయ్యలేము

# దిబ్బ ప్రభువుగారితో ఇంటర్వ్యూ

## శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

సాయంకాలము అయిదుగంటలకు ప్రభువుగారి దర్శనం అవుతుందని కోటనుంచి నాకు కబురొచ్చింది. నా మామూలు దుస్తులతోనే ప్రభువువారిని దర్శించటానికి అనుమతి వచ్చిందిగాని శ్రీ వారికి అథమం మూడు శ్రీలైనా తగిలించక తప్పదని ఉత్తరువయింది. విప్లవకవుల దగ్గిర్నుంచీ రెండేసి శ్రీలు తగిలించుకున్నారు గనుక నున్నున్ననూ, కథల్లో బోడెమ్మలకు సహితం రెండేసిశ్రీలు ఉంపింపించబడుతున్నాయి గనుక నున్నున్ననూ నేను శ్రీ వారిని శ్రీ శ్రీ శ్రీ వారనక తప్పదని కోటవారు నాకు తెలియబరిచారు.

శ్రీ వారు, తోటలో నన్ను ఇంటర్వ్యూ చేస్తారని తెలిసింది. నాకు తోటకన్న శ్రీ వారే ముందవుపించారు. ఇంతకూ నాకు తోట అవుపించనేలేదు. ఒకపక్కగా వెడలుపైన ఆకులుగల మొక్క ఒకటి కనిపించింది. అక్కడక్కడ ఎండిపోయిన మొక్కలు పొదలుపొదలుగా కనిపించాయి.

"ఇదేనా శ్రీ శ్రీ శ్రీ వారి తోట?" అన్నాను.

"ఇంకా ఉన్నాయి. కాని అన్నిటిలోకీ ముఖ్యమైనదిదే." అన్నారు శ్రీ వారు, దక్షిణంగానూ, తూర్పుగానూ ఉన్న చెట్ల సముదాయాలు చూపుతూ. ఆ తోటలు పెద్దపెద్ద చెట్లతో కూడిఉన్నాయి. చూడటానికి తోటలంటే నమ్మశక్యంగా ఉన్నాయి. శ్రీ వారు నా సందేహం తీర్చారు:

ఈ తోట మా ముత్తాతగారు దుక్కప్రభువుగారు వేసినటువంటిది. ఇవన్నీ అప్పుడు వారిచేత్తో వేయింపించిన మల్లెతోటలు...ఆహా! మల్లెల సౌరభం ఆ కాలంలో చూడవలసింది! జగ్గకవిగారు ఈ తోటలో మల్లెల్నే వర్ణించి, సురలోకంలో ఉండుకున్నటువంటి పారిజాతాలు పీటితో పోలవని స్పష్టంగా చెప్పారు. మహాకవి!"

"శ్రీ శ్రీ శ్రీ వారి అభిప్రాయంలో మల్లెలకు రానురాను వాసన తగ్గుతోందనా?" అని అడిగాను ఆశ్చర్యంతో.

"అందుకు సందేహం ఏమీ లేదు. అన్ని పూలకీ వాసన తగ్గుతోంది. మనుషులంతా నీరసించిపోతున్నట్టే. మీలాగా పాశ్చాత్య సంస్కారంగల వారీ సత్యాలని నమ్మరు."

"శాస్త్రీయమైన ఆధారం ఉంటే—"

"లేకేం ఉంది. మల్లెపూలే తీసుకోండి. ప్రపంచంలో అన్నిటికీ ఏదో పరిమితి ఉంటుందని ఒప్పుకుంటారా?"

"ఒప్పుకుంటాను."

"అయితే మల్లెపూల సౌరభం పరిమితంగా ఉంటుందని మీరే ఒప్పుకుంటున్నారు. ఆ సౌరభం కొద్ది పూల నాశ్రయించినప్పుడున్న సాంప్రత అసంఖ్యాకమైనటువంటి పుష్పజాలానికి సంక్రమించే సరికి—"

"ప్రభువువారి అభిప్రాయం అర్థమవుతోంది. మనుషుల సంఖ్యకూడా హెచ్చినకొద్దీ వ్యక్తులు నిర్వీర్యులవుతారని తమ అభిప్రాయం కాదా?"

"అవును ఇరవయ్యో శతాబ్దమధ్యంలో పొట్టి పుట్టగొడుగుల్లాటి మనుషులు పుడతారనీ, వాళ్లు యుద్ధాలుచేసేటప్పుడు శత్రుసేనల మధ్య యోజనాల

కొద్దిదూరం ఉంటుంది తప్ప బాహా బాహీకచాచి యుద్ధం చెయ్యరనీ నేను ఘట్టిగా చెప్పగలను.''

''యుద్ధమంటే స్ఫురించింది—అడగదగిన ప్రశ్న అవునో కాదో తెలీదు— తమకూ సన్నం రాజుగారికీ యుద్ధం తప్పదని పుకారుగా ఉంది. ఇది ఎంతవరకు నిజమో సెలవివ్వటానికి శ్రీ శ్రీ శ్రీ వారికేమైనా అభ్యంతరం—''

''ఏమీలేదు, ఒక్కటే ముక్క చెబుతున్నాను. నేను శాంతి కోరేవాణ్ణి. నాకు యుద్ధాలంటే అసహ్యం. నా ప్రజల క్షేమమే నాకు కావలసింది. సన్నంరాజుగారు కయ్యానికి కాలుదువ్వుతాడు. నే నాయన ఎత్తులకు లొంగనని ఆయనకు తెలీదు. ఈ మధ్య తమ దూతను పంపి సన్నం రాజుగారు, నాకు ముప్పైవేల కత్తులు అవసరంగా కావాలి, రెండువేల గుర్రాలు కావాలి. ఇవి వెంటనే తమ కార్ఖానాల నుంచీ, అశ్వశాలల నుంచీ ఇప్పిస్తారా యుద్ధానికి వస్తారా ?'' అని కబురుచేశారు. 'కావలిస్తే అంతకు రెట్టింపు కత్తులిస్తానన్నాను గుర్రాలుకూడా ఇచ్చేస్తా నన్నాను, కాని యుద్ధానికి ఒప్పుకోలేదు. చూశారా నాయుక్తి ?''

నా గుండె ఎగిరి గొంతులో కూచుంది.

''ఇదంతా ఉచితంగానే—''

''లేదు; సన్నం రాజుగారి దగ్గిర చక్కని బాణా సంచా తయారుచేసే వాళ్లున్నారు. కత్తులు కొలవకీ, గుర్రాల విలవకీ సరిపడా బాణాసంచా పంపు మన్నాను.''

''అడుక్కుతిన్నట్టే ఉంది నీ తెలివి.'' అని లోపల అనుకుని, పైకి, ''దారితప్పి యుద్ధం జరిగితే ఆత్మ రక్షణ సన్నాహా లేంచేస్తారు ?''

''ఏముందీ చెయ్యటానికీ ? నా మాట శిరసావ హించే నా బిడ్డల్లాటి ప్రజ ఉన్నారు. వాళ్లు చచ్చ యినాపోతారు గాని ఓటమికి ఒప్పుకోరు.''

''క్షమించండి. మీ ఏలుబడిలో సస్యసమృద్ధి చాలా తక్కువగా ఉన్నట్టు కనిపించింది. అనేక చోట్ల నీటివసతులులేక పంట ఎండిపోతున్నాయి. చెరువుల్లో పూటు తీస్తున్నట్టు కనిపించదు. ఆహార సమృద్ధిలేని ప్రజలు యుద్ధం చెయ్యగలరా ?''

''పిచ్చివాడా, శరీరబలంతో పోరే వాడేం పోర గలడు ? దైవబలం ఉండాలి. చెరువుల విషయమూ, పొలాల విషయమూ నే నంగీకరిస్తాను. కాని ఏం చెయ్యనూ ? నేనాట్టే ఖర్చుదారును కాను. నాకు సరిపడా రాబడి ఉంది. ఉన్న పొలాలన్నీ బాగు చేయించి పండించి ఆ పంటంతా ఏంచేసుకుంటాం ?''

''తమ యేలుబడిలో అందరికీ తిండి సమృద్ధిగా ఉందా? తిండికి మాడే ప్రజలున్నట్టు కనిపిస్తారే ?''

''పనిచెయ్యనివారికి తిండిలేదేమోగాని పనిచేసే వారందరికీ కడుపునిండా తిండి ఉంది.''

''పనిలేని వాళ్లకి సాగుబడిచెయ్యని పొలాలివ్వ రాదా ? చెరువులు బాగుచేయించరాదా ?''

''నాకీ రాబడి చాలునని చెప్పానుగా! నేను కొందరు కొందరు రాజుల్లాగ ఖర్చుదారును కాను. నారాబడి ఇంకా తగ్గిపోయినా నేను సుఖంగా బతక గలను. అందుచేత కొన్ని పొలాలు బీడుపెట్టేయిద్దా మనుకుంటున్నాను.''

''మరింత మంది తిండికిమాడి చావరా ?''

''నా పొలాలు నేను బీడుపెట్టటానికి ఒకరి ఆజ్ఞ కావాలా ?'' అన్నారు ప్రభువువారు కళ్లెర్రజేసి.

''క్షమించాలి, ప్రభువులు. నేను చెప్పిందేమంటే ప్రజలు తమ నిర్ణయాన్ని అంత నయంగా ఆమోది స్తారా అని.''

''వాళ్లు దైవభక్తిపరులు. భగవంతుడిస్తే దొరుకు తుందనీ, లేకపోతే లేదనీ వాళ్లెరుగుదురు.''

''వాళ్లకి విద్యాసౌకర్యా లేవిధంగా ఉంటాయి తమ ఏలుబడిలో.''

# ఆంధ్రశిల్పి

"విద్యలో నాకు విశ్వాసం లేదు. శరీరంవొంచి కష్టించే ప్రజలు చదువు మరిగితే పనిచెయ్యరు. కవిత్వాలు చెప్పి కానుకలు గుంజుతారు. నాకు కవిత్వమంటే మంట. వచనం అర్థమయినంత సులువుగా మనకు ఎప్పుడన్నా పద్యం అర్థమవుతుందా? అదీ కాక చదువుకోవాలంటే ఇప్పటికే ఎన్నో మహాగ్రంథాలున్నాయి. ఒక్క భారతం చాలదా జన్మల్లా చదవటానికి. నేను పదిహేనేళ్ళ నుంచీ చదువుతున్నాను, ఆరణ్యపర్వం అవకుండా ఉంది. భారతం తెరిచేసరికి నాకు బ్రహ్మానందమై సుషుప్తి కలుగుతుంది. మహాకావ్యం! మహాకావ్యం!"

"తమ యేలుబడిలో పరిశ్రమ లెట్లా ఉన్నాయి?"

"ఉన్నాయి. ఫరవాలేదు. వడ్రంగులూ, కమ్మరవాళ్లూ, సాలెవాళ్ళూ ఉన్నారు. ఇకేం కావాలి?"

"సన్నంరాజుగారి పరిపాలనలో పరిశ్రమలు బాగా సాగుతున్నాయని విన్నాను?" అంచుచేతనే అతన్ని బొమ్మనుచేసి ధనికులంతా ఆడిస్తున్నారు. మళ్ళీ ఎక్కడా అనకండి; సన్నంరాజును నా మీదికి ఉసికొల్పే వాళ్లు పారిశ్రామికులే. వాళ్లకి మా రాజ్యంలో ఉండే ఇనపమట్టి కావాలి. నారాజ్యంలో తయారయే కత్తులన్నీ ఇమ్మన్నా ఇస్తానుగాని ఆ ఇనపమట్టి సన్నంరాజుకి దక్కనిస్తానా? మా తాతగారు చెబుతుండేవారు: ఆ మట్టిలో కోటానకోట్లు కత్తులున్నాయని. అమ్మా? నేనేం వెర్రికుట్టెనా?"

విన్న సంగతులతో నాకు మొహం మొత్తింది. నేను సెలవు పుచ్చుకోవటానికి ఉపక్రమిస్తూండగా నాకన్ను ఆ తోటలో ఉన్న ఒక్క మొక్కమీద పడింది. అదే తోటలకల్లా మహోన్నతంగా ఉంది.

"ఇదేం వృక్షమో తెలుసుకోవచ్చునా?" అన్నాను.

శ్రీవారు నవ్వి, "విత్తు దొరికినప్పుడు నాకు అదే సందేహం కలిగి నాటిమాశాను. చెట్టు పెరిగాక అది ఆముదపు చెట్టని శాస్త్రవేత్తలు చెప్పారు" అన్నారు.

"తమరు ఈ తోటలో మరికొన్ని చెట్లుకూడా వేయిపించలేకపోయారా?" అన్నాను.

"వేయించాను, కాని అవి దీన్నిమించి పెరగాయి, అంచేత కొట్టింపింపించ వలిసొచ్చింది," అన్నారు శ్రీవారు ఆముదపు చెట్టువేసి గర్వంగా చూస్తూ.



# పాకిస్థాన్ నిజస్వరూపము

## శ్రీ జి. సుందర రెడ్డి

[వెనుకటిసంచిక తరవాయి]

పాకిస్థాన్‌లో ఆదాయాభివృద్ధికి ఏమైన వీలున్నదా? దానిని గురించి గూడ మన మిచ్చట ఆలోచించెదము. ప్రపంచములోని అన్ని ప్రభుత్వాలకి ఎక్కువ ఆదాయముపడి పరిశ్రమల (Industries) ద్వారా వస్తున్నది. ఇప్పుడు ఏయే దేశాలలో పారిశ్రామికాభివృద్ధి లేదో, కృషి ప్రధాన దేశాలుగా ఉన్నవో ఆ దేశాలన్ని చాల వెనుకబడి వున్నవి. అంతేగాక కృషి ప్రధాన దేశాలన్ని పారిశ్రామికంగా అభివృద్ధిఅయిన దేశాలకి బానిసలుగా నున్నవి. చైనా, ఈజిప్టు, దక్షిణ ఆఫ్రికా, దక్షిణ అమెరికా భారత దేశాల ఉదాహరణలు మన ఎదుట ఉన్నవి. ఒక్క వ్యవసాయాభివృద్ధివలన పాకిస్థానాన్ని ప్రపంచములో ప్రథమశ్రేణికి జెందిన దేశాలతో సమానముగా జేస్తామనడము హాస్యాస్పదము. పాకిస్థాన్‌లో వ్యవసాయాభివృద్ధికి పొలముయొక్క విస్తీర్ణముగూడ ఎక్కువ లేదు. పాకిస్థాన్‌యొక్క ఉత్తర పశ్చిమప్రాంతాల పరిశ్రమలస్థితి అందరకు తెలిసినదె. బెంగాల్ అస్సాములను తీసుకుంటే అస్సాంలో ముసల్మానులు మెజారిటీగా లేరు. కనుక అస్సాం పాకిస్థాన్‌లోకి పోజాలదు. పోతే ఒక్క బెంగాల్ ఉన్నది. బహుశః మన లీగు నాయకుల ఆశలన్ని బెంగాల్‌పై ఉన్నవి. కాని యీ ఆశలు అడియాస లగును. ఏలయనగా బెంగాల్‌లో సగభాగంలో హిందువులు మైనారిటీగా లేరు. కనుక ఆ భాగముగూడ పాకిస్థాన్‌లోకి పోజాలదు. ఇంక హైదరాబాద్ స్టేటు వున్నది. ప్రస్తుత ప్రపంచములో సోషలిస్టుల విచారాలు ఆదర్శాలు చాల ప్రాముఖ్యానికి వస్తున్నవి. మన పరిస్థితులు వానిని ఆహ్వానించుచున్నవి. కనుక భావి ప్రపంచములో సోషలిస్టుల ఆర్థికవ్యవస్థ రాక తప్పదు. ఇటువంటి సమయములో భారత దేశ మేరోజున స్వతంత్రమగునో బహుశః ఆరోజునే ప్రస్తుతమున్న స్టేట్సుకి భారతదేశములో స్థానంలేకుండా పోవచ్చు. అదిగూడగాక హైదరాబాద్ స్టేటులో 100కి 90 మంది హిందువులేగనుక, భావి ప్రపంచములో ప్రజల కోర్కెలకి విరుద్ధముగా ప్రభుత్వము పోజాలదు గనుక హైదరాబాద్ స్టేటుపై ఏవిధమైన ఆశలు పెట్టుకొనుటకు వీలులేదు.

ఇంతేగాక పాకిస్థాన్‌లో పారిశ్రామికాభివృద్ధికి భావికాలములోగూడ ఏమియు మార్గములేదు. ఏదేశములోనైనా పారిశ్రామికాభివృద్ధికి బొగ్గు, ఇనుము, మార్కెట్ చాల అవసరము. యీ మూటికే పాకిస్థాన్‌లో చాల కొరత. ఖనిజపదార్థాలు ఇరుగుపొరుగుదేశాలనుంచి తెప్పించుకొనెద మనడము పెద్ద పొరపాటు. ఇతరత్ర ఖనిజపదార్థాలు తెప్పించుకొన్న అచ్చట తయారయిన వస్తువులఖరీదు ఎక్కువగును. అప్పుడు మార్కెట్టుకి అచ్చట వస్తువులు ఎక్కవు. అదిగూడగాక ఏ ఘడియలో మన ఇరుగుపొరుగు దేశాలు ఏవైఖరిని అవలంబించునో మనకి తెలియదు. వీటినన్నిటిని ఏదో ఒకవిధముగ సరిజేసుకొన్నా పాకిస్థాన్‌లో పెద్దమార్కెట్లుగూడ లేవు. దానికి ఇంగ్లండుకున్నట్టు ఒక్క ఉపనివేశముగూడ తన వస్తువులను కొనుగోలుజేయుటకు లేదు. బెలూచిస్థాన్, సింధు, ఫ్రాంటియర్, కాశ్మీర్ ప్రజల బీదతనము జగద్విదితము. ఒక్క పంజాబులోమాత్రము కొనుగోలు

జేయుటకు శక్తిఉన్నది. నేటిప్రపంచములో బొగ్గు, ఇనుము, మార్కెట్ యీ మూటికి గొప్పవిలువ ఉన్నది. బహుశః నేటిసభ్యత వీటిపై ఆధారపడి ఉన్నదన్న అతిశయోక్తి గాజాలదు. నేడు వివిధ దేశాలమధ్య సంఘర్షణలకి, రెండుమూడువందల సంవత్సరాలనుంచి జరుగుతూవచ్చిన యుద్ధాలకి యీ మూడే కారణములు. సారాంశ మేమిటంటే పాకిస్థాన్ తన పారిశ్రామికాభివృద్ధికి, ఆఫ్ఘనిస్థాన్ యీరానులవలె పాశ్చాత్యదేశాలదగ్గర ఆర్థికసహాయము తీసుకోకతప్పదు. దాని పరిణామమువల్ల అది ఏదో ఒక కేపిటలిస్టుదేశానికి ఆర్థికంగా బానిస కావలసివచ్చును.

కొందరు లీగునాయకులు పాకిస్థాన్‌లో పారిశ్రామికాభివృద్ధికి అవకాశములేదని ఒప్పుకుంటూ దేశీయ పరిశ్రమలేనందువల్ల విదేశాలనుండి దిగుమతులు హెచ్చును. అప్పుడు పాకిస్థానుకి కస్టమ్సుద్వారా, రాబడి ఎక్కువగునని అంటున్నారు. విదేశాలనుంచి దిగుమతులు హెచ్చయిన కస్టమ్సుద్వారా పాకిస్థాన్‌కి రాబడి షుమారు 10 కోట్లరూపాయలు పెరగవచ్చు. కాని యీ 10 కోట్లరూపాయలకి బదులు 100 కోట్లరూపాయలు విదేశీకేపిటలిస్టులకు చెల్లించవలసివచ్చును. యీ పద్ధతినే గనుక అనుసరించిన కొలదికాలములోనే ఆ దేశము కొల్లగొట్టబడును.

పై విమర్శవల్ల ఆర్థికంగా పాకిస్థాన్ తన కాళ్ళమీద తాను నిలబడజాలదని స్పష్టమగుచున్నది. అదియునుగాక, నేటి ప్రపంచములో చిన్నచిన్న దేశాలకి దుర్బలదేశాలకి స్థానములేదు. పేరు ప్రతిష్ఠలులేవు. ప్రపంచమంతటికి ఒకే గవర్నమెంటు ఉండాలి. ముఖ్యమైన కొన్ని అంతరరాష్ట్రీయ అధికారాలు దానికే ఒప్పజెప్పాలి, లేకపోతే ప్రపంచానికి ఆటంబాంబుల బారినుండి విముక్తి లేదనుకొనుచున్న యీ సమయములో మన ముస్లింలీగు సోదరులు కాల్పనిక పాకిస్థాన్ సుఖస్వప్నములు చూచుచున్నారు!

హిందూ దేశముయొక్క విభజన నిజంగా మైనారిటీల హక్కులని, ధర్మాన్ని, సంస్కృతిని సంరక్షించడానికైతే పాకిస్థాన్‌వల్ల మైనారిటీ సమస్య పరిష్కరించబడుటలేదు. కాని అనేక వికట సమస్యలను యిదే లేవదీయును. మైనారిటీ హక్కులకి, ధర్మానికి, సంస్కృతికి ఏ విధమైన హానికలుగకుండా భావి భారతవిధానములో ఏర్పాటుజేసుకోవచ్చు. యీ నగ్నసత్యాన్ని గ్రహించక యీరోజు గూడ పాకిస్థాన్ మా కివ్వకపోతే ప్రత్యక్షపోరాటము (direct action) సాగిస్తామని లీగు లీడర్లు బెదరించుచున్నారు. బహుశః వీరు మధ్యయుగము యొక్క విచారవీధులలో విహరించుచున్నారు, మధ్యయుగములో ఏ కొద్దిమంది ముసల్మానులో హిందూదేశాన్ని జయించినారు. అలాంటప్పుడు కొన్ని కోట్లమంది ముసల్మానులము హిందూదేశాన్ని ఎందుకు మరల జయించలేమన్న అహంభావము వీరికుండవచ్చు. మధ్యయుగములో భారతదేశ వీరాధివీరు మహాత్మ గౌతమబుద్ధుని అహింస మాకు సహాయముచేసినది; ఇప్పుడు మహాత్మా గాంధిగారి అహింసాతత్వము మాకు తప్పక సహాయముచేయునని వారికి నమ్మకముండవచ్చు. కాని హిందూదేశము తన పురాతన చేతిహాసాన్ని మరచిపోలేదు. పాకిస్థాన్ దేవతకి నరబలినీయ బూనుకున్న యీపూజారులు ఇది మధ్యయుగముగాదు, ఇరువదియవశతాబ్దియని గ్రహించాలి.

మొట్టమొదటి లీగు ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్; కాంస్టిట్యూయంట్ ఎసెంబ్లీల రెంటిని బాయ్‌కాట్ చేసినది. కాని యీతీర్మానంవల్ల తనపలుకుబడి ప్రతిష్ఠ తగ్గిపోయేసూచనలు గన్పించినవి. గనుక ఎగ్జిక్యూటివ్

# పాకీస్థాన్ నిజస్వరూపము

కౌన్సిలులో జేరినారు. ఎగ్సిక్యూటివ్ కౌన్సిల్ లో జేరిన కాంస్టిట్యూయంట్ ఎసెంబ్లీలో తప్పక జేరవలెనన్న నియమం కాబినెట్ ప్లానులో నున్నది. కాని నేడు ఈ నియమమాన్ని లీగు పాటించదలచుకోలేదు. కాంస్టిట్యూయంట్ ఎసెంబ్లీని, వైస్రాయి సహాయంతో భంగపరచబూనుకున్నారు. కాని వారిఎత్తులు సాగే చిహ్నములు కన్పించడము లేదు. వీరి ప్రయత్నములు ఫలించకపోయిన, ముస్లిముల స్వార్థాలను, హక్కులను రక్షించడమనేసాకుతో, కాంస్టిట్యూయంట్ ఎసెంబ్లీలోగూడ లీగు తప్పకుండా జేరును. అలాంటప్పుడు లీగుకి యీ పద్ధతులవల్ల లాభమేమిటి? యీ పద్ధతుల ప్రయోగముచే లీగు తన పాకిస్థాన్ సిద్ధాంతాన్ని కాంగ్రెస్ చే ఒప్పించ ప్రయత్నిస్తున్నది. రెండవవైపున బ్రిటను గవర్నమెంటు లీగు సహాయంచే యింకా కొంతకాలం యీదేశంలో ఉండదలచినది. గనుక నేడు జిన్నా వైస్రాయి ఒకరిపై నొకరు ఆధారపడి ఉన్నారు.



# ఆధునికశిల్పం - అంతర్జాతీయత


## శ్రీ సంజీవదేవ్


**విశ్వసృష్టిలో** స్పష్టంగా గోచరించే శాశ్వత సత్యం పరివర్తన. పరివర్తన గతిశీలం. జీవలక్షణం గతిశీలం. కనుక పరివర్తన జీవలక్షణం. ఈ పరివర్తన ఇతరజీవుల్లో కంటె మానవజీవుల్లో అధికతరం. కారణం, మానవునిలో ఇతర జీవుల్లో కంటె బుద్ధి అనే వస్తువొకటి బలంగా పనిచేస్తుంది. కనుక బుద్ధి బాగా పనిచేస్తుందంటే తన కుపకరించేవేవో, అపకరించేవేవో, అనగా ఏది మంచి ఏది చెడు అనే విషయాల్లో వివేకం కనపఱచి అనుకూలవిషయాలను తీసుకోటం, ప్రతికూలాలను వదలివేయటం. ఈ విధంగా మానవచరిత్రంతా ఒక పెద్ద పరివర్తన. ఈ పరివర్తనే పరిణామసిద్ధాంతానికి అసలు పంథా.

ఇక మానవ సంస్కృతి ఇన్ని అన్ని మార్పులు చెందిందని చెప్పటానికి వీలులేదు. మానవ సంస్కృతిలో రెండు ప్రధానవాదాలు—ఆధ్యాత్మిక వాదం, భౌతిక వాదం—అనేక పర్యాయాలు ఒకటొకంటె, మరొకటి గొప్పదనాన్నిపొందటం మరల రెండవ దాని ఆధిక్యంవల్ల అణచబడటం ధారావాహికంగా స్మరణాతీతకాలం నుంచి జరుగుతూనేవుంది. ఈ పరివర్తన శీలమైన మానవసంస్కృతికి ప్రథమలక్షణం శిల్పం. ఈ శిల్పం మానవజీవితంలోని మార్పుల ననుసరించి మారుతూవస్తుంది. ఒకప్పుడు ఉన్నత శిఖరాల నందుకోటం మరికొంతకాలానికి లోతైన లోయల్లోనికి పతనం అయిపోవటం జరుగుతూ వస్తుంది.

ఆది మానవుని జీవితం అన్నిదేశాల్లోనూ, కొద్ది మార్పు లున్నప్పటికి, అధిక సామ్యాన్ని కలిగివుండేది. అప్పటి మానవునిమీద దేశకాలాల ప్రభావం తక్కువగానే ఉండేది. ఎంతదూరదేశాల్లో వున్నప్పటికి వారి జీవన విధానాల్లో ఒక రకమైన సామ్యం ఎక్కువగా గోచరించేది. కారణం, అప్పటి వాళ్ళ అవసరాలు చాల తక్కువ. ఏవో కొద్ది ప్రాథమికఅవసరాలు మాత్రమే వుండేవి. ఆ ప్రాథమిక అవసరాలు అన్నిదేశ ఆదిమవాసులకు దాదాపు సమానంగానే వుంటూవుంటవి. ఎక్కువభాగం ఆహారానికి సంబంధించిన అవసరాలే.

శిల్పం జీవితాన్నుంచి వస్తుంది కాబట్టి కనుక అప్పటి ప్రతిదేశపు శిల్పానికి, సామ్యం వుండేది, ఆదిమ యుగాల శిల్పం అంతర్జాతీయం అనే చెప్పవచ్చు. అసలు శిల్పంయొక్క ఉత్పత్తి అంతర్జాతీయ సామ్యంలో; పెరుగుదల [illegible]; పరిణామం మరల అంతర్జాతీయ సామ్యంలోనే. ప్రాగ్చరిత్ర కాలమగు ప్రాచీన శిలాయుగంలోను, తరువాతి నవశిలాయుగంలోను చిత్రించబడిన గుహావాసుల శిల్పానికి దేశాలు [illegible] సామ్యం వున్నది. దాదాపు ఇరవై వేల సంవత్సరాల నాటి యూరపులోని అల్టామిరా గుహల్లోని చిత్రాలకూ, దాదాపు అదేకాలం నాటి సింగనపూర్, హోషంగాబాద ప్రాంతాల గుహల్లోని చిత్రాలకు అత్యంత సామ్యం. ఎక్కడి [illegible] దేశం, ఎక్కడి భారతదేశం! ఈ [illegible] తమ శిల్పానికీ అంత సామ్యమా!

నేడు మనం ప్రాచ్యమని పాశ్చాత్యమని [illegible] ప్రభేదాలు చాలకాలం క్రిందటివరకు లేవు. యూరపులో పారిశ్రామిక యుగం ప్రారంభం అయినప్పటి నుంచీ వచ్చింది ప్రాచ్య పాశ్చాత్య ప్రభేదం అంతా.

కాని క్రమేణా నేడు యీ ఖండభేదాలు నశించి ఖండాంతర ఐక్యత ఏర్పడుతున్న లక్షణాలు జీవితానికి సంబంధించిన ప్రతి రంగములోనూ గోచరం అవుతున్నాయి. ఆదిమ మానవుల స్వల్పఅవసరాలతో నిండిన జీవితంలో గోచరించే సామ్యం నేటి మానవుని బహుళ అవసరాలతో నిండిన జీవితంలోకూడ గోచరిస్తుంది. ఇందుకు కారణం భౌతిక విజ్ఞానంవల్ల కలిగిన వేగవంతమైన వాహన సౌకర్యాలు, ఒక దేశపు వార్తలు మరొక దేశాని కందటానికి వీలైన వార్తాపత్రికలూ, రేడియోలు, సామాన్య మానవునిలో కూడ విద్యయందు కలిగే ఆసక్తి మొదలగు ఆధునిక సాధనాసంపత్తియే.

నేడు ఆధునిక శిల్పం అనబడేది విశ్వజనీనమైంది. ఇది నేటికాలానికి పాశ్చాత్యదేశం ద్వారా బయటికి వచ్చినప్పటికీ పాశ్చాత్యమని అనే వీలులేదు. ఎందుకంటె ఈ ఆధునికశిల్పంలో సర్వదేశాల యొక్క శతాబ్దాల సాధనంతా అంతర్నిహితమై వుంది. నేటి ముద్రణాయంత్రాలనూ, రైళ్లనూ విమానాలనూ పాశ్చాత్యాలని అనజాలం. అవి అన్ని దేశాలవి, అందరి ప్రజలవి. ఆధునిక శిల్పంకూడ వీటివలెనే నేడు అంతర్జాతీయం అయిపోయింది.

నేటిరోజున, కొద్ది ప్రాదేశిక ప్రత్యేక లక్షణాలున్నప్పటికీ, ఆధునిక శిల్పాన్ని — వాస్తుశిల్పం, మూర్తిశిల్పం, చిత్రశిల్పం—అంతర్జాతీయశిల్పం అని అంగీకరించక తప్పదు. క్రిందటి శతాబ్దంలో పాశ్చాత్యదేశాలనుండి దిగుమతైన శిల్పరీతులను భారతదేశం స్వీకరించక, తన ప్రాచీన కళావైభవం వైపుకు దృష్టిమరల్చింది సృష్టిమూలక ప్రేరణకొరకు. ఆ రోజుల్లో అట్లుచేయటం న్యాయమే అయింది. కారణం, అప్పుడు మనదేశానికి దిగుమతైన శిల్పం దాని జన్మస్థానమైన పాశ్చాత్యదేశాల్లోనే పనికిమాలినదని గ్రహింపబడ్డది. అప్పటికి ఆ శిల్పం ఆ దేశాల్లోనే సృష్టిశీలతను కోల్పోయి అనుకరణ శిల్పంగా పరిగణించబడింది. క్రిందటి శతాబ్దపు పాశ్చాత్యశిల్పులు, శిల్పరసికులు ఆ శిల్పాన్ని మృతప్రాయంగా చూచి, ప్రాచ్య శిల్పరీతుల సమ్మేళనంతో నవనవ రూపకల్పనకొరకు సాధనలూ, పరిశోధనలూ చేస్తున్నరోజు లవి. అటువంటి సమయంలో భారతీయులు ఆ మూడోరకపు పాశ్చాత్యశిల్పాన్ని తిరస్కరించి తమ ప్రాచీనపద్ధతి నవలంబించటం చాల సహజం, శ్రేయంకూడ.

ఆ భారతదేశమే నేడు పాశ్చాత్యదేశాలనుంచి బయటపడిన ఆధునిక శిల్పాన్ని స్వీకరించటంలో న్యాయం, శ్రేయం కూడ వున్నది. గతిని కోల్పోయి స్థితిమాత్రంగానే వున్న మన ప్రాచీనశిల్ప సంపద మన శిల్పులకు కొంతకాలమే ప్రేరణ నివ్వకలుగుతుంది. ప్రాణవంతమైన ప్రేరణను శిల్పి ఎప్పుడైతే పొందలేడో అప్పుడతని సృష్టికార్యం అంతా అనుకరణప్రాయంగానూ, అందువల్ల మృతప్రాయంగాను మారుతుంది. నేడు భారతీయశిల్పం అనీ, ఇటలీ శిల్పం అనీ, చీనాశిల్పం అనీ ఆధునిక శిల్పసృష్టిని వర్గీకరణచేయలేము. కారణం ఆధునిక శిల్పం ఏఒక్క దేశ సాంప్రదాయానికీ కట్టుబడలేదు.

అసలు మనం దేన్నైతే పాశ్చాత్య శిల్పం అంటున్నామో అది నిజానికి సొంతం పాశ్చాత్యం కాదు. నేడు మనం జపాను శిల్పం అంటే అచ్చగా ఏ దేశం శిల్పవిధానంలేకుండా జపానుదిగానే వుండలేదు. జపాను శిల్పంపై భారత శిల్పప్రభావం బాగా పడి వున్నదనే సత్యం నిర్వివాదం. అదేవిధంగా ప్రాచీన పాశ్చాత్య శిల్పం ఈజిప్టు మొదలగు ప్రాచ్యభూముల శిల్ప సాంప్రదాయాలతో ఓతప్రోతం, యూరపులో నవజాగరణ యుగంవరకూ కూడ పాశ్చాత్య శిల్పం

అంతా ప్రాచ్య శిల్పంవలె కేవలం కల్పనావాద ప్రధానం. వాస్తవవాదం ఎక్కడా గోచరించదు. బైజంటైన్ శిల్పం కేవలం ధార్మిక విషయాలను సృష్టిస్తుండేది. మధ్యయుగాల వరకూ కూడ పాశ్చాత్య చిత్రశిల్పం ప్రాచ్యపద్ధతివలె కేవల రేఖా మయం; రేఖల మధ్యస్థలాన్ని మాత్రం రంగుతో నింపేవాళ్లు. మూడు ఆయతనాల్లో ఆకారాన్ని చూపించటం అప్పటికి లేనేలేదు. దృష్టిక్రమం (Perspective) కానీ, ఛాయాకాంతుల ప్రదర్శన కాని ప్రాచీన పాశ్చాత్య శిల్పంలో లేనేలేవు. విశేషం ఏమంటే మరల ఆధునిక శిల్పంలోకూడ ఇవి లేవు. ఆ రోజుల్లో ప్రాచ్యశిల్పానికీ పాశ్చాత్య శిల్పానికీ విషయవస్తువులో తప్ప నిర్మాణ విధానంలో అంత భేదం వుండేదికాదు.

క్రమేణ మధ్యయుగాల చివరిభాగం నుంచి పాశ్చాత్య శిల్పం వాస్తవవాదం వైపు మొగ్గ జొచ్చింది. కాని ప్రాచ్య శిల్పం మాత్రం తన మామూలు సంప్రదాయాన్ని విడవకుండా రా సాగింది. పాశ్చాత్య శిల్పుల వాస్తవవాదం క్రిందటి శతాబ్దంవరకూ బాగా సాగివచ్చింది. కాని కెమేరా యంత్రావిష్కారంతో పాశ్చాత్య శిల్పంలోని వాస్తవవాదానికి దెబ్బతగిలింది. అప్పటినుండి పాశ్చాత్య శిల్పులు నూతన రూపకల్పనకొరకు మరల ప్రాచ్యశిల్పం శరణుజొచ్చారు. అంతటితో అంతులేని 'ఇజం'లు, ఇంప్రెషనిజం, క్యూబిజం, ఫ్యూచరిజం, సర్రియలిజం, కన్‌స్ట్రక్టివిజం మొదలైనవన్నీ బయలు దేరి నవ్యరూపకల్పనల చేసినవి. ఈ నూతన పంథాలన్నిటికీ ప్రాచ్యశిల్పమే ప్రేరణ. వీటన్నిటి పరిణామ స్వరూపంగా ఆధునిక విశ్వశిల్పం అనగా అంతర్జాతీయ శిల్పం ఉద్భవించింది. అంతర్జాతీయ శిల్పం అనగానే ఈ అంతర్జాతీయ సామ్యం నిర్మాణవిధానం లోనే కాని వ్యక్తపరిచే విషయవస్తువులో కాదని అర్థం. అనేక వ్యక్తులు అనేక రకాల విషయాలను చిత్రించవచ్చు. ఆ విషయాలకు సామ్యం వుండదు. కాని ఆ చిత్రించిన విధానాలలో ఒకరకమైన ఏకత్వం గోచరిస్తే దాన్ని అంతర్జాతీయ సామ్యం అంటాం.

రచనా విధానంలోని భేదాన్నే శిల్పం గుర్తించేది. రచించబడిన విషయవస్తువులోని భేదాన్ని కాదు. రవివర్మ హిందూదేవతలనూ దేవస్త్రీలనూ అనంతంగా చిత్రించాడు తన చిత్రాలలో. కాని శిల్పజ్ఞలోకం ఆ చిత్రాలను భారతీయ చిత్రకళగా గుర్తించక పాశ్చాత్య చిత్రకళ క్రింద గణించారు. ఏమంటే ఆయన రచనావిధానం పాశ్చాత్యం గనుక. తెలుగు భాషలో షేక్స్పియరు జీవితాన్ని గురించి నాటకం వ్రాస్తే అది తెలుగుసాహిత్యమే అవుతుంది కాని ఆంగ్లసాహిత్య మవుతుందా? అదేవిధంగా సోక్రటీసు మీద ఇంగ్లీషులో ఒక నాటకం వ్రాస్తే అది ఇంగ్లీషు సాహిత్యమే అవుతుంది కాని తెలుగు సాహిత్యం కాదు. అజంతాగిరి శిల్పంలో ఘలాని సంప్రదాయం అంటే ఆ శిల్పంయొక్క రచనా విధానమే కాని విషయవస్తువు కాదు. ఆధునిక శిల్పం అంతర్జాతీయ మైందీ అంటే ఆధునిక శిల్పంలోని రచనా విధానం లేక నిర్మాణకౌశలం అంతర్జాతీయమైందని అర్థం. భారతీయులు భారతీయ దృశ్యాలను చిత్రించుకో వచ్చు, చీనావారు చీనాదృశ్యాలను చిత్రించుకో వచ్చు, అమెరికావారు అమెరికా దృశ్యాలను చిత్రించుకోవచ్చు, కాని వారి మూడింటి చిత్రణ విధానంలో కనుక బాగా సాదృశ్యం వుంటే అప్పుడు వీటన్నిటినీ అంతర్జాతీయ శిల్పం అంటాం.

ఈ యుగంలో అంతర్జాతీయంగా ఏక భాష ఏకలిపి ప్రపంచానికి అవసరమైనట్లు ఏకశిల్పం కూడ

అవసరమైంది. ఏకభాష, ఏకలిపి సరిగా అమల్లోనికి రాలేదుకాని ఏకశిల్పం మాత్రం కొంతవరకు అమల్లో కొచ్చింది. ఈ ఏకశిల్పమే ఆధునికశిల్పం. నేడు సంఘములోనూ, సాహిత్యంలోనూ రాజకీయ ఆర్థిక విధానాల్లోనూ, కనుపించే ప్రధానభేదం పాత క్రొత్తలనే భేదమేగాని ప్రాచ్యమా పాశ్చాత్యమా అనే భేదంకాదు.

మనం ఆధునిక శిల్పం అని చెప్పేది పాశ్చాత్య దేశాలలోనుండి బయటి ప్రపంచానికి అందించబడినప్పుడు దాన్ని మనం ప్రాచ్యులం ఎందుకు స్వీకరించాలి? అది పాశ్చాత్యదేశాలనుండి వచ్చింది కనుక అది పాశ్చాత్య శిల్పమే కాని ప్రాచ్యానికికూడ ప్రాతినిధ్యం వహించే విశ్వశిల్పం ఎందుకు అవుతుంది? దీని సమాధానానికి అసలు ఆధునిక శిల్పం అంటే ఏమిటో తెలుసుకోవాలి. ఒక్కమాటలో ఆధునికశిల్పం సర్వదేశ శిల్పాల సమ్మిశ్రణం కనుక అన్ని దేశాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది.

అనేక రాజకీయ ఆక్రమణలవల్లనూ ఇంకా అనేక రాజకీయ వ్యాపారిక కారణాలవల్లా చీనా, జపాను, భారతదేశం మొదలగు ప్రాచ్యదేశాల విలువైన శిల్ప సంపదలు పాశ్చాత్య దేశాల మ్యూజియాలలోకీ, వ్యక్తుల శిల్ప సంగ్రహాలలోకీ వెళ్లటం తటస్థించింది. దేశ సౌభాగ్యం దృష్ట్యా ఇట్లు జరగటం ఆయా ప్రాచ్యదేశాలకు నష్టమే. కాని యీ నష్టంలోనే కొంతలాభం లేకపోలేదు. ఆలాభం ఏమంటే, ఇతర దేశాలు ఈ దేశాలయొక్క సంస్కృతి మహోత్కృష్టతను గుర్తించుటయే ఆ శిల్పాలు వలసపోయినందున. ఎవరి శిల్పసంపద వారి దేశంలోనే వుండిపోతే ఒక దేశపు సంస్కృతియొక్క గొప్పతనాన్ని మరొక దేశం గుర్తించటానికి అంత వీలుండకలిగేదికాదు. ఈ ప్రాచ్యశిల్ప సంపదయొక్క ప్రవాసంవల్ల పాశ్చాత్య విద్వాంసులు, శిల్పులు, శిల్పసమీక్షకులూ ఆ శిల్పాలను బాగా అధ్యయనంచేసి అందులోని రూపసంప్రదాయాలు తమ నూతన రూపకల్పనకు ఎంతవరకు తోడ్పడుతవా అని ప్రయోగాలుచేసి చూడసాగారు. ఈ ప్రయోగాల పరిణామమే మన ఆధునిక విశ్వశిల్పం!

ఈ ఆధునిక శిల్పప్రాభవానికి ప్రత్యేకం జపాను చిత్రకళలు చాల తోడ్పడ్డాయి. క్రిందటి శతాబ్దపు మధ్యభాగంలో జపానుకు పాశ్చాత్యదేశాల సంపర్కం బాగాకలగటం ప్రారంభం అయింది. దాంతో జపాను తన జీవితంలోనూ శిల్పంలోనూ కూడ పాశ్చాత్య పద్ధతుల నవలంబింపసాగింది. ఈ ప్రథమ వ్యామోహంలో జపానులోని విలువైన చిత్రాలు, వివిధాలైన పనితనంగల పనిముట్లూ, కలర్ ప్రింటులూ మొదలైన శిల్ప సామగ్రినంతా విదేశాలకు ముఖ్యంగా యూరపుకూ, అమెరికాకూ ఎగుమతి చేయసాగారు. పాశ్చాత్య శిల్పులు ప్రథమంలో వీటిని విచిత్ర వస్తువులక్రింద చూచినా క్రమేణ వీటి ప్రాముఖ్యాన్ని గుర్తించసాగారు.

పాశ్చాత్య శిల్పంయొక్క వాస్తవానుకరణతో విసుగెత్తి అసంతృప్తిచెందిన ఆ శిల్పులు యీ దూర ప్రాచ్యపు శిల్పసృష్టిలో ఒక నూతన చైతన్యాన్ని దర్శించసాగారు. జపాను కలర్ ప్రింటులు ఒక రకంగా కొంత చాకరకపు అభిరుచికి చెందినప్పటికీ వాటిలో ఒక ప్రత్యేకతవుంది. అప్పటి పాశ్చాత్య శిల్ప విప్లవవాదులు ఏదైతే కోరుతున్నారో అది వీరికి వాటిలో గోచరించింది. ఆడంబరశూన్యమైన సాదా రూపం, చిత్రం చిత్రంలాగా రెండు ఆయతనాల్లో బల్లపరుపుగా మాత్రమే కనపడటం, చిత్రం వాస్తవ వస్తువులనే భ్రమగొల్పక పోవటం,విశేషమైన రచనా పటిమ, దృష్టిక్రమం (Prespective) లో అసా

మాన్యపద్ధతులు, ఇవన్నీకూడ ఆ నూతన మార్గాన్వేషుల హృదయాల నాకర్షించినవి. ఇన్నాళ్లనుండి ప్రకృతికి అనుకృతినే శిల్పంగా సృష్టిస్తూ అనంతృప్తి చెందిన ఆ పాశ్చాత్య శిల్పులకు ప్రాచ్యశిల్పంలోని యీ విశేష సుగుణాలన్నీ అమృత సందేశాన్ని విని పించినాయి. చిత్రం చిత్రంలాగే గోచరించాలికాని వాస్తవ జగత్తువలె గోచరించరాదు అనే సూత్రం ప్రధానమైపోయింది. ప్రాచ్య శిల్పు లెప్పుడూ చిత్రాన్ని చిత్రంలా కనుపించేలాగే చిత్రించేవారు కాని వాస్తవరూప భ్రమ నెప్పుడూ కలిగించ నూడ లేదు. ప్రాచీన పాశ్చాత్య శిల్పులుకూడ మధ్య యుగాల ఆఖరువరకూ ప్రాచ్యుల పద్ధతి ప్రకారం చిత్రాన్ని చిత్రంలాగే కనపరచారు. ఎటు తిరిగీ యూరపులో నవజాగరణారంభంనుంచీ చిత్రాన్ని వాస్తవంగా చూపే రచనా పద్ధతు లవలంబించారు అనే సత్యం ఇదివరకే తెల్పబడింది.

ప్రథమంలో యీ ప్రాచ్యశిల్ప ప్రభావాన్ని తన చిత్రాల్లో కనపరిచింది ప్రసిద్ధ ఐరిష్ - అమెరికన్ చిత్రశిల్పియగు విజలర్. ఇతను చిత్రశిల్పం పారిస్‌లో అభ్యసించాడు. యూరపియన్ శిల్ప చరిత్రలో ఏ ప్రథమ విప్లవోద్యమం వచ్చినా అది ముందు ఫ్రాన్స్‌లోనే వచ్చేది. అదేవిధంగా ఆధునిక శిల్పానికి పునాదులు వేసిందికూడ ఫ్రాన్స్‌లోనే. తరువాత అనేక మంది యూరపియన్ చిత్రశిల్పులు యీ నూతన విధానాన్ని అనగా ప్రాచ్య ప్రభావాన్ని స్వీకరించి తమ శిల్పసృష్టికి పూనుకొన్నారు.

జాకోబ్ ఎప్‌స్టీన్ నిర్మించే మూర్తి శిల్పంలో భారతీయప్రభావం బాగా గోచరిస్తుంది. ఎప్‌స్టీన్ భారతీయశిల్పం నుంచి ప్రేరణ పొందటానికే మాత్రము లజ్జచెందలేదు, ఈ విస్తృత ప్రపంచంలో ఎవరికి నచ్చిన సంప్రదాయాలను వారవలంబించటానికి స్వేచ్ఛవున్నది. ఈ యుగంలో సాంకర్య దోషం జీవితానికిచెందిన ఇతర రంగాల్లో ఏవిధంగా అయితే లేకుండాపోయిందో అదేవిధంగా శిల్పంలో కూడ లేకుండపోయింది. ఈజిప్టు వాస్తుసాంప్రదాయ మిశ్రితమైన సౌధాలను అమెరికాలో నిర్మించటం, అమెరికన్ పద్ధతుల మిశ్రమంతో జపానులో గృహ నిర్మాణంచేయుటం, భారతీయ సంప్రదాయాలు సూచించే మూర్తి శిల్పాలను బ్రిటిషు శిల్పులు నిర్మించటం, బ్రిటిషు చిత్రపద్ధతిని భారత శిల్పులు చిత్రించటం నేటి యుగంలో పరిపాటి అయిపోయింది. ఈ అన్యోన్య ఆదాన ప్రదాన పద్ధతి 'వసుధైవకుటుంబకం' అనే అంతర్జాతీయ వాక్యసూత్రానికి దారి తీస్తుందనటంలో సందేహం లేదేమో.

ఆధునిక శిల్పంలో ప్రత్యేకం వాస్తుశిల్పం నేడు ఒక విశ్వజనీనవ్యాప్తిని చెందివుంది. ఆధునిక వాస్తు శిల్పానికి ఒక విశ్వజనీన వాక్యత లభించటానికి నేటి నిర్మాణ సామగ్రి ప్రధానకారణం. సిమెంటు, కంకర, ఇనుము మొదలగు సామగ్రి సౌధనిర్మాణానికి ఉపయోగించటం ఆరంభించినప్పటి నుండీ ఎత్తైన ఏటవాలుగల ఇంటికప్పుల స్థానంలో చదరమైన కప్పులు ప్రవేశించినవి. అనవసర అలంకరణంతా నశించి ఒక విధమైన స్వేచ్ఛతో కూడిన విశాల ప్రదేశాలు కనుపించేలాంటి నూతన వాస్తుశిల్పం ప్రపంచం అంతా ప్రాకింది. ఈ ఆధునిక వాస్తుశిల్పానికి సాంప్రదాయాలతో నిమిత్తములేదు. మానవుని అవసరాలనుబట్టీ, నిర్మాణ ప్రదేశంయొక్క పరిసర ప్రకృతి దృశ్యాన్నిబట్టీ నిర్మాణ రూపరేఖల్లో లయ తాండవించేట్లు సౌధాన్ని నిర్మించటమే ఇప్పటి వాస్తుశిల్పం యొక్క ప్రాధాన్యం. ఆధునిక వాస్తుశిల్పాన్ని ఫలాని దేశపు వాస్తు అని చెప్పటానికి వీలులేదు. ఇది అన్ని దేశాలకూ సమానమే. నేటి సైన్సును ఇండియన్ సైన్సు,

# ఆధునిక శిల్పం – అంతర్జాతీయత

చీనాసైన్సు, అమెరికన్ సైన్సు అని చెప్పటానికి వీలులేదు. అది అన్ని దేశాలకూ ఒకటే. అదేవిధంగా నేటి వాస్తుశిల్పాన్ని కూడ ఫలాని దేశానిదని చెప్పటం కుదరదు. అది అంతర్జాతీయం. ఇదేవిధంగా ఇతర శిల్పాలుకూడ.

లోతుగా ఆలోచిస్తే ఆధునిక శిల్పం ఆధునిక మానవుని ఆశయాలకూ, అభిలాషలకూ, అభిరుచులకూ ప్రతిబింబం మాత్రమేనని తెలియకపోదు. ఈశతాబ్దం వైజ్ఞానిక శతాబ్దం. హేతువాదం దీనికి మూలం. అస్పష్టత్వాన్ని, అగమ్యగోచరాలను ఇప్పటి మానవ సమాజం సహించదు. ప్రతీ విషయమూ స్పష్టంగానూ స్వతంత్రంగాను వుండాలి. ఒక మానవుడు మరొక మానవునిపై ప్రభుత్వంచేయటాన్ని ఆధునిక మానవుడు సహించడు. సమాజంలోని ఎక్కువ తక్కువలను ఓర్చడు. ఈ విప్లవ భావాలే రాజకీయ, ఆర్థిక రంగాలలో పెట్టుబడిదారీకీ, సామ్రాజ్య వాదానికీ వ్యతిరేకంగా సోషలిజాన్నీ, ప్రజాస్వామికాన్నీ రూపొందించినవి. సాంఘికరంగంలో వర్ణజాతి భేదాలను రూపుమాప ప్రయత్నిస్తున్నాయి. ఏ సంఘానికా సంఘం మిగతా మానవ సంఘాన్నుండి వేరుకాదనీ అదేవిధంగా ఏ దేశాని కాదేశం మరొక దేశాన్నుండి వేరుకాదనీ గుర్తించినవి. ఈ విప్లవభావాల ఫలితమే ప్రస్తుతం కొద్దిగా కనుపిస్తున్నట్టీ, ఇకముందు బాగా కనుపించబోతున్నట్టి విశ్వమానవ సౌభ్రాతృత్వం. ఇది కేవలం ఊహాగానంకాదనే ఆశ.

మానవ సమాజంలో ఉన్నతమైన యీ స్వాతంత్ర్య ప్రీతి, అంతర్జాతీయ ఐక్యతా, సమత్వంపైన ఆసక్తీ ఇవన్నీకలసే ఆధునిక శిల్పానికి రూపాన్ని ప్రసాదించినవి.

ఆధునిక భౌతికవిజ్ఞానం జడవాదాన్నుండి విముక్తిచెంది చైతన్య సిద్ధాంతానికి చేరుకున్నది. దీనివలెనే నేటి శిల్పంకూడ భౌతిక భారాన్నుండి విముక్తిచెంది నైరూప్య వాదానికి సమీపిస్తున్నది. అనవసర రూప బాహుళ్యాన్ని విసర్జించటం నేటి శిల్పంయొక్క ప్రధాన లక్షణం. వీలైనంత తక్కువ రూపంతో వీలైనంత ఎక్కువ రసాన్ని ప్రసాదించటం ఆధునిక శిల్పియొక్క లక్ష్యం. నేటి శిల్పం వాస్తవ వాదాన్ని కేవలం విషయవస్తువులోనే చూపిస్తున్నది కాని రచనా విధానంలో ప్రదర్శించటంలేదు. అంటే ఆధునిక శిల్పం వాస్తవవాదానికి దూరం అనే తాత్పర్యం. నూరు సంవత్సరాల క్రిందట పాశ్చాత్య చిత్రాలలో వున్న వాస్తవవాదం నేటి పాశ్చాత్య చిత్రాలలో గోచరించదు. తెలిసినవాళ్ళంతా యీ లక్షణాన్ని శిల్పంలోని పురోభివృద్ధి అనే అంగీకరిస్తున్నారు. ఇది వృద్ధిలక్షణంకాదు క్షీణించే లక్షణం అనేవారు కూడ కొందరు లేకపోలేదు.

నేటి రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక వ్యవస్థలన్నీ భౌతిక భారంనుండి విముక్తిచెంది ఒక స్వేచ్ఛాపూరిత సామ్యస్థితికి చేరుకోవాలని ప్రయత్నిస్తున్నవి. అంటే యీ ప్రయత్నం భౌతిక వాదానికంటె ఆధ్యాత్మిక వాదానికే ఎక్కువ సమీపిస్తున్నదేమోనని అనుమానం. అదేవిధంగా ఆధునిక శిల్పం తన్నుతాను జడభారంనుంచి సాధ్యమైనంత తేలిక చేసుకుంటూ నైరూప్య సిద్ధాంతాన్ని అనుసరిస్తూ, దేశ, జాతి, మతవిభేదాలను దాటి ఒక అంతర్జాతీయ ఐక్యస్థితిని సమీపింపచూస్తున్నది అంటే అదిక్రమేణ భౌతికవాదాన్నుండి తప్పించుకొని ఆధ్యాత్మిక వాదాన్ని సమీపిస్తున్నదేమో. ఆధ్యాత్మిక వాదం అంటే చలనంలేని మృతప్రాయంగా గోచరించే జడ పదార్థాలు చైతన్యమయమై, లయతో స్పందించటం అని.

# సంక్రాంతి పండగ

'శ్రీ మునిమాణిక్యం'

౧

"ఇదుగో కూరలకోసం బజారుకు వెడుతున్నాను", అని కేకేసి నేను బైటికి వెళ్ళటానికి సిద్ధమైనాను.

కాంతం అప్పటికే స్నానంచేసి మంచిబట్ట కట్టుకొని తలలో పూలు పెట్టుకొని తులసిపూజ చేసుకొంటున్నది.

'ఒక్కనిమిషం ఉండండి వస్తున్నా' అని కేక వేసింది. ఒక్క నిమిషంలోనే వచ్చింది.

నలభై ఏండ్ల మనిషి. అయితేమటుకేం దబ్బపండులాంటి ముత్తయిదువ. ముఖాన కుంకుమబొట్టు! చెంపకు చేరడేసి కళ్లు! నెరసిన చెంపలు! ఆరుగురు పిల్లల తల్లి!

ఆ మాతృమూర్తిని చూచి నే నొక్కడిని తప్ప మిగిలిన లోకమంతా చెయ్యెత్తి నమస్కరిస్తుంది. ఆవిడ వచ్చి అన్నది, 'మీరు కూరలుకొని తీసుకొని ఇక్కడున్నట్టు రావాలె. అక్కడ ఎవరితోనో మాట్లాడుతూ కూర్చుంటే కాదు, వింటున్నారా?'

'వింటున్నాను', అని తల ఊపాను.

'ఒక వీశెడు వంకాయలూ, అరవీశెడు బెండకాయలూ, పచ్చిమెరపకాయలూ, టోమాటాలూ... ...' అని చెప్పుకుపోతున్నది. 'ఇవి అన్నీ కొంటే ఎంత అవుతుందో ఏమిటో కొంచెం ఆలోచించావా?' అన్నాను.

'ఆలోచించక్కర్లేదండీ! ఎంత అయితే ఏం జేస్తాము! తప్పతుందా?'' అన్నది.

తప్పదాయె మరి! ఏం జేస్తాను!

కావలసిన డబ్బు జేబులో వేసుకొని గడప దిగబోతుంటే చూడండి మీరు వెళ్లేదార్లోనేగా పున్నాయి ఇల్లు! ఒక శేరు పాలు పంపమని చెప్పండి'' అన్నది.

నేను సరేనని తలఊపి వీధిలో కాలుపెట్టాను. ఆవిడ మళ్ళీ నన్ను లోపలికి పిలిచి, "చూడండి వంకాయ కూర అల్లుడు తినడట! కాబేజీ ఉంటే తీసుకురండి'' అన్నది కాంతం.

కూరలు ఎంత ప్రియంగా ఉన్నవో ఏమిటో ఆమెకేమన్నా తెలిస్తేగా! ఆవచ్చిన మనిషి మనతోపాటు తినిపోతాడు అని అనుకోదు, ఆవిడ. అయితే ఒకటి ఆ వచ్చేమనిషి సామాన్య బంధువు గనకనా! అల్లుడొస్తున్నాడు! ఏంజేస్తాము?

బజారుకు గబగబా నడవటం మొదలుపెట్టాను. జేబులో ఉన్న అయిదు రూపాయిలనోటు తీసి ఒక్కసారి దానివంక దీనంగా చూశాను. అది కాస్తా సాయంత్రానికి కనపడదు.

అయినా ఏంజేస్తాం! అల్లుడొస్తుంటే! గబగబా నడుస్తున్నాను.

ఇంతలో రాధాయ పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పాడు, "రాత్రి కూరకు బంగాళాదుంపలూ, మధ్యాహ్నము ఏమైనా ఫలహారం చేయటానికి కొంచెం సెనగపిండో, మైదాపిండో తెమ్మన్న''దని! "పంచదార కూడా, తెమ్మన్నదట.'' "సరే తెస్తానన్నానని చెప్పు'' అని వాడిని పంపి నేను పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ బజారుకు వెళ్ళాను. అల్లుడొస్తుంటే! తొందరగా తిరిగి రావద్దూ!

౨

నేను అరగంటలో తిరిగి ఇంటికి వచ్చేశాను. ఇంట్లో ఆవిడ అందరిమీదా కేకలు వేస్తున్నది. ఒక్కొక్క మిషపైన ఒక్కొక్కరి మీద కేకలు.

"అదేమిటే రుక్కుతల్లీ, తలంటిపోసుకోమంటే అల్లాగే కూర్చున్నావు? మొగుడొస్తాడని తొందర లేకపోయె! ఏమిటే అది! తే!''

"ఒరేయ్ రాధా! వెధవా, తొందరగా వెళ్ళమన

లేదూ నిన్ను! బావ వచ్చే వేళ అయింది. వెళ్ళి ఒక కట్ట తమలపాకులూ, సవాశేరు వక్కలూ, కొసిని లవంగాలూ, ఏలకాయలూ, తీసుకొని రమ్మని ఎంత సేపైందిచెప్పి నీకు.''

''వెళ్ళిన మనిషి అక్కడే కూర్చున్నారు! ఇంత వరకూ కూరలు ఇంటికి రాకపోయె! ఇంటిదగ్గర ఏమి కావలసివస్తుందో ఏమో, కాస్త తొందరగా వెళ్లుదాము ఇవ్వాళ అని ఆయనకు తోచొద్దూ! ఎబ్బే! ఏం మనిషమ్మా! ఎన్నాళ్లు చెప్పుకొన్నా ఇదే వరస అయిపోయె!''

''ఒరేయ్ శాస్త్రిబాబూ, ఆ పున్నాయ పాలు తేనేలేదు. వెళ్ళి తీసుకురారా, నాయినా. చెప్పి ఎంతసేపు అయింది. కదలవాయె. లే, నాయినా లే. పున్నాయతో చెప్పు, మాబావ వస్తున్నాడు. అర్జంటుగా పాలు తెమ్మంది మా అమ్మ అని!'' ఇక్కడున్నట్టు రావాలె.

''తెమలవే, రుక్కమ్మా తెములు. తొందరగా కానిచ్చి తలదువ్వుకొనిసిల్కుచీర కట్టుకో. పూలు తెమ్మని చెప్పటం మరిచి పోయినానే తల్లీ! నాకు బాత్తిగా మతి పోతున్నది. మహాలక్ష్మిని పంపించాలె. నీవు తొందరగా కానీయ్.''

'ఏమే. జయా అల్లాగే వుంటావా బావ వస్తుంటే! లే! నీవుకూడా స్నానంచేసి పరికిణీ కట్టుకో!'

''నాకూ ఇప్పుడే వచ్చింది ఈ రోగం; నడుము పగలేసుకు పోతున్నది. కూరలు ఇంకా రాకపోయె! ఆయన ఎప్పటికి రాను, ఎప్పటికి వంటగాను! అప్పుడే తొమ్మిది గావస్తుండె! ఆయన ఇంకా రానేలేదు. మనిషికి అవసరం తెలియకపోయె! పాపా, అట్లా వీధిలోకివెళ్ళి మీనాన్న వస్తున్నారేమో చూడూ!''

ఆవిడ పాపం ఇల్లాగ తొక్కిసలాడుతున్నది. ఏం జేస్తాం, అల్లుడొస్తుండె!

3

'కూరలు తెచ్చానే' అంటూ నేను ఆవిడ ఎదట బడ్డాను.

ఆవిడ నవ్వుతూ, 'మీ ఇల్లు బంగారంగానూ, ఇంత ఆలస్యం చేస్తే ఎల్లాగండీ' అంటూ నాకెదురుగా వచ్చింది.

నేను కూరలు ఆవిడకు ఇచ్చాను. ఇంతలో పున్నాయ పాలు తెచ్చింది. రాధాయ తమలపాకులూ అవీ తెచ్చాడు. అమ్మాయి సిల్కుచీర కట్టుకొన్నది. పాప కొత్తపరికిణీ కట్టుకొన్నది. ఆవిడ ముఖం వికసించింది. కళ్ళల్లో ఆనందం తొణికిసలాడింది. నవ్వుతూ అందరి వంకా చూచింది.

మా తండ్రి మంచివాడమ్మా. ఎప్పటికైనా వీడే నాకు కాస్త అన్నంపెట్టేది అని రాధాయను మెచ్చుకొంది. పెద్దకొడుకును టైముచూడు నాయినా రైలు వచ్చేవేళ అయిందేమో అని పంపించింది. పాపను దగ్గరకు తీసుకొని 'నా బంగారు తల్లి' అని ముద్దాడి 'ఒసేయ్ మాడూ, బావ పిలిస్తే నీవు వెంకెతనం చెయ్యక నీవు దగ్గరకువెళ్ళి, ఏంకావాలో కనుక్కొని నాకొచ్చి చెబుతుండమ్మా' అని బుజ్జగించింది.

'ఒరే శాస్త్రిబాబూ, బావ బండి వాకిట్లో ఆగటంతోనే, నీవెళ్ళి ఆయన పెట్టె ఏదైనా ఉంటే, ఇంట్లోకి తీసుకొనిరా' అని వాడికిచెప్పింది. 'ఒరే రాధబాబూ, బావ రావటంతోనే, కాళ్లు కడుక్కునేందుకు నీళ్లు నేనే ఇస్తానుగాని, నీవుమటుకు తువాలా తీసుకొచ్చి ఇయ్యేం!'

అందరికి అన్ని పనులూ చెప్పింది.

'నేనేం జెయ్యాలే?' అని అడిగాను, నాకేమీ పనిజెప్పకపోవటం మూలాన.

'మీరేమి చేయనక్కరలేదు. ఊరుకొని నామీద కేకలేయకుండా ఉంటే అదే పదివేలు?' అన్నది.

ఆపళంగా ఆవిడ వంటఇంటిలోకి వెళ్ళిపోయింది చాలా హడావుడిగా.

౪

అల్లుడూ నేనూ బండి కట్టించుకొని వస్తున్నాము రైలు దగ్గరనుంచి. బండి ఇంటిముందు ఆగటంతోనే పసి పిల్లలు ఇద్దరూ, మమ్మలనుచూచి లోపలకు పరు

గెత్తుకుంటూ పోయి వాళ్ళఅమ్మకు చెప్పేశారు, బావ వచ్చాడని! మేము గడపలో కాలుపెట్టక ముందే అల్లుడికి అత్తగారు కాళ్లు కడుక్కునేందుకు నీళ్ళు ఇచ్చి క్షేమ సమాచారం అడిగింది. రాధాయ తువాలా ఇచ్చాడు. శాస్త్రీ పెట్టె తీసుకొచ్చి గదిలో పెట్టాడు.

ఆ అబ్బాయిని కుర్చీలో కూర్చోమని నేనూ, కాసేపు అసంగతులూ, ఈ సంగతులూ మాట్లాడాను.

పాపా, రాధాయ, బావ దగ్గర జేరారు. అతడు కూడా వాళ్ళనేదో మాట్లాడిస్తున్నాడు. నేను అవతల గదిలోకి వెళ్ళాను ఏదోపని చూచుకొంటానికి.

అల్లుడు వాళ్ళను ఏదో అడుగుతున్నాడు. మీ అమ్మ ఏం జేస్తున్న దన్నారు. మీ అన్నయ్య ఏం చేస్తున్నాడు? చదువుకొం టున్నాడన్నారు. మీ అక్కయ్య ఏం జేస్తున్నదని అడిగాడు. ఆపళంగా, వాళ్లిద్దరూ ఒక్కగంతులో వంట ఇంట్లోకి పరుగెత్తి 'అక్కయ్య ఏంజేస్తున్నదే అమ్మా' అని అడిగారు. 'ఎందుకురా నాయినా?' అన్నది ఆవిడ. బావ అడుగుతున్నాడని వాళ్ళిద్దరూ పెద్దగా చెప్పేశారు. ఆమె వాళ్ల నోళ్లునొక్కి 'అరవకూడదు. మేడపైని గదిలో ఉన్నది.' అని చెప్పి పంపించింది.

భోజనంచేస్తూ ఉన్నంతసేపూ ఆవిడ అంటూనే ఉన్నది. 'అయ్యో! ఇంత మోమాటమేమండీ అల్లుడికి, బొత్తిగా తినటేం?' అని.

భోజనాలు అయిపోయినై. 'మేడపైన పక్క వేసి ఉంది. పడుకో నాయనా కాసేపు.' అన్నది ఆమెగారు అల్లుడితో.

ఆ అబ్బాయి నవ్వుకొంటూ పైకి వెళ్ళాడు. తమలపాకులూ, వక్కలూ, అమ్మాయే తీసికెళ్లి మొగుడికి ఇచ్చి వచ్చింది. ఆతరువాత తల్లీకూతురూ, మాట్లాడుకొంటూ, నవ్వుకొంటూ భోజనాలు చేశారు.

నేను హాల్లోనే కూర్చుని ఒక అర్జంటు ఉత్తరం వ్రాసుకొంటున్నాను. ఆ ఉత్తరం పోష్టుకు పంపి, కాస్త పక్కమీద దొర్లుదామని అనుకొంటున్నాను.

ఇంతలో కాంతం వచ్చి నన్నొకసారి లోపలికి రమ్మని పిలిచింది.

'మాటండీ' అన్నది.

'చెబుదూ, ఏమిటో!'

'అల్లాకాదు. ఒక్కసారి రావాలె.'

'ఏమిటో రహస్యం!'

'అల్లుడొస్తేమటుకు ఇంత హడావుడా!' అని అనుకొన్నాను.

కాంతం నాకు దగ్గరగావచ్చి, రహస్యంగా అన్నది. 'విన్నారా, అల్లుడు పండగదాకా ఉండడుట!'

ఈమాట అని ఆవిడగారు, నన్ను వింతగా చూచింది. ఈ ఆశ్చర్యకరమైన వార్తవిని నేను నోరు తెరచి, 'అరే! ఏం? ఎందుకుండడూ?' అంటానని ఆవిడ అనుకొన్నది. నేను విని ఊరుకున్నాను.

'ఈరాత్రికి ఉండి తెల్లవారు ఝామును బండికి వెళ్ళి పోతాడట!' అని మళ్ళీ అన్నది.

'మరునాడు సోమవారం. ఆఫీసుకు పోవాలె. సెలవుపెట్టి రాలేదు కామాలు.' అని నేను అనుకొన్నాను. అందుకని ఆయన వెడతాడు అని తెలిసినపుడు నాకేమీ ఆశ్చర్యం కలగలేదు.

ఆమె అనుకోటం ఏమిటీ అంటే, ఇంత విచిత్రం ఎక్కడాకూడలేదు. ఇవ్వాళవచ్చి మళ్ళీ ఇప్పుడే వెళ్ళటం ఎక్కడన్నా ఉందా? అని.

౨

ఆవిడ అనుకొన్నట్లు నేను అనుకోక పోవటంవల్ల, నన్ను జూస్తే ఆవిడకు ఒళ్లు మండిపోయి ఉంటుంది. ఏమీ అనలేక చూస్తూ ఉండిపోయింది.

ఆవిడ చూపుల్లో రంగులు మారుతున్నయి. రక్తిమ కరిగిపోతున్నది. ఆవిడ కళ్లు నీలి కలువలైనవి.

ఆవిడస్థితి గ్రహించి నేను అన్నాను. ఎందుకే?

ఎందుకంత ఇదైపోతావు? అమ్మాయి పండగ వెళ్ళిందాకా ఉంటుందిగా?

కాంతం నెమ్మదిగా అన్నది. 'ఉంటుంది,లెండి' అందుకుకాదు నేననటం. అల్లుడుకూడా ఈ నాలుగురోజులూ ఉండి పండుగకు కొత్తబట్టలు కట్టుకుంటే నాప్రాణం సంతోషిస్తుంది.' అంటూ ఆవిడ గుండెపై చెయ్యివేసుకొని నావంక పసిపిల్లలాగ చూచింది.

కాంతాన్ని చూచేసరికి నా హృదయంకూడా ప్రేమతో దడదడలాడిపోయింది. కాని కొత్త బట్టల మాట ఏమిటి? ఈరోజులలో కొత్తబట్టలు కొనటం అంటే మాటలు గనకనా!

కాని ఏంజేస్తాము! అల్లుడాయె! చిన్నవాడు! బట్టలు పెట్టకుండా ఎల్లా పంపుతాము. అందుకని నేను అన్నాను 'సరే బట్టలు పెడదాములే! నీ వన్న మాటా నిజమే! అల్లుణ్ణి పండుగదాకా ఉండమను.'

'అన్నాలెండి పండగకు నమ్మని అన్నాను' అన్నది.

'మరి ఇంకేమే?' అని నేను విసుక్కున్నాను.

'అయితే మరి అయనగారు ఏమన్నారో వినరేం? పండగకు ఒక్కరోజే సెలవ. రావటానికి వీలుండదండీ?' అన్నాడు. నేను ఏమీ మాట్లాడలేదు. మళ్ళీ ఆవిడే అన్నది. 'అమ్మాయినికూడా చెప్పమన్నాను. చెపితే వింటేనా? మళ్ళీ ఆమాటే అన్నాడట!' అని ఆవిడ నావంక దీనంగా చూచింది.

'సెలవు ఇయ్యకపోతే ఎట్లా వస్తాడే పిచ్చిదానా? పోనీ ఇంకో పండుగకు వస్తాడూ?' అన్నాను.

'అదికాదండీ, అమ్మాయీ, అల్లుడూ ఇద్దరూ పండగకు ఇంట్లోఉండి కొత్తబట్టలు కట్టుకుంటేగాని నా ప్రాణం సంతోషించదు.'

'అయితే పండగకు రమ్మని గట్టిగా అను' అన్నాను.

'అంటానులెండి. మీరుకూడా అనండి. ఇద్దరమూ, అంటాము అనుకోండి. దానికికాదు, రావటానికి వీలు లేదు అంటే ఎట్లాగూ అని?'

వీలులేకపోతే ఏంజెయ్యాలో నాకు తోచలేదు. నాకు తోచిందల్లా ఒక్కటే. ఆయన రాకపోతే కొత్తబట్టలు కొనే కర్చు తప్పిపోతుంది!

ఈమాట కొన్స్తా బయటికి అంటే ఆవిడ ఏమనుకుంటుందో అని మాట్లాడక ఊరుకొన్నాను. ఒక్క నిమిషం ఊరుకొని ఆవిడే అన్నది 'ఏమంటారు?'

'ఏమంటానికీ నాకు తోచటంలేదు. రావడానికి వీలులేదు అంటే ఇంకొకసారి అంటాము రమ్మని! ఇంకోసారి, ఇంకోసారి అంటాము. ఆయన రానన్న కొద్దీ ఇంకా గట్టిగా రమ్మని ప్రతిమలాడుదాము. నాకు అంతవరకు తోస్తున్నది! అంతకంటే ఏం జేస్తాం? అన్నాను. 'అబ్బ! వేళాకోళమా ఏమిటండీ? నేను చెప్పేది ఏమిటంటే, పండగకు ఎట్లాగూ బట్టలు పెట్టాలిసే ఉండె! ఇప్పుడే......'

'శ్రీహరోహరీ! మరీ బాగుంది ఈ వ్యవహారం! రాకపోయినా బట్టలుపెట్టే ఏర్పాటు చేస్తివా, అన్ని పండుగలకూ, కొత్తబట్టలు పోస్టుద్వారా పంపాలిసి వస్తుంది?' అన్నాను.

'ఏమి మాటలండీ అవి! అన్ని పండగలకూ బట్టలు పంపుతామా ఏమిటి? పండగముందు వచ్చాడు కాబట్టి నే ననటం?' అని ఆవిడ అన్నది.

'అయితే పండగదాకా ఉండమని అను మర్యాదకు ఏమీ లోపం రాకుండా! ఆయన అంతగా ఉండకపోతే ఏంజేస్తాము? మాట్లాడక ఊరుకో.'

'అవ్వ! మీ ఇల్లు బంగారంగానూ! ఊరుకొంటే మర్యాదగా ఉంటుందంటారా? పండగముందు వచ్చిన అల్లుడికి బట్టలు పెట్టకపోతే ఏమైనా బాగుంటుందా మీరే చెప్పండి?'

'ఏమో బాగుంటుందనే తోస్తుంది. నేను అనేక సార్లు వెళ్ళాను మా అత్తారింటికి పండగముందు. నాకు ఎప్పుడూ బట్టలు పెట్టలేదు.' అన్నాను.

కాంతం తెల్లపోయి 'అయితే, దానికీ దీనికీ సంబంధం ఏమిటండీ?' అన్నది.

'ఇంత తెలిసిందానివి కదా నీవూ! అప్పుడీ తెలివి ఏమైపోయిందీ అంటా? మీ నాన్నతో చెప్పి పెట్టించ లేకపోయినావూ?' అన్నాను గొంతుక కాస్త పెద్దదిచేసి.

కాంతం ముఖం ఇంతచేసుకొని అన్నది 'ఇప్పు డెందుకండీ అదంతా? అయినా ఇప్పటి సంగతి చెప్పండి?'

అయినా నేను ఊరుకోక 'ఇప్పుడు ని కూతురి విషయం వచ్చేసరికి అన్ని మర్యాదలూ తెలిసొచ్చి నయ్యేం?' అన్నాను ఎత్తి పొడుపుగా.

కాంతం ఒక్క నిమిషం ఆలోచించి, ఇల్లా అన్నది 'చూడండి, నాకూతురు విషయంలో అన్ని మర్యా దలూ మీరు జరపండి. మీకొడుకు విషయంలో మళ్ళీ ఇన్ని మర్యాదలూ జరిగేలాగున నేను చూస్తాను. సరేనా?'

ఏం జేస్తాం. మాట్లాడకుండా పెట్టెతీసి ఉన్న డబ్బంతా తీసుకొన్నాను. నెల అంతా గడపటానికి అట్టిపెట్టుకొన్న డబ్బు అది. అది కాస్తా కర్చు అయిపోతే ఎల్లా గడవాలో భగవంతుడికే తెలి యాలె. ఏం జేస్తాం? అల్లుడొచ్చాడాయె మరి!

కట్టుకొన్న బట్ట బొత్తిగా మాసిఉన్నది. పెట్టెలో నుంచి తీసి ఇంకొకటి ఇయ్యమన్నాను. 'ఇదొక్కటే ఉంది. కాస్త చినిగినట్లుంది.' అంటూ ధోవతి నాచేతి కిచ్చింది ఆవిడ. మూద్దునగదా రూపాయి వెడల్పున చినుగు ఒకటి కనపడ్డది.

ఆ చినుగువంక చూస్తూ ఒక నిమిషం నుంచు న్నాను. ఆ పాతగుడ్డ నోరుతెరుచుకొని 'నీ దారి ద్ర్యాన్ని ప్రపంచానికి చెపుతానని' భయపెట్టింది!

ఏడిసింది. ఈ మాత్రానికి నేను భయపడుతానా? ప్రపంచమంతా నోరు తెరుచుకొని చూచినా, నేను లెక్క చెయ్యదల్చుకో లేదు. దానినోరు గట్టిగా కుట్టేసి ఆ బట్టే కట్టుకొని బజారుకు బయలుదేరాను. కాంతం వీధిగుమ్మంలో నుంచుని 'భోజనంచేసి కాసేపు పడుకోకుండా, వెడుతున్నారు పాపం. ఎండ కూడానూ' అన్నది.

ఏం జేస్తాము. అల్లుడొచ్చాడాయె!

౬

బట్టలకొట్లో వర్తకుడు కూడా అల్లుడుగారికి పెట్టేవి కాస్త ఖరీదు గలవిగా ఉండాలండీ, లేక పోతే దర్జాగా ఉండదని చెప్పాడు. నేను కాదన లేదు. నాధోవతిలోని చినుగు మాత్రం అతడు చూడ కుండా జాగ్రత్తపడ్డాను. అల్లుడికి పెట్టాలిసినగుడ్డలు కొన్నాను.

అమ్మాయికో? దానికి చీర ఎట్లాగూ కొనా లెగా, దానికోసం ఇంకోసారి ఎందుకూ? అని అప్పుడే ఒక మంచి జరీచీర కూడా కొనేశాను.

అంతా యాభైరూపాయలు బిల్లు అయింది. నా దగ్గర ఉన్న నలభై ఇచ్చి, మిగిలినది తరువాత ఇస్తా నన్నాను. ఆయన ఒప్పుకొన్నాడు.

ఈబాకీ మొత్తం నేను ఇచ్చే అంతవరకూ, నెలకు నూటికి రూపాయిన్నర వడ్డీ అని కూడా వ్రాశాడు.

పోనీ ఏం జేస్తాం. సమయానికి అప్పు దొరికింది. అదే సంతోషం అనుకొని ఇంటికి వచ్చేశాను.

అప్పటికి అయిదు గంటలే అయింది. చీకటిపడ్డ తరువాత కొత్తబట్టలు కట్టుకోకూడదు. అందుకని అప్పుడే కాఫీ అదీ అయిపోయిన తరువాత, కొత్త బట్టలకు పసుపుపెట్టి అల్లుడికి ఇచ్చాము. అల్లుడు కట్టుకొన్నాడు. అమ్మాయి తలుపుపక్కన నుంచుని చూచి సంతోషించింది. ఆవిడా నేనుకూడా చాలా సంతోషించాము.

మా ఆవిడ తెల్లవారు ఝామున మూడుగంటలకే లేచి అల్లుడు స్నానం చేయటానికి వేడినీళ్లు కాచింది. ఆయనలేచి ముఖం కడుక్కొని స్నానం చేసాడు.

ఇంతలో అమ్మాయి కాఫీ తయారు చేసింది. 'ఇక లేవండి. ఆ అబ్బాయి బండి కెడుతున్నాడు' అంటూ ఆవిడవచ్చి నన్ను లేపింది. నేనూ ముఖం కడుక్కు

న్నాను. అల్లుడూ, నేనూ, అమ్మాయీ పిల్లలూ అంతా కలిసి కాఫీతాగాము.

ఆయన కాఫీ తాగేలోపుగా మా పెద్దవాడువెళ్ళి జట్కా పిలుచుకొని వచ్చాడు.

తెల్లారగట్ల బండి ఎక్కుతూ ఉంటే అమ్మాయి ఏమిటో తల్లితో గుసగుసలాడింది. ఆవిడ అన్నది, 'ఏమాత్రం వీలున్నా పండగకురా నాయనా. ఒక్క రోజుఉండి వెళ్లుదువుగాని.'

అమ్మాయి ఏమీ అనలేదు కాని ఆయనవంక ఏదో దీనంగా చూచింది.

పాప 'బావా, పండగకు తప్పకుండా రావాలె' అన్నది.

పిల్లలు ఇద్దరూ 'తప్పకుండా రాబావా' అని చేతిలో చెయ్యి వేయించుకొన్నారు. నేనొక్కడినీ ఊరుకుంటే ఏంబాగుంటుంది. 'తప్పకుండా రావయ్యా. మీ ఆఫీసరుకు నేను చెప్పానని చెప్పు. సెలవు ఇస్తాడులే' అన్నాను.

నవ్వుతూ అన్నమాటే అయినా చాలా దర్జాగా అన్నానని సంతోషం కలిగింది. ఆయన నవ్వి ఊరుకొన్నాడు. చిన్నతనం. ఏమంటాడు అయినా? బండి మలుపుతిరిగేదాకా నుంచుని ఇంట్లోకి వచ్చేశాము.

పిల్లలు మళ్ళీ పడుకొన్నారు. అమ్మాయి మేడపైకి వెళ్ళింది.

నేను కాంతంతో అన్నాను 'నలభై రూపాయలూ అయిపోయినై. ఎట్లాగడపటం నెలకు నెలంతా?'

'ఎట్లాగో గడుస్తుంది లెద్దురూ. ఊరికే బెంగపెట్టుకోకండి.'

'బెంగ అంటే బెంగకాదూ, నాకు ఊరికేఎక్కడ నుంచి అయినా వచ్చిపడుతుంది కనకనా. ఈపాడు స్కూలుమాస్టరీ ఉద్యోగంలో జీతానికి వృద్ధిఅంటూ లేదు. నేను నా చిన్నతనంలోనే గనుక తాలూకా ఆఫీసులో ప్రవేశించి ఉన్నట్లయితే, ఈపాటికి డిప్యూటీ కలెక్టరును అయి కూర్చునేవాణ్ణి' అన్నాను.

'పోనిద్దురూ, ఉన్నదాంతో సంతోషిద్దాము.' అన్నది ఆవిడ. ఎప్పుడూ ఆమాటే అంటుంది.

అందుకని నాకు ఒళ్ళుమండుకొచ్చి అన్నాను 'అదిగో, నీకు అల్లాంటి బుద్ధి ఉండబట్టే డిప్యూటీ కలెక్టరుగారి భార్య అయ్యే యోగ్యత నీకు లేకుండా పోయింది. తెలిసిందా?'

ఆవిడ ఏమీ మాట్లాడలేదు. అల్లుడొచ్చాడన్న సంతోషమో, మరి ఏమిటో. ఆవిడ ఈ మాటలు పట్టించుకోనే లేదు. భగవండికి నమస్కరిస్తున్నది.

2

పండగ రేపు. ఆరోజు అందరూ కొత్తబట్టలు కట్టుకోవాలె.

పాపకు పరికిణీ, చొక్కా కొత్తవి ఉన్నవి. మిగిలిన పిల్లలకుకూడా, ఇదివరలో కుట్టించిన వాటిలో ఈ పండగకు అని అట్టిపెట్టినవి ఉన్నవి. అమ్మాయికి కొననే కొంటిని. ఎటొచ్చీ ఆవిడకే లేదు.

ఆవిడకు ఒక్కత్తైనా లేకపోవటం ఏమని బజారు కెళ్ళి, ఆ కొట్లోనే పద్దు వ్రాయించి ఇంకో చీర తెచ్చాను.

పండగొచ్చింది!

ఆ రోజున పిండివంటలతో సహా వంటచేస్తున్నది మా ఆవిడ. నేను మొత్తం అయిన ఖర్చు లెక్క జూసుకొంటున్నాను.

రెండు చీరలూ, నలభై.

అల్లుడికి పెట్టిన బట్టలఖరీదు ముప్ఫైరెండు.

కూరలు మొదలైనవాటికి అంతా కలిపి ఎనిమిది.

మొత్తం ఎనభైరూపాయలతో పండగ వెళ్ళేటట్టుగా ఉంది.

పది గంటలైంది. ఆవిడ అందరినీ అన్నాలకు లెమ్మంటున్నది.

ఇంతలో ఇంటిముందు జట్కా ఆగింది. పిల్లలు పరుగెత్తుకుంటూ వచ్చి, సంతోషంగా చెప్పారు 'బావ వచ్చాడ'ని.

'పండగరోజుకు ఎల్లాగో సెలవు సంపాదించి

వచ్చావు నాయనా? చాల సంతోషము' అని పలకరించింది మా ఆవిడ.

అమ్మాయి స్నానానికి నీళ్లు తోడింది.

రాధాయి తువాలా ఇచ్చాడు.

'ఇహ ఎందుకూ ఆలస్యం? స్నానం చెయ్యండి' అని కాంతం నన్ను తొందరపెట్టింది. భోజనాలు చేశాము. పండగరోజున అల్లుడొచ్చాడని అంతా సంతోషించాము. నేను కాస్త నడుమువాల్చాను. కాని నాకొక ఆలోచనవచ్చి, నిద్రపోనియ్యలేదు. నాలుగు గంటలకు అంతా కొత్తబట్టలు కట్టుకొంటారు గదా, ఆయన సంగతి ఏమిటీ అని నాకు దిగులుపట్టుకొంది.

మొన్ననే క్రొత్తబట్టలు ఇచ్చాం. మొన్న ఇచ్చాం గదా అని ఊరుకోవాలా? పిల్లలంతా కొత్తబట్టలు కట్టుకుంటారు. ఆయన ఏం జెయ్యాలె?

ఇదివరలో పెట్టిన బట్టలే తీసి కట్టుకోమంటే బాగుంటుందా ?

ఒకసారి పసుపుపెట్టి కట్టివిడిచిన బట్టలు మళ్లీ కట్టబెట్టడం ఏమిటి ? ఇవీ నా సందేహాలు.

అయితే మళ్లీ కొత్తబట్టలు కొనుక్కొని రావలసిందేనా ? ఆరి బాబా, ఈ సమస్య తేలటం ఎల్లాగు?

పండగముందు ఒకసారి బట్టలు పెడితే మళ్లీ పండగకు అనునిషికే బట్టలు పెట్టకూడదు, అని ధర్మశాస్త్రంలో ఉందని ఎవరైనా చెపితే బాగుండును.

ఇంతలో కాంతం వచ్చింది.

'పండగపూట అల్లుడు రాడేమో ననుకొన్నాను, వచ్చాడు పాపం. తమాషాగా లేదూ ?' అన్నది సంతోషంతో. నాకు ఆయన రావడం నిజంగా తమాషాగానే ఉన్నది. అందుకని నిజమేనని ఒప్పుకొన్నాను. ఆవిడ మళ్లీ అన్నది 'మీరు ఈ కాసేపు నిద్రపొండి. నాలుగు గంటలకు అంతా క్రొత్త బట్టలు కట్టుకొంటారు, చూచి మరీబైటకు వళ్లండేం?'

నేను తల ఊపాను.

కాంతం ఉలిక్కిపడి అన్నది 'కొత్తబట్టలంటే జ్ఞాపకం వచ్చింది. అల్లుడికీ...'

'ఆఁ ఆఁ అదే అదె! ఇదివరకే పెట్టేశాం' అన్నాను నేను.

'అయితే—' ఏమో అనబోతున్నది ఇంకా.

'అయితేలేదు. గియితేలేదు' అన్నాను. అంతటితో ఆవిడ ఊరుకోక 'కొంచెం చిక్కే వచ్చిందండోయ్. ఇప్పుడెట్లా? అమ్మాయి, పిల్లలూ, నేనూ, కొత్తబట్టలు కట్టుకొంటాము గదా. ఆయనకు ఇవ్వకపోతే ఎట్లా?' అని అన్నది.

'నేను మళ్ళీ ఇప్పుడు కొనలేను బాబూ. పోనీ, మనం అంతాకూడా క్రొత్త బట్టలు కట్టుకోటం మానేద్దాం.'

"ఎట్లాగండీ, పండగపూట. అదీగాక, పుట్టింటికి వచ్చిన ఆడబడుచు పండగపూట క్రొత్తచీర కట్టుకోకుండా ఉండటం ఎట్లా?"

ఛీ, నాకే కష్టం వేసింది.

'పోనీ, ఆయనను, మొన్న మనం ఇచ్చిన బట్టలే కట్టుకోమంటే?' అన్నాను. కాంతం చిక్కు విడిపోయినట్టు సంతోషించి 'సరే, ఇంకేం, అల్లాగే చేద్దాము' అన్నది. దీనికి ఆవిడ ఒప్పుకోదేమో అని భయపడుతున్నాను ఇందాకటినుంచి. ఆవిడ 'సరే' అనేసరికి నాకు సంతోషం వేసింది. కాని 'అమ్మాయి ఏమన్నా అనుకొంటుందేమో' అన్నాను ఆవిడతో.

'ఆఁ అదేమనుకొంటుంది. దానికమటుకు తెలియదా?' అన్నది కాంతం.

'కాస్త అమ్మాయితో ముందుగా చెప్పు' అన్నాను.

'ఇప్పుడే మాట్లాడివస్తానుండండి. అయినా అదేమి అనుకోదు. మీకాభయమక్కరలేదు' అని అంటూ ఆవిడ వెళ్ళింది.

# సంక్రాంతి పండగ

అరె! తమాషే! కాంతం ఒప్పుకొన్నదే! మా కాంతం ఇంత మంచిదని నేనెప్పుడూ అనుకోలేదు.

౮

నేను సంతోషంగా ఉన్నాను.

పది నిమిషాలైన తరువాత ఆవిడ వచ్చింది. నేను అడిగాను ఆదుర్దాగా 'అదేమీ అనలేదుగా ?'

'అదేమంటుంది అండీ ? అమ్మాయీ, ఆయనగారి పెట్టెతీసి అంతా వెదికింది. ఆయన మనం పెట్టినబట్టలు తేనేలేదుట ! అక్కడే వదిలేశాడు కామాలు' అని చెప్పింది.

నేను ఒక్కమాటకూడా మాట్లాడలేకపోయినాను. కాసేపుండి 'ఏం జేద్దాము !' అన్నాను, నీరసించిన గొంతుకతో.

'ఏం జేస్తామండీ. పండగకు అల్లుడు ఇంటికొచ్చె. కొత్తబట్టలు కట్టుకొని కనపడకపోతే నలుగురూ నవ్విపోతారు.' అన్నది.

ఇక నేను మాట్లాడలేకపోయినాను. ఏం, మాట్లాడేది. నలుగురిచేత నవ్వించుకొంటామా ?

ఒక్క నిమిషం అయిపోయింది.

కాంతం నావంక జూచి, 'ఎందుకండీ అంత బీదపడిపోతారూ?' అని అడిగింది. నాకు ఒళ్లు మండిపోయింది. 'ఏం జెయ్యమంటావే. నా బొంద. ఇప్పుడు మళ్ళీ ధోవతీ, ఉత్తరీయం కొనుక్కు రావలసిందేగా! ఎక్కడనుంచి తెచ్చేది?'

'మీరేమీ తేనక్కరలేదు లెండి.'

'తేకపోతే ఎక్కడినుంచి వస్తుంది డబ్బు?'

కాంతం నవ్వుతూ 'ఇందండి' అని పాతికరూపాయలు లెక్కపెట్టి నా కిచ్చింది.

ఆవిడదగ్గర కొద్దో గొప్పో డబ్బు ఉంటూనే ఉంటుంది. నేను ఇచ్చిన డబ్బులోనే కొస్త కొస్త మిగుల్చి వెనకేసుకోటం ఆమెకు మామూలు. అందుకనే, ఆవిడ నాకు డబ్బు ఇస్తుంటే, నాకు ఆశ్చర్యం కలగలేదు.

కాంతం దగ్గర ఇంకా ఏమన్నా డబ్బు ఉందేమో అని తోచింది. 'కాంతం నీవు...చాలా మంచిదానివి గానీ...చూస్తున్నావుగా ఇబ్బంది. ఇంకేమన్నా ఉంటే ఇయ్యి.' అన్నాను.

ఆవిడ చాలా విచారపడుతూ, "నా దగ్గిర డబ్బు ఎక్కడిదండీ. ఇదైనా అమ్మాయి ఇచ్చింది.' అన్నది.

'అమ్మాయి ఇచ్చిందీ?' ఆశ్చర్యంగా అడిగాను.

'అవును అమ్మాయే ఇచ్చిందండి. అల్లుడు పెట్టెలో క్రొత్తబట్టలు లేకపోవటం జూచి నాతో అన్నది. 'అమ్మా, నా దగ్గరఉండి కొద్దిగా డబ్బు, ఇది నాన్న కిచ్చి, కొత్తబట్టలు కొనమనవే' అని.

అమ్మాయి మటుకు బంగారు తల్లికాదూ అనుకొన్నాను. దాని డబ్బు తీసికొంటానికి నాకు ఏమాత్రం మనస్కరించలేదు. పాపం, బిడ్డ ఎంత కష్టపడి దాచుకొన్నదో ! మనస్సు చివుక్కుమన్నది.

అందుకని ఆవిడతో అన్నాను 'ఇంద. అమ్మాయికి ఇచ్చెశెయ్యి. దాని డబ్బు నేను తీసుకుంటానుటే నా స్థితిజూచి ఇస్తేమటుకూ ?'

కాంతం తెల్లపోయింది.

'మరి ఏం జేస్తారూ ?' అన్నది.

'ఏమిటిచేసేది. ఎక్కడో పద్దువ్రాయించి తెస్తాను. నా అవస్థ నేను పడతాను' ఇల్లా అని పైన ఉత్తరీయం వేసుకొని గబగబా నడిచి పోయినాను బజారుకు.

౯

సాయంత్రం నాలుగు అయింది. కాఫీ తాగాము. అంతా పసుపుపెట్టిన కొత్తబట్టలు కట్టుకొన్నారు, పిల్లలూ, అమ్మాయీ, ఆవిడా, అల్లుడూ అంతా.

నేను గదిలో కూర్చుని ఉన్నాను.

ముందు కాంతం వచ్చి నా పాదాలను కళ్లనద్దుకొని నమస్కారం చేసింది. క్రొత్తచీర కట్టుకొన్నది. నాకాంతం. మంచి కాంతం. పిల్లలు ఒక్కరొక్కరే వచ్చి, నా పాదాలు ముట్టుకొని నమస్కరించారు.

బంగారు తల్లులు. ఒక్కొక్కరినే ముద్దాడి దీవించాను.

చివరకు అమ్మాయీ, అల్లుడూ, క్రొత్తబట్టలుకట్టు కొని కలకలలాడుతూ వచ్చారు. ఇద్దరూ ఒక్కసారే వంగి పాదాభివందనం చేశారు.

ఆనందంతో ఒళ్లు మరిచిపోయినాను. నాబిడ్డ, నా మక్కు తల్లి సంతోషంగా ఉంది. అదే చాలు నాకు. కాంతం తలుపుదగ్గర నుంచుని చూస్తున్నది. ఆమె కళ్లల్లో మెరుపులు మెరిసినై. ముత్యాలు రాలినై తల్లి, తల్లాయె మరి! ఆమె నావంక, పిల్లలవంకొ, అమ్మాయివంకొ అల్లుడివంకొ, కళ్లుతిప్పి, ఆనందంతో గర్వంగా నవ్వింది.

చాలు. నా జీవితానికి ఈ మధురక్షణముచాలు. ఈ దివ్యక్షణాన్ని ఆశించి జీవి ఎంతటి త్యాగాన్ని అయినా భోగంగా అనుభవించగలడు అనుకొన్నాను.





నల్లమందు భాయీ

శ్రీ పి. దాస్ గుప్తా



అబిసీనియనుల బాధలు

శ్రీ పి. దాస్ గుప్తా

# మిట్ట మధ్యాహ్నం

## శ్రీ సౌరిస్

రా—రాలేదు.

సుందర్ పడిపోయాడు కింద

నాకందకండా కొమ్మమీద కూచుని.

ఎక్కిరిస్తోంది రామచిలక.

కలకలమని నవ్వుతో పువ్వులుకోస్తోంది కోతి, కోమలమయిన హస్తాలతో.

లతలన్నిటినీ లాలిస్తోంది లలిత.

లలిత నుంచుంది. కోలకళ్ళతో కోరల్లాంటి చూపులతో ఊపిస్తోంది. వొయ్యారంగా మెలికలు తిరిగి మెరుపులాగ మెరిసిపోతో మిడిసిపడుతో, మిడత లాగ ముద్దుగా ముత్యంవంటిపిల్లని ముద్దులాడుతో నుంచుంది.

కంచుగంటమోగుతోంది, గుళ్ళో, బళ్ళో, వొళ్ళో తల పెట్టుకుని పడుకున్నాడు. సుందర్, నాపిచ్చిసుందర్.

నేనే లేకపోతే ఏమౌతావు, నువ్వు నా పిచ్చి నాన్ !

నిన్ను చూస్తే నాకు చిన్నప్పటే ఎంతో ఇష్టం, వెర్రీ, పిచ్చీ.

కళారవీ, నవకవీ.

నిర్దోషి అయిన కవిని కైదులో పెట్టారు, పాపం, కాలు విరగకొట్టారు, కట్టి పారేశారు. చెరసాలలో మన్ను మశానం కలిపి తినమన్నారు. తిండిపెట్ట మన్నారు రాకాసిలాగ కేకలేశారు.

రా—రాలేదు. రాకపోలేదు వొచ్చారు.

ఎన్నో రోజులనించి చూస్తున్నాను నిన్ను నిర్మలా! ఏమిటంత దిగులు నీకు ? నిర్మల, నిర్మలమైన మనసు చెలరేగింది. హోరెత్తింది, హోహో అంది.

హోసీ, అని నిట్టూర్పు విడుస్తాడు రఫీక్-హ్హహ్హ హహ అంటాడు సైగాల్ మహాశయుడు.

యువకుడు కూనిరాగాలు తీస్తున్నాడు. ఫెళేల్ మని చెంపమీద దెబ్బపడింది, పాతాళానికి జారాడు జావలాగ జగత్తుకిందికి. జంగం కథలోని జెంగిజ్ ఖాన్ లాగ.

తుపాను, భీకరమయిన తుపాను. తుపాకీల, నర ఫిరంగుల మర్మం ఎవరికి తెలుసు ?

కలిసి మెలిసి తిరిగేవాళ్ళకే కోపం ఆమెని చూస్తే. ఇంక నీకా, నాకా !

ఏమంటావు ?

మందాకినీ మలయమారుత మండోదరి, మనస్తాప పడుతోంది. మమతతో మమేకంగా మారిపోతో.

మాలిని వొచ్చింది, మంచి నవ్వుతో, పువ్వులు పట్టుకుని పట్టుచీర కట్టుకుని.

"ఏమి కావాలి ?" అంది మండోదరి, సహోదరితో సామాన్యంగా చూస్తో.

"నువ్వు కావాలి" అంది మందాకినీ మలయమారుత మాలిని, మమకారంతో ఆమె వంక చూసి.

మూరఖ్ కాన్, తుఝుసంఝూయే అని పాడుతున్నాడు క్రిష్ణ చంద్రడే, చంద్రుణ్ణి చూసి నవ్వుతో.

నేను మాత్రం దడదడా కొట్టుకునే హృదయంతో నలిగిపోయి వాడిపోతున్న సంపెంగ పువ్వులని చేతులో పట్టుకుని కన్నీళ్లుకార్చాను.

ఏరియల్, ఏరియల్, ఏమైనావు? నాహృదయం తల్లడిల్లుతోంది, తపనపడుతోంది. తంటాలుపడు

తున్నా నీకు జాలి అనేది లేదా? నా angel ఏమయి నావు?

మరపు మసకల తెరల్లోంచి నాతో దోబూచులాడుతున్నావా? నాకందవా? నీ కందిపోయేటంత కోమలమైన దేహాన్ని నాచేతుల్లో పట్టుకోవడమే భయమేస్తోంది. నాకు, నా పెదిమలు అదుముకుని నీ పెదిమలు కరిగిపోతాయేమోనని భయం.

అన్నీ భయాలూ, భీకరాలు.

రా—వొచ్చారేమోనని ఉలిక్కిపడ్డాను ఎందుకో అంత అదిరిపాటు నాకు! కళ్లు నెత్తికొచ్చాయి. వాటిని లెఖ్ఖచేయడం మానేశాను.

నేనంటే నాకే లెఖ్ఖలేదు. ఇంకోరంటే నాకు లెఖ్ఖా!



# భారత సాహిత్య పరిషత్తు

శ్రీ 'వాత్సవ'

భారతకళాసాహిత్య పరిషత్తు సంస్థాపనవిషయమై ఒక అర్ధశతాబ్దికి పైనుండి మనదేశంలో పలువురు కళాస్రష్టలూ, రచయితలూ, కవులూ శ్రద్ధవహించి కృషిచేస్తున్నారు. కాని, భారతభూమి ఇంతవరకు పరాధీనంగానే ఉన్నది,అన్న కారణంచేత స్వాతంత్ర్య సిద్ధి పొందేవరకు ఇటువంటి ప్రముఖసంస్థ సంస్థాపించడం అంత సముచితం కాదేమో అని పలువురు అభిప్రాయపడ్డారు. స్వర్గీయ ధన్‌వత్ రాయ్‌వర్మ, హిందీ, ఉరుదూ రచయిత మున్షీ ప్రేమ్‌చంద్ ఒక సంస్థ స్థాపించారు. దానికి కన్హైలాల్ మున్షీలాంటి వాళ్లు దోహదంచేశారు. ఇంతలో ప్రేమచంద్‌జీ స్వర్గస్థులయిన కారణంచేత యీసంస్థకూడా హరించి పోయింది. గురుదేవుడు రవీంద్రుడు పరమపదించిన తర్వాత వారి స్మృతిచిహ్నంగా యీ పరిషత్తు స్థాపించాలనే ప్రయత్నం జరిగింది. వారి స్మారకనిధికి ఇంకా ధనసేకరణే పూర్తికాలేదు.

ఈలోపున జయపూరులో రచయితల మహాసభ జరిగింది. ఆ సభకి లండన్‌నించి వచ్చిన ఇ. ఎన్. ఫారెస్టర్, అధ్యక్షత వహించిన సరోజినీదేవిగారలు, సందేశం పంపిన పండిత నెహ్రూవంటి ప్రముఖులు, ఈ సంస్థయొక్క ఆవశ్యకతను గుర్తించారు. కాని గట్టిపూనికతో కూడిన ప్రయత్నం దేశంమొత్తంమీద జరగలేదు. జాతీయప్రభుత్వంవంటిది నాడు ఏర్పడింది. ఈ సంవత్సరారంభంలో బొంబాయిలో జరిగిన కేంద్రవిద్యాసలహా సంఘ సమావేశంలో శ్రీ సి. రాజగోపాలాచారిగారు తిరిగి దీని ప్రస్తాపన తెచ్చారు. భారతదేశానికి అంతర్జాతీయకళాసంఘాల లోనూ, విజ్ఞానసంస్థలలోనూ ప్రత్యేక ప్రాముఖ్యం వచ్చే యీసమయంలో అఖిలభారతసంస్థలు స్థాపించాలనీ, అవి దేశసంస్కృతినీ, జాతీయతనూ, ఏకతనూ నిరూపించేవిగా ఉండాలనీ గుర్తించారు. అటువంటి సంస్థలయిన కళాపరిషత్తు, సాహిత్యపరిషత్తు, విద్యాపరిషత్తు, విజ్ఞానపరిషత్తూ ఏర్పడి, ఆసేతుహిమాచల పర్యంతం కళాసాహిత్యాదిరంగాలలో జరుగుతూ వున్న కృషికి తగినప్రాధాన్యం యివ్వాలని సంకల్పించారు. భారతప్రభుత్వం ఇంత మంచికార్యం చేపట్టడంవల్ల తదితర స్వతంత్రరాజ్యాలలోని కళాసంస్థలకులాగే మనదేశసంస్థలకి సైతం విశిష్టత యేర్పడి అంతర్జాతీయ గౌరవంపొంది తీరతాయి. విజ్ఞానపరిషత్తు విషయమై ఈ అభిప్రాయాన్ని సర్ సి. వి. రామన్ పండితుడు వెలిబుచ్చాడు. ఇదియింకా నిర్మాణదశలోనే ఉన్నసమయంలో ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం ఏ భాషాప్రదేశానికి ఆభాషాప్రదేశం ఒక శాఖ స్థాపించి అఖిలభారతీయసంస్థ ఆదర్శపద్ధతుల్లో నిర్వహించడానికి తోడ్పడవచ్చు. మనరాష్ట్రంలో శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావుగారు ఈవిషయంలో చిరకాలంనించి కృషిచేస్తున్నారు. వారు తలపెట్టిన అఖిలభారతీయసంస్థకి ఇంతవరకు అంగవంగకళింగ తమిళ కేరళ కర్ణాటకాది ప్రాంతాలలోని ప్రోత్సాహంకూడా లభించింది. అన్నిప్రాంతాలలోనూ సమర్థులయిన కళాకారులూ, రచయితలూ వీరి ఉద్యమానికి చేయూత ఇవ్వడానికి వాగ్దానాలు చేశారు. ఆసలీ సంస్థ ఆచరణలోకి రావడానికి ప్రఖ్యాత ఐరిష్ రచయిత, కళాభినేత అయిన జేమ్సు కజిన్సు చక్కని

పథకం ఒకటి తయారుచేసి ప్రకటించారుకూడాను. పరిషత్తు ఎలాగు ఉండాలి? కళా, సాహిత్య శాఖలకి వేరుపరిషత్తులు కావాలా? వాని ఉద్దేశాలు ఏమిటి? ప్రయోజనాలు ఏమిటి? అవి నిర్వహించవలసిన కార్యక్రమాలు ఏమిటి? వానికి తగినంత ప్రాతినిధ్యం, బాధ్యత కలిగించే విధానం ఏది? ఎవరు సభ్యులుగా ఉండాలి? ఇటువంటి వివరాలన్నీ అన్ని ప్రాంతాలవారూ, అన్ని భాషలవారూ తర్జన భర్జన చేసి నిర్ణయించవలసిన అంశాలు. ఇటువంటి లోక్షోత్తరసంస్థలు ఏర్పరచేముందు తొందరతో ఏ నిర్ణయాలూ జరగనీయకుండా ప్రభుత్వం జోక్యం కలుగజేసుకోకుండానే కళాభిమానులు, సాహితీప్రియులు ఆలోచన చెయ్యాలి.

ఈ విషయంలో ఆంధ్రదేశంలో శాఖ స్థాపించాలని ఆంధ్రశిల్పిలో శ్రీ సింగరాచార్యగారు వ్రాసినదానిలోనూ, దానిమీద సంపాదకీయవ్యాఖ్యలోకూడా ఉటంకించారు. అయితే యీ ఆంధ్రశాఖ ఏ స్వరూపం వహించాలని చూద్దాం. ప్రస్తుతం మన ఆంధ్రదేశంలో ఉన్న సాహిత్యసంస్థలు, ఆంధ్ర సాహిత్య పరిషత్, నవ్యసాహిత్యపరిషత్, సాహితీసమితి, ఆంధ్ర అభ్యుదయ రచయితలసంఘం, ఆంధ్రసారస్వతపరిషత్ ప్రజాసాహిత్యమండలి మొదలయినవి వున్నవి. ఈ సంస్థల ప్రతినిధులందరితోనూ ఒక సమావేశం జరిపి వారికితోడు తెలుగు తెలిసి హిందీ, ఉరుదు ఆంగ్లకర్ణాటకాది భాషల్లో రచియించేవారి సహకారాన్ని పొంది అందరికీ ప్రాతినిధ్యం వహించగలిగే కేంద్రసంస్థను ఆంధ్రంలో స్థాపిస్తే దానిద్వారా ఎంతయినా కృషిచేయవచ్చును. దీనినిగురించి కళావేత్తలు ఆచరణయోగ్యమైన తమ సూచనలు ఆంధ్రశాఖసంస్థాపనకు కృషిచేసే శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావుగారి పేర వ్రాయవచ్చును.



# చిత్ర వివరణము

శ్రీ టి. యస్. శ్రీనివాసన్

రా ధ

రాధ త్రివర్ణచిత్రము, శ్రీ ధీరేన్. కె దేవ్ వర్మగారు 1923 లో శాంతినికేతనం విద్యార్థిగా ఉన్నప్పుడు చిత్రించారు.

ఒకానొకప్పుడు రాధాకృష్ణులమధ్య ఒక చిన్న మాటపట్టింపులాంటిదివచ్చి, కోరినప్పుడల్లా రాధ శ్రీ కృష్ణమూర్తిని కలుసుకోలేకపోయేది. పోనీ ఒకవిధంగా మనస్సుని సమాధానపరచుకుని శ్రీ కృష్ణ మూర్తి ని నూటిగా వెళ్లి కలుసుకుందాం అనుకుంటే అహంకారం అడ్డువచ్చి మనస్సులో కల్లోలాన్ని తెగతెంపులు చేసుకోలేక పోయేది. ఎల్లాగైతేనేమి నిరంతర మనోవ్యథతో బాధపడుతూన్నందుకు ఎంతో చికాకుపడింది. కొన్నాళ్లు గడిచాక మనోవ్యథను ఒకవిధంగా సమన్వయించుకుందుకు ఆమెకు చక్కని ఆలోచన తట్టింది. శ్రీ కృష్ణమూర్తి సామాన్యంగా ధరించే శిరోభూషణంతోను, ఇంకా ఇతర ఆభరణములతోను శ్రీ కృష్ణమూర్తి వలె క్రొత్త ఆహార్యంలో ఉండడానికి ప్రయత్నించింది. చిత్రంలో రాధ శిరోభూషణం తలపై ధరించి, చివరిని నెమలి పింఛం ఉంచుకుంది. ఆహార్యరచన చేసుకుంటూ అద్దంలోచూచి ఆనందిస్తూన్నట్లు చిత్రించబడింది. తరువాత కృష్ణుడు రాధను కలుసుకుంటాడు.

వర్మగారు రాధను నిస్పృహాతో ఉన్నట్లు చిత్రిస్తూ ముఖంలో జాలిగొల్పే భావాలు చక్కగా చిత్రించారు. సున్నితమైన వర్ణ సమ్మేళనంవల్ల మనోభావము ద్యోతకమయింది.

వర్మగారు శాంతినికేతనంలో మొట్టమొదట తయారయిన విద్యార్థులలో వారు. భారతప్రభుత్వమువారు, లండనులోని ఇండియాహౌసు చిత్రించడానికి ఎన్నుకున్న నలుగురు చిత్రకారులలో వీరొకరు. వీరి ప్రతిభే దీనికి కారణము. వర్మగారు అక్కడ ఎన్నో చక్కని కుడ్యచిత్రాలు చిత్రించారు. లండనునుంచి తిరిగివచ్చిన తరువాత వీరు ఉత్తరహిందూస్థానంలోని మహారాజుల భవనాలలో కుడ్యచిత్రాలు చిత్రిస్తున్నారు. వీరి కళలో గొప్ప భవిష్యత్తు కనబడుతూఉంది.

## మృణ్మయమూర్తి నిర్మాణము

క్రీస్తుకు పూర్వం నించీ మన్నుతో బొమ్మలు చేయడం భారతీయుల పురాతన గృహపరిశ్రమలలో ఒకటి సింధుప్రాంతంలో మోహంజోదారోలో ఈమధ్య దొరికిన మృణ్మయ ప్రతిమలుచూస్తే అతి పురాతన

కాలంలోకూడ మనదేశం శిల్పులు ఎంత పరిపూర్ణస్థితికి వచ్చారో తెలుస్తుంది. ఈ మధ్య మృణ్మయ శిల్పాలు తయారుచేయడం బాగా అభివృద్ధికివచ్చి శిల్పనిర్మాణానికి ఇది ప్రధానాధారంగాఉంది.

స్టుడియోలలో మొట్టమొదట మట్టితో విగ్రహాలు తయారుచేసి, వాటి ననుసరించే విగ్రహనిర్మాణం పూర్తిచేస్తారు. ఇంకా మట్టితో బొమ్మలుచేసి వాటినికాల్చి విగ్రహాలు తయారుచేయడం బాగా ప్రచారంలో ఉంది. దక్షిణభారతదేశంలో ఇలాగ చిన్న చిన్న బొమ్మలుచేయడం ఒక గృహ పరిశ్రమగాఉంది. నవరాత్రులలో ఈబొమ్మలు బాగా అమ్ముడుపోతాయి. ఇప్పుడు మట్టిలోంచి పెద్దపెద్ద విగ్రహాలుకూడా తయారుచేస్తున్నారు. సుప్రసిద్ధశిల్పులు మృణ్మయ మూర్తులు తమ విగ్రహాలకు ఆధారంగా ఉపయోగిస్తున్నారు.

క్రితం నెల ఆంగ్లశిల్పిలో శ్రీ పి. దాసుగుప్తాగారి 'స్కల్ప్చర్ అనే' గ్రంథయొక్క సమీక్షపడింది. ఇప్పు డీసుప్రసిద్ధశిల్పి నిర్మించిన కొన్ని శిల్పాలఛాయాచిత్రాలు మా పాఠకులకు అందిస్తున్నాము.

ఈ శిల్పాలలో పడుచుదనపు బింకము, ముసలితనం ముడుతలు బాగా వ్యక్తమౌతున్నాయి. ఇవి జీవచైతన్యంతో కలకల్లాడుతున్నాయి. అనువాదం : 'లక్ష్మి'



# గ్రంథ విమర్శనము

## మానవ హక్కులు

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు ఇంగ్లీషులో వ్రాసిన "The Fundamental Rights of Man in Theory and Practice" అను పుస్తకానికి ఇది శ్రీ బి. వి. సింగరాచార్య చేసిన ఆంధ్రానువాదం. దీని వెల ఒక రూపాయి. ప్రాప్తిస్థానం: జాతీయ జ్ఞానమందిరం, త్యాగరాయనగరం, మద్రాసు.

ఇంగ్లండులో రెండవజేమ్సు, ఫ్రాన్సులో 14 వ లూయీ మొదలైనరాజులు తాము దేవాంశ సంభూతులమనీ, తమ రాజ్యాలలోని ప్రజలమీద సర్వాధికారాలు తమవేననీ, తా మేదిచేసినా అది తప్పకుండా న్యాయసమ్మత మౌతుందనీ, తాము అవలంబించే కార్యవిధాన విషయమై ఎదురుపల్కటానికిగాని, విమర్శించటానికిగాని, ఆఖరుకు ప్రశ్నించటానికిగాని ఎవరికీ అణుమాత్రమైనా అధికారంలేదనీ వాదించేవారు. ఒకసారి ఫ్రెంచిరాజు 14 వ లూయీ "నేను దానిని కోరుతున్నాను కాబట్టి అది ధర్మబద్ధమైనదే" అన్నాడు. ఆ నిరంకుశ చక్రవర్తులు చివరకు రాను రాను తమవ్యక్తిగతాభీష్టమే ధర్మశాస్త్రమనే ధోరణిలోకికూడా వచ్చారు. కేవలం పాశ్చాత్యదేశాల చక్రవర్తులు మాత్రమే యిట్టి అభిప్రాయాలు కలిగిఉండే వారని మనం భావించగూడదు. మనదేశంలోకూడా "నా విష్ణుః పృథివీపతిః" అను లోకోక్తి వాడుకలో ఉంది. కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలంలో "సతాం హి సందేహపదేషు వస్తుషు, ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః" అని దుష్యంతునిచేత అనిపిస్తాడు. దీనిని బట్టి మానవసమాజ పరిణామదశలో ఒకప్పుడు అన్ని దేశాల రాజులు ఒకేవిధమైన అభిప్రాయాలు కలిగి ఉండే వారని స్పష్టమవుతున్నది.

"పరిపాలకుల ఇష్టానిష్టాలతో నిమిత్తంలేకుండా ప్రాణమాన విత్తాలకు సంబంధించిన స్వతస్సిద్ధమైన హక్కులు కొన్ని ప్రతిమానవునికి ఉంటవి. ఏ పరిస్థితిలోను పరిపాలకులు ఆ హక్కులకు ప్రతిబంధకంగా ప్రవర్తించగూడదు." అనే సిద్ధాంతాన్ని కొందరు ప్రజాస్వామ్యవాదులు లేవదీశారు. ఈ ధర్మబద్ధమైన వాదం ఆ నిరంకుశ ప్రభువుల చెవికెక్కలేదు. అటువంటి నిరంకుశ ప్రభుత్వాలను కూలద్రోసే నిమిత్తమే ప్రజాస్వామ్యవాదులు యిరోపా అమెరికా ఖండాలలో విప్లవాలు లేవదీసి, విజయం సంపాదించి, ప్రజాస్వామిక ప్రభుత్వాలను నెలకొల్పారు. ప్రజలకు స్వతస్సిద్ధంగానే కొన్నిహక్కు లుండాలన్న అభిప్రాయం ఈ విప్లవ సమయంలోనే ఎక్కువగా ప్రచారంలోకివచ్చింది. పదహారు, పదిహేడు, పద్దెనిమిది శతాబ్దాల యిరోపాఖండచరిత్ర చదివితే, "మానవ ప్రాథమిక స్వత్వాలు" ఒక సిద్ధాంతరూపం ఎలా తాల్చిందీ మనం తెలుసుకోవచ్చు.

పౌరస్వత్వ సిద్ధాంతం ఏయే దేశాలలో ఎప్పుడు ఏయే విధంగా అవతరించింది మొదలైనదాని పుట్టుపూర్వోత్తరాలనుగూర్చి, దానిపై విమర్శకులు జరిపిన ఖండనమండనాలనుగూర్చి ఈ గ్రంథంలో శ్రీ వెంకటరంగయ్యగారు సమగ్రంగా వివరించారు.

స్వాతంత్ర్య సౌధప్రాంగణంలో నిల్చుండి,స్వతంత్ర రాజ్యాంగాన్ని రచించుకోబోతున్న భారతీయులు ప్రస్తుతం ప్రజాస్వామిక సూత్రాలనుగురించి, ప్రాథమికస్వత్వాలనుగురించి కొద్దో గొప్పో తెలుసుకోటం అవసరం.

# ఆంధ్ర శిల్పి

సాధారణంగా ఇటువంటి గ్రంథాలను భాషాంతరీకరించటం కష్టసాధ్యమైనపని కాని, ఈ పుస్తకంలో అనువాదం మక్కీకి మక్కీగా లేకుండా స్వతంత్ర రచనలాగా సాఫీగా నడచింది. ఇంగ్లీషు రానివారికి ఈ పుస్తకం బాగా ఉపయోగపడుతుంది.

—వట్టికొండ రంగయ్య.

## ప్రజాపరిషత్తు

ఆంగ్లమాతృక : శ్రీ నూమిడిపూడి వెంకటరంగయ్య. ఆంధ్రానువాదం : శ్రీ కొడాలి ఆంజనేయులు, క్రౌనుసైజు, 173 పుటలు, వెల : రు. 1-8-0, ప్రాప్తిస్థానం : జాతీయ జ్ఞానమందిరం, త్యాగరాయనగరం, మద్రాసు.

ఆధునికయుగంలో నూతన రాజ్యాంగాలను ఏర్పరచుకొన్న ప్రభుత్వాలను మూడురకాలుగా విభజించవచ్చు. మొదటిరకానికి చెందిన ఐర్లండు చకోస్లావాకియా, యుగోస్లోవియా, ఫిన్లండు, పోలండు, ఏస్తోనియా, లాట్వియా మొదలైన దేశాలు తమపై పెత్తనం చెలాయిస్తున్న సామ్రాజ్యాలను కాలద్రోసి స్వాతంత్ర్యం సంపాదించుకొన్నవి. ఫ్రాన్సు, జర్మని, ఆస్ట్రియా ఆదిగాగల దేశాలు అనాదినుంచి స్వాతంత్ర్యం అనుభవిస్తూనే, నిరంకుశ పరిపాలకులను నిర్మూలించి, ప్రజాస్వామిక ప్రభుత్వాలను స్థాపించుకొన్నవి. అమెరికా సంయుక్తరాష్ట్రాలు, స్విట్జర్లాండు, కెనడా, ఆస్ట్రేలియా వగైరా దేశాలు మూడవరకంలో చేరుతవి. వీటిలో ప్రతిదేశం మొట్టమొదట కొన్ని స్వతంత్ర రాష్ట్రాలుగా విభక్తమై వేరువేరుగాఉండి, తరువాత కొంతకాలానికి ఆ ప్రత్యేకరాష్ట్రాలన్ని కలిసి ఒకే దేశంగా ఏర్పడి, సమష్టిగా ఒక రాజ్యాంగాన్ని ఏర్పరచుకొన్నవి. మొత్తంమీద ఈదేశా లన్నింటిలోను ఏదో ఒకవిధమైన రాజ్యాంగం అమలులో ఉంది.

ఆయా దేశాలలో అక్కడి రాజ్యాంగాలు ఎప్పుడు ఏవిధంగా ఆచరణలోకి వచ్చినవో ఈ పుస్తకంలో వెంకటరంగయ్యగారు సవివరంగా వర్ణించారు. ఆయా దేశాల రాజ్యాంగ చరిత్రలను పరిశీలించటంద్వారా మనం నేర్చుకోవలసిన గుణపాఠాలను గురించి, పరతంత్ర భారత రాజ్యాంగ నిర్మాణచరిత్రను గురించి, ప్రస్తుతం సమావేశమౌతున్న స్వతంత్ర భారత రాజ్యాంగ నిర్ణాయకసభ — దాని బాగోగులనుగురించి గ్రంథకర్త సమగ్రంగా చర్చించారు. ప్రజల ఉపయోగార్థం ప్రస్తుతం అవసరమైన ఇట్టి ఉత్తమ గ్రంథాన్ని సకాలంలో ప్రకటించిన జాతీయజ్ఞానమందిరంవారు అభినందనీయులు.

—వట్టికొండ రంగయ్య.

కూలిజనం : పాలగుమ్మి పద్మరాజు, నవరచనా ప్రచురణలు, 4/8, దేశిగర్ సామి వీథి, మైలాపూరు, మద్రాసు.

ఈ పుస్తకం చూడడానికీ, చదవడానికీ ఎంతో ముచ్చటగా వుంది. ఇందులో ఎనిమిది కథలున్నాయి. వీటిలో చివరి మూడు—స్త్రీరత్నమా ? మానవ స్వభావమా ?, ఉద్వేగాలు, బాల్యం—అనేవి మానవప్రకృతిని చిత్రిస్తాయి. మొదటిదానిలో చదువుకున్న ఆడదానిముందు, యువకుడు అప్రయత్నంగా చూపించే కంగారు, సంస్కృతితో చక్కదనం జోడించబడినప్పుడు పురుషుడిలో వ్యక్తమయ్యే మానసికదౌర్బల్యం చూపించబడ్డాయి. ఫలితం హాస్యాస్పదంగా పరిణమించిందేమో ననిపించింది ; అందంగా పాడైపోయిన యీ మూడుకథలలోనూ ప్రధానస్థానం యీ కథదే. అందానికి మచ్చు— "ఆ వేసవిఎండలో స్టేషనంతా మూర్ఛపోయినట్టుగా వుంది." ఉద్వేగాలు అన్న కథలో. రచయిత చెప్ప దలుచుకున్నది మంచి విషయమే—కాని యీ కథ ద్వారా అది చెప్పలేకపోయాడు. పూర్తిగా పాడైపోయిన బాల్యం అన్న కథని, చివరకొచ్చేటందాకా,

# గ్రంథ విమర్శనము

సంపాదకుడు ఏమధ్యనో యిరికించి వుండవల్సింది. 'వానవచ్చిన రాత్రిలో' రచయిత శిల్పంకోసం శ్రమ పడినట్టు తెలుస్తుంది. రచనావిధానంలో క్రొత్త మార్గం త్రొక్కి కొంతవరకు కథకుడు విజయం పొందాడు. ఆ కథావస్తువుపై సానుభూతిలేని చదువరికి అంగులో శిల్పాన్ని పరిశీలించడానికి తగినంత వోపిక వుండకపోవొచ్చు. ఆ పద్ధతిలోని 'శక్తి' 'సిరి'—'వెలుగు పశుత్వంలా కళ్లమీదికివచ్చి పడింది' అన్న వాక్యంలో వుంది.

మిగతావి—అంటే మొదటి నాలుగుకథలూ—మన పల్లెటూళ్లల్లో వుండే అనాగరికులు, ఆర్థికంగానూ, వైజ్ఞానికంగానూ బాగా తక్కువగా వుండే వ్యక్తుల మనస్తత్వాలని చిత్రిస్తాయి. జీవితాన్ని గురించి వితర్కించుకోకుండా సహజంగా జీవించే పల్లీయులనుగురించి వ్రాసిన రచయితలలో అగ్రస్థానం పద్మరాజుదే. పాశ్చాత్య రచయితలు,—ముఖ్యంగా లారెన్సు, సామర్‌సెట్‌మామ్, టాల్‌స్టాయ్, పారిశ్రామిక నాగరికతతో అసంతృప్తి చెంది, పల్లీయుల జీవితాలలో వాళ్లల్లో లేని ఆదర్శాలు చనువుతారు: సంఘం ఏర్పరిచిన నైతిక నియమాలు స్వేచ్ఛాజీవనానికి అంతరాయం కలిగించడం కాకుండా, మనస్సుకి కుటిలత్వం నేర్పుతాయనీ, యీ దగాచేసుకోవడం 'కుళ్లు' పల్లెలో వుండే మామూలువ్యక్తులకి లేదనీ, కాబట్టి వారి బ్రతుకు మంచిదనీ యీ రచయితలు అనుకుని వ్రాస్తూంటారు. పద్మరాజులో యీ భ్రమలేదు. వారు నాగరికతలోంచి పారిపోయి "ఇదుగో యిక్కడున్నారు నిజమైన మనుషులు' అని చప్పట్లుకొట్టరు. పల్లీయులకీ కట్టుబాట్లుంటాయనీ, వారికీ నైతికదృష్టి వుంటుందనీ గ్రహించడమే కాకుండా, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు వారిని మార్చివెయ్యగా వారిలో మిగిలిన మానవత్వాన్నీ, సహజత్వాన్నీ వీరు ప్రదర్శించగలగడం వీరిలోని ప్రత్యేకత. ఆ పని కథానికద్వారా మనలో యింతబాగా ఎవ్వరూ చెయ్యలేదనే చెప్పాలి. పరిచయవాక్యంలో సుబ్రహ్మణ్యంగారు, కథకుడిగా ఇంతవరకూ ఆయన చాలావరకు పట్నవాసపుకళ్లతోనే పల్లెటూళ్ళని పరిశీలించి వ్రాయడం సంభవిస్తోంది. పల్లెలలోనే పెరిగి సాహిత్యంమీద అభిరుచిగల పల్లీయుడే వచ్చి కథలు వ్రాసేవరకూ 'పద్మరాజుగారికి పూర్తిగా పల్లీయుడు కావాలని' కోరుతూంటామని వ్రాశారు. నిజంగా పల్లీయుడైతే పద్మరాజుగారు యిల్లాంటి కథలు వ్రాయలేరేమో! పల్లెలలో వుండేవారికి, వారి ప్రత్యేకత వారికి తెలియకపోవొచ్చు. పల్లెలలో వుండడం వొకటి; వారిని అర్థంచేసుకుని సానుభూతితో చిత్రించడం వొకటీ. పద్మరాజు వ్యక్తపరిచిన పట్నవాసపు దృష్టి 'పుల్లి' అన్న కథలో బాగా గోచరిస్తుంది. ఈ కథని పద్మరాజే 'యింకా బాగా వ్రాసివుండగలరనిపించింది. పంతం, పడవప్రయాణం మంచికథలు; కూలిజనం గొప్పకథ. ప్రపంచ సారస్వతంలో ఉత్తమకథానికలలో వొకటిగా దీన్ని ఎన్నుకోడానికి నేను సంకోచించను. కూలిజనం ఏపని చేసేటప్పుడు ఆపనే చేస్తారనీ, శరీరం వొకటి చేస్తూండగా మనస్సు ఇంకొకటి చేస్తూండడం వారిలో లేదనీ, రచయిత యీ కథద్వారా చెప్పదల్చుకొన్న విషయాలలో వొకటి. కొండమీద శిఖరంపై చేరుకుని కిందికి చూసినట్లుగా, యిందులో అఖాతాలున్నాయి. చాలా జాగ్రత్తగా చదవదగ్గ దీకథ, కొన్నిమాటలపై రచయిత చూపిన పనివాడితనం, 'చిత్రిక' అద్వితీయం. ఉదాహరణకి—"ఎండ దాహంగా పెరుగుతోంది"—"ఎండ భూమికి దాహాన్ని నేర్పుతుంది"—"గాలిలో మెల్లని దాహం

ప్రాణుల్ని మత్తులో ముంచుతోంది''—కథకుడికి శిల్పంలోనూ, ఊహలోనూ, సందేశానికి విలువ కట్టడంలోనూ, కవితోపాటు సమానస్థానం యివ్వాలన్నవాళ్ళకి యీ కథ మంచి ప్రమాణం. ఇది కథ కాదు; వోరకమైన ఖండకావ్యం.

పద్మరాజు ప్రకృతిలో లీనమై, తేరుకుని చిత్రించినట్టుగా వుంటుంది, ఆయన ప్రకృతివర్ణన; పల్లెటూరి వాతావరణాన్ని చిత్రకారుడిలా చిత్రించటం కాకుండా, మనని అక్కడికి ప్రవేశపెట్టి, మనచేత అంగులో పాల్గొనేటట్లు కూడా చేస్తాడు. ''జీవితం బరువుగా అక్కడ కూర్చుని ఆలోచించుకుంటూ చుట్టకాలుస్తున్నట్లుంది''—ఇట్లాంటివి ఎన్నో! బస్తీలలో పాతుకుపోయి, ప్రకృతితో సంబంధం పోగొట్టుకుని, మళ్లా సెలకొల్పుకోటానికి అప్పుడప్పుడు మన పల్లెలకి సెలవలికి వెళ్లే నాగరికులు యీ పుస్తకం లేకుండా ప్రయాణం చేస్తే వారికి రైల్వేవాళ్లు టిక్కెట్లు అమ్మకూడదు.

'యస్'

---

# గ్రంథస్వీకృతి

౧. నాయకురాలు

శ్రీ వావిలాల సోమయాజులు

ప్రాప్తిస్థానము :

సాహితీసమితి, తెనాలి. వెల ౧-౮-౦

౨. శ్రీ త్రిపురాంతకోదహరణము

రావిపాటి త్రిపురాంతకమహాకవి ప్రణీతము.

3. మించుపల్లె—తెలుగుపొలుపు

ప్రాప్తిస్థానము :

నిడదవోలు వెంకటరావు, ఎమ్.ఏ,,

ఆంధ్రోపన్యాసకుడు,

పరిశోధకశాఖ, మద్రాసు విశ్వవిద్యాలయము,

మదరాసు. వెల ౧-౦-౦

౪. అష్టావక్రచరిత్రము

(ఆధునిక పద్యకావ్యము) వెల ౧-౮-౦

౫. శ్రీమహర్షి జీవితకథామృతము

(ప్రాచీన భారతమహర్షుల జీవితచరిత్రములు)

గ్రంథకర్త : శ్రీ బులుసు వెంకటేశ్వర్లు, బి.ఏ.

ప్రాప్తిస్థానము :

పండిట్ బులుసు వెంకటేశ్వర్లు, బి.ఏ.,

రామారావుపేట, కాకినాడ. వెల ౨-౦-౦

౬. జైహింద్ (కథలసంపుటి)

పి. వి. సుబ్బారావు. వెల ౧-౦-౦

౭. సరే, కానివ్వండి (కథలసంపుటి)

గోపీచంద్ వెల ౧-౦-౦

౮. మల్లెపూలు (కథలసంపుటి)

కె. రాధాకృష్ణ,

ప్రాప్తిస్థానము :

ప్రజాసాహిత్యపరిషత్తు, తెనాలి. వెల ౧-౦-౦



నర్తనమురళి

: గోపీనాథబృందము ★ భోలానాథ్ ★ సరోజ ★ కె. కె. సిన్హా ★ ఇంద్రాణి ఇంకా ఇతరులు.

# శిల్పి ప్రచురణము

# Cottage Industries of India

సంకలన కర్తలు

పి. ఆర్. చిత్రా : టి. యన్. శ్రీనివాసన్

'శిల్పి' సంపాదకులు



ఇది అన్ని రాష్ట్రాలలోను, ప్రధాన స్వదేశసంస్థానాలలోను ఉన్న కుటీరపరిశ్రమలను గురించి, సమగ్రంగా, తయారు చేసిన ఆంగ్ల గ్రంథము. సుప్రసిద్ధులయిన అర్థశాస్త్ర వేత్తలు, పారిశ్రామికులు వ్రాసిన వ్యాసాలతోను, ప్రత్యేక చిత్రాలతోను ఎంతో ఆకర్షకంగా తయారవుతోంది.

ఇది డెమ్మీ ఆక్టేవో సైజులో 300 పేజీల గ్రంథము. 30 పేజీల ఆర్టు సప్లిమెంటుతో సహా 1947 మేలో తయారవుతుంది.



వివరాలకు — మేనేజరు,

శిల్పి పబ్లికేషన్సు

10. నరసింగపురం వీథి

మౌంట్ రోడ్డు, మదరాసు.

ఇది 37, ఆచారప్పన్ వీథిలోని బి. యన్. కె. ప్రెస్సులో, బి. నాగిరెడ్డిగారిచే ముద్రింపబడి, 10, నరసింగపురం వీథిలోని ఆంధ్రశిల్పి కార్యాలయంలో శ్రీమతి డి. ఆర్. చిత్రాగారిచే ప్రకటింపబడినది. సంపాదకులు: వి. ఆర్. చిత్రా : పి. గణపతిశాస్త్రి.




## సచిత్ర మాసపత్రిక

సంపాదకులు

వి. ఆర్. చిత్రా: పి. గణపతిశాస్త్రి




౧౦, నరసింగపురం వీధి,

మౌంట్ రోడ్, మద్రాసు

# విషయానుక్రమణిక



## శిల్పాలు



గౌరీ శంకరులు

శ్రీ వి. ఆర్. చిత్రా

ఆంధ్రశిల్పి

# సంపాదక సమీక్షలు

## ప్రజా పరాజయము

ఎల్లాగయితేనేమి చిట్టచివరికి-ఒమాందూరు రామస్వామిరెడ్డియార్‌ని మద్రాసు కాంగ్రెసు పక్షానికి నాయకుణ్ణిగా ఎన్నుకున్నారు. ఆంధ్రకేసరి నాయకత్వపు ఎన్నికలో ఓడిపోయాడు. అది సంవత్సరాది. ఆంధ్రులందరికీ ఆ నాడు పండుగ కావలసింది. అయితే యావదాంధ్రమూ ప్రజాసామాన్యప్రతినిధికి జరిగిన ఈ పరాజయానికి స్తంభించిపోయింది! అటు రాజీకుదర్చడానికి అవతరించిన కాంగ్రెసుఅధ్యక్షుడు కూడా రాజీచెయ్యలేక 'చాలా కుంగిపోతూ తిరిగిపోతున్నా'నని అన్నాడు. అధికార వ్యామోహితుల కుతంత్రాలు అవగాహన చేసుకోలేని సామాన్య ప్రజకు—ఈ మంత్రివర్గం మారిపోవడాన్కి కారణం ఏమో తెలిసిందికాదు. కేరళ సంచారంచేస్తూన్న కాంగ్రెసు అధ్యక్షుణ్ణి మంత్రివర్గం మారడానికి కారణం ఏమిటంటే ఏమీ చెప్పలేక పోయాడు. 'విశ్వాసరహితులు' కూడా తమ విశ్వాసరాహిత్యానికి కారణం చెప్పలేకపోయారు. కాంగ్రెసు పక్షానికి అఖండవిజయం చేకూర్చిన ప్రజానీకానికి ప్రకాశంప్రధానిపరాజయం తమకి జరిగిన పరాజయమే అనిపించింది. అసలు 'విశ్వాస'పదానికే అర్థం తారుమారై పోయినట్టనిపించింది!

రాష్ట్రం రాష్ట్రం అంతా ఈ విధంగా స్తంభించిపోతూ ఉండగా ఆంధ్రకేసరి శాసనసభలో ఒక గంభీరప్రకటన చేశారు. ఆ ప్రకటనలో ఆయన ప్రతి హృదయస్పందనమూ ప్రతిధ్వనించింది. అంతేగాదు. ప్రజానీకంలో ఉన్న ప్రతిపౌరుని హృదయమూ ప్రతిధ్వనించింది! చివరికి ఆ ప్రకటన అంతా విని చెవులు గింగురుమనేటట్లు హర్షధ్వనులు చేస్తూన్న శ్రోతలనందరినీ స్పీకరు సభలోనించి వెళ్లగొట్టించవలసిన పరిస్థితి ఏర్పడింది!

ప్రజలు ఎన్నుకున్న ప్రజాప్రతినిధుల ప్రభుత్వం పరిపాలిస్తూంటే ఇల్లాగ సామాన్యప్రజలని సభలోనించి వెళ్ళగొట్టించవలసిన అవసరం ఏమికలిగింది! అందులోనే ఉంది అసలురహస్యం అంతా!

అసలు మద్రాసు రాష్ట్రం కాంగ్రెసు వ్యవహారాలు ఎన్నికలైనప్పటి నించీ, తగాదాలలోనే పడ్డాయి. కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు ప్రజా స్వామ్య సిద్ధాంతాలన్నీ మంటలోకలిపి, శాసనసభ్యుల్ని సి. రాజగోపాలా చార్యులుగారిని ఎన్నుకోవలసిందని విధించడమూ, దానికి వారు వ్యతిరే కించి ప్రకాశంగారిని ఎన్నుకోవడమూ అందరికీ తెలిసినవే.

అప్పటినించీ కేంద్రంలోఉన్న పార్లమెంటరీబోర్డు ప్రకాశం మంత్రి వర్గంమీద పగబట్టింది. డాక్టరు సుబ్బరాయన్‌గారు శాసనసభలో చెప్పి నట్టు పార్లమెంటరీబోర్డు ప్రకాశం మంత్రివర్గంతో 'మాకేమీ సంబంధం లే'దని చెప్పివేసింది.

ఇక నేంకావాలి! పదవీవ్యామోహ పూరితులైన పెద్దలంతా మంత్రిపదవులకోసం మంత్రాంగాలు ప్రారంభించారు. విశ్వాసరాహిత్యానికి ఒక పదవీ వ్యామోహం తప్ప మరేకారణమూ అవసరం లేకపోయింది. అందుచేత ఒకనాడు పొద్దున్నే లేచేసరికి కారణం ఏమీలేకుండా శాసన సభ్యుల్లో అధికసంఖ్యాకులకి ప్రకాశం నాయకత్వంమీద విశ్వాసం ఎగిరి పోయింది!

మద్రాసు రాజకీయాల్లో ఈ విషపువిత్తు నాటింది కాంగ్రెసు కార్య వర్గము. దానిఫలితమే ఈవేళ మనం కళ్ళారా చూస్తున్నాము. ప్రజాహృద యాల్లో అచంచలవిశ్వాసం చూరగొన్న ఆంధ్రకేసరి శాసనసభ్యులకు అవిశ్వసనీయుడైనాడు. దానికి ఫలితంగా ప్రజానీకంలో కాంగ్రెసు సంస్థ మీదనే ప్రజలకు విశ్వాసం నశించిపోయింది. ఇంతేకాదు. ఇకముందు మంత్రి వర్గంమీద విశ్వాసం పోవడానికి ఏమీకారణం అక్కరలేదనీ, ఒక పదవీ వ్యామోహమే చాలుననీకూడా తేలింది.

ప్రకాశం మీద అవిశ్వాస తీర్మానంవల్ల ఆయనమీద సర్వులకూ అభిమానం ఇనుమడించింది. దీనికి కారణం శాసనసభలో కొందరు వ్యక్తుల అధికారకాంక్షా, కాంగ్రెసుహైకమాండు అహంకారమూ మాత్రమే.

ఇక్కడ ప్రధానమయినది వ్యక్తులుకారు. కాంగ్రెసు కార్యవర్గంగాని శాసనసభ్యులుగాని గమనించవలసినది, తాము చేస్తున్నదానివల్ల ప్రజల్లో కాంగ్రెసుమీద గౌరవం ఎంతవరకు ఇనుమడిస్తుందా అన్నదే! ఇంత కాలాన్నించి ప్రోదిచేసి పెంచిన కాంగ్రెసు వృక్షం కూల్చివెయ్యడమా అన్నదే!

ఇప్పటికైనా కాంగ్రెసు సర్వాధికారులు తమ అహంభావం విడిచి, ప్రజాస్వామ్య పద్ధతులు అవలంబించి దేశంలో సన్నగిలిపోతూన్న కాంగ్రెసు పరువుప్రతిష్ఠలు ఇనుమడింప జేస్తారా? మద్రాసు శాసనసభ్యులుకూడా తమ పదవీవాంఛలు విడిచి కాంగ్రెసు ప్రతిష్ఠకీ, ప్రజలు తమమీద ఉంచిన విశ్వాసానికీ అనుకూలంగా ప్రవర్తిస్తారా?

శ్రీ పి. గణపతిశాస్త్రి.

# వసంతగీతిక

రేగుకోర్కెలగుత్తి నాగుండెవలె నెర్ర
నెర్రనైనది మావి యిగురుగుబురు
మ్రోగు పాటలపేటి నా గళమ్మటు తీయ
తీయనైనది పుల్గు తెరవగూడు
ననుచు నూహాలడోల నామనస్సటు పారు
నేరులైనది గాలి యోరయొరక
ననయుతావులకోవ నామన్కియటు సిత
హసితమైనది మల్లెయలరుతీవ

పొదుపువాకిలి గవనుతల్పులు సడల్చి
కనబడనిచేయి యేది విప్పినదొ గాని,
నాలుగాశలలోపల మూలమూల
లందు చొరబడి పోయినా డామనిదొర!

## పూవులు

ఓ హో వసంతా!
ఓయి వసంతా!
నీహారాంచల నిభృత నిశాంతా!

## వేణువు

ఈదారికెలకు లందేను వేణువునోయి
నాదాలకోవ! ఆనందాల పెనుప్రోవ!
స్వాదుమృదులములు నీపాదాలసవ్వడులు
ఏదవ్వులెందైన నే నెరుంగగలేన!
బెదరు నీ పెదవి యూరుపుగాలి కదిలేన,
చెదరు నీ చీరకుచ్చెల సుంత మెదిలేన,
ఆగిపోలేనోయి! అడగియున్నవి వేలు
మ్రోగిపోయేనోయి ముగ్ధరహస్యాలు!

## పూవులు

ఘుసృణ రసాలకిసాలరసాసవ
కషాయ వికచగళా! వసంతా!
మసృణకుసుమ హృద్గళన్మరంద
స్నపిత చరణయుగళా! వసంతా!
ఓహో వసంతా! ఓయివసంతా!
చిరతరపథికా! ప్రియతమ ప్రేమిక!

## కోయిల

ఈపర్ణశాలలో నేను కోయిల నోయి!
నాపున్నె మీనాటికేని పండినదోయి!
ఒక్కకొమ్మగవాయి!
ఒకరెమ్మ సన్నాయి!
దిక్కుదిక్కుల నేడు
తోట ఒకతే హాయి!

ఎవరు తగిలించారో!
ఈతీపిలో ఒగరు!

ఎవరు రగిలించారో!
ఈగొంతులో పొగరు!

నాగుండె మెరుపో!
నానాథు పెదవుల యొరపో!
మైగదించిన దెవరు!
మావియిగురుకు తొగరు!
దక్షిణప్రాంగణద్వాః కవాటము నీవు
తెరచినావా! తోట తెరువు మాధవదేవ!
కూర్చినారా! సుందరీ కోమలాలస

## వ సం త గీ తి క

శ్యామలాలకల నవమల్లికలడోలికల
పేర్చినారా, దారి కురవకాశోకాలు
ఓర్చికోనేలేవు స్వామిమృదుచరణాలు

### పు వ్వు లు

ప్రతివిభాతహారీకృతరజత
ప్రాలేయాంబుకణా! వసంతా!
ప్రతివిభావరీ విరహిహృదయ
నిశ్శ్వసనమలయపవనా! వసంతా!
ఇటురావే! ఓ నవమల్లీ
మాగధి! మాలతి! శేఫాలీ!
ఇటురావే! ఓ కురవకమా!
ఓమాకందా! కింశుకమా!

### పు వ్వు లు

మల్లీ వల్లీ మరకతకాంచీ
వేల్లిత తనుమధ్యా! వసంతా!
ఫుల్లమాలతీ పులకితవ్రతతీ
పల్లవమృదురథ్యా! వసంతా!
ఓహో! వసంతా! ఓయి వసంతా!
అరవింద సితకుంద దళస్మిత!

### తు మ్మె ద

ఎలదేటి నోయి!
స్వామీ! నేను సెలయేటి
అలలలో కదిలేటి
కలువపూ పడవలో
ఊయాల ఊలీల!
ఊగేను! తూగేను!
నీ యోలగము వేళ
నే యింతమర పేల!
తరపి తేనియసోన
తొరిపి మంచుజలాన
కురిపించిరెవరు!
క్రొవ్విరిగుండె లోలోన!
తగిలించి వలపుపుప్పొడి
బూదినామేన,
బిగియించి రెవరు మోదుగు
పూవు చాపాన!
నీలనీలకజ్జల సమగరుదం
చల మధుకర చికురా! వసంతా!
లోల మనోహర వీచీవిచలిత
బాలమృణాలకరా! వసంతా!
ఓహో వసంతా! ఓయివసంతా!
శిశిరకుమారా! కుసుమమనోహర

### గా లి

దుదుకు రెక్కలజోడు
తొడిగించుకొన్నాను!
కడిమి పుప్పొడి జీను
కదియించుకొన్నాను!

### వ సం తు డు

కురియు మంచునును జడులనడగు
తెలియుసుక పొరల బయళులపై
తొరయు పుప్పొడులఁ దొరగు తేనెయః
లొలయు చివురు తెరువులపై!

### పు వ్వు లు

ఇటురావె! ఇటురావే!

### వసంతుడు

చలితహిమానీలలిత తుషారము
దులిపికొనుడు మొయి నంటెనులే!

### పువ్వులు

మధుర మధుర మధుమైరేయము, మీ
మరుగుటెదలలో నిండెనులే!

### వసంతుడు

ఇటురావే!

### పువ్వులు

నవమల్లీ!
ఇటురావే!
శేఫాలీ!
ఇటురావే!

శ్రీ కృష్ణశాస్త్రి.



# ప్రణయాభిషేకము

ప్రణయంబను మరకతమణి
నాదు లలాటమున దిద్ది,
ప్రసాదించినావు, రమణి!
. మహారాజ పదవి సిద్ధి!
అల్పుడుగద అవని నంత
పాలించిన మహీజాని;
నీ చిత్తము, నాయనంత
సామ్రాజ్యపు రాజధాని.
విశ్వస్థలి యంతకూడ
ఛత్రంబయి కప్పనన్ను;
విశ్వస్థలి యంతచూడ
సకియ! నీదు చిన్నికన్ను
తారకాగ్రహమ్ము, లిందు
సూర్యవర్తులాలు, సతము
నాదుప్రణయ మకుటమందు
ఉజ్వలముగ ప్రజ్వలితము.
సిగ్గిల్లియు నలహిమాద్రి
నాచూడ్కిని గని అవనత;
మేను మహారాజు మాద్రి
నడయాడుచు, చనుదు జనత.
ఏనుఁగ నడయాడు దారి
పరువమ్ములు పరువుదీయు,
వందిమములు పలుకు శారి
పూలు తలంబ్రాలుపోయు
మయూరములు నటనమాడు
కిరణమ్ములు వలచివ్రాలు
లక్ష కోకిలములు పాడు,
ఉర్వినంత ఉత్సవాలు.

సలుపు దాస జనము నోజ,
పసిండి సుక పాదసేవ.
గడ్డిపూలు పాదపూజ
ఏనుఁగ నడయాడు త్రోవ.
క్రోధకామములకు, బిక్ష
పుట్టబోదు, భయాసత్య
దస్యులందరి కురిశిక్ష,
కంటకాల కాత్మ హత్య.
విడునుక్లాంతి విడునుభ్రాంతి;
నాట్యమాడును ప్రతిచోట,
అమర కాంతి ప్రణయ శాంతి
ఏనుఁగ నడయాడు బాట
నేనన్న ధరఁ పరాకు!
భూచక్రములోని శత్రు
రాజులంత వచ్చి, నాకు
కానుకలను కప్పమిత్తు.
జగతినంత జయించేటి
శక్తిశాలి, శివునికంటు
కల్పించిన యట్టిమేటి
మరుడు కూడ నాకుబంటు
రాజరాజ శిఖామణిని,
జగజ్జేత నగుదుసుమ్ము!
నిర్మిస్తి నిఖిలధరణిని
మదాస్థాన మంటపమ్ము.
నాసభాస్థలమ్ము లోన
సకల కవీశ్వరులు, ఇచ్చ
వచ్చినటులు, ప్రణయ గాన

# ప్రణయాభిషేకము

ములను, పాడుచుంద్రు, నిచ్చ!  
కనుము! జనుల కనులు చెమర,  
కవితాసతి మనోహరును—  
''రోమియో జులియట్'' అమర  
కథ వచించు షేక్స్పియరును.  
వినుము! అదో, హఠాత్ బాణ  
హతహరిణము అరచురీతి,  
శాఫో విరహాగ్ని వీణ  
సలుపుచున్న కరుణగీతి.  
అహో! కాళిదాసు రూపు!  
అతని కవితసభాసదుల  
అవ్యక్త సుఖాబ్ధి నూపు,  
కట్టించును కనుల నదుల!  
భరతావని నోము పంట  
వాల్మీకి కవి, తన వ్రాత  
వినుము! తాను చదువు చుంట  
రామాయణ ప్రేమగాథ.  
అవుర! అదిసుధావ్యధార్చి;  
ప్రకృతిలోని ప్రణయకీర్తి!

కోలాహలు గిరిక గూర్చి  
వర్ణించుట భట్టుమూర్తి.  
అదిగో, విను! అల్లసాని  
పలుకచున్న మృదుపదాల,  
వరూథినీ చిన్నదాని  
నిభృతమనోరహస్యాల.  
పడబోదట పరుల చూడ్కి  
నీ గుండియ అంతిపురము;  
నా భాగ్యము పండు మాడ్కి  
నను శయింపనిమ్ము, చిరము.  
తపితావని పయిన, మిన్ను  
వాకవచ్చు పగిది, నీవు  
ప్రణయసలిలములను, నన్ను  
అభిషేకము సలిపినావు!  
బాహు పంజరమ్ము లోన  
ప్రణయరాజ్య మహీజాని  
పదవి నిచ్చినావు, చాన!  
నువ్వు నాదు మహారాణి!

శ్రీ 'పఠాభి



# నాగార్జునకొండలో రాత్రి!

నీలికొండల నీలిగుసగుస
ఏటితెలి క్రొన్నీటిగలగల
మలపుబాటల వలపుపిలుపులు
మరగి వచ్చితిని!

ని
న్నరయ వచ్చితిని!
కొండమలపులో ఏటిరొదలో
యుగయుగమ్ములు నిల్చియుంటివి!

నగ్నశిల్ప శిలాతపస్విని
ఎపుడు తెలిసితివి!
నా
ఎదుట నిలిచితివి!

ఎడదరేగిన ఏటిహోరులో
కొండకోనల గ్రుమ్మరిలి యీ
రేయి నీ యేకాంతసేవలో
కలత నిద్దురలో!
నీకై
కలవరింతలలో!

నీలికొండల నీలిగుసగుస
ఏటితెలి క్రొన్నీటి గలగల...

శ్రీ మొక్కపాటి కృష్ణమూ

# ఆవేదన

ఐదు వసంతముల్ గడచె ; ఆరవయేడునుగూడ మెల్లగా
పాదము మోపి సాగినది ; ప్రాణసఖీ ప్రతిబింబమాత్మయుం
దూదర వెట్టుచున్నది ; సహోదర మిత్రుల గాంచగా సదా
వేదన కల్గుచున్నది ; తపించును చిత్తము మాతృభూమికై.

పోదముపోద మంచు దలపోసి పదేపదె లేనిపోని స
మ్మోదము దెచ్చిపెట్టుకొని పొంగితి కాని ఫలమ్ము శూన్య ; మా
వేదన మెంతకాలమిటు వేపుచునుండునొ నా యెడంద ; ఆ
స్వాదిత పూర్వసంస్మృతులు సంతతమున్ పెనవైచి యేచెడున్.

పాయగలేక పత్ని నెడబాసి ప్రయాణము కట్టువేళ కం
దోయి దొరంగునశ్రువుల దొంతర లొత్తుచు పైటకొంగునన్
"శ్రేయము మీ" కటంచు నెదొ చెప్పగ లేక కలంత జూచు నా
ప్రేయసి కంపితస్వరము వీనుల నెప్పుడు మారుమ్రోగెడున్.

సుదతిని చూడలేక, మరిచూచిన వీడగలేక ముందుకున్
పద పద యంచు నాత్మ బలవంతము వెట్టుచు నెట్టినన్ సరే
పదములుమాత్ర మెంతవడి బాటకు రాని విషాదఘట్టముల్
మది గదియించుచో నిపు డమాంతము కాయము కొయ్యవారెడున్

జవజవలాడు యౌవన వసంతవిలాస విజృంభణమ్మునన్
వివశశరీరయై విరహవేదన వేగుచునెట్టు తాళెనో!
పవలును రేయి నాపయిని భావననిల్పి తదేక దృష్టియై
ఉవిద యొనర్చు ఘోరతప మూరక పోవునె నిష్ఫలమ్ముగన్ !

నవనవ విప్రయోగదమున శ్శిఖలెల్లెడ నావరింపుచున్
కవకవలాడు దేహలతికా విభవమ్ము హరింపకుండునే!
ప్రవిమల శారదేందు సితభాను సముచ్చయ ధాళధళ్యముల్
కవిసి హృదయంబు జాతమును గాసి యొనర్చి కలంచకుండునే!

నాకయి యేడ్చియేడ్చి వదనద్యుతులెంతగ జాజువారెనో
నాకయి చూచిచూచి నయనద్వయ మెంత విశాలమయ్యెనో !
నాకయి పిల్చిపిల్చి గళనాదమదెంత మనోజ్ఞమయ్యెనో !
నాకయి లేచిలేచి లలనా హృదయాంబుజ మెంతవాడెనో !

శ్రీ ఫట్టికొండ రంగ[illegible]

# శ్రీ మన్మనీషికి

కనఁబడదా! వస్త్రఖండ సంఘన్నార్థనగ్న రజోద్విగ్న భగ్నమూర్తి!
వినఁబడదా! క్షుధావిచ్ఛిన్న గర్భనిర్గత వేదనోద్రిక్త కరుణావరము!
స్మృతిఁదోపదా! క్రూర హేమంత హిమశైత్య కుంచిత శిశుముఖ కుటిలరేఖ!
తెలియరాదా! వ్యథాదీర్ణ హృదర్ణవా ఘూర్ణిత బాడబోద్గీర్ణవహ్ని!
తలపుఁబారదా! స్వప్రాణధారణ క్రియానిమిత్త మృషాప్రణయ భృత వార
భామినీ శీర్ణ పాండుర వదనకృతకహాస చంద్రికాంతర్గతా వ్యక్తతమసు!

మానవత్వము లుప్తమా? కొయ్యబొమ్మవా? మాటాడవేమి శ్రీమన్మనీషి!
మ్రోడు వారినదె నీలో కరుణాలత! చివురులు దొడుగదు—పువులువిడవు:
సౌహార్ద మన నేమొ యూహింపగలవె స్వప్నాలలో—జాగ్రదవస్థకేమి!
స్పందింపదే నీయెడంద? మాంసపుముద్దలం దాగి నిద్దురఁజెందఁబోలు!
నెత్తుటికి వేడి లేదె? కుంచించుకొన్న దేమి కోమలత్వము? పారెనెందు సౌమ
నస్యమెక్కడిది పొడిదనమ్ము కన్నుఁగవను? వణఁకఁబోదేమి పెదవుల జంట?

నీ సౌధ శిఖరమంటెను మిన్ను—జ్ఞానముమాత్ర మధోలోక మార్గగామి;
నీ మేను కమనీయ హేమరుచుల వెల్గు—మేధస్సు మాత్రము మృణ్మయమ్ము;
నీ వనాంతము లతాంతావృతరమణీయము—యెడఁద మాత్రము బీటవడిన బీడు;
నీ వక్షమందు మణిచ్ఛవి తొలుకాడు—మనసుమాత్రము తమోమయకుహరము
నీ పెదవులు తాంబూలారుణిమ మృదులము లందు కదలు పలుకులు విషావిలములు
నీ తనువు మాత్రమే నరజాతి జాత మితరవిధమెల్ల నసురుని స్మృతికిదెచ్చు!

అది నిరుపేద శూన్యమనోగగనసీమఁ గదలాడు దుఃఖ నీరదము సుమ్ము!
అది పాలకేడఁద నల్లాడు బిడ్డనుగన్న పురిటికన్నుల శోక శరధి సుమ్ము!
అది లేత వయసు కర్మాగారమున శ్రమించెడువేళ జారెడు స్వేదము సుమి!
అది పంటలడుగంట నార్తి కర్షకహృది జెలరేగు వేడి యూర్పుల సెగసుమి!
అది పథానఁబోయెడు కఠినాత్ములఁగని కాసుకోసము పేరాసఁ గరము సాచి
కసరి కొట్టఁబడిన బిచ్చగానిచూపు! చూపు తూపయి నీ గుండె సోకదేమి!

కట్టినాడు చలువఁగల్లులు పేర్చి, నీమేడ! వానికి నిల్వనీడ లేదు!!
నేసినాడతి సన్నని జిలుఁగుదారాల, నీ పంచ! లేదు వానికి వలువయె!!

# ఆంధ్ర శిల్పి

కోసినాడు, చెమటఁబోసి పండించి, నీ వరిచేను! వానికి కరవుగంజి!!
పరచినా డలరులవలె మెత్తనైన నీ పరుపు! వానికి శయ్య కరకునేల!!
పాలరాతితో చరమనిద్రాలయమ్ము నీ కొఱకు గట్టు! తా మరణించినపుడు
పడిదొరలునెందొ, వాని యభాగ్యశవము!! అతడు కష్టించు! సంతుష్టితాత్ముడీవు!!

ఒకడు సుఖింప నెందరో అ
హోరజనుల్ శ్రమఁగుందు వేదనా
శకము గతించిపోయినది
శ్రామికలోకము నిద్రనుండి మే
లుకొనియె—శ్రీమదాంధ్ర! మది
లోగల నీ దురహంకృతిఁ త్యజిం
పక గతిలేదు! కష్టపడు
వారికి దప్పస్థలమ్ము లే దిలన్!!

శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి.



# నవ్య సృష్టి

వలదు వలదిక కాలహరణము,
సలుపదగు మంగళాచరణము;
వలయు పరికరములు గ్రహించుము,
అచలమగు దీక్షను వహించుము.
నవ్యసృష్టిని చేయవలె నోయీ,
శ్రావ్యరీతుల
నవ్యగీతుల వ్రాయవలె నోయీ!

ప్రాతమాటలె అయిన నేమీ,
చేతకాదా క్రొత్త కూరుపు?
చూపలేవా క్రొత్తరూపము
సంతరించెడి నీదు నేరుపు?
దివ్యదృష్టిని జగతి కనుగొనుమా,
కావ్యముల నిక
నవ్యసృష్టిని చేయదొరకొనుమా!

పూర్వకృతులను పునాదులపై
పూని కట్టుము నూత్న సౌధము;
నవ్యశోభా లక్షణాన్విత
వైజయంతీ శ్రీ సనాథము,
శిల్పకౌశలమునకు సాక్ష్యముగన్
ఉత్తమంబగు
కల్పనాపరిణితికి లక్ష్యముగన్.

ప్రాతగిల్లిన యీ జగంబున
నూతనత్వము గలదు నిత్యము,
ఆ రహస్యము యుష్మదాంతర
దృష్టిగోచర మగుట సత్యము;
విశ్వమర్మమెరింగి ఉరుశక్తిన్
విస్తరింపుము
నిశ్వసించిన నీదు మహితోక్తిన్.

ఇంద్రియములకు ఎల్ల వేళల
ఒక్కటై వడి గోచరములౌ
విశ్వమందలి వస్తుజాలము
నందు నీవు మహత్తరములౌ
నవ్యసౌందర్యములు గనలేవా?
నవ్యతరబాం
ధవ్యరచనా చతురడవు గావా?

ఏడుస్వరముల మేళనమ్మున
ఏడురంగుల మిశ్రణమ్మున
నవ్యరాగము, నవ్యచిత్రము
ఉప్పతిలు కరనైపుణమ్మున;
నవ్యకవితాపథము కనుమోయీ,
లెమ్ము లెమ్మిక
నవ్యసృష్టికి పూనుకొనుమోయీ!

శ్రీ వజ్ఝల వెంకటేశ్వర కః

# బుద్ధదర్శనము

ఆ తుషార గిరి శిఖరిని,
పరివిస్తృత, మేకాంత,
మ్మతి గంభీర మొ్మక
వట భూజము తోచెనోహో!

ఆ హిరణ్మ్య శాఖక్రింద,
నచ్చట పద్మాసనమున,
అమరమూర్తి ద్యుతులదీప్తి
నమరి యుండి నోహో
దివ్యబుద్ధ ప్రభూత్తములు!
శుద్ధజ్ఞాన ప్రభాచ్ఛటల
ముగ్ధమూర్తులీ బుద్ధులు!
ఒడ్డులొరసి పొర్లి లేచు
మహాశాంతి సముద్రాన
మునిగి కనుగవ ముడిచి రోహో!

ఇది ఏమిటి అతి వింతగ
బుద్ధప్రభలు దూరమవును
ఛిద్రతమసి దూకిపడును?
మరల నదే కాంతి జాలు!
మొదలి జాలు మరలప్రాలు!
ముకుళితాంధకారమహో!
మరల నవే బుద్ధ ప్రభలు!
ఒడల పులక లెత్తునోహో,
గడల శాంతి పర్వు నోహో,
మాకరంద మాధురీ
స్వప్నమ్మోహోయియ్యది!

శ్రీ సుబ్రహ్మణ్య భారతి. అనుకృతి: శ్రీ రమణారెడ్డి

# చంద్రికా బాల

## శ్రీ ఎమ్. నరసింహాచార్య

అనంత విశ్వసౌందర్యాలకీ అధిదేవి శ్రీ చంద్రికా బాల అతని శిల్పకళాధిష్ఠానదేవత. అతని జీవితం చంద్రికా సౌందర్యోపాసనా దీక్షలో దీప్తివంతమై అతడు చిత్రించిన చిత్రాల్లో సత్యంశివంసుందరం అయిన విశ్వాత్మ ప్రతిబింబించింది. విశ్వమకుటాయమానమైన హిమవన్నగ సర్వోచ్చశిఖరం కైలాసం చంద్రికా పవిత్రమూర్తిలోని విశుద్ధధవళశోభా సౌభాగ్యాన్ని అతని హృదయాంతరాల్లో అంకితంచేసింది. వికసిత జ్యోత్స్నాయామినులు చంద్రికాబాల మధుర సుహాసరోచులతో అతనిజీవితాన్ని ముంచెత్తేశాయి. నదీఝరీ ప్రవాహవేగాల కలకలనిస్వనాలలో చంద్రికాపద మృదుమధుర రవళులు అతనికి శ్రవణపేయా లయినాయి. నవవసంతశ్యామలమైన సుందర ప్రకృతి, తారకా సుశోభితమైన అనంతనీలగగనం, వినిర్మలసలిలోపేతమైన గభీరమహాసాగరం, చంద్రికా రూపసంపదలతో అతని తారుణ్యమయ జీవితాన్ని ఆలోకితం చేశాయి.

చంద్రలోకవాసినినై విశ్వాలన్నీ ఆలోకితంచేసే శ్రీ చంద్రికాబాల అతనిని తన అనంతకోటి దివ్య రూపాలతో విముగ్ధుణ్ణి చేసేసింది. దివ్యప్రణయ విమోహితయై విపినభూముల పరిభ్రమించే ప్రేమోన్మత్త చంద్రికను, సుస్నిగ్ధధవళ జ్యోత్స్నాస్నాతయగుచు ఏకాంతంగా అభిసరింపవెడలే అభిసారికా చంద్రికను, విరహిణీచంద్రికను, ప్రణయవంచితా చంద్రికను - భగ్నహృదయ చంద్రికను, వాసవసజ్జికాసు చంద్రికను, ప్రణయకోపను చంద్రికను, ముగ్ధ యౌవన ప్రౌఢయైన చంద్రికను, వేయిమంది చంద్రికలను వేయిరీతులుగా చిత్రించాడు.

శ్రీ చంద్రికా బాల కైవసంచేసుకున్న దివ్యసౌందర్యాన్ని అమృత సత్యస్వరూపాన్ని విశ్వకల్యాణ కారిణీ మూర్తిని అతని చిత్రాలు శతశతధా వ్యక్తపరచగా లోకం ఆశ్చర్యచకితమైపోయింది.

దివ్యసౌందర్యరాశియగు శ్రీ చంద్రికా బాలను రూపించేయత్నంలో కళాసృష్టి చేసిచేసి తనివితీరని తమకంతో అతని ప్రాణాలు తల్లడిల్లాయి. అతని తీరని సౌందర్యతృష్ణకి పరితుష్టిలేక హృదయం పరితపించింది. అతని తారుణ్యం నిరుపమానుభూతిలో రససిద్ధి కానక నీరసించింది.

నిరనుభూతమైన ఒకానొక దివ్యరసానుభూతిని కాంక్షించి అతని మనస్సు విచలితమైపోగా అతనికి తపస్యాభంగమైంది.

చంద్రికాబాల నులివెచ్చని స్నిగ్ధాంగకాల సంస్పర్శకోసం, చంద్రికావిశాల నిభృతపీనకుచోప గూహనంకోసం, చంద్రికావిశుభ్ర మధురాధరామృత పానంకోసం, చంద్రికా దివ్యసుందర విగ్రహాలింగనంకోసం, శాశ్వతానంద దాయకమైన చంద్రికా బాల సాంగత్యంకోసం అతని సర్వాంగకాలూ, హృదయమూ, ఆత్మా తీక్ష్ణావేదనతో సంతాపితాలై అతని కీలోకమే శూన్యమయేట్లా చేశాయి.

అనేక వసంతాలు గడిచాయి. చంద్రికాబాల దివ్యసంపర్కంకోసం అతనితృష్ణా, విరహవేదనా అంతకంతకి అతిశయించి పోయాయి. అతని హృదయం శూన్యమై అతని జీవితం శుష్కించి అతనిఆత్మ సమ్మోహితమై పోయింది.

అతని తూలికాంచలాలు దివ్యరేఖాపచితాలైన సౌందర్యాలినీ, అతని వర్ణలేపనాలు చిత్రవిచిత్రాలైన

ఇంద్రధనుష్షేలనా విలాసాలినీ చూపడంమాని యుగాలైంది. అతని జీవితం అలసతాపూర్ణమై భయావిలమై చిత్రరచనకి మనస్సు పుట్టకుండా చేసింది.

ఈవిధంగా అతిదీర్ఘాలైన వర్షాలెన్నో గతించి పోయాయి. చంద్రికాప్రణయంలో, చంద్రికా విరహంలో అతడు ఉన్మత్తుడై కృశించి జీర్ణించి నశించిపోయే సమయ మాసన్నమయింది.

ఒకానొకనాడు ఆఖరుప్రయత్నంగా అతనిఆత్మ తీరనికాంక్షతో ఆరని తృష్ణతో సజీవచంద్రికా మూర్తిని సృష్టించడానికి స్థిరసంకల్పితమైంది. అతని శరీరంలో సమస్తప్రకృతి సౌందర్యం, అతని హృదయంలో సకల విశ్వప్రణయం - అతని ఆత్మలో సంపూర్ణసృష్టికారిణీ శక్తీ ఒక్కసారిగా జాగరితాలయాయి. అతని తూలికాజాలం అగణిత సూక్ష్మ రేఖా విన్యాసాలనీ, అతనివర్ణ సముదయం అద్భుత లేపనా వైశద్యాలినీ ప్రదర్శింపగా దివ్యలోకవాసిని విశ్వప్రణయ సామ్రాజ్యాధిరాజ్ఞి శ్రీ చంద్రికాబాల ప్రసన్నచిత్తంతో హాసరోచుల వెలార్చుచూ అతని చిత్రంలోకి అవతరించింది.

నీలగగనమంతటా నిండుకుపోయిన నిభృతకైశ్య భారంతో, విశ్వమంతటా విరిసిపోయిన విశాలోన్నత శుభ్రవక్షోజాలతో, పృథ్వీమండలమంతటా ఆవరించుకపోయిన విపులఘన జఘనాలతో, విన్నవోయిన కౌనుతో, విప్పారిన కనులతో కలమవెన్నుల బోలిన జంఘలతో విశ్వమోహిని, దివ్యప్రణయిని, నిత్యసత్యస్వరూపిణి చంద్రిక తన అలౌకికరూపంతో అతన్ని ఆత్మాంతరాల్లోంచీ కదలించివేసింది.

జీవకళ లుట్టిపడే శ్రీచంద్రికాబాల దివ్యచిత్రసన్నిధానంలో అతడు అంజలి నిబద్ధుడై మోకరిల్లాడు. ఎన్నో పగళ్లు ఎన్నో రాత్రులు నిరాహారియై నిద్రావిహీనుడై అనన్యచేతస్కుడై అతడు చంద్రికా కరుణామయ దృష్టుల ఛాయల్లో నిలిచి అనంతవేదనాభరితమైన తన సంతప్త హృదయాన్ని ఆదేవి పాదపంకజాల మ్రోల అర్పించుకున్నాడు.

దీనుడై ఉన్మత్తుడై నశించిపోతూన్న ఆ ప్రణయ శిల్పిస్థితికి మనస్సుకరిగి ఒకానొక దివ్యముహూర్తాన కరుణామయి శ్రీ చంద్రికాబాల ఆంగిక విన్యాసంలో ఒక సంచలనం - విశుద్ధోన్నత గౌరలలాటంపై ఒక్క స్వేదబిందువు - స్నిగ్ధమృదుల కపోలఫలకాలలో ఈషద్రక్తిమాభాస - ప్రణయభారావనత దృగ్జాలంలోంచి ఒక సుప్రసన్న రేఖ-మధురాధరంలోంచి ఒక్క హాసరోచి ప్రస్ఫుటమైనట్లయి అతని జీవితాశా జ్యోతిని ఒక్కసారిగా జాజ్వల్యమానం చేసేశాయి.

అకస్మాత్తుగా శ్రీచంద్రికాబాల మృదులపాద మంజీరాలనిక్వాణాలూ, కరపల్లవాల కంకణకణక్వాణాలూ, ఘళఘళమనే కుచ్చెళ్ల సవ్వడులూ, ఘల్లుఘల్లుమను గజ్జెల వడ్డాణపు కిలస్వనాలూ వినిపించగా అతని చిరవ్యథిత హృదయం చంద్రికా స్వాగతం కోసం విప్పుకుపోయింది. శ్రీ చంద్రికాబాల దివ్యాంగకాలనుండి తరంగితాలైన సహస్రసుమ పరిమళాలతో అతని నాసికా పుటాలు సురభిళించినట్లయి అతని ప్రాణాలు ఉక్కిరిబిక్కిరై పోయాయి. శ్రీ చంద్రికాబాల విపులనితంబ ప్రదేశాల నావృతమైన సువిశాల వక్షోజాల నాచ్ఛాదిత మొనర్చిన మృదుల నీలకౌశేయ పరిధానంలోంచి, ఉజ్వలపీత చేలాంచలంలోంచి కదలి వచ్చిన చిరుగాలి పరగలు అతని సర్వాంగకాలనీ సంస్పర్శించినట్లయి అతని శరీరం ఆ పాదమస్తకం రోమాంచితమైపోయింది. స్నిగ్ధాలై మృదులాలై మాంసలాలైన చంద్రికాప్రణయిని గౌరాంగకాల వంపులలోని అతిలోకసౌందర్యాలనీ - త్రిభంగికమైన ఆమె దివ్యమంగళ విగ్రహంలోని విశ్వసమ్మోహన

కరాలైన విలాసాలనీ-స్నేహసుస్నిగ్ధమై మంజులస్మేర మొలికే ఆమె చంద్రముఖంలోని ప్రసన్నతా భావాన్ని నేత్రపర్వంగా వీక్షించి అతని ఆత్మ తన్మయత్వం చెందిపోయింది.

అత డాశ్చర్య సంభ్రమాలతో ఎట్టయెదుట సాక్షాత్కరించిన శ్రీ చంద్రికాబాల ప్రాకృతికరూపాన్ని విలోకిస్తూ అట్టే నిలిచిపోయాడు.

విశుభ్రధవళ వస్త్రధారిణియై రజతమయ కరకంకణ చరణమంజీరాలతో కటినూపురాలతో నిత్య షోడశవర్షీయ అతని శిల్పశ్రీ శ్రీ చంద్రికాబాల అతనికి ప్రత్యక్షమై నిలువునా అందా లొలికిపోయింది.

ఆనందాతిరేకంచే వికసించిన తన సర్వాంగకాలనీ,సజలాలైన నేత్రాలినీ విప్పార జేసి,సజీవచంద్రికారూపాన్నవలోకిస్తూ అతడు బాష్పావరుద్ధ కంఠస్వరంతో "చంద్రికా! చంద్రికా! చంద్రికా!" అంటూ కరుణాక్రందనం చెయ్యసాగాడు.

శ్రీ చంద్రికాబాల కరుణాపూరిత నయనాలు, ఆమె మధురాధరాలు కదిలాయి. ఆమె అభయముద్రిత హస్తం అతనిమూర్ధాన్ని తాకింది. ఆమె కరుణార్ద్ర దృక్కులు అతని అంతరాంతరాల్ని తడిమాయి. ఆమె దివ్యవాణి అతని ఆత్మాంతరాల్లో నిధ్వనించింది.

"అనంత దివ్యప్రణయ సామ్రాజ్యాధిపత్యం వహించిన నీవు - అలౌకిక కళారచనా ధురీణుడవైన నీవు చంద్రికా భౌతికరూపాన్ని కాంక్షించి ఎంతగా అధీరుడవై పోయావు? క్షణికమైన తృష్ణాశమనం కోసం - నశ్వరమైన సుఖానుభూతికోసం - తుచ్ఛ ప్రాకృతిక సంపర్కంకోసం ఎంతగా దురపిల్లి పోయావు?

ఎవరోయీ ఈ నీ చంద్రిక? ఈ క్షుద్రచిత్ర నిబద్ధితమైన చంద్రికా సంయోగంకోసమేనా నీవింతగా కాగిపోయినది? చంద్రికలోని యీ స్వల్పాంశను అనుభవించి నీవు పరితృప్తుడవు కాగలవా?

ఓయి అబోధశిల్పీ! చంద్రిక నీ దివ్యహృదయంలో ఉన్నదోయీ! మధురమయానంత భావనాలోకాల్లో విహరించే నీ ఆంతర్యంలోనే కాదుటోయీ శ్రీచంద్రికాబాల సంపూర్ణాంశతో విరాజిల్లుతూన్నది! ఆ సత్య స్వరూపిణి చంద్రికాబాలముందు ఈ నశ్వరన్యూన చంద్రికారూప మేపాటిదోయీ! ఈ భౌతికరూప తృష్ణలో నీ వెంతగా వియోగవ్యథ ననుభవించితివోయీ!

నీకు వియోగమా? శ్రీచంద్రికాబాల దివ్యజీవితంలోని శతశతాంగ భంగిమలూ - కరచరణ విన్యాసాలూ - కదలికలూ, రేఖలూ, వర్ణాలూ గుత్తకు పుచ్చుకున్న నీ ప్రణయహృదయానికా వియోగం? ధగద్ధగాయిత నవరత్నభూషలతో, వివిధవర్ణికా రేఖాంచితాలైన శస్త్రకౌశేయ పరిధానాలతో శ్రీ చంద్రికాబాల పవిత్రదేహాన్ని అలంకరించావు కాదుటోయీ! చంద్రికాబాల వినీల దీర్ఘకుంతలాల్ని వేయిరీతులుగ ముడిచి సహస్రవిధములుగ ప్రశస్తసుమదామాంచితం చేశావు కాదా! అనంతహావభావ విలాసాలతో అద్భుత ప్రణయ లీలా విశేషాలతో శ్రీచంద్రికాబాల హృదయానికి దివ్యచైతన్యాన్ని ఇచ్చావే. అనుపమ కళాకౌశల్యం కనపరిచి నిత్యసత్యసుందర స్వరూపాభాసలతో ఆమె పరిశుద్ధాంతరాత్మని వ్యక్తపరుస్తూ శ్రీ చంద్రికాబాలకి అనంతకోటి శాశ్వత రూపాల నిచ్చితివి. నీకు ఆమెయెడలనా వియోగం!

ఓయి సమాధిభ్రష్టుడా! సృష్ట్యాదినుంచిన్నీ శ్రీ చంద్రికాబాల నీ కైవసమై ఉండగా - అనుక్షణం నిన్ను బాయక తన అవ్యాజకరుణా ప్రపూర్ణ దృక్కుల నీపై ప్రసరింపజేస్తూ శ్రీ చంద్రికాబాల నిన్ను చుట్టుకొని నీకింతే దగ్గరలో నీలోనే స్థిరనివాస మేర్పరచుకొని ఉండగా నీకింకా కావలసినదేమిటోయీ! ధీరుడవై స్థితప్రజ్ఞుడవై శ్రీ చంద్రికాసాహచర్యంలో

ధన్యత నందవోయీ. శాశ్వతసత్య సౌందర్య స్వరూపిణి నీకళాధిదేవి శ్రీ చంద్రికాబాల దివ్యజీవన ప్రకాశనంలోనే - నీమధుర భావనామయ ప్రపంచాన్ని ప్రస్ఫుటీకరించడంలోనే నీకు చంద్రికా సంయోగం. నీకు ప్రణయతృష్ణాశాంతి. నీయీ అనంతదివ్య తపస్సునకంతరాయ మేలనోయీ! నీవు శ్రీ చంద్రికా జీవనంతో తాదాత్మ్యమందవోయీ! నీవు వేరు చంద్రిక వేరు కానపుడు ఇంకనూ నీ వనుభవింప మిగిలిన దేమున్నదోయీ."

సాశ్రునయనుడై శ్రీ చంద్రికా హృదయాంతర ప్రాంగణచ్ఛాయలో నిలిచిన అతనికి ఒకవిధమైన ఆత్మశాంతి - తృష్ణాశమనం కలిగి ధన్యోస్మి అనుకున్నాడు!



# ఎలక్ట్రాను

## శ్రీ వసంతరావు వేంకటరావు

ఐదారు నెలలై ఎలక్ట్రానుదర్శనం కాలేదు. నేనేమో చాలాసార్లు మంత్రపఠనం చేశాను; అయినప్పటికి ఎలక్ట్రాను సాక్షాత్కరించలేదు. నాకొకనాడకస్మాత్తుగా ఆ మంత్రప్రభావంపై సందేహం కలిగింది. అట్లనుమానం కలిగినప్పటినుండి ఎలక్ట్రాను గోచరించడంలేదు. మంత్రాలసందర్భంలో మనస్తత్వప్రాధాన్యం గురించి ఎక్కువగా చెప్తారు. దాని కొక దృష్టాంతముంది. గొప్పమంత్రవేత్తఅయిన ఒక ఫకీ రుండేవాడట. పాముకాట్లను, శరీరవ్యాధులను మంత్రశక్తిచే అద్భుతంగా కుదిర్చేవాడు. ఆ గ్రామంలో నున్నవాడొకడా ఫకీరువద్ద మంత్రం నేర్చుకొందామని ప్రయత్నించేవాడు. కాని, ఫకీరుకి మంత్రోపదేశం చేసిన గురువుగారి ఆజ్ఞ యేమంటే ఆ మంత్రాన్ని ఎవ్వరికి చెప్పవద్దని. అందుచేత ఎందరెన్ని విధాల అర్థించినా ఆ ఫకీరు మంత్రాన్నెవరికి చెప్పేవాడుకాడు. కాని, ఆ గ్రామీణుడు మాత్రం ఫకీరుని వేధించి వేధించి ప్రాణం విసిగించాడు. ఆ బాధపడలేక ఏమైతే అయిందని తుదకు మంత్రోపదేశాని కంగీకరించి గ్రహణ సమయం ఏర్పాటుచేశాడు. నిర్ణీతకాలంలో మంత్రోపదేశం జరిగింది. ఆ మంత్రం "ఘోడాఆయా, చేవర్ ఖాయా, పానీపీయా, చలేగయా" అని మాత్రమే. ఉపదేశం పొందిన వ్యక్తి 'ఇంతేనా మంత్రం' అన్నాడు. ఆక్షణంనుండి ఫకీరుయొక్కశక్తి పూర్తిగా నశించింది; ఉపదేశంపొందినవానికి పట్టుబడిందికాదు. ఇట్లుభయభ్రష్టత్వమయింది. ఆ రీతిగా ఎలక్ట్రా నుపదేంచిన మంత్రంపై విశ్వాసం పోయినప్పటినుండి ఎలక్ట్రానుతో సంభాషించుట కవకాశం కలుగలేదు. సామాన్యంగా దేనియందైన విశ్వాసంపోవుట సులభంగాని, విశ్వాసాన్ని పునఃప్రతిష్ఠించుకొనుట చాల కష్టం. అది గ్రహించినప్పటినుండి విశ్వాసస్థాపనకు ప్రయత్నిస్తూనేఉన్నాను. తుదకు, వ్యయసంవత్సరాది నాడు అభ్యంగనానంతరం శుచిగా కూర్చొని ఎలక్ట్రాను చెప్పిన మంత్రాన్ని స్థిరచిత్తంతో పురశ్చరణ చేయ మొదలుపెట్టాను. అట్లు కొన్నాళ్ళు చేసిన తరువాత విశ్వాసం నెలకొల్పబడినట్లు ధైర్యం కలిగింది. అప్పు డొక శుభావసరమందు ఎలక్ట్రానును మనఃపూర్వకంగా స్మరించినంతనే ఎలక్ట్రాను ప్రత్యక్షమై "ఎన్నాళ్ళకెన్నాళ్ళకు నన్నాహ్వానించేవు, మిత్రమా! ఈమధ్యకాలంలో నీచిత్తం అన్యాయత్తమైయుందా, లేక, విశ్వవిశేషాలను జీర్ణంచేసికొంటూందా?" అంటూ అభిమానపురస్సరంగా హెచ్చరించింది. ఆ హెచ్చరికకు నాలో సిగ్గు పొడమింది. ఏమి మాటాడుటకు తోచక అవనతవదనుడనై ఊరకొన్నాను. అంత ఎలక్ట్రాను ప్రారంభించింది. "మిత్రమా, ఈమధ్య యుద్ధానంతర పునర్నిర్మాణకార్యక్రమంలో పాల్గొంటూన్న పెద్దల చిత్తవృత్తులను గమనిస్తూ ఆహారసమస్యాపరిష్కారానికి వారు పడుచున్నబాధలు చూస్తున్నాను. ప్రపంచమంతా ఒకేదేశంగా భావింపబడితేగాని మానవజాతికి భవిష్యత్తులేదని ఈయుద్ధంవల్ల తెలియవచ్చింది. కొందరు విజ్ఞానులు చెప్పినట్లు

పారమాణుకశక్తి వినియోగించినట్లైతే భూలోకాన్ని ఆపరస్వర్గం చెయ్యగలరు. బొగ్గుగనుల గర్భంలో ప్రళయంబాంబును పేల్చినట్లైతే ఆ మహాశక్తికి బొగ్గు రత్నంగా మారవచ్చునని కొందరూహిస్తున్నారు. అయితే, మునుముందాశక్తి నెట్లుపయోగిస్తారో చూడాలి. దానిమాటకేమి. నన్నెందుకు రప్పించావు?"

"నక్షత్రాలగురించి విశేషాలేమైనా చెప్తావేమో అని రమ్మన్నాను. నక్షత్రగర్భాలలో కొంతకాలం జీవితంగడిపి వచ్చావు కాబట్టి ఆస్థితిగతులను వర్ణించు సామర్థ్యం నీకే ఉంది. అదీకాక నక్షత్రాలదగ్గరకు మేమెన్నడు పోలేముకదా! నీవు కొంత సవిస్తరంగా చెప్పాలి" అన్నాను.

"నక్షత్రాలచెంతకు పోలేకపోతేనేమి, మీరు నక్షత్రాన్ని తూచి, నక్షత్రగర్భంలో జొచ్చి శోధించినట్లు జ్ఞానం సంపాదిస్తున్నారు. అయితే, ఆ జ్ఞానార్జనకు మేమే అవకాశం కల్పిస్తున్నాము. మా జీవితంలో రహస్యంలేదు. సర్వవిషయాలు ఆకాశంలో మేము ప్రకటిస్తున్నాము. ఆప్రకటన మా భాషలోనే జరుగుతూంది. మా భాషాసంప్రదాయలను తెలిసికొన్నవారికి సృష్టిరహస్యాలు కరతలామలకమే. కాని, అదంత సులభమైనదికాదు. ఇంతకూ, మానవులు మా భాషను చాలవరకు సాధించారు; అచ్చుటచ్చుట గూడార్థాన్ని మాత్రం స్పష్టంగా గ్రహింపలేకున్నారు. అదైనా మునుముందు తెలిసికొంటారని నా నమ్మకం.

మే మందరము విద్యుదయస్కాంత తరంగ (electro magnetic wave) లిపి నుపయోగిస్తాము. వార్తలన్నీ ఆ ప్రత్యేకతరంగాలలోనే కలిగిస్తున్నాము. అట్టి తరంగాలనుండి నక్షత్రవిషయమై అనేక రహస్యాలు కనుగొన్నారు. నక్షత్రాలబరువు, తాపక్రమం (temperature) పరిమాణం, నక్షత్రాలలోనున్న పదార్థాలు, తుదకు నక్షత్రపరిమాణ చరిత్రయావత్తు మీవారు కనుగొంటున్నారు. మేము పరమాణుకేంద్రకం (nucleus) చుట్టూ మహావేగంగా తిరుగుచున్నామని ఇదివర కెరిగించాను. పదార్థం సామాన్యస్థితిలో నున్నప్పుడు మే మొకేవేగంతో నియతకక్షులలో నిత్యభ్రమణమం దుంటాము. కాని, పదార్థ మేదైనా ఉత్తేజింపబడినప్పుడు మేమహాశక్తిని గ్రహించి మాకక్ష (orbit) కు పైనున్నకక్షలోనికి గెంతుతాము. తిరిగి మా స్వస్థానం చేరుకొనేటప్పుడు శక్తి నిచ్చివేస్తాము. ఆశక్తి తరంగరూపంలో ప్రసరింపబడుతుంది. ఈక్రియలో వివిధపరమాణువులు ప్రత్యేకవిధాలుగా ప్రవర్తిస్తాయి. ప్రాణవాయు పరమాణువులనుండి వచ్చుతరంగాలకు ఒక ప్రత్యేకత ఉంది. అట్లే, బంగారుపరమాణువులు వాటికి ప్రత్యేకమైన తరంగాలనే కలిగిస్తాయి. ఇట్లు ప్రతిమూలపదార్థము ఉత్తేజింపబడినప్పుడు దానికి స్వాభావికమైన తరంగసమూహాన్నే ప్రసరిస్తుంది.

కాని, తదేకదృష్టితో నక్షత్రాల నెంత పరిశీలించినప్పటికి కంటిలో జొరబడు కాంతితరంగాలగూర్చి కించిత్ జ్ఞానమైన మానవుడు సంపాదించలేడు. ఎఱ్ఱని నక్షత్రాలనుండి వచ్చుతరంగాలు నీలితారలనుండి వచ్చుతరంగాలకన్న కొంచెం పొడవైనవని తెలిసికొని అంతటితో సంతుష్టుడై యుండినట్లైతే ఇప్పుడార్జించినంత నిగూఢజ్ఞానంలో సహస్రాంశమైన సంపాదించి యుండలేకపోయెడివాడు. అయితే, మే మేవిధంగా తోడ్పడ్డామో తెలియజేస్తాను, విను.

కాంతితరంగాలన్నీ ఒకేవేగంతో గమిస్తూ ఉంటాయి. అవన్నీ కలిసిపోతూన్నప్పుడు వాటిని వేరువేరుగా గుర్తించుటకష్టం. కాని, ఒక కిరణజాలం ఒకగాజు పట్టకం (prism) మీదపడి దానిలోనుండి బహిర్గమించినప్పుడు అది వక్రీకరణ (refraction) మొందుతుంది; అనగా, నూటిగా పోతూన్న కిరణ

జాలం వంగుతుంది. అట్లు వంగినప్పుడు ఎఱుపుకిరణాలకన్న నీలలోహితకిరణాలు ఎక్కువగా వంగుతాయి. కిరణాల అలపొడవు (wave length) తగ్గినకొద్దీ నిజమార్గంనుండి వక్రీకరణమొందుట ఎక్కువౌతుంది. కాబట్టి బహిర్గతకిరణజాలం విసనకఱ్ఱవలె విస్తరిస్తుంది. ఇట్లు వివిధకిరణాలు చెదరగొట్టబడగా రంగురంగులవర్ణపటం (special) ఏర్పడుతుంది. దాని నొకకొనను నీలలోహితం, ఒకకొనను ఎఱుపు ఆక్రమిస్తాయి. మధ్యను క్రమంగా నీలి, నీలం, ఆకుపచ్చ, పసుపుపచ్చ, నారింజరంగులుంటాయి. అట్టి వర్ణపటాన్ని మే మప్పుడప్పుడు ఆకాశంలో కలిగిస్తాము. చిన్నవాన జల్లుపడి వెలిసినప్పుడు సూర్యుని కెదురుగా హరివిల్లు నేర్పరుస్తాము; దానిని చూచిన పిన్న పెద్దలందరు ఆనందిస్తారు.

మేము శక్తిని గ్రహించి ప్రసరిస్తామని చెప్పాను. పదార్థాలు చాలవరకు కాంతినిరోధకము (opaque) లు. వాటిలో కాంతి జొచ్చికొనిపోలేదు. గాజు, నీరు, గాలివంటి కొన్ని పారదర్శక (trasnparent) పదార్థా లున్నాయి. అవి కాంతిని నిరోధించవు. నీటిలో చేపలుపోయినట్లు, ఆ పదార్థాలలో కాంతి దూసికొనిపోగలదు. కాని, పారదర్శకపదార్థపరమాణువులలో నున్న మావారుమాత్రం కాంతితరంగాలకు కొంత నిరోధం కలిగిస్తారు. తరంగాల పౌనఃపున్యంతోపాటు నిరోధం ఎక్కువౌతుంది. పౌనఃపున్యం (frequency) ఎక్కువైతే అలపొడవు తగ్గుతుంది—నీలంకిరణాల పౌనఃపున్యం ఎఱ్ఱనికాంతి పౌనఃపున్యంకన్న ఎక్కువ, నీలంకిరణాల అలపొడవు ఎఱుపుకిరణాల అలపొడవుకన్న తక్కువ. కాబట్టి, గాజుపట్టకంలో జొరబడిన కాంతియొక్క పౌనఃపున్యంబట్టి అది వక్రీకరణ మొందుతుంది. అంతేకాక, గాలిలోకన్న గాజులో కాంతియొక్క వేగం తక్కువ. మా సహాయం ఇప్పుడు బోధపడుతుంది. ముక్కోణాకారంగల గాజుపట్టకంయొక్క ఒకముఖంమీద పడిన కిరణజాలం రెండవముఖంలోనుండి బహిర్గమించులోపున మే మా కాంతి తరంగాల నన్నిటిని, పోస్టాఫీసులో ఉత్తరాల నేర్చినట్లు, వాటి పౌనఃపున్యాన్ని బట్టి ఏర్చివేస్తాము. సన్నని నిలువుపాటి రంధ్రంలోనుండి వెలువడి పట్టకంమీద పడినకాంతి దానినుండి బహిర్గమించి విస్తరిల్లి వర్ణపటమౌతుంది. ఆవర్ణపటంలో కొన్నికొన్నిచోట్ల తేజోరేఖలుంటాయి. వాటికిసైతం మేమే కారణం. మండుచున్న పదార్థంనుండి వచ్చినకాంతి ఆ పదార్థానికి ప్రత్యేకమైనదని చెప్పాను. ఒక్కొక్కపదార్థం కొన్నికొన్ని నికరమైన అలపొడవులుగల కిరణాలనే ప్రసరిస్తుంది. వర్ణపటంలో ఆకిరణాలు ఏయే స్థానాలలో నుంటే ఆయా స్థానాలలోనే తేజోరేఖ లేర్పడతాయి. వర్ణపటంలో వాటి స్థానాన్నిబట్టి రంగును ప్రదర్శిస్తాయి. మండుచున్న సోడియం అను మూలపదార్థనుండి వెలువడిన తరంగాల రెండు పసుపుగీతలను కలిగిస్తాయి. ఉదజనినుండి వచ్చుకాంతి ప్రధానమైన నాలుగురేఖలను కలిగిస్తుంది. నియాను అను వాయువు ఉత్తేజింపబడినప్పు డిచ్చుకాంతివల్ల అనేకరేఖ లేర్పడతాయి; వర్ణపటంయొక్క ఎఱుపుభాగంలో చాల గీతలుంటాయి. ఇట్టి తేజోరేఖలను జాగ్రత్తగా పరిశీలించి వాటి స్థానాలను గుర్తించిన మానవుడు గణితసహాయంవల్ల వాటిభావాన్ని గ్రహించాడు. ఏదైనా ఒక వర్ణపటాన్ని చూడగానే అందులో ఫలానా రేఖలున్నాయి కనుక దానిని కలిగించినకాంతిలో ఫలానాపదార్థముండక తప్పదని నిర్ణయించగలడు.

నక్షత్రవార్తల నెట్లు పంపుచున్నామో ఇక సులభంగా గ్రహించగలవు. నక్షత్రాలన్నీ మండుచున్న వాయుగోళాలు. అందున్న మావారు ఆ తాపక్రమా

నికి నిత్యకార్యనిమగ్నులై ఉంటారు. అనుక్షణం వారు విద్యుదయస్కాంతతరంగాలను ప్రసరిస్తున్నారు. అవి భూమిని చేరుకుంటాయి. ఆతరంగాలను గాజు పట్టకంలోనుండి పోనిచ్చినప్పుడు గాజులోనున్న మూవారు అలపాడవునుబట్టి కాంతి తరంగాల నేర్చి వర్ణపటంలో రేఖలను చూపిస్తారు. ఆ రేఖాసంప్రదాయాన్ని అవగాహనచేసికొన్న విజ్ఞానులు వర్ణపటాన్ని పరిశీలించి దూరతరతారకలలో ఏయే పదార్థాలున్నాయో చెప్పుకొంటారు. ఈవిధంగా నక్షత్రనిర్మాణాన్ని కనుగొన్నారు. అట్లే తాపక్రమాన్ని తెలిసికొని నక్షత్రాలను కొన్నిజాతులలోనికి విభాగించేరు. నక్షత్రా లెట్లు జనించి లయమౌచున్నాయోకూడ ఊహిస్తున్నారు.”

“మిత్రమా, నక్షత్రవయఃపరిమితి కోట్లకొలది సంవత్సరమైన మానవజీవితపరిమాణం నూరేండ్లకన్న తక్కువై యుండగా, సాపేక్షంగా క్షణమాత్రజీవితైన మానవుడు నక్షత్రపరిణామాన్ని ఎట్లు తెలిసికొనగలిగేడని కొందరు హేళనగా ప్రశ్నిస్తున్నారు కదా...”

“ఔనౌను, అట్టిప్రశ్నల నా చెవినికూడ పడ్డాయి. అవి అజ్ఞానులు మూఢమతులు వేయవలసినవి కాని జిగీషతో శ్రమించు విద్యార్థిసైతం అట్లడగడు. ఏమంటే, అనుభవపూర్వకజ్ఞానాన్ని ఫలప్రదంగా సంకలనంచేయుటే మీ ప్రత్యేకత. 'మిత్రమా, మఱ్ఱిచెట్లవంటి చెట్లు వందలకొలది సంవత్సరాలు జీవిస్తాయి. అయితే మఱ్ఱియొక్క జీవితచరిత్ర తెలిసికోవాలంటే విత్తునాటి, మొలిచిన మొక్క మహావృక్షంగా పెరిగినదాకా దానిని పరిశీలిస్తూ కూర్చుంటారా? మహారణ్యాలలో పర్యటించి అప్పుడుద్భవించిన చిన్న మొక్కనుండి పరిణతవృక్షం వరకు మధ్యనున్న అంతరాలలోగల చెట్ల నక్కడక్కడ చూచి మఱ్ఱి ఈ విధంగా పరిణామమొందుతుందని ఊహించరా? అట్లే, అసంఖ్యాకంగానున్న నక్షత్రాలను పరిశీలించి, వాటివయస్సు నిర్ణయించి పరిణామ మూహించడం ప్రాజ్ఞలక్షణంసుమా!...”

ఇంకేమో అంటూండగా స్వరం సన్నగిల్లిపోయింది. ఏమా అని దిక్కులుచూచేసరికి ఆకాశం మేఘావృతమై దుమారం రేగుతూంది. మేఘాలు గర్జిస్తున్నాయి. వాతావరణం విద్యుద్బలపూరితమయింది. అ బలంచే ఎలక్ట్రాను ప్రబోధింపబడి ఏమబ్బులోనో లీనమయింది.



# బడి గంట - బండి గంట

## శ్రీ కవికొండల వేంకటరావు

ఓనాటిరాత్రి మా యింటి మండువా సావిట్లో, దాన్నే రాతిసావిడి అనికూడా అంటారు,—ఎందుకో పెద్దవాళ్లు, ఆడవాళ్లు, మగవాళ్లు, అత్తాకోడళ్లు, తల్లీ కొడుకులు, అన్నాదమ్ములు,—ఎన్ని వరుసలు ఈ ప్రపంచంలో వుండాలో అన్ని వరుసలుగాను, తీరి, కజ్జాలో తమవాళ్లు తా మెరక్కుండావుండి యున్నారు. నేను వ్రాసిన దాన్నిబట్టి ఒకలక్షమంది అయినా వుండివుండక పోరు. ఇన్ని వరుసలకూ ఇన్ని తావులకూ ఆ సావిట్లో, ఒకఇంట్లో అంతమంది వుంటారా? ఎంత పెద్ద కుటుంబమైనాను! అని పాఠకులాశ్చర్య పోయేరేమో! అదికాదు. నేను వ్రాసిందాన్నిబట్టిమీ రూహించవలసింది.-ఒకపర్యాయం కోడలు అత్తనుఅంటే, ఆ మాటట్టుకు అత్త కొడుకును, కొడుకు వదినెగార్ని, వదినెగారు మఱిదిని, మఱిది అతగాని భార్యాను, ఆ భార్యా వారి పిల్లల్ని ఇలా తిట్టడం, తిమ్మడం, మొత్తడం, మొత్తుకోవడంకూడా జరుగుతూ పెద్దరవరవగా వుంది. రాత్రిభోజనాలైపోయిన పిదప జరుగుతూవున్న తీతిక పోట్లాటగా నాకు అది తట్టింది. గాదెల దొడ్డిలోకంతా వినబడుతూవుంది గోల.

ఆలాంటి గోల సర్వసాధారణంగా ఆలాంటి పెద్దిళ్ళల్లో నిత్యమూ ఆ రోజుల్లో జరుగుతూనే వుండేదిగా నేనూహించి, ఆకలహంకూరాని కెక్కడా ప్రారంభం, ఎప్పుడూ ప్రారంభం అనేదానికన్న ఆకలహం ఎప్పుడు ఏలా అంతమౌతుంది, ఎప్పుడు అందఱూ సుఖంగా నిద్రపోతారూ అనేభావం మిలిమిలితించి, ఆకలహధ్వనికి దూరంగా వుండి పోవాలనో ఏమో, నేనోచంకకు ఇంగ్లీషు మొదటి పుస్తకం, ఎ. బి. సి. డి, ల దగ్గఱనుంచి వున్నది, పేరుమీదవున్న—గార్థభో గాడ్ఫ్రేవో? ఆ ఫస్టు రీడరూ, రెండోచంకను సవారీబండి చిరతలు పలుపులు, గంటలు తగిలించుకునో, పెట్టుకునో, పెద్ద గాదె అరుగుమీద కూర్చునివున్నాను,—ఎవళ్ళకూ తెలియకుండా, ఎవళ్ళకూ తెలుపకుండా!

అప్పటి నావయస్సు పదేళ్లువెళ్ళి పదకొండోయేడు. మా వూళ్లోనె ఎ. బి. వ్రాతలు నేర్చి, ప్రైమరీప్యాసయి, రాజమంద్రం చదువుకు సన్నాహమైయున్న మొదటి మాణవుకుణ్ణి. కులుకు, ఎ. బి ని తల్లక్రిందులుగా పూర్చి పేరుచివర బి. ఎ. వ్రాసుకుందామని. గానూ హూడ్డూ వేసేస్తానని. దానికే మఱో పేరు. ఆంగ్ల భాషా వేషా వ్యామోహం అనొచ్చు. కాని ఆ రోజుల్లో అది వ్యామోహం అని అనిపించుకునేది కాదు. 1903 విక్టోరియా మహారాజ్ఞి మనదేశానికి చక్రవర్తినియై పరిపాలిస్తూ, పరిణతి, పరిణామం కనబరుస్తూవున్న శాంతికాలము. ప్రతివాని ఎగ ఇంగ్లీషు బడుల్లో చదవాలని. ప్రతివాని ఏవ ఎదో సెరద్దారో, సముద్దారో అవుదామని! మఱీన్నీ లాయరుకావచ్చు! హైకోర్టు గడ్డెక్కొచ్చు! తెల్ల దొరల ప్రాపకంవుంటే, తెల్లదొరసానులతో 'కాసర బీసర' టీపార్టీల్లో మాట్లాడగలిగితే, మగవానికి పట్టని అదృష్టంలేదని అనుకునే ఉద్యోగాధికార యుగం అది.

ఇవన్ని అప్పట్లో, పదకొండేళ్ళ కుఱ్ఱకుంక మనస్సులోవున్నాయా? అని కొందఱు తోసి పారేస్తే తోసి పారవేతురుగాక! అవన్నీ వున్నా లేకపోయినా

నాలో ఆంగ్ల భాషను నేర్చుకోవాలనే అభిలాష మిగిలిపోటే తప్పకుండా వుండివుండి. కాకుంటే నేను నేర్చిన ఎ. బి. సి. అక్షరాల కూడిక నుడికారం ముప్ఫైయో పడిలోవున్న మా పెద్దకక్కయ్యకు చెప్పడమేమిటి? ఆయననుకూడా, వ్యవసాయంమాని రాజమంద్రి వచ్చి, నాలుగవ గరగతిలోనో, మొదటి ఫారములోనో చేరమనడమేమిటి? ఇప్పుడు నాలో నాకే నవ్వువస్తూంది ఆ ముక్క తలుచుకుంటే.

గానా బడ్డీమీద, చీకట్లో, ఆలా, ఒకచంకను ఆరీడరు, ఒకచంకను చిరతలు, పలుపులు, గంటలు, పెట్టుకుని, ఎంతసేపని పట్టుకొని, కూర్చోను? దొడ్డి గుమ్మంలో బండీకి గూడుకట్టి, గడ్డిపఱచి, చాపసరిది, అంతా సిద్ధపఱచి, మఱి పెద్దెడ్లనుకూడా తలపగ్గా లుచ్చుకు ఆవలకు తీసుకునివెళ్ళి, తొట్టి కిటూకదాన్ని అటూకదాన్ని తోలి, అవి కొమ్ములు విసరుకొంటూ ఒసరు పిసరు మెసవుతూవుంటే, "నర్సయ్య" అనే మా పాలేరు గాద బడ్డీ క్రిందకు ఆ చీకటిలోనే వచ్చి ఎందుకో తమముళ్లాడేడు. లోలో గొణుక్కోసాగాడు, "ఇక్కడ చిరతలు పలుపులు వుండాలి! ఏమయి నాయో? ఎవరుతీశారో? గంటలూ కనబడవు. ఎవడైనా చేద్దెబ్బకొట్టేశాడా యేమిటిచెప్మా! మొన్న తీర్థంలో కొత్తగా కొన్న గంటలు! ఉఁ! ఉఁ" అని.

నేను బడ్డీమీదనుంచి "ఏమోయి నర్సయ్య! నీవేనా ఏమిటి ఈవేళ రాజమండ్రిబండి తోలేది?" అన్నాను. దానికి జవాబు చెప్పకుండానే "మిమ్మల్ని గురించి, ఇంటిల్లిపాదీ లోపల మండువా సావిట్లో కజ్జా ఆడుకుంటూవుంటే, మీరెక్కడ నిశ్చింతగా కూర్చున్నారా? బాబులూ? చిడతలు, పలుపులు మీ చేతిలో వున్నాయా?" అన్నాడు. "ఆ వున్నాయి! గంటలూ వున్నాయి! ఇవిగో!" అని మోగించి నాకోసం వాళ్ళందఱూ జగడమాడుకో వడం ఏమిటోయి? ఎందుకోయి?—ఇంతకూ చెప్పు! నీవేనా బండితోలేది ఈ రాత్రి?" అని అడిగాను. "ఏం నేను పనికిరానా?" అన్నాడు. "నీవు పనికిరాకేం, నీవే తోలాలి! చూడు మావాళ్ళతో చెబుతావుకదా లోపలకువెళ్ళి,—"అబ్బాయిగారు అప్పడే ఓ చంకను ఇంగ్లీషు పుస్తకం, ఓ చంకను చిరతలు పలుపులు గంటలు పెట్టుకుని బండెక్కి కూర్చున్నారు. మఱి మీ రెంత పోట్లాడుకున్నా కొట్లాడుకున్నా, అయన్ను రాజమంద్రం చదువులో ప్రవేశపెట్టం, అని అనుకున్నా ప్రయోజనం లేదు. వస్తే మిమ్మల్నందర్నీ యీ బండి మీదనే రాజమంద్రం వచ్చేసెయ్యమన్నారు! అని చెప్పు" అని పురమాయించాను.

నర్సయ్య, అంటే మాపాలి కాపుల్లో పెద్ద పాలి కాపు. మఱిన్ని సవారీబళ్లు తోలేవాళ్ళల్లో సౌమ్యుడు. ఉన్నారు మఱిద్దఱు, ఉద్ధారుళ్ళనిపించుకోతగ్గవారు, రాజన్న అనీ, రుద్రయ్య అనీ—కాని నర్సయ్యే, ఊరిప్రయాణంవస్తే బండితోలాలి! అటువంటప్పుడు నర్సయ్య పనికిరాడని అంటానా? అనను. పైగా అతనంటే నాకు నమ్మకం! తప్పకుండా, నే నన్న మాట, లోపలకు తక్షణంవెళ్ళి తప్పకుండా, మా పెద్దవాళ్ళతో చెప్పక మానడు అని ధీమా!

మా మండువాచావడి, ఆ కాలానికి తగియుండిన సమష్టికుటుంబపు కట్టడం: పెద పెద్దతనాబీలు, మేలైన కొమరులు, ఉసులైనగూళ్ళు, ఊచలకిటికీలు వున్నది. తలపెద్దలు ముగ్గురన్నదమ్ములకు మూడుపడగ్గదులు. మూడుపడగ్గదుల ప్రవేశద్వారాలు ఆచావడిలోనే! చావడివెనుకను పెద్దపడమటిల్లు. ప్రక్కగా పడమటింటనో అడ్డగోడ. అడ్డగోడావలపొయ్యిలు, పోపుల సరంజామానూ! తిన్నగా చూస్తే వసారా, వసారాను చేరి పెరడు, పెరట్లో పుల్లదబ్బచెట్టు, తులసికోట, కానేపాదు, ఊటేదుంప, కఱివేపాకురొబ్బ, కరివేరు

పువ్వు - పెద్దబ్యాక్ గ్రౌండుగా విరాజిల్లుతూవుండేవి. మండువాకు రేకుతగిల్చి, గొట్టంగుండా వాననీరుపడేలా ఏర్పాటువుంది. ఒక్కొక్కప్పుడు తగిల్చేవారు, ఒక్కొక్కప్పుడు తీసేవారు. తగిల్చినప్పుడు కలిగే కొత్తచీకటికి, తీసినప్పుడు తోచే కొత్తవెలుక్కి మేం, పిల్లలం, వ్వా, సంబరపడిపోయేవాళ్ళం! అస్త మానం ఆలాతగిల్చి తీస్తూఉంటే బాగుండు ననిపించేది. వానకురిస్తే మా ఆనందానికి మేరే వుండేదికాదు. మండువాలోంచి నీరు ఆవలకు పోకుండావుంటే నాపాట, పోతూవుంటే గట్టైత, నానుపు నానాఅల్ల ఱేని? ఇంతకూ రాతిసావడి కాబట్టి సరిపోయింది.

"దుండగి డప్పుడే బండెక్కి కూర్చున్నాడా? దింపేసెయ్యి!" అంటూ నర్సయ్యతోకూడా వెను వెంటనే, నర్సయ్య చెప్పిన ఊసుమీద అనుకుంటాను, ఊగిపోతూ, మా పెద్దకక్కయ్య దొడ్డిగుమ్మంలోకి వచ్చిపడ్డాడు. ఈ పెద్దకక్కయ్యకే నేను ఇంగ్లీషు అక్షరాలు నేర్పింది. ఈ పెద్దకక్కయ్యే ఆయనకు అలవాటైన అధ్యాత్మకీర్తనలు పాడ్డంమానేసి ఎక్కువ అవుసరంగా నాకు cat = పిల్లి అని వొప్పజెప్పిం దీని!/ అయితే అటు నాచదువు క్కొబోయే ఖర్చు, ఇటు సమష్టి కుటుంబపురాబడి, ఇటు ఇంటిపట్టు పెరుగు, అటు పిడత కడిగినవాళ్ళు, అటు చరం, ఇటు స్థిరం! ఇవన్నీ వొక్కుమ్మడిగా ఆయనలో— మాద్దపెకక్కయ్యలో — తలకెక్కిపోయినాయి. నేను బండెక్కి కూర్చున్నాను అని వినేసరికి, వచ్చి పడ్డాడు బండీవద్దకు!—"దిగు! బండీ దిగు! ముందు దిగు!" అన్నాడు.

ఆయన దిగమన్నకొద్దీ, నేను, తొట్రుపాటుగా దిగ జారవలసినవాణ్ణి,బండీ వెనుమొసముకు ఎగబ్రాకాను. "గంటలూ చిరతలూ పలుపులూ ఇవ్వనుగాక ఇవ్వను" అన్నాను. వెనకనుంచి అమాంతంగా వొక్కళ్ళూ నన్ను అందుకుని దింపలేకపోయినారు. అంత ఎత్తు బండి! పెద్దెద్లకు తగ్గట్టు చేయించిన పెద్దబండి! ముందునుంచి ఎక్కి దిగలాగుదామంటే బండి లేచి పోతుందేమో!— నే కూర్చున్నానూ అంటే కూర్చు న్నాను! కుఱ్ఱవాణ్ణి, తేలికవాణ్ణి! అయినా నా బరువుకు బండీ తేలిపోకుండా, నర్సయ్య, బండి నొక తనకాలితో అణచిపెట్టి వుంటాడుకూడాను! మరి ఆయోజనం లేకపోయింది.

నన్నే కట్టమన్నారు ఎడ్లమెడల్లా గంటలు. నన్నే పొయ్యమన్నారు పలుపులు. నన్నే పెట్టమన్నారు చిరతలు, ఎడ్లను "చొ చొ చో" అంటూ పిలిచి, కాడి కిందకుచొప్పించిన వాణ్ణికూడా నేనే అయ్యాను ఆరాత్రి!

తలక్రింద, తలగడామల్లే, ఆ ఆంగ్లగ్రంథం పెట్టు కుని పండుకున్నాను బండిలో. వెంటనే నిద్ర పట్టి పోయింది. ఎడ్లమెడల్లోని గంటల గణగణ, జోలగా మోగింద పాడుగుతా నా నిదరలో! మళ్ళీ మేలుకున్నది రాజమహేంద్రం, కూరలబజారు వెడుతట్టునవున్న "తురకలదొడ్డి"లో — నాతోకూడా ఆ రాత్రి ప్రయాణంచేసి నన్ను ఎవరక్కడకు చేర్చిందీ, కూడా వచ్చినవా రెవరైందీ, వెంటవెంటనే మఱచిపోయి నానో? ఎవరూ నాకూడా రానేలేదో?—"గాజల దొడ్డి"యొక్క గుమ్మంలో బండీ ఎక్కినవాణ్ణి "తురకలదొడ్డి"యొక్క గోరీలవద్ద దిగేటప్పటికి బండీలో వొక్కణ్ణేవున్నాను. నాతలక్రిందగా గ్రంథం ఆలాగేవుంది!

ఆగ్రంథం చేతబట్టుకుంటూ— గ్రంథం పేరు "godford" కావచ్చు "godfear" కావచ్చు "godfeary" కావచ్చు-బాగా జ్ఞాపకం కాదిప్పుడు. మూడూ కాకపోవచ్చు. ఆగ్రంథం చేతబట్టుకుంటూ ఎక్కడున్నది తలపోశాను. ఎడ్లమెడల్లో దారంట

మోగిన గంటలధ్వనికీ, ఇంగ్లీషుబడిగంట మ్రోతకూ, తేడా తెలుసుకుంటూ ఓతట్టుచూచాను. ఆతట్టు నీలనీలపుగోడలు, కన్నాలసున్నాలు, గల, మ్యునిసిపాల్ లోవర్ సెకండరీస్కూలు, గణగణగణ బడివేళ పిలుపుగంటమ్రోగింది అప్పుడే! వెంటనే ఆపాఠశాలలో ఫస్టుఫారమ్ విద్యార్థిగా ప్రవేశించాను.

ఆ బడిగంట వింటూ ఎందుకోజోగాను! "ఓ అబ్బాయీ! నిన్నే! నిదరోతూవున్నావు! నీకు బడిగంట వినిపించడంలే?" అన్నారు కొత్త మాస్టరుగారు. "లేదండీ! మా వూరు రెండెడ్లబండి, నన్ను తీసుకువచ్చింది, తిరిగి వెళ్ళిపోతూవుంది, గంటలు మోగించుకుంటూ! ఆగంటలకండీ! ఈ జోగు!" అన్నాను, అలా మళ్ళీ మా బండి చూపించాను నా చూపుడు వ్రేలతో! "రాత్రి నిదరలేనట్టుందినీకు. వెళ్ళి మధ్యాహ్నం రావోయి బుద్ధిమంతుడా?" అన్నారు మేస్టారు. "రాత్రి నిదరలేకేం? అండీ! రాత్రి అల్లా దారిపొడుగుతా మోగినవి ఆ గంటలే!" అన్నాను నేను. "అయితే నీవు తిరిగి మీ బండీ ఎక్కి మీవూరు వెళ్ళిపోవలసినవాడవే!" అన్నారు మాస్టరుగారు. "ఏమండి?" అన్నాను. "ఏమేమిటి? ఇక్కడ వినవలసింది మీవూరు బండీగంటలుకావు. మా వూరు బడిగంటలు. ఇది పగటిపూట! తెలిసిందా? నే చెప్పేది పట్నవాసపు బడిచదువు. సరిగా వినుపాఠం. I am= నేను ఉన్నాను." అని చెప్పసాగారు.

ఆయనెంత సరిగా వినుమన్నా, అనుమన్నా, ఆ పాఠశాలలో చదివినన్నాళ్ళూ,చదివినన్నాళ్ళు ఏమిటి శాన్నాళ్ళు, శాన్నాళ్ళు అన్నమాటేమిటి? ఇప్పటికీ కూడా, ఏదైనా కొత్తచదువు ప్రారంభించేసరికి వినవచ్చేది మా వూరు రెండెడ్లబండీ గంటల మ్రోత! మ్రోతతోపాటు నాలో, చెప్ప శక్యంగాని, ఒకానొక జోగు బడిగంట! గుడిగంటకూడా దానిముందు గయిర్ హాజర్!



# ఆంధ్రసాహిత్యము - అభ్యుదయమార్గములు

శ్రీ మొలుగు వెంకట కృష్ణమాచార్యులు

ఇదమంధంతమఃకృత్స్నం, జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయంజ్యోతి, రా సంసారం నదీప్యతే.

ఏనాడు ఎక్కడ శబ్దార్థరూపమైన సాహిత్య దీపము ఉన్నతముగా వెలుగదో అప్పుడు ముల్లోకములు అజ్ఞానాంధకారములో మునిగి దిక్కుతెలియక తడుముకొనుచుండును. అని సాహిత్యాచార్యుడు దండి. ఈమాట చాల అనుభవముతో దూరదృష్టితో చెప్పినది.

మానవజాతిని చెడుబాటలనుండి ఉత్తమమార్గాలకు త్రిప్పునది సాహిత్యము. సమ్రాట్టులును, సైన్యాధిపతులు కత్తిచూపి చేయించలేనిపనులను సాహిత్యము చల్లగా మెల్లగా ప్రేయసివలె గడుసైన మిత్రునివలె లాలించి మనసుకరగించి చేయించును.

సాహిత్యమనే సాంకేతికపదమును ఇక్కడ కొంచెము వివరించినచో చెప్పబోయెడువిషయములు బాగుగా అవగాహము కాగలవు.

స్థూలదృష్టికి చదువదగిన గ్రంథజాలమంతయు సాహిత్యావరణములోనికి రాదగినదిగా గనబడినను దానితత్త్వ మిట్లు స్పష్టపఱచుట మంచిది. హిత మనగా మేలుకూర్చునది. ష్టమైనదియును. ఆట్టి విషయబంధురమైనది సహితము. దానిభావము సాహిత్యము. అనగా లోకమునకు ఆనందమును కలిగించుచు దానిచాటున మేలునుగూడ చమత్కారముగా బోధించు గ్రంథసమూహమును సాహిత్యమనుటలో ఎక్కువ ఔచిత్యమున్నది.

వేదము ఆజ్ఞాపించును. కనుక లోకమునకు అది అంటే బెరుకు. పురాణములు బతిమాలిచెప్పును. కాని లోకము దానిపట్ల శ్రద్ధతీసికొనదు.

ఇక సాహిత్య మనగా కావ్యాదికము. నవ్వుచు, చమత్కరించుచు వ్యంగ్యభావములతో బలుకుచుండును. జనము దానివైపు ఎక్కువగా మొగ్గును. కనుక కావ్యనాటకాదికసాహిత్యము ప్రజలకు అత్యంతసన్నిహితబంధువు.

ఒకదేశసాహిత్యము, ఆదేశపు అభిరుచులకు, ఆదర్శములకు, జీవితలక్ష్యాలకు ప్రతిబింబమని చెప్పవచ్చును. ఆరీతినే ఒకకాలపుసాహిత్యము ఆప్రజల ఊహలను బ్రదుకును మార్చి తనప్రభావమును వారిమీద ముద్రించును. దీనిబట్టి సాహిత్యము ప్రజల కెంతదగ్గఱ చుట్టమో మన మూహింపగలము.

ఇంత లోకసన్నిహితమైన సాహిత్యము ప్రజల కెంతగా ఉపకరింపవలెనో ఒకదేశముపై దానిబాధ్యత ఎంతగా నున్నదో మనము గుర్తించవలసియున్నది.

'వాచామేవ ప్రసాదేన లోకయాత్రా ప్రవర్తతే' అన్నాడు కావ్యాదర్శములో ఆచార్యదండి. అనగా శబ్దార్థరూపమైన సాహిత్యపు టనుగ్రహముచేత సాహిత్యము సాధుమార్గములో సాగుచున్నదట. ఒకప్పుడు సాహిత్యము మూగతనము వహించిన దనుకొందము. కాక అప్రస్తుతప్రశంసలతో నిండిన దనుకొందము. అప్పుడు లోకయాత్ర నీరసమై కుటిలమై కర్తవ్యపరాఙ్ముఖమై అవకతవకగా అయిపోవునని ఆసాహిత్యాచార్యుని నమ్మిక.

దీని ననుసరించి సాహిత్యమునకు లోకమును నడిపించు నధికారము అవసరము ఎంతగ నున్నదో బుద్ధిమంతులు గుర్తింపకపోరు.

కనుకనే మమ్మటాచార్యుఁడు కావ్యమునకు నిరూపించిన ప్రయోజనములను పరిశీలించినయెడల సాహిత్యము లోకయాత్రను ఎంతగ నిర్వహించునది మనకు బోధపడఁగలదు.

'శివేతరక్షతి' 'సద్యఃపరనిర్వృతి' 'కాంతా సమ్మితోపదేశము.' ఇవి కావ్యమునకుముఖ్యప్రయోజనములు.

శివేతరక్షతి అనఁగా సాధులోకమును పీడించి పిప్పిచేయు దౌర్జన్యమును, కౌటిల్యమును, పశుబలమును ధిక్కరించి మంగళమయమార్గదర్శకముగా నుండవలెను సాహిత్యము.

పరనిర్వృతిఅన-నీరసవిషయవిస్తరణము. శుష్కపటాటోపపరిభాషలను వదిలి పాఠకుని ఆనందతన్మయునిఁగా రసవివశునిఁగాఁ జేయునది.

కాంతాసమ్మితోపదేశమనఁగా సాహిత్యము ఎప్పుడు కేవలము ఆనందపారవశ్యముకొఱకే వినియోగపడక ఎప్పటికప్పుడు ప్రజలకు వెలుగుదారులు చూపి కల్యాణసీమలకు నడిపించు నుపదేశముల నిచ్చుచుండవలెను.

ఈ ఉత్తమసాహిత్యసూత్రములను కొలతబద్దలుగా ఎంచుకొని తీసికొన్నచో ప్రతిదేశపు ఉత్తమసాహిత్యగోష్ఠికి సమన్వయింపఁగలము.

మానవాభ్యుదయమునకు ప్రగతికి తోడ్పడని సాహిత్యము శిల్పదృష్ట్యా ఉత్కృష్టమే యగుగాక. అది సంఘమునకుమాత్రము చైతన్యములేని అందమైన కొయ్యబొమ్మయే యగును.

ఈ పైసాహిత్యాచార్యుల లక్ష్యములను దృష్టిలో ఉంచుకొని మన తెనుఁగు సాహిత్యమువైపు తిరిగి మన కవుల సాహిత్యాదర్శముల నించుక పరిశీలింతము.

ఆంధ్రపద్యవిద్యకు గురుదేవుఁడైన నన్నయభట్టాచార్యులసాహిత్యాదర్శము విశ్వశ్రేయస్సు. ఆయన ఆంధ్రభాషకు లక్షణము కట్టఁబోవుచు శ్రీకారము చుట్టి "విశ్వశ్రేయః కావ్యం" అని సువర్ణాక్షరములతో సూత్రించినాఁడు. నాయెఱిగినంతవఱకు ఏసంస్కృత సాహిత్యలక్షణకర్తా ఇంత ఘంటాపథముగా కావ్యమే అన లోకకల్యాణమే అని చాటినట్టు చూడలేదు. ఆయనదృష్టిలో లోకకల్యాణ కారకమంటె చాల దనుకొనెద. లోకకల్యాణమే అనవలెను.

మానవాభ్యుదయమునకు పాటుపడి పరితపించని వాఁడు కవిగాఁడు. అతని సాహిత్యము కావ్యము కాదు. అనునంత తీవ్రవాది నన్నయ. ఆయన ఆంధ్ర జాతి యభ్యుదయమును, ఔన్నత్యమును ఎంతగాఁ గోరి మహాభారతాంధ్రీకరణమునకుఁ బూనుకొనెనో మన మూహింపఁగలము.

కృష్ణద్వైపాయనమహర్షి నన్నయదృష్టిలో జననుతుఁడు. ఆయనభారతము కేవలము కావ్యముకాదు. ధర్మశాస్త్రముకాదు. వేదాంతముగాదు. నీతిశాస్త్రము కాదు. అన్నియునుగూడ. సమగ్రమగు మానవజీవిత మనఁదగును. అందులో మానవులు, దానవులు, కటువులు, సాధువులు, వీరులు, భీరులు, జూదరులు, దేవవ్రతులు. అందఱును మనకు సన్నిహితులుగా నున్నారు. అట్టి విస్పష్టమానవజీవితము ఇంకెందును కనఁబడదు. కనుక దానిని తెగించి తెనిగించి మానవాభ్యుదయముకొఱకు ప్రజల యెదుటకుఁ బెట్టెను. ఆయనరామాయణము జోలికి పోలేదు. అది కేవలము మహాకావ్యమే. అది మానవజీవితమునకు దూరమై పోయియుండును. దానిని సామాన్యజనజీవితముదగ్గఱకు తేఁజాలము.

ఇఁక ధర్మశాస్త్రజ్ఞులకు ధర్మశాస్త్రముగాను, అధ్యాత్మవిదులకు వేదాంతముగా కవివృషభులకు మహాకావ్యముగా ఇంకను ఇతరులకు ఇతరముగా కనబడు బహుముఖమానవజీవితచరిత్రను చిత్రించే భారతమును జననుతుఁడు వ్యాసమహర్షి వ్రాసినాఁడు. నానారుచిరార్థసూక్తినిధి నన్నయ జగద్ధితమునకై ఆంధ్రజాతికి అందించినాఁడు. నన్నపార్యుఁడు భారతము కేవలము పండితులకొఱకే వ్రాయలేదు. ఇతరులకుకూడ అందులో భాగము ఉన్నది. సారమతు

పైనకవులు ప్రసన్నకథాకలితార్థయుక్తినిలో నరసి సంతోషమందిన ఇతరులు అక్షరరమ్యత అంటే మాటల కూర్పు నేర్పు అయినను చూచి ఆనందించఁ గలఁడన్నాఁడు. కాని "ఎవ్వరేమనుకొన్న నాకేమి కొఱత" అని యెవరిని యూసడించలేదు. దీనినిబట్టి యీప్రథమాంధ్రకవి ప్రజలను తనదగ్గఱకు తీసికొను టకు ఎంత తహతహపడెనో మనము ఊహింపఁగలము.

భారతశేషాంధ్రీకరణకర్త, అపరశేషమూర్తి తిక్కనార్యుఁడు మహితాత్ముఁడు. ఆంధ్రకవిత్వ విశారదుఁడైన నన్నపార్యుని హృదయము నేర్పుతో బాగుగా అవగాహన చేసికొనినవాఁడు. కనుకనే నన్నయార్యుని విశ్వశ్రేయస్సూత్రమును శిరసావహించి ఆయన సంస్కృతివాక్కులనుగూడ దాటి కమ్మని జాను దెనుఁగును కావ్యమందంతటను వాడి మఱింత ప్రజాసన్నిహితబంధువై అభ్యుదయమార్గములను విస్తరించినాఁడు.

వ్యాసమహర్షి "లోకహిత నిమ్మంబాని" భారతమును వ్రాసినాడని ఆయన విశ్వసించినాఁడు. కనుకనే "పదియేనింటఁ దెనుంగు బాస జనసంప్రార్థ్యంబులై పెంపునం, దుదిముట్టం రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్" అని తాను పండితాపండిత సాధారణముగాఁ దెనిఁగించెదనని చెప్పి యున్నాఁడు.

అంతేకాదు, తన భారతములో తన తెనుఁగుజాతి అంతయు కన్ను తెరవవలెను. తలలూపి కర్తవ్యమును గ్రహించవలెను అని తాను మహాకవిత్వ దీక్షావిధానమును పూనితి నన్నాఁడు. కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలి ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ, సాత్యవతేయ సంస్కృతి శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వదీక్షావిధి నొందిపద్యముల గద్యములఙ్ రచియించెదంగృతుల్.

ధనమదాంధులైన ప్రభువుల కొలువుకూటములను త్రోసి వారి అధికారములను ధిక్కరించి సరసహృదయులు లేని కూళలకు డబ్బుకొఱకు తన కవితను ఉంపుడుకత్తెగా ఉంచుటను భరింపలేక దారిద్ర్యమును వరించి నాగలిని నమ్మి తన హృదయ కుహరమునే స్వర్గరాజ్యముగఁ జేసికొన్న అమరకవి మన పోతనకవి. తన జీవితమునే భారతజాతిగౌరవమునకు ఆదర్శముగా నిలిపిపోయిన ధన్యజీవి. ఈయన శబ్దపాక పుత్రుఁడు. శృంగిలో ప్రతిఫలించిదుర్మదక్రీడఁ జరించు రాజుల రాజ్యమదాంధులను పట్టి పల్లార్చుదనుక సజ్జనశాంతి కలుగదని తన వ్యంగ్యశంఖమును పూరించి ఊది ప్రబోధించి నిర్గమించిన ఆంధ్రవీరుఁడు.

ఇతఁడు గూడ తన భాగవతాదిని "అంచఅ మెప్పింతుఁ గృతులనయ్యెయెడలఙ్" అని తన ఆర్షదృష్టిని ప్రకటించినాఁడు. ఇట్లా ఋషితుల్యులైన మన పురాంధ్రకవులు సాహిత్యము ప్రజాభ్యుదయమునకే అనేసంగతి మరవకుండఁగనే తమ రచనను సాగించినారు.

ప్రబంధకవులలోని ఆంధ్రకవులకు ఋష్యంశ పోయినదనవచ్చును. వారికవిత అగ్రవర్గములవారి అనేకభాగములలో ఒకభాగము. రకరకములగు క్రీడలలో ఇదియొక కేళి. వారి రసికతా పరిధులలో కవిత మగ్నమై కొన్ని అవధులలో సంకుచిమై రత్నఖచిత పరిమళమిళిత రాజాస్థానములలో ఇది యొక ఆటవెలఁదిగా ప్రవర్తిల్లినది. ఆనాటి కవి అస్వతంత్రుఁడు. అనేకులవలె అతఁడును రాజభృత్యులలో నొకఁడు. ప్రభువు నభిరుచుల కతఁడొక గీటురాయి. ఇది కవులదోషముగాదు. కాలదోషమని ఎంచనగును.

రాయవేశ్యాభుజంగుఁడైన బెండపూడి అన్నయమంత్రి శ్రీనాథమహాకవిని సప్తసంతానములలో తన కొకటి వెలితిగానున్నదనియు ఆ వెలి తీర్ప శివపురాణ మొకటి వ్రాయుమనఁగా అతఁడు భీమేశ్వర పురాణమును వ్రాసినాఁడు. ఇతని కావ్యాదర్శములివి:

హరచూడా హరిణాంకవక్రతయు, కాలాంతః స్ఫురచ్చంద్రికా పరుషోద్గాఢ పయోధరస్ఫుటతటీ

పర్యంత కాఠిన్యమున్."

ఇతఁడు నారికేళఫలపాకము నంజలియైన కవితాను గుంభములు తెలియని సోమరిపోతులని నిష్కారణముగా తృణీకరించి మాటలాడఁగలఁడు. ఇతఁడు కాని యితని కావ్యములు గాని పల్లకీలు దిగివచ్చి ప్రజాలోకమునకు వచ్చిన పాపమునకు పోలేదు. కృష్ణరాయ సార్వభౌముఁడు కూడ, సప్తసంతానములలో ఖిలముగానిది కవితగాన తనపేర కావ్యమొకటి వ్రాయుమనెను. పెద్దనయు రససమంచితకథలతో విన నింపుగులుక వ్రాసి తన ప్రభువును సంతోషపెట్ట గలిగెను. ప్రబంధ యుగమంతయును ఇంచు మించు నీవిధముగనే నడిచినదని చెప్పవచ్చును.

తుదకు ఆంధ్రకవిత ఆశ్రయమిచ్చినవారి యభిరుచులకు లోనై దిగజారి దిగజారి చివరకు చంద్రరేఖా విలాపములవంటి పతనావస్థకు వచ్చినది.

తరువాత సుమారు రెండువందలయేండ్లకు కీ. శే. వీరేశలింగ కవితో తిరిగి ఆంధ్రసాహితికి చైతన్యము కలిగిన దనవచ్చును.

పద్యభూయిష్ఠమైన సాహిత్యములోఆయన విజ్ఞానసాధనముగా వచనరచనకు ప్రాణము పోసినాఁడు. శృంగార ప్రబంధములు తప్పినచో చదువుకో తగిన గ్రంథములులేని కాలములో స్త్రీలకు పిల్లలకు ఆయన వాఙ్మయమును సృష్టించియున్నాఁడు. చరిత్రలు వ్రాసినాఁడు. క్రొత్తవి వ్రాసినాఁడు. సంఘములో మాలిన్యము పేరుకొని గడ్డ గట్టినదని దానిని కోసివేసి కడిగి జాతిని ఆరోగ్యవంతముగా చేయు తలంపుతో ప్రహసనము లెన్నో వ్రాసినాఁడు. పత్రికల ప్రకటించినాఁడు. ఉపన్యాసము లిచ్చినాఁడు. 'ఆయన ప్రజల కొఱకే పుట్టెను. ప్రజలకొఱకే పాటుపడెను. ఆంధ్రసాహిత్య ప్రయోజనమును పూర్తిగా ప్రజాహితమునకే వినియోగపఱచెను.' అనెడి విఖ్యాతిగడించిన మహనీయుఁడు. ఈయుగములో తిరిగి రాజమహేంద్రవరమున "విశ్వశ్రేయః కావ్యం" అనే సూత్రమునకు ప్రాణమునిచ్చిన ఆంధ్రాభ్యుదయ విధాత పంతులుగారని చెప్పుటకు జంకువా రుండరు.

దీనికి అనేకవిదేశ ప్రభావాలు సాహిత్యసంపర్కములు ఎక్కువ ప్రోద్బలము నిచ్చినవని యనుకొనవచ్చును.

తన ప్రబోధము లందఱకు నందుటకు ప్రజాసామాన్యమునకు అర్థముకాని సంస్కృతభాషను విడిచి నాటి ప్రజల భాషయగు పాళీభాషను చేఁబట్టిన బుద్ధభగవానునివలె శ్రీ.గి. రామమూర్తి ప్రజలభాష అవలంబించి దాని వెలిని తీర్చుటకు బ్రతుకంతయు ధారవోసిన ప్రజాహితజీవి. ఈయన వ్యవహారభాషా ప్రబోధమునో చాలమంది మూగతనము వదిలి గొంతులో ఏదో అడ్డు తొలఁగినట్లు అయినదని సంతోషించినారు.

పిమ్మట గురుజాడ మహాకవి వ్రాసినది తూకములో తక్కువయినా విలువ గొప్పది. ఆయనను ఆనాటి పరిస్థితులు స్తిమితముగా ఉండనీయక ప్రతి దేశీయసమస్యల వంకకు ఆయనను త్రిప్పినవి. వర్ణభేదము, హరిజనసమస్య, మూఢవిశ్వాసములు. ఇటువంటి సమస్యలన్నియు ఆయనను కలచినవి. కావ్యములు వ్రాయించినవి. ఇటీవల బయలుదేరిన క్రొత్త పోకడలకు తీరులకు ఆయనే మార్గదర్శి మహర్షి.

ఆంధ్రదేశమును తమ కవితావిహారములో ఒక ఊపు ఊపినది తిరుపతి వెంకటకవులలో నొకరగు శ్రీ చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రిగారు. ఈ నాటి యుద్ధములు, దురపేక్ష, దురతిక్రమణము, తుదకు రేషనింగు మొదలైన అన్నింటిమీద తమ కలము దించకుండ వ్రాయుచున్నా రనునపుడు ఆయన ప్రజలలో కదిలి ఎదిగి ఎట్లు వచ్చుచున్నారో మనము గ్రహించగలము. కనుకనే యీ మధ్య అభ్యుదయరచయితల సంఘమువారు ప్రత్యేకము ఒకసంచిక వారికి అంకితము యిచ్చియుండిరని వినియున్నాను.

# ఆంధ్ర సాహిత్యము - అభ్యుదయ మార్గములు

ఈ నాడు ప్రజలు మేలుకొన్నారు, తమ ఎదుట నిల్చిన విషమసమస్యల గ్రహించి బోధపఱచుకొనుచున్నారు. ఏదో ఒక ఆందోళనముతో, ఆవేశముతో మెదిలి కదులుచున్నారు.

బుద్ధిమంతుల చేయూతను అపేక్షించుచున్నది లోకము. ఈ తరుణమందు చెయ్యి చెవిమీదఁ బెట్టుకొని అర్థంకానట్టియు, లేనట్టియు పద్యములను గ్రుమ్మరించుటగాని, నిర్బంధ శృంగారరచనలను ఎగరవేయుటగాని నిష్ప్రయోజనమని మనవిచేయుచున్నాఁడను. మనకు పరమపూజ్యులైన తొల్లింటి తెనుఁగుకవుల సాహిత్యధర్మముల నర్థము చేసికొని సాహిత్య ప్రయోజనమును సద్వినియోగమునకుఁ దెచ్చుట ఈ నాటికవుల విధ్యుక్తధర్మమై యున్నది. అప్పుడే ఆచార్యదండి ఆదేశించిన ఉత్తమసాహిత్య ప్రయోజనమును ఆంధ్రసాహిత్యము నెరవేర్పఁగలిగిన దగును.

ఈ నాటి ఆంధ్రసాహిత్యనిర్మాతల బొదలలమీద దేశాభ్యుదయ విధాయకమైన బాధ్యత ఎంతయో గలదు.

1. ప్రజల కనుఁగవను బాగా విప్పించు వచన వాఙ్మయము సర్వతోముఖముగా వృద్ధిలోనికి రావలసియున్నది.

2. ఈనాటి సాహిత్యాంగములైన చిన్నకథలు, నాటికలు, ఖండకావ్యములు, వ్యాసములు మున్నగు రచనలలో ప్రజాజీవితము ప్రతిఫలించి లోకమును ఆకర్షించవలెను.

3. కళ కళకొఱకే యను అహంకారవాదము నశించి, ఎప్పుడు శిల్పప్రబోధములు జాతినితీర్చిసంఘమును దిద్దుబాటు చేయునో ఆ నాఁడే మన సాహితికి దేశమునకు అభ్యుదయమగును.



# కొడాలివారి కవిత్వం

శ్రీ 'కృష్ణశ్రీ'

కొద్దికాలంలోనే రసజ్ఞహృదయాన్ని మెప్పించి పేరుపొందినవారిలో కొడాలి సుబ్బారావుగారొకరు. "హంపీక్షేత్రము" భారతిలో దర్శనమిచ్చే వరకూ కవిత్వాభిమానులెవరూ ఆయన్నెరగరనవచ్చును. ఆ పత్రిక ఆంధ్రప్రపంచానికి చూపిన జాషువా కవిలాగే ఈయన కూడా కొద్దికాలంలోనే పేరు పొందారు. కావ్యప్రచురణ ప్రారంభించిన చాలా నాళ్ళకిగాని జాషువా కవిని తెలుగువారు గుర్తించుకోలేదు. ఎక్కడో మంచుకొండల్లో పారే సెలయేట్లో తప్ప మరొకచోట సాధారణంగా కనపడని నిర్మలత్వమే జాషువాకవి రచనల జీవము. వింతైన ఈ నిర్మలత్వాన్ని గుర్తించడానికి కొంత జాప్యమే ఐంది. కొడాలివారి కవిత్వంలో ఆవేశమూ, ఉత్సాహమూ, జడగా అల్లుకుపోయి కనపడతాయి. ఈ మూడు తెలుగువారి నైజములోవి. కనక కొడాలివారి రచనలు చదవగానే—కలలోని సుందరిని పగలు చూచినట్టుగా—ఎముకల్లోని మూలుగులో అణిగియున్న పౌరుషము నవనాడుల్లోనూ పరుగులెత్తింది తెలుగువారికి. కొడాలివారు హంపిని దర్శించినప్పుడు తమలో కలిగిన కలవరాన్ని వర్ణిస్తూ మనకి హంపిని చూపించేస్తారు. ఆ క్షేత్రాన్ని దర్శించి కవనమల్లినవారు చాలామంది ఉన్నారు. కాని తెలుగువారి నైజానికి అనుకూలంగా ఉండడమువల్ల 'హంపీక్షేత్రాని'కి ఉన్నశక్తి వాటికి అలవడలేదు.

చిన్నతనంలో—తన మేనమామ కామరాజుగడ్డ శివయోగానంద రావుగారితో కలిసే—సుబ్బారావుగారు కవిత్వం అల్లడం నేర్చుకున్నారు. కాని ఆ రచనల్లో సుబ్బారావుగారి ప్రత్యేకత ఏదీ గోచవంచదు. ఆయన వర్ణ్యవస్తువుని దూరంనించి చూసి సర్ణిస్తున్నట్లుంటుంది. పద్యంకూడా ఆయన ఎక్కిరివారిచేసే గుర్రంలాగ కాక, ఆయన పదిలంగా కాపలాకాసే లేడిపిల్లలాగు కనబడుతుంది. కాబట్టి ఆకాలపు రచన సుబ్బారావుగారిలో అణిగివున్న భాషాభిమానాన్ని చూపించడానికి తప్ప మరెందుకూ అక్కరకురాదు. మొదటి పుస్తకం అచ్చువేసిన తర్వాత సుబ్బారావుగారు చాలాకాలం మౌనం దాల్చారు. ఈ ఘట్టంలో, పద్యాల్ని ఇంజన్లలాగు నడిపించగలశక్తి ఆయనలో నెమ్మదిగా చేరుకుంది కాబోలు. అదృష్టవశాత్తూ విశ్వనాథ సత్యనారాయణగారి పరిచయ స్నేహాలు కూడా ఈయనకు లభించాయి. విశ్వనాథ వారంటే మూర్తిధరించిన ఆవేశమే. అందులో పద్య పఠనాకాలంలో మరీని. సంతత సాహచర్యమూ సమానతత్వమూ - రెండూ చేరి వారి ఆవేశాన్ని వీరికి ఆవహించేటట్లు చేశాయి. సత్యనారాయణగారు అప్పటికి ముఖలింగమూ, వేగీ, వంటి చారిత్రిక క్షేత్రాలు దర్శించి ఆంధ్రప్రశస్తిని కీర్తించి ఉన్నారు. హంపినిగూర్చి ఆయన కావ్యమల్లలేదు. అది సుబ్బారావుగారి వంతుకు వచ్చింది. సరిగా ఈ వేళకి వారణాసి శ్రీనివాసరావుగారు తోడ్కొనిపోయిన విద్యార్థి బృందముతో సుబ్బారావుగారు హంపి వెళ్ళడం కూడా తటస్థించింది. హంపిలోని ప్రతి శిలయొక్క చరిత్రా వెంకటరంగయ్యగారు చెప్పినట్లు చెప్పగలరట వారణాసి శ్రీనివాసరావుగారు. వారు చెప్పిన కథలన్నీ మన

స్సుకి పట్టించుకుని, ఏకాకిగా తిరిగి కవితాసమాధి నలవరుచుకొన్నారు. కొడాలి సుబ్బారావుగారు. దాని ఫలమే హంపీక్షేత్రము.

విశ్వనాథ సత్యనారాయణగారు కొడాలి సుబ్బారావుగారికి కవితా గురువంటున్నాను. వాస్తవముగా కాకపోవచ్చును. కాని విశ్వనాథవారి కవితారీతులు ఈయన రచనలలో బాగా కనబడతాయి. హంపీ క్షేత్రాన్ని కావ్యసామగ్రిగా తీసుకోవడంలోనే సత్యనారాయణగారి ప్రభావం చాలావుంది. చారిత్రిక క్షేత్రాల కథనము వారే ప్రారంభించారు. వారి రచనలే 'హంపీక్షేత్ర' రచనకి కొడాలి వారిని పురికొల్పాయి. విశ్వనాథవారి విఖ్యాతికి ప్రథమకారణమైన ఆంధ్ర క్షేత్రాభిమానమే వీరినికూడా పలికించింది. విశ్వనాథవారి సీసములవలెనే వీరి సీసములు కూడా శక్తివంతాలు. పద్యాల కట్టుబడిలో వీరిద్దరి రచనలకీ పోలికలు కనబడతాయి చూడండి.

"ఏరాజు పంచెనో యిచట శౌర్యపుపాయ
సమ్ములు నాగులచవితినాళ్ళ (విశ్వనాథ)
ఏదేవి చిలికెనో ఈపాలమీగడ
విఠ్ఠలాలయ శిలావేదులందు (కొడాలి)
ఈ పాలాలెంత చేవెక్కించుకొన్నవో
గుండెబ్రయ్య సముద్రగుప్తుడడలె (విశ్వనాథ)
ఈ జీర్ణపుగ్రామ మేమి చూపించును
తెలుగురారాజు పండిన యశస్సు (కొడాలి)
గణితశాస్త్రాంభోధి ఘనుడాతడే పావు
లూరి మల్లన కవిలోకగురువు (విశ్వనాథ)
అతడె తిమ్మరుసయ్య అప్పాజిబాబంట
తెలుగువారలు కొల్చు దేవగురుడు (కొడాలి)

ఇలాటివి చాలా కనపడతాయి. వాక్యంలోని క్రియఘ్ముందు వస్తుంది ఇవి చూడండి !

ఛేదింపబడి మహాశ్రీశైల సవిధ భూ
స్థలములదాక కాంతార సమితి (విశ్వనాథ)
కురిసినదెచట వాక్కుల జృంభణములోన
కవిరాజుపైన బంగారువాన (కొడాలి)

కానైతే ఈ పోలికల్లో ఒక కొత్తసంగతి తెలుస్తుంది. దేశీయకవనం రచించే కుతూహలంలో కొత్త ఫక్కీలవలంబించే విశ్వనాథవారి పద్యాలలోని తొలి కసటు కొడాలి వారిలో కనిపించదు. శౌర్యపు పాయసములూ, చేవెక్కించుకున్న పాలాలూ, ఛేదింపబడిన కాంతారసమితీకంటె, దేవి చిలికిన పాలమీగడా, తెలుగురాజు యశస్సు చూపించే పుగ్రామమూ, కవిరాజుపైన కురిసిన బంగారు వానా, కొంచెము పెంపుడు జాతివి. విశ్వనాథవారికి లేని ఒరవడి కొడాలి వారికి ఉంది. అందువల్లనే వారి రచన సాపుదేరింది.

విశ్వనాథవారి కావ్యపఠనము విన్నవారందరికీ దానిలోని వైలక్షణ్యము స్పష్టము. కొడాలివారి పద్యాలలోని విరామాలూ పూర్ణబిందువులూ విశ్వనాథవారి పద్యగానానికి స్థిరరూపం ఇస్తున్నాయి. సుబ్బారావుగారి సోదరులు చంద్రమౌళీశ్వరరావుగారి కావ్యపఠనము రాగవరసని సాగుతూ వచన ధోరణిలోకి మారి ఆగుతూంటుంది. విశ్వనాథవారి పద్ధతే యిది. పద్యాల్లో పూర్ణబిందువులు ప్రవేశపెట్టి కొడాలి వారు విశ్వనాథవారు పద్యాన్ని పాడే పద్ధతికి రూపం ఇచ్చి నిలిపారంటాను.

విశ్వనాథవారివలెనే కొడాలివారు కూడా ఆవేశపరులు. ఉదాహరణలు హంపీక్షేత్రంనిండా కనబడతాయి. నాటినన్నిటినీ వివరంగా పరిశీలించుకోడాని కిక్కడ అవకాశము చాలదు. కాబట్టి కొడాలివారి ఆవేశం కనపర్చే రూపభేదాలు పరిశీలించుకోడము మెరుగు: నన్నయ్యగారి ప్రార్థనలవలెనే వీరి ప్రార్థనలు కూడా శక్తివంతాలు. ఏ

ఘట్టంలోనైనాసరే భగవత్ప్రశంస రా భయం. చేతులు జోడించుకుని సాష్టాంగము పడిపోతారీయన.

> "పన్నగస్వామి శయ్యా సపాండురారు
> ణచ్ఛ విప్రసన్న ప్రశాంతప్రమోద
> పద్మనాభ మహాదేవు ప్రతిమగాంచి"

న వీరి ప్రభుభక్తి ఏచదువరినీ దాటిపోదు. "ఇన వంశోద్భవుడు' 'మహా దేవదేవుడు!' 'దేవుడు' ఈయన శబ్దరత్నాకరంలో లేదు. 'మహా దేవుడే' వుంది. ఎక్కడైనా తప్పిజారి దేవుడని పడిందా, దానిపక్కనే 'మహా' తాండవిస్తుంది. ప్రార్థనపట్ల నన్నయగారి వృత్తాలవలెనే వీరివృత్తాలు పూర్ణసరస్వతిలాగ ప్రవహిస్తాయి చూడండి:

ఓంకారస్వరలీనమై నిగమనాదోపాసనాధీనమై
కైంకర్యప్రతిపాద్యమై భువనరక్షాదక్షమై తాండవా
హంకారస్థిరచంద్రమశ్కకలశైత్య ప్రాప్తశాంతత్వమై
శంకాసంకులమైన నీయునికి ఆశాసిద్ధి కల్పించుతన్.

విశ్వనాథవారి ఆంధ్రప్రశస్తి దాటిపోయిన ఆంధ్రుల ఐశ్వర్యాన్ని కీర్తిస్తుందెంతసేపూ. "వేంగిరాజులపాద పవిత్రచిహ్నగర్భితమ్మగు భూమిఖండమందు" అశ్రువులు జారే జీవచ్ఛవాంధ్రజనులూ, "అస్వతంత్రతా నియతమైన బ్రదుకు భరించలేని తెలుగువారూ, కన పడతారు వారి ఆంధ్రప్రశస్తిలో. అధునాతనాంధ్రులకు వారు వేయిపడగల్లో ఇచ్చిన సందేశము వేరే ఏమీలేదు" 'పోయింది పోయింది. స్వామిపడగలు వెలిసిన సుబ్బన్నపేట సుభాన్‌పేట అయిపోయింది. మనకి కనపడేవి నశించే జాతి చివరిమెరుగులు' అని.

కొడాలివారుకూడా నిరాశాభావాన్నే వెలిబుచ్చారు. హంపిని చూచి వారుపొందిన ఆవేశానికి చివర వారి భావా లివి:

> "గురుపూజలో తృప్తికుదరని సన్యాసి
> చిరునవ్వు మొలకవంచించెనేమొ
> కవిరాజు పద్యసంకల్ప హర్షంబున
> విషహాక్షరంబు కన్పింపదేమొ
> సిరిగర్వమున దృష్టిచెదరిన సిద్ధాంతి
> గుణకారలబ్ధి సంకుచితమేమొ
> దాసియయ్యు పతివ్రతాత్వభంగముకోడి
> నిట్టూర్పులో నగ్గి నిలిపెనేమొ
> తెలుగురాజుకు పుట్టిన తెగులుపురువు
> తొలిచెనో ఏమొ ఆంధ్రుల తొలకరి సిరి
> కానిచో ఎన్నడనుకోని దీనచరిత
> కాస్పదంబయిపోవునే ఆంధ్రనూత!"

'హంపీక్షేత్రము' పాడుగునా 'మాతెల్గు వీర్యమేల యచేతనంబు' అనీ, 'తుదకు పౌరాణికము లట్లు తూలిపోయె'ననీ 'ఆంధ్రసామ్రాజ్యనాటకాభ్యంతరమున చివరి తెర జారిపోయిందనీ, ఎంతసేపూ గతించిన ఆంధ్రసామ్రాజ్యపు సమాధిపక్కన కూర్చుని అశ్రువులు రాల్చారు. శబ్దాలవ్యంజకశక్తీ, పదాల కూర్పులోని సౌందర్యమూ చక్కగా గ్రహించగలిగి, గడ్డిపూనవ్వు, సెలయేటి కడుపులోని కడలిమ్రోత, వసుమతీగర్భతల సరస్వతీ గుర్తించగలిగిన చైతన్యమూర్తి కావ్యాలలో వర్ణించవలిసింది నిరాశా నిస్సహాయత్వమూ, వెనుకచూపూ కాదు.

> "మంచిగతమున కొంచెమేనోయి
> మందగించక ముందుకడుగేయి
> వెనకచూస్తే వెనకేనోయి"

అన్నాడు అమరకవి గురజాడ. విధి ఆకర్షించకుంటే, "వేయికి చాలుపో తెలుగువీరుడొకండనీ, ఆంధ్రఖడ్గచలనంబులలోలయరుద్రతాండవస్ఫురణము గల్గునోయి" అనీ గతించిన రాజు నుద్దేశించి పల్కిన కొడాలివారివాణి బ్రతికున్న ఆంధ్రుల్ని చెయ్యూపి జయకొట్టించి ఉండేది.

# విచిత్ర సంఘటన

## శ్రీమతి 'చిత్ర'

పచ్చ పర్సుతీసి పచ్చ టిక్కట్టుకొంటున్న అందమయిన ఆమెని చూడగానే నాకూ ఆమె వెంట వెళ్ళాలనే కోరిక కలిగింది. నేనూ అదే టిక్కట్టుకొని ఆమె ఎక్కిన రైలుఎక్కి ఆమె పక్కనే కూచున్నాను. ఆమె నావైపు చూడకండా ఏదో ఆలోచనలో పరధ్యాన్నంగా కూచుని ఉంది.

"మీరు ఎంతవరకూ" అని పలకరించాను నేను.

"తాంబ్రంవరకూ, మీరూ?" అన్నది ఆమె.

"నేను అక్కడికే."

"బంధువులున్నారా" అన్నది ఆమె.

"ఎవ్వరూ లేరు. మీకూ."

"నాకూ అక్కడ ఎవ్వరూ లేరు" అన్నది ఆమె కన్నీళ్లు ఆపుకుంటూ.

రైలు అన్ని స్టేషన్లూదాటి ఆగిపోయింది.

అంతా దిగిపోయారు. మేం ఇద్దరమూ ఎక్కడికో తెలియకండా అలాగ నడుస్తూన్నాము.

"మీరు చదువుతున్నారా?" అన్నాను నేను.

"చదువు పూర్తిఅయి నాకు పెళ్ళిఅయింది. ఇద్దరు, పిల్లలు నాకు. మీరూ?" అన్నది ఆమె ఆలోచనగా.

"ఈ సంవత్సరంతో నా చదువు పూర్తిఅవుతుంది. అప్పుడు బి. ఏ. అవుతాను" అన్నాను. ఆమె నా మాటలు వినకండా కొండలవైపు ఏదో వెతుకుతున్నట్లుగా చూస్తూ ఉంది.

"మీలో ఏదో ఒక వింతఆకర్షణ, విశిష్టతా నాకు కనిపించాయి. మీ వెంటనే రావాలనే కోరికతో ఇలా వచ్చేశాను. ఒకగంటలో తిరిగి వెళ్ళిపోవాలి." అన్నాను నేను మళ్ళీ. ఆమె మాట్లాడలేదు. నావైపు చూడలేదు.

"మా అడ్రసు ఇస్తాను. మా ఇంటికి రండి" అన్నాను.

"ఇక్వండి. మీతో రావడం నాకెంతో సంతోషంగా ఉంది. మీరు నాకెంతో ఆప్తులైనట్లుగా అంత ఆనందగా ఉంది. మీరు రాకపోతే ఇవాళ ఇక్కడ ఒంటరిగా......" అన్నది ఆమె కన్నీళ్ళు ఆపుకుంటూ. నాకు ఆమెని చూస్తే ఏదో చెప్పరాని బాధ కలిగింది. అంత అందమయిన ఆమెతో, అంత అశాంతీ ఆ ముఖంలోని వేదనా చూడలేకపోయాను. ఆమె చేతిని దగ్గరగా తీసుకుని ఇలా అన్నాను.

"మీరు ఏదో చాల కష్టంలో ఉన్నారు. ఎందుకని ఇలా వచ్చారు? నాకు చెప్పగ నిదా?" అన్నాను. కంటనీళ్ళు తుడుచుకుంటూ నిట్టూర్పుతో నావైపు తిరిగీ ఆమె ఆవేశంతో ఇలా అన్నది.

"మీబోటి ఆప్తులకు నాబాధ చెబితే నావేదన ఎంతో తగ్గిపోతుంది. మన కలయిక చాల చిత్రంగా ఉంది. నన్ను మరిచిపోకండి. నాపేరు శారద. లక్షాధికార్ల కూతుర్ని. నా పెళ్ళికి మావాళ్ళు ప్రయత్నం చేస్తున్నరోజులలో నాసహపాఠి రామూని నేను ప్రేమించాను. అతనూ నన్ను కోరాడు. ఆరోజులలో అతనూ నేనూ యీ కొండలలో యీ తోటలలో కాలం గమనించకుండా గంటలు నిమిషాలులా గడిపేవాళ్ళము. ఒకరిని విడిచి ఒకరు ఉండలేక విధిలేక బాధపడుతూ ఇంటికి వెళ్ళిపోయేవాళ్ళము. ఆఖరికి ఒకరోజున ధైర్యంచేసి అమ్మకీ నాన్నకీ రామూనే పెళ్ళాడతానని చెప్పేశాను. ఇద్దరూ మండిపడి నన్ను నానామాటలూ అని చదువు మాన్పించివేశారు. తమ అంతస్థుకి తగిన ధనవంతునికి నన్ను ఇచ్చి పెళ్ళి

చేశారు. పదిహేనేళ్ళు కాలచక్రంలో గిర్రున తిరిగి పోయాయి. పిల్లల తల్లినయాను. మావారు డాక్టరు కావడంవల్ల ఇన్నేళ్ళూ మరిచిన ఈ ఊరికి మళ్ళా రావలసివచ్చింది. వచ్చాను, క్షయరోగుల ఆస్పత్రి చూడాలని తోచక, ఒకరోజు ఇటువచ్చి, నేను మరిచిపోలేని చోట్లను చూసుకుని మధుర స్వప్నాలు తలుచుకుంటూ ఆస్పత్రిలో అడుగుపెట్టాను. ఇంతలో ఎవరో మంచంమీద మూలుగుతూ పడిఉన్న ఒకరోగి నన్ను చూడగానే లేనిబలం తెచ్చుకుని.

"శారదా" అంటూ ఒకకేక అరిచాడు. ఉలిక్కిపడి అటు చూస్తునుగదా అతను రాము. జీవకళ లేకండా మంచాన్ని అంటిపెట్టుకుని ఉన్నాడు. అతన్నిచూసిన ఆ నిమిషాన నాకు ఏం తెలియలేదు; కళ్ళు చీకట్లు కమ్మాయి. మనస్సు ఉండబట్టక దగ్గిరగా వెళ్ళి పలకరించాను.

"శారదా! నాకీ జబ్బురావడం మంచిదయింది. యీ విధంగా నేనిక్కడికి రాకపోతే నువ్వేలా కనపడిఉండువు." అన్నాడు ఆయాసపడుతూ. ఇంటికి వచ్చానేగాని నామనస్సు ఎలాగో అయిపోయింది. నాకో సరంమంచంమీద కృశిస్తున్న నారాము కళ్ళకి కనిపించేవాడు. ప్రతీసాయంత్రం అతన్ని చూడాలనే ఆశతో ఆస్పతికి వెళ్ళి వచ్చేదాన్ని; అక్కడ ఉన్న కాసేపూ మనస్సుకి ఎంతో శాంతికలిగేది. రామూకి కూడా జబ్బుతగ్గుముఖానికి రావడం మొదలుపెట్టింది. నేను వెళ్ళడం మావారికి సరిపడలేదు. తమహోదాకి భంగమని తగదన్నారు. మానెయ్యమన్నారు. వెళ్ళడం మానేశాను. నౌఖర్లద్వారా రామూకి ఆహార సదుపాయలు అందచేసేదాన్ని. అదీ మావారికి నచ్చలేగు. జబ్బుగా పడిఉన్న రామూని మొండితనంగా ఇంటికి పంపించివేశారు. నన్నుచూసిన పాపానికి రామూకి ఆగతిపట్టింది. మేమూ ఇంకోఊరికి వెళ్ళి పోయాము. రాము ఎక్కడ ఉన్నాడో ఏమయాడో! అప్పటికీ ఇప్పటికీ అతని సంగతి నాకేం తెలియలేదు. రేపే మేము బెంగుళూరికి వెళ్ళవలసి ఇవాళ ఇక్కడికి వచ్చాము. ట్రేపన్నించి ఇలాగవచ్చాను. ఎందుకో నాకే తెలియదు. ఇక్కడఉన్న ఈ చోట్లన్నీ నాకోసరమే ఉన్నట్లుగా ఉంటాయి. మమ్మల్ని ఇద్దర్ని కలుసుకోడానికీ, విడదీయడానికీ ఈ తోటలూ యీ కొండలూ కారణాలు. "ఎప్పుడయినా యీ రైలు పొరపాటు నన్నా రామూని తీసుకురాకూడదా" అనుకుంటాను, అంటూ ఆపైన ఏం చెప్పలేక చేతులతో ముఖం కప్పుకుని ఏడవడం మొదలుపెట్టింది. ఎంతో సమాధాన పరచాలని చూశాను, శారద కన్నీళ్లు ఆగలేదు.

బలవంతంగా శారదని రైలు ఎక్కించి నేనూ ఆమె పక్కనే కూచున్నాను. ఇద్దరం మాట్లాడలేనంత ఆలోచనలతో చూడనేలేను. రైలు వాయువేగంతో రివ్వున వచ్చి బీచిలో ఆగిపోయింది. నా బలవంతాన తప్పని సరిగా శారద నావెంట వచ్చింది. ఆమె చేతిని నేను వదలలేదు. మా గుమ్మంలో అడుగు పెట్టామో లేదో.

"లలితా! ఇంతసేపయిందేం!" అంటూ మావారు మాకు ఎదురుగా వచ్చారు. శారదనిచూసి వారూ, వారినిచూసి శారదా నిర్ఘాంతపడి నిలబడిపోయారు.

శారదని దగ్గిరగా తీసుకుని,

"ఇదొక విచిత్ర సంఘటన" అన్నాను నేను.

# వర్జీనియా వుల్ఫ్

శ్రీ ఆచంట జానకిరామ్

౧

"అసలు ఒక్కమాటే చాలు! కాని, ఆ ఒక్క మాటే దొరక్కపోతే?"—వర్జీనియా వుల్ఫ్.

*　　*　　*

మనం ఊహించే ఊహలు, కోరే కోరికలు, మన పరిసరంలో ఉండే ఇతరుల ఊహలు, కోరికలు, మన అందరి ఆలోచనలూ, ఆశయాలూ, అనుభవాలు, వీనిని అన్నిటినీ ఒక్కమాటలో చెప్పకలిగితే, ఆ ఒక్క మాటే విశ్వసాహిత్య మవుతుంది. కాని అటువంటి ఒక్కమాటా మనకు కనబడక పోతే!.........

కాని, వర్జీనియావుల్ఫ్ మాటలకోసం ప్రయత్నించదు. ఒకచోట కూర్చొని ఆలోచిస్తూవుంటుంది. ఆ వాతావరణలో ఆమె మనోవీథిని అవతరించిన పదజాలాన్నీ, చక్కని సమాసాలనీ, మళ్లామళ్లా, తనలో తానే, అనుకుంటూ, అప్రయత్నంగా, కాగితంమీద ఉంచివేస్తుంది. ఆమెకు తెలియకుండానే, అతి సుకుమారమైన మాటలు, మనోహరములైన ప్రయోగాలు, ఆమె వ్రేళ్ళమీదుగా దొర్లివస్తాయి—దొర్లుతూవచ్చి సుందరాతిసుందరమైన మంచి ముత్యాల పేరుగా అమరిపోతాయి.

అద్వితీయమైన రచనా కౌశలము ఆమె సొత్తు. ఇతరులు వచనరచనలో ఉపయోగించే పొడిపొడి మాటలతోనే, ఆమె హృదయమును కదల్చివేసే కావ్యాలను వ్రాస్తుంది. ఇవి పద్యకావ్యాలు కావు. వీనిలో ఛందస్సులేదు కాని, సంగీతము స్ఫురిస్తుంది—ప్రతిమాటలోను. ఐతే, ఆమె వ్రాసేది కేవలము 'వచనము' అనడానికీ వీలులేదు, ఆమె వ్రాసేది—'భాష'. యుగయుగాలనుంచీ, వంశపారంపర్యంగా, వస్తూవున్న నూతన సంస్కారమును ఆమె తన రచనలో సజీవంగా చేస్తుంది. ఉన్నత సంస్కారవతి అయిన వర్జీనియాకు చక్కని పదములు, రసోచితములైన వర్ణనలు, అప్రయత్నంగా, ఒకదాన్ని ఒకటి త్రోసుకుంటూ, ముందుకు వస్తాయి.

*　　*　　*

వర్జీనియావుల్ఫ్ లండన్‌లో, ౧౮౮౨వ సంవత్సరమున పుట్టింది. ఆమె తండ్రి లెస్లీస్టీఫెన్ సుప్రసిద్ధ రచయిత, విమర్శకుడు. అతడు విజ్ఞానవంతుడు, తత్త్వవేత్త, అతి మృదులస్వభావుడూ, కావడంవల్ల, ఆంగ్లేయ సాహిత్య ప్రపంచకంలోనే అనాటి హేమాహేమీలందరితోనూ, పరిచయం కలిగి, కొందరితో మిక్కిలి స్నేహంగా ఉండేవాడు. ఇటువంటి సహవాసమే వర్జీనియాకు చిన్నతనంలో సాహిత్యపు వాతావరణను కలుగజేసింది. వారిఇంట్లో అద్భుతమైన గ్రంథాలయము ఉండేది. తనతండ్రి, అతని స్నేహితుల సాంగత్యంవల్లా, ఆ గ్రంథాలయంలోనే పుస్తకాలతో సహచర్యంవల్లా, ఆమె చిన్నతనంలోనే గొప్పగా విద్యావంతురాలైంది. అతి తీక్ష్ణమైన మేధస్సు ఆమెకు పిత్రార్జితము. ఉన్నత సంస్కారంతోపాటు, నిశితమైన ఆలోచనా శక్తికూడా, ఆమెకు తండ్రి ప్రసాదించిన ఆస్తే. లెస్లీస్టీఫెన్ ౧౯౦౪వ సంవత్సరంలో చనిపోయాడు. తదనంతరం వర్జీనియా, ఆమె సోదరుడూ వేరే చిన్న ఇల్లు తీసుకున్నారు. ఇక్కడే, వర్జీనియా, తన మొదటి రచన రచించింది. ఆమె సోదరుడు ఎడ్రినియన్ తండ్రిలాగే సాహిత్యప్రపంచకంలో పెద్దపెద్ద వారితో కలిసి

మెలసి తిరుగుతూ, వారిలో కొందరిని తరుచు తన ఇంటికి తీసుకువచ్చి సత్కరిస్తూ ఉండేవాడు. వర్జీనియా కూడా వీరిని కలుసుకుంటూ ఉండేది. కాని, వీరు—అందరూ ప్రతిభావంతులే,—అనేక విషయాలను గురించి మాట్లాడుకుంటూ ఉండగా అతి శ్రద్ధగా వింటూ ఉండేదేగాని, వర్జీనియా తాను అట్టే మాట్లాడేదికాదు. ఆ రోజులలో వర్జీనియా తనకు కలుగుతూ ఉన్న క్రొత్తక్రొత్త అనుభవాలను అర్థము చేసుకోవడానికీ, జీవితాన్ని గురించి తనకు క్రమక్రమంగా విశదమవుతూఉన్న విశాలభావముతో ఈ అనుభవ పరంపరను సరిగ్గా అన్వయించుకోడానికీ, ప్రయత్నించేది.

* * *

వర్జీనియా ఆలోచనలూ, ఆశయాలు, ఎటువంటి ప్రతిబంధకములేకుండా, విస్తరిల్లుతూ వచ్చాయి. ఎటువంటి నిర్బంధములేక, ఆమె తన మనస్సుకు వచ్చినట్టు వ్రాయకలిగింది. కాని నిజంగా కావ్యదృష్టితో కల్పించిన రచనకు ఉపక్రమించడానికి ఆమెకు చాలా కాలము పట్టింది.

మొట్టమొదట వర్జీనియా సాహిత్య విమర్శనలు వ్రాసేది. తాను స్వయంగా ఏమీ అంతగా రచింపకపోయినా, ఇతరుల రచనలను విమర్శించే శక్తి చక్కగా అలవరచుకొన్నది. తరువాతనే తాను స్వయంగా వ్రాయడము మొదలుపెట్టింది. 'టైమ్సు లిటరరీ సప్లిమెంటు' లో ప్రతివారమూ, ఆమె విమర్శలు, సాహిత్యపు వ్యాఖ్యలు వెలువడుతూ వుండేవి. అమెరికను పత్రికలలో కూడా, తరుచుగా, ఆమె సాహిత్యపు వ్యాఖ్యలు ఉంటూఉండేవి. ఆరోజులలో ఆమె చదివిన పుస్తకాలకు అంతులేదు. అనేక దేశాలు తిరిగింది. రకరకాలైన మానవ సంఘాలను చూచి, వారి ఆచారవ్యవహారాలు, వారి సంస్కృతి చక్కగా పరిశీలింప గలిగింది.

౧౯౧౨ లో వర్జీనియా, లియొనార్డ్ వుల్ఫ్‌ను వివాహమాడింది. ఇతడు పత్రికా రచయిత, వ్యాసకర్త సాహిత్యప్రియుడు. కొన్నేళ్ళు సిలోను సివిల్ సర్వీసులో ఉన్నతోద్యోగంలో పనిచేసిన ఇతను తిరిగి స్వదేశం వచ్చి, అసమానమైన తన సంస్కృతిని సర్వతోముఖంగా ప్రకటింపగలిగాడు. సిద్ధహస్తుడైన లియొనార్డ్ రచించిన కొన్ని గొప్ప రచనలు ఎంతో ప్రశంసకు పాత్రమైనాయి. ఇటువంటి భర్త లభించడము వర్జీనియా కవితాలతకు గొప్ప దోహదమిచ్చినట్టైంది. అతడు ఆమెను పూర్తిగా అర్థము చేసుకొని, ఆమె ఆశయాలతో ఏకీభవించి, ఎంతో ప్రోత్సహించాడు. ౧౯౧౫ లో తాను ఏడేళ్ళుగా వ్రాసిన తన మొదటి రచనను వర్జీనియా పుస్తకరూపంగా ప్రకటించింది. "నౌకాయానము" అనే ఈమె మొదటి నవలలో, ఈమె తనకు ముందు వెలువడిన ఏ నవలలోనూ లేని క్రొత్త ప్రతిభ ప్రకటించింది. ఇతర నవలలలోలాగే, కథవుంది. ఈమె నౌకాయానంలో, కాని, వ్యక్తుల అనుభవాలు వర్ణించడంలోనూ, కథ నడకలోనూ, వర్జీనియా పూర్తిగా నవ్యరీతినే అనుసరించింది.

* * *

వర్జీనియా బాహ్యజీవనం ఎంతో నిశ్చలమై శాంతియుతమై ఉన్నట్టు కనిపించినా, నిజానికి ప్రతి నిమిషమూ, ఆమె మానసికంగా గొప్ప ఆందోళనను పొందుతూ ఉండేది. అతి కుశాగ్రమైన ఆమె జ్ఞానేంద్రియము ఏదో ఒక విషయం గురించి తర్కిస్తూనే ఉండేది. వారి ఇంటికి వచ్చేపొయ్యే వాళ్ళందరూ కూడా, ఏదో ఒక విధంగా ప్రతిభావంతులే. వారు వెలువరించే అభిప్రాయాలూ, వీరు వెలువరించలేని అభిప్రాయాలూ, ఇవన్నీకూడా ఆమెకు, లోలో స్వీయవిమర్శన రేకెత్తించేవి.

# వర్జీనియా వుల్ఫ్

"నాకు పుస్తకాలకంటె మనుష్యులే ఇష్టము... నవలలకన్న 'స్వీయచరిత్ర' లే నాకు రుచిస్తాయి." అనేది వర్జీనియా.

సాహిత్య ప్రపంచకంలో దిగ్గజాలనతగిన ఇలియట్, స్పెండర్, స్ట్రాచీ, లెహమాన్ వంటివారితో సమాన ప్రతిపత్తితో సంచరించే వర్జీనియా, క్రొత్తగా కలమునెత్తిన ఎందరెందరు యువకులకో ప్రోత్సాహమిచ్చేది. అటువంటివారు తమ సమాజంలోకి రావడం తటస్థిస్తే వారిలోఉన్న ప్రతిభను గోరంతలు కొండంతలుగా చేసి వర్ణిస్తూ వారి ఆత్మవిశ్వాసాన్ని పదిరెట్లు ఇనుమడింప జేసేది. వర్జీనియాకు భౌతిక సౌందర్యమంటే ఎంత ప్రియమో, మానసిక సౌందర్యమన్నా అంతే ప్రియము. ప్రతిభావంతులు ఆమెను ఇట్లే ఆకర్షించేవారు. కాని, ఎవరిలోనైనా, ఏ మాత్రము ఆత్మసంశయము కనుపించినా, తక్షణము తన మధుర వచనా చమత్కృతితో వారి భయాన్ని పోగొట్టకలిగేది —ముఖ్యంగా, క్రొత్తగా విశ్వవిద్యాలయాలలోంచి స్నాతకులై వచ్చిన విద్యార్థినులఎడ ఎంతో సానుభూతితో వర్తించేది.

సాహిత్యంలో 'అభిరుచి' అంటే ఏమిటో, 'రసన' అంటే ఏమిటో వర్జీనియాకు చక్కగా తెలుసును. కాని, ఆ కారణంవల్ల ఇతరుల యెడల నిరసనభావము కాని, కించిత్ గర్వముగాని ఆమెలో మచ్చునకైనా లేవు.

వర్జీనియా, ఆమె భర్త లియొనార్డ్, ఇద్దరూ కలిసి ౧౯౧౭ లో 'హోగర్త్‌ప్రెస్'ను నెలకొల్పారు. చిన్న చేతిమరగా ప్రారంభించిన ఈ సంస్థ నేడు సాహిత్య ప్రచారానికి ఎంతో చేయూతగాఉన్న మహానిలయమైంది. ఈ దంపతులిద్దరి ప్రోత్సాహం వల్లనే ఎన్నెన్నో గొప్ప రచనలు ఆంగ్ల సాహిత్య రంగాన్ని అలంకరింప కలిగాయి.

ఆరోజులలో వర్జీనియా వుల్ఫ్ లండనునగరములోని సాహిత్యజీవనానికే ఆయువుపట్టై ఉండేదట.

"ఇదివరకెన్నడు పొసగని, ఇకముందెన్నడూ పొసగడానికి అవకాశంలేని, అనేక సద్గుణములు ఒక్కచోట అవతరించడమువల్ల, వర్జీనియా ఈ విధంగా మన సాహిత్య ప్రపంచంలో ఇటువంటి కీలకస్థానము అలంకరించ కలిగినది"—అన్నాడు! టి. ఎస్. ఇలియట్. "వర్జీనియా ఉత్తమ కళావేత్రి. పూర్వ సాంప్రదాయాల ఔన్నత్యాన్ని పాటిస్తూ, ఒకరి మెప్పుపైన ఆధారపడకుండా, ఆమె ఉన్నత సాహిత్యాదర్శాలను చూపకలిగింది. ధనికవర్గపు పోషణా లక్కరలేదు; శ్రామికులు గొంతు చీల్చుకొని చేసిన పొగడ్తలూ అనవసరము, వర్జీనియావంటి నిజమైన కళామూర్తులకు!

ఒక పర్యాయము, ఒక స్త్రీలసభలో మాట్లాడుతూ వర్జీనియా, తాను సాహిత్య విమర్శనా దృష్టి ఎలా అలవరచుకో కలిగిందో చెప్పింది.

"ఒకానొక ప్రఖ్యాత కథకుడు రచించిన ఒక నవలను విమర్శింప వలసివచ్చింది. విమర్శ వ్రాస్తూ ఉండగా, నేను "అశరీరిణియైన" ఒక వింత వ్యక్తితో పెనగులాడవలసివచ్చింది. నేను వ్రాత మొదలు పెట్టానో లేదో ఈ వింత వ్యక్తి నన్ను వెయ్యివిధాల ఆటంకపరచేది. నన్ను ఒక్కముక్క వ్రాయనిచ్చేదికాదు. ఈ 'అశరీరిణిని' వర్ణిస్తాను. సౌజన్యపు అపరావతారము ఆ వ్యక్తి. త్యాగమూర్తి. ఇంటిపనులన్నీ చక్కగా నిర్వహించకలదు. ప్రతినిమిషము తన బాగును ఇతరులకోసం ధారపోసేది. నిజానికి ఆమెకు స్వంత వ్యక్తిత్వమే లేనట్టుండేది. తన ఆలోచనేలేదు. తాను ఆలోచించడమేలేదు! తనకు కోరికలేలేవు!—ఎల్లప్పుడూ ఇతరుల ఆలోచనలు గురించీ, ఇతరుల కోరికలను గురించీ పరితపించేది, ఆ అశరీరిణి.

"సద్గుణాలరాశి ఆమె. ఎవ్వరినీ కొంచమైనా నొప్పించలేదు."

"నేను నా విమర్శ వ్రాయడానికి పూనుకున్నానో లేదో ఉత్తర క్షణంలో, ఆ 'అశరీరవ్యక్తి' నా ప్రక్కనే అవతరించింది—నా చెవిలో ఇల్లా బోధించింది. 'అమ్మాయీ! నువ్వు ఇంకా చిన్నపిల్లవు. పురుషపుంగవుడు వ్రాసిన ఓ పుస్తకరాజాన్ని విమర్శింప సాహసిస్తున్నావు. నామాట విను, రచయిత ఆశయాలతో వీలైనంత సానుభూతి చూపు. నీ విమర్శ ఎంత కోమలంగా ఉంటే అంత మంచిది." అనీ, మరీ రహస్యంగా, "వీలైనంత ఎక్కువగా శ్లాఘించు...స్త్రీజన సహజములైన మెప్పుదలతో ముంచివెయ్యి... చూడు—నీకు ఒక ప్రత్యేక వ్యక్తిత్వము ఉన్నదనిగాని, నీ అంతట నీవు ఆలోచించుకునే శక్తి, విచక్షణ, నీ కున్నాయని పిట్టకైనా తెలియనివ్వకూడదుసుమా!" అనీ ఎంతో బోధించింది. ఆ "అశరీరవ్యక్తి' తన ఇష్టంవచ్చిన అక్షరాలను నాచేత వ్రాయించడానికి ప్రయత్నించింది.

అప్పుడు నేను స్త్రీ సహజంగాని పని చేశాను—నాకు అంతధైర్యం రావడానికి కారణం, నేను జీవనోపాధికొరకే వ్రాసేరచయిత్రిని కాకపోవడమే.- నేను ఏం చేశానంటే, లేచినుంచుని అమాంతంగా ఆమె గొంతుక పట్టుకున్నాను. ఆమెను చంపివేయడానికి ప్రయత్నించాను. హత్య దోషమే. కాని ఆత్మరక్షణకొరకు నేను ఆమెను చంపవలసి వచ్చింది. నేను ఆమెను చంపిఉండకపోతే నన్నే ఆమె హత మార్చి ఉంటేది. ఏమి వ్రాయడానికి పూనుకున్నానకే, తక్షణము ఆమె తీయతీయని మాటలతో "అబ్బే! ఇతరులను నొప్పింపకూడదు. నీవ్రాతలలో అసత్యం చెప్పైనా ఇతరులతి సంతోషింపచెయ్యాలని" నిర్బంధించేది. కాని, ఆమెను చంపడం సులభం అనుకోకూడదు. పాంచభౌతికమైన దేహంకలవారిని చంపవచ్చునుకాని, ఇటువంటి అశరీరిణిని చంపడమెల్లా! : ఒక్క దెబ్బతో చావలేదు ఆమె. ఎంతో ప్రయత్నం మీద నేను ఆమెను రూపుమాపకలిగాను. నాకది ఒక గొప్ప అనుభవము. మరవరాని అనుభవము. నాలాగే స్త్రీ రచయితలు అందరూ ఎప్పుడో ఒక పర్యాయం ఈ అశరీర వ్యక్తిని ఎదుర్కోవలసి వుంటుంది, తప్పకుండా."

ఆరోజులలో స్త్రీ రచయిత్రికీ, పురుషరచయితలకూ మధ్యవుంటే తేడాని వివరిస్తూ ఆమెఇలాఅన్నది.

"మనము మన ఆలోచనలను గురించీ, మన భావపరంపరను గురించీ, నిజమైన అనుభవాలను గురించీ. ఉన్నది ఉన్నట్టుగా చెప్పడము పురుషుడు సహించలేడు. ఇటువంటి విషయాలు తాము ఎంత యథార్థంగానైనా వ్రాయడానికి వెనుదీయరు. కాని ఈ విషయాలే స్త్రీ వెల్లడిచేస్తే, అవి ఎంత నిజమైనా, పైకి చెప్పకూడనివై పోతాయి. నిజంగా స్త్రీరచయిత్రి తను చెప్పదలచుకున్న విషయాలన్నిటినీ, ఏవిధమైన ప్రతిబంధకమూ లేకుండా చెప్పకలిగే రోజులు ఇకముందు ఎప్పుడో ఉన్నాయి. ప్రస్తుతం మాత్రము అల్లావీల్లేదు.

నేటి నాగరిక ప్రపంచకంలోకూడా స్త్రీకి తగిన స్థానం ఇంకా ప్రాప్తించనందుకు చాలా చింతిస్తుంది వర్జీనియా వుల్ఫ్.

'ఇంకా ఎన్నాళ్లు పిల్లలను కనడమే ముఖ్యవ్యాపకంగా వుంటుంది, స్త్రీలకు' అని ప్రశ్నిస్తుంది.

'ఇంకా ఎన్నాళ్లు స్త్రీలను గురించిన పుస్తకాలు పురుషులు వ్రాసినవిగానే ఉంటాయి' అంటుంది.

'స్త్రీ సహజమైన గర్భధారణ, శిశుపోషణాశక్తి, యిటువంటివాటితోపాటు స్త్రీకి మేధాశక్తి, ప్రతిభ వున్నప్పుడు ఆమెకర్తవ్యమేమిటి? ఈ రెండు శక్తులలో దేనిని ఉపసంహరించుకుంటుంది; దేనిని అభివృద్ధి చేసుకుంటుంది? వీనిలో ఒక శక్తిని మరుగుపరచితే

# వర్జీనియా వుల్ఫ్

ఆమె వ్యక్తిత్వ మేమవుతుంది? అంటే మిక్కిలి ప్రతిభావంతురాలైన స్త్రీ, తాను స్త్రీ ఐనంతమాత్రంచేత తనప్రతిభనంతా బూడిదపాలుచేసి, పిల్లలను కనిపెంచడమే పరమావధిగా పాటించడము న్యాయమేనా? లేక, తన మాతృస్వభావాన్నే మరచిపోయి, తన మేధాశక్తని, ప్రతిభను వినియోగించే వ్యాపకాలలో నిమగ్నఅయి, కీర్తిగడింప కలిగితే ఆ విధంగా ఆమెకు సంపూర్ణానందం సమకూరుతుంది, అని చెప్పకలమా? పోనీ, రెండింటిలోనూ ఉంటే, ఆబాధ్యతలను రెండింటినీ సంతృప్తికరంగా నిర్వహించడానికి, ఒక ఆయుః పరిమితి చాలుతుందా?...ఒకవేళ, ఎంతో ప్రయత్నించి, అల్లా నిర్వహింపకలిగినా, అట్టి విశేష ప్రయత్నము ఆమె సంతతిపైన నీ విధంగా పరిణమిస్తుంది. వారందరు పిల్లలలాగ ఉంటారా? పుస్తకమా? బిడ్డా? ఏది నేటి స్త్రీ వాంఛింపవలసినది? క్రొత్త పుస్తకాన్ని "కనడానికి" ఎంత శక్తీ ఎంత యత్నమూ కావాలి! నవ్యస్త్రీ దేనిని కోరుకుంటుంది?

వర్జీనియా వుల్ఫ్ తన రచనలలో స్త్రీల ఆశయాలను గురించి విపులంగా పరీక్షిస్తుంది. కాని ఎక్కడా కూడా ఆమె పురుషద్వేషిణికాదు. జరిగిపోయిన విషయాలను గురించి ఆమెకు ఏమాత్రమూ కసిలేదు-పురుషవర్గముపైన. ఆమె రచన స్త్రీలనుద్దేశించి ప్రతిభావంతురాలైన ఒక స్త్రీ రచించిన ఉత్తమరచనగా వర్ధిల్లుతుంది.

స్త్రీలు తమ్ముగురించి తాము చెప్పకోవడములో ఒకటి నవీనమైన, ఒకఅందమైన, ఒక సంతోషదాయకమైన। క్రొత్త పద్ధతికి త్రోవ చూపింది వర్జీనియా వుల్ఫ్. యుగయుగాలగా, పురుషులు స్త్రీలను తమ బానిసలగా చూచిన విషయం మరచిపోలేదు స్త్రీ. కాని చారిత్రకమైన ఈ విషయంగురించి పురుషునిపై ఆమెకు ద్వేషములేదు. తన వ్యక్తిత్వాన్ని, తనలో ఇమిడివున్న అపారమైన శక్తిని పూర్తిగా గుర్తించింది స్త్రీ. సృష్టి ఆదినుంచీ, మానవజాతికి స్త్రీల ద్వారా కలిగిన మేలును సదా జ్ఞప్తియందుంచుకొని, ద్విగుణీకృతమైన ఉత్సాహంతో భావికాలపు మానవ ప్రపంచకంలో స్త్రీ తనకు ఉచితమైన స్థానాన్ని అందుకోటానికి ప్రయత్నించేయత్నము కనబడుతుంది ఈమె రచనలో. యంత్రయుగంలో నివసిస్తూ, సాక్షాత్తు లండన్‌లో తన జీవితకాలంలో ఎక్కువ భాగము వెళ్లబుచ్చినా, వర్జీనియా వుల్ఫ్ రచనలలో, యంత్రాల ఆందోళనగాని, యంత్రాల తొడతొక్కిడిగాని ఎక్కడా కనుపించదు. తన భావాలు లోకం యెదుట ప్రకటించాలన్న ఆశా వున్నట్టు కనుపించదు. ఆమె రచనలలో ప్రతిపదములోనూ ఒకానొక విశిష్టత ఒకానొక ఉన్నత సంస్కారము ప్రస్ఫుటమవుతూంటాయి, ఆమె తనవంటివారినే ఉద్దేశించి వ్రాస్తుంది. కనుక ఆమె భావాలు అట్టి సంస్కారము కలవారినే ఎక్కువగా ఆకర్షింపకలుగుతాయి.

సత్యాసత్యములనుగురించి చర్చిస్తూ, ఒక పర్యాయము, వర్జీనియా వుల్ఫ్ ఇల్లా చెప్పింది.

"ఇది 'సత్యము' అంటే ఏమిటి. సత్య' మనేది జనులనుకునేటంత సులభసాధ్యమైనదికాదు. ఈ నిమిషము ధూళిధూసరితమైన రోడ్డు ఒక్కటే సత్యమని, గాలిలో ఎగిరిపోతున్న చిత్తుకాగితాలే సత్యమేమొ? ఇవి ఏవీ కావు, నీరెండలో మెరసిపోతూవున్న చిన్న చామంతి పువ్వు ఒక్కటే నిజము. గదిలో కూర్చుని కులాసాగా కబుర్లు చెప్పకుంటూవున్న యువకులలో ఒకరు అప్రయత్నంగా అనాలోచితంగా చెప్పిన ఒక్క ముక్కలో ఎంతటిసత్యము ఉండవచ్చు!

నిసిరాత్రిని; ఏకాకిగా ఇంటికి తిరిగివస్తూ, ఆ విజనప్రదేశంలో, తలపైకెత్తగా అతి దూరాన ఉన్న ఆకాశంలోంచి చుక్కలు పలకరించే పలుకులు

...హనము వినిన మనుష్యవచనములన్నిటికంటె, ఎక్కువ సజీవమైనవని తోస్తుంది.

ఇది నిజము—ఇది నిజముకాదు అని ధృఢంగా చెప్పటం చాలా కష్టము. కాని, సత్యస్వరూపముతో క్షణకాలము పరిచయము కలిగినా, ఆ వస్తువుకు ఆ భావానికి, ఒకానొక శాశ్వతత్వము లభిస్తుంది.

క్షీణించిపోయిన పగలు, చీకటిలో కలిసిపోయే టప్పుడు మిగిలేదేమిటి? అదే నిత్యము.

గతించిపోయిన మన అనుభవాలు, మన ప్రేమలు, మన అనురాగ విరాగాలు వీనిలో శాశ్వతంగా ఏది వున్నదో అదే సత్యము".

ఈ సత్యముతో, నిరంతరము సహవాసము చేసే శక్తికలవాడు, ఇతరులందరికంటే ఎక్కువ అర్హత కలవాడు—రచయిత ఒక్కడే!"—అంటుంది వర్జీనియా వుల్ఫ్.

(సశేషము)

---

# ఆంధ్రశిల్పి చందాదారులకు

ఆర్యా!

1946 అక్టోబరు ఆంగ్ల 'శిల్పి' పొరబాటున మీలో కొంతమందికి పంపాము. దయ ఉంచి అది తిరిగి పంప ప్రార్థన.

మదరాసు చందాదారులు తమకు పై సంచిక చేరినట్లు తెలియజేస్తే, మా నౌఖర్ని పంపించి పై సంచికలు మేమే తెప్పించుకొనగలము.

మేనేజరు,

'శిల్పి'

౧౦ నరసింగపురం వీధి

మౌంట్ రోడ్, మద్రాసు.

---

# దాక్షిణాత్య కాంస్యప్రతిమలు



శైవనాయనారు: పార్శ్వభాగము



దేవి



కాళియమర్దనము



శైవనాయనారు: ముఖభాగము

# దాక్షిణాత్య కాంస్యప్రతిమలు



ఉమామహేశ్వరమూర్తి



శివకల్యాణమూర్తి



దీపదేవత



దీపదేవత

# చిత్ర వివరణము

## శ్రీ టి. యన్. శ్రీనివాసన్

అనాదికాలంనించీ, కవులకు, చిత్రకారులకూ, వేదాంతులకు హిమాలయం ఎంతో బహుమానపాత్రంగాను, ఆరాధ్యంగాను ఉంటూవచ్చింది. ఈ పర్వతం సహజసౌందర్యము, ప్రశాంతవైభవము చూచి మన ప్రాచీనులు ముగ్ధులై దీనికి 'పర్వతచక్రవర్తి' అనే బిరుదు ఇచ్చారు. మహాకవి కాళిదాసుకాలంలోకూడా దీనియెడల అత్యధికగౌరవం ఉండేది. అతని కుమార సంభవకావ్యం ఈ పర్వతవర్ణనంతోనే ప్రారంభిస్తుంది.

> అస్త్యుత్తరస్యాం దిశిదేవతాత్మా
>
> హిమాలయోనామ నగాధిరాజః,
>
> పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
>
> స్థితఃపృథివ్యా ఇవ మానదండః.

ఇంకా బుద్ధుడు మొదలుకొని నేటికాలందాకా అవతరించిన మహామహులంతా ఈ హిమాలయాల్లో తమ నిశ్చలధ్యానాలకు అనువైనప్రదేశాలు అన్వేషిస్తూవచ్చారు. బదరీనాథము, కేదారనాథము మొదలైన ప్రదేశాలన్నీ వారిపవిత్ర తపశ్చర్యలవల్లనే పుణ్యక్షేత్రా లయ్యాయి. కళాశీలురకందరికీ హిమాలయం ఒక అనంతమైన ఆవేశవిషయం. అనేకవిధాలలో కళాశీలురు మనోహరమైన హిమవన్నగ సౌందర్యం చిత్రించారు.

అంతేకాదు, హిమవత్పర్వతం దేవభూమిఅయి, దేవనివాసం అయింది. హిమవంతుడికి దేవత్వమూ, యజ్ఞభాగార్హతా లభించాయి. ఆపిమ్మట హిమవంతుని గృహంలో పార్వతి అవతరించి, త్రిమూర్తులలో ఒకడైన శివునికి అర్ధాంగి అయింది. ఆపైన పరమేశ్వరుడు మామగారి గృహమే తనకు నివాసస్థానంగా చేసుకున్నాడు. హిమాలయంలో ఔత్తరాహశ్రేణిలో ఉన్న కైలాసం సార్వతీపరమేశ్వరులకు స్థిరనివాసం అయింది. ఇది ఇల్లాగ ఉండగా హిమాలయశిఖరాలన్నింటిలోకి, అత్యంతోన్నతమైన మౌంట్ ఎవరెస్ట్ శిఖరాన్నికూడా చాలా ప్రాచీనకాలాన్నించీ గౌరీశంకర శిఖరం అని పిలుస్తున్నారు. సహజంగా పరికిస్తే ఈ శిఖరంపక్కనే ఇంకొక శిఖరం ఉన్నదనీ, అది నిరంతరము మంచుతో కప్పబడి ఉంటుందనీ, శిఖరానికి కొంచెంకిందుగా ఆశిఖరం అంతా మేఘాలతో కప్పబడి ఉంటుందనీ చెబుతారు ఈ ప్రకృతి రామణీయకం చూచి ముగ్ధులైన అనేకచిత్రకారులు ఈ శిఖరాలసౌందర్యం గౌరీశంకరులభావనతో ఇనుమడింపజేస్తూవచ్చారు.

ఈ చిత్రంలో శ్రీ వి. ఆర్. చిత్రాగారు శిఖరాల సహజసౌందర్యంతో నిత్యప్రేమికులైన గౌరీశంకరులను చిత్రించారు. ఇందులో అలంకారాడంబరం ఏమీలేదు. అయినా ఇది ఎంతో భావస్ఫోరకంగా ఉంది. హిమాలయోన్నతప్రదేశంలో హిమం కరుగుతూ జాలువారుతూ ఉంటుంది. ప్రవహిస్తూన్నట్టుగా ఉన్న గౌరీశంకరుల శిరోజాలు హిమప్రవాహాలను తలపింపజేస్తున్నాయి. నిశ్చలగంభీరములైన పార్వతీపరమేశ్వరులముఖాలు హిమాలయౌన్నత్యము, వైభవము ధ్వనిస్తున్నాయి. ఇందులో శివుని నిత్యాలంకారాలయిన నెలవంక, సర్పముకూడా కనిపిస్తున్నాయి. వాటిలో సర్పము ఎంతో మనోహరంగా శివుని కంఠానికి చుట్టుకుంది. శిఖరాలకు వెనకాల ఉన్న నెలవంక శిరోభాగానికి ఎంతో సామరస్యం చేకూ

రుస్తూఉంది. అయితే ఇక్కడ శివుని శిరస్సునించి ప్రవహించే గంగాప్రవాహంమాత్రం కనిపించడంలేదు. బహుశః శివుడు తన అర్ధాంగితో సమాధినిమగ్నుడై ఉన్నప్పుడు అన్యతరుణీసాహచర్యమూ, తన్మూలకమైన విఘ్నమూ ఆకాంక్షించి ఉండకపోవచ్చును. ఈ సమాధి మగ్నతను, అవిభాజ్యమైన ఏకతను సూచించడానికి కంఠానికి దిగువభాగం అంతా కలిసిపోయినట్లు చిత్రించబడింది.

ఇది శ్రీ వి. ఆర్. చిత్రాగారు రాజకీయంగా కారాగారంలో ఉన్నప్పుడు చిత్రించినది. కాని దీనిలో కారాగారంలో ఉండే మానసికనిర్విణ్ణతగాని, ఆవేదనగాని కనిపించదు. పైగా ఇది కాంతిప్రవాహంతోను, మనోహర సమ్మేళనంతోను, ప్రేక్షకులకు స్వాతంత్ర్యభావము,మహోన్నత వైభవముధ్వనిస్తూంది.

అనువాదకుడు: 'శిల్పి'

## అఖిల భారత ఖాదీ స్వదేశీ వస్తుప్రదర్శనములో చిత్రప్రదర్శనము.

తమిళనాడు కాంగ్రెసు కమిటీవారు ఇంచుమించుగా పదేళ్ళు గడిచినతరవాత క్రిస్టమసులో తమ ప్రదర్శనాలు జరిపే పద్ధతి మళ్ళీ ప్రారంభించారు. పూర్వంవల్లే ఈ ప్రదర్శనాలు జనరల్ పాటర్స్ రోడ్డులో జరపకుండా తమ కొత్తవసతిలో—అంటే తేనాంపేట పోలీసుస్టేషనుకి సమీపంగా జరిపించారు. ఇక్కడ బాగా విశాలంగా ఉంది. పూర్వప్రదేశంకంటెకూడ బాగా ప్రశాంతంగా ఉంది.

ఈ ప్రదర్శనాలకు ఉపాంగంగా ఒక చిత్రకళాప్రదర్శనంకూడా జరిపించారు. అడయారు థియసాఫికల్ సొసైటీ అధ్యక్షులు శ్రీ జినరాజదాసగారు ఈ చిత్రకళాప్రదర్శనం ప్రారంభిస్తూ దీన్ని ఈక్రింది విధంగా ఎంతో సముచితంగా ప్రశంసించారు.

"మన జాతీయజీవనంలో భారతకళాప్రదర్శనాలు క్రమంగా ఒక ఆచారంగా పరిణమిస్తున్నాయి. చిత్రసంపాదనాదృష్టితోను, చిత్రకళాపోషణాదృష్టితోను చూస్తే ప్రేక్షకుల్లో ప్రోత్సాహ మేమీ లేదనే చెప్పాలి. నేను మిగిలినదేశాల్లో అనేక ప్రదర్శనాలు చూశాను. నా అనుభవాన్నిబట్టి భారతదేశము మహాసుందరములు, మహల్లక్ష్యసమన్వితములు అయిన చిత్రాలు ఉద్భవింపజేస్తూన్నదని చెప్పగలను. భారతీయులు తమ జాతీయజీవనం సంరక్షించుకోవాలంటే తమ చిత్రకారులు సృష్టించిన చిత్రసంపదలో మునుగుతూ తేలుతూ ఉండాలి. ఆవిధంగానే వారు తమ జాతీయజీవనం సంరక్షించుకోగలుగుతారు".

శ్రీ జినరాజదాసగారు ఈరోజుల్లో ప్రతీభారతీయుడి మనస్సులోను ఉండేభావాలు ఎంతో మనోహరంగా వ్యక్తీకరించారు. చిత్రకళకు మనలో ఒక ఉనికి ఏర్పడిందని చెప్పవచ్చును. జీవితాన్ని కళలో ప్రతిబింబింపజేసుకుంటూ కళామయమైన జీవితం గడిపే పరిస్థితులు క్రమంగా ఏర్పడాలి.

ఈ చిత్రప్రదర్శనం ఏర్పాటుచేసినవారు, ఇంచుమించుగా ౧౫౦ చిత్రాలదాకా ప్రదర్శించారు. వీటిల్లో చాలా చిత్రాలు దాక్షిణాత్యులు రచించినవే. వారిలోకూడా చాలామంది వృత్త్యా చిత్రకారులు కారు. ఈ ప్రదర్శనంలో వివిధములైన చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. తత్రాపి కళాప్రియులు, కోవిదులు అయిన స్వర్గీయ శ్రీ యస్. వి. రామస్వామిమొదలియారుగారి చిత్రసంచయము ప్రత్యేకంగా ప్రశంసింపతగినవి. అందులో కొందరు సుప్రసిద్ధచిత్రకారుల చిత్రాలుకూడా ఉన్నాయి.

మూర్తిచిత్రాలలో శ్రీ ఆర్. అనంతరామన్‌గారు చిత్రించిన 'సాధువు' అనే చిత్రానికి ప్రథమ బహుమతి వచ్చింది. అది దానికి అన్నివిధాలా తగిఉందని అనవచ్చును. దానిలో చిత్రకారుడు వైవిధ్యం బాగా ప్రదర్శించకలిగాడు. చిత్రవిషయం దుష్కరమైనదైనా చిత్రకారుడు ఈ చిత్రం చాలా సామర్థ్యంతో నిర్వహించాడని చెప్పవచ్చును. తైలవర్ణచిత్రాలలో

# చిత్ర వివరణము

శ్రీ సి. రామస్వామిగారు చిత్రించిన "బజారువీథి" ప్రథమ బహుమానం వచ్చింది. ఇవి సామాన్యంగా అందరూ చిత్రించే విషయాలే. అయితే శిల్పి దీనిలో ఒకకొత్త దృక్పథము, ఒకకొత్త శిల్పపద్ధతీ ప్రవేశ పెట్టాడు. ఇందులో సామరస్యంకూడా చాలా బాగా కుదిరింది.

శ్రీ యస్. రాజన్‌గారు చిత్రించిన త్యాగరాజ చిత్రము ఆమహామహుని అగ్రగణ్యచిత్రాలలో ఒకటిగా పరిగణించవచ్చును. దీనిలో చిత్రకారుడు తంజావూరు మహలులో భద్రపరిచిన త్యాగరాజ చిత్రమూర్తి పోలికలు తప్పిపోకుండా జాగ్రత్తగా చిత్రించాడు. తంజావూరు మహలులో భద్రపరిచిన చిత్రము త్యాగయ్యకు సమానకాలీనమని చెబుతారు. నీటిరంగులలో రచించిన మూర్తిచిత్రాలలో దీనికి మొదటి బహుమానం వచ్చింది.

ఇంకా ఆయావిద్యాలయాల్లో చిత్రకళ అభ్యసిస్తూ ఉన్న అనేకమంది యువక చిత్రకారులుకూడా ఈ ప్రదర్శనంలో పాల్గొన్నారు. ఇందులో కొందరు ఆ యువకులచిత్రాలు ఎంతో బాగున్నాయి. వీరికి తగినంత ప్రోత్సాహం ఇవ్వడం చాలా అవసరం. వీరికి తగినంత శిక్షణంఇచ్చి ప్రోత్సహించకపోతే వీరి కళ వికసించదు.

ఆపైన వేరే ఒక భాగంలో స్వర్గీయ శ్రీ రామస్వామి మొదలియారుగారు సంపాదించిన చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. ఈ చిత్రాలవల్ల ప్రదర్శనానికంతటికీ ఒక వింతశోభ చేకూరింది. వీటిలో శ్రీ శారదా ఉకీల్ రచించిన 'జటాయూమరణము' శ్రీ రవీంద్రనాథ చక్రవర్తి రచించిన 'శివుని వివాహ ప్రయాణము'('శిల్పి'లో ప్రకటితము) శ్రీ దేవీ ప్రసాద రాయ చౌదరి రచించిన 'నీలగిరిబాట' అనే చిత్రము, 'లీప్చాయువతి' అనే చిత్రము('శిల్పి'లో ప్రకటితము) శ్రీ నందలాలబోసు దీర్ఘరేఖలలో చిత్రించిన "మహిషాసురమర్దని" అనే మహాచిత్రము ఉన్నాయి. చిత్రప్రియులందరు ఈ చిత్రాలు చూచి ఎంతో ముగ్ధులయ్యారు.

ఈ ప్రదర్శనంలో ఇంకా శ్రీ. సి. గోపాల్ రచించిన కొన్ని శిల్పాలుకూడా ప్రదర్శింపబడ్డాయి.వీటిలో దృఢరేఖలో రచించిన శీర్ష చిత్రము గమనింపదగింది. శిల్పవిమర్శకులు శిల్పాలలో శ్రీ. సయ్యద్ అహమద్ రచించిన 'అస్పృశ్యుల' శిల్పానికి మొదటి బహుమానం ఇచ్చారు. ఇది చాలా సొగసైన మూర్తి శిల్పము. దీనిలో అస్పృశ్యవనిత సుఖజీవితం ఎంతో మనోహరంగా చిత్రితమైంది. అనువాదకుడు 'శిల్పి.'

## 'కల్పన'లో పూర్వరంగ దృశ్యాలు

శ్రీ ఉదయశంకరుడు ఈమధ్యన తయారుచేస్తూన్న 'కల్పనలో' పూర్వరంగానికి సామాన్యంగా సహజమైన ప్రకృతిదృశ్యాలు తీసి వేసి కృత్రిమదారు మూర్తులతో చక్కని పూర్వరంగ దృశ్యాలు కల్పించాడు. సినీమా ప్రపంచములో ఈ మార్పు ఒక అపూర్వమైన పరిణామం కల్పించగలదనడంలో అతిశయోక్తిలేదు. మనోహరములైన ఈ నాలుగు చిత్రాలు ఉదయశంకరుని 'కల్పనా' చిత్రంలోనివి.

'శిల్పి'

# గ్రంథ విమర్శనము

## జేబు రుమాలు

నవరచనా ప్రచురణలు, 4/8 దేశిగర్ స్వామి వీథి, మైలాపూరు : మదరాసు.

అచ్చుతప్పులు లేకుండా, చూడడానికీ, చదవడానికి యీ పుస్తకం చాలా ముద్దుగా వుంది. సంపాదకుడు 'పరిచయంలో' రచయితనిగురించి కొద్దిగా చెప్పి, మిగతవిషయాలు పుస్తకం చివరలో వేసివుంటే బాగుండేదని నాకు తోచింది—ఎవరు 'యీ ఆవిడికి' అంకితం చేశారో తెలీడంలేదు. నవరచనావళి మొదటి ప్రచురణ, వెల ఈ రెండూ అట్టలోపల వుండాల్సింది.

ఇందులో నాలుగుకథలున్నాయి. మొదటిది జేబు రుమాలు. ఇందులో వొక చదువుకున్న స్త్రీ జేబు రుమాలుపై నగిషీపని మొదలెట్టి, ఆరేండ్లలో వొక బంధువునీ, యిద్దరిస్నేహితులనీ కుట్టేరుమాలు వారి కోసమేనంటూ, చివరికి పెండ్లికాగానే భర్తకోసమే నని తేలుస్తుంది. ఇది మొదట్లో మంచికథలా కనిపించినా, కొంచం ఆలోచిస్తే యిందులో ఏమీ కనిపించదు—రచయిత చమత్కారం తప్ప. మొదటి యిద్దరితోనూ ఆ చదువుకున్న స్త్రీ చేసిన ప్రసంగం బట్టి, తరువాతకూడా అందరితోనూ అట్లాగే అంటుందని తెలుస్తూనేవుంది. ఇందులోని 'చర్య' 'సంభాషణలు' కథకోసం అల్లినవాటిలా వున్నాయి కాని, జీవితంలో అనుభవాన్ని సృష్టించినట్లుగా లేవు. ఒకచోట పద్మిని వొక స్నేహితునితో 'నిన్ను మోసపుచ్చను' అంటుంది; అది చదువరికి రచయితసందేశంలాగుంది; చదువుకున్న స్త్రీ యిట్లా ప్రవర్తిస్తుందీ, అనిచెప్పడంకూడా రచయిత సంకల్పంలా తోచదు—ఎందుకంటే కేవలం 'చమత్కారంపై' స్త్రీత్వానికి విలువకట్టడం సాహసంకాబట్టి, అట్లాంటిస్త్రీ, భర్తని చివరికి హాస్యాస్పదంగా చెయ్యడం రచయిత వుద్దేశమైతే అదీ ఫలించలేదు; ఎందుకంటే మోసపోయిన మిగతా ముగ్గురువ్యక్తులూ హాస్యాస్పదంగానే గోచరిస్తారు. నాదృష్టికి పద్మినే హాస్యాస్పదంగా గోచరించింది: మొత్తంమీద యీకథ, యిందలి పాత్రపోషణ భిన్నాభిప్రాయాలకి తావివ్వడమే, రచయిత చెప్పదల్చుకున్నది స్పష్టంగా లేదనడానికి తార్కాణం. 'ఆడాళ్ళంతా, పెండ్లయ్యేవరకూ బద్ధకిస్తూవుంటారు' యిదీ నాకు యీకథలో కనిపించిన పాఠం. సహజస్థితిలో ఆడాళ్ళు, మొగాళ్ళుకూడా బద్ధకస్తులే, మొత్తంమీద యిది చమత్కారమైన కథ. అంతే.

రెండోది స్వేచ్ఛ. భార్య మరొకణ్ణి ప్రేమించి, వ్యభిచరిస్తే భర్త ఏంచెయ్యాలి? యిదీ యీకథలో రచయిత తీసుకున్న సమస్య. భర్త (శ్రీనివాసరావు) పాశ్చాత్యకవుల స్వేచ్ఛాప్రేమసిద్ధాంతాలను, అలవరుచుకుని, స్నేహంద్వారా భార్యకుకూడా నేర్పుతాడు. సంస్కృతిలేకపోవడంవల్ల, వాటిని ఆచరణలో పెడుతుంది. భర్త సహించలేడు, అరికట్టలేడు; స్నేహితుడు (గుమాస్తా)తో చెప్పుకుని ఏడుస్తాడు. ఏం చెయ్యడానికీ తోచక, అతని ఆదర్శాలు, తనజీవితంలో లేవదీసినతుపానుకి తట్టుకోలేక విషం తాగి ఆత్మహత్య చేసుకుని, భార్యకి 'విముక్తి' యిస్తాడు.

ఈ నైతికసమస్యని రచయిత తార్కికబుద్ధితోనూ, వ్యవహారికదృష్టిలోనూ చర్చించాడు కాని, హృదయంతో పరిశీలించలేదని తోస్తుంది. వ్యభిచరించిన భార్యపై సంఘంచెప్పేతీర్పు స్నేహితుడు గుమాస్తా ద్వారా రచయిత చెప్పిస్తాడు; రచయితకూడా గుమాస్తా కట్టిన విలువలతో ఏకీభవించనట్లుకూడా నా అనుమానం. భార్యకి స్వేచ్ఛని నేర్పిన శ్రీనివాసరావుని "లోకవిరుద్ధమైన అప్రయోజకుడు" అని తీర్పు

చేశాడు. శ్రీనివాసరావు చనిపోయింతర్వాత గుమాస్తా వెళ్ళి, శ్రీనివాసరావుభార్య ప్రియుణ్ణి వొక్క లెంపకాయ కొడతాడు. అది సంఘం కొట్టిన చెంపకాయ. ఈవిధంగా ప్రేమకి విలువకట్టి, యీప్రేమ, (వ్యభిచారం) స్వేచ్ఛ, పాశ్చాత్యసాంప్రదాయాల ఆరాధనవల్ల జనించినవని చెప్పించడంవల్ల, చదువరి ప్రధాన పాత్రలమంచిచెడ్డలను,మన స్తత్వాలనూ హృదయంతో అర్థంచేసుకుని, సానుభూతి చూపలేకపోతున్నాడు. ఇట్లా అడుగడుక్కీ నైతిక స్తంభాలను లేవదీసి అసలు వ్యక్తులు అగపడకుండా చెయ్యడం యీ కథలో నాకు కనిపించినలోపం. ఇందులో వొక మంచి వాక్యం వుంది. "తమజీవితం మరొకరిమీద ఆధార పెట్టుకునేవాళ్ళగని ఎప్పుడూ అన్యాయమే"— ఇట్లాంటి భావాలు పాఠకుడిదృష్టిని నైతికసమస్య మీదనుంచి మరల్చి, అతీతుణ్ణిచేస్తాయి.

మూడోది వంశవృక్షం; ఇది యీ పుస్తకంలో నాలుగుకథలలోకి వుత్తమకథ అవడం కాకుండా, చాలా గొప్పకథలలో వొకటి. కథావస్తువు వున్నతమైంది; మధ్యమధ్య కొంచం విసుగుపుట్టించేవర్ణనలు, కథచివరలో అసలు సంగతి టూకీగా, పేలవంగా చెప్పివెయ్యడం, యిందులోవున్న చిన్నలోపం. జీవితానికి, కథానికశరణు అని నమ్మే సారస్వతప్రియులలో, వొక తెలుగువారే కాకుండా ప్రతి భారతీయుడూ చదవవల్సిన కథ యిది: అట్లా చదవని వారెవరేనా వుంటే, వెనక ఎవరో అన్నట్లు వారికి 'జుల్మానా' వెయ్యాల్సిందే!

ఆఖరిది 'పరామర్శ.' ఇది చదవడం వొక వుత్కృష్టమైన అనుభవం. మిగత కథలలో లోపమైన పాత్ర పోషణ యిందులో జరిగింది. ప్రేమించి లోలోపల బాధపడే వొక చదువుకున్న వితంతువు ఆంతరంగికం ఎంతో మృదువుగా చిత్రించాడు కథకుడు. స్త్రీలో —ముఖ్యంగా మనసంఘంలో— వ్యక్తమయ్యే మానసిక దౌర్బల్యం, యీ కథానిక వెన్నెముక. కాని రచయిత, తను సృష్టించిన పాత్ర ఎట్లా వుండేదీ, వర్ణించ యత్నించకపోవడం కొంత ఆశ్చర్యం కలగజేస్తుంది. ఏవొక్కరూ ఎట్లావుండేదీ చదువరి ఊహించుకోవల్సిందే కాని, పాత్రకి ప్రత్యేకత, వ్యక్తిత్వం కనిపించదు. ఈ లోపం, మొదటికథలో కొంతవరకూ, చివరి కథలో పూర్తిగానూ వుందని అనుకుంటాను.

వారి శైలినిగురించి వొక్కమాట. వీరి శైలి సులభంగా, స్వచ్ఛంగా వుంటుంది. చదివేటప్పుడు, వీరి శైలి బాగుందా లేదా అనే సందేహంరాదు; 'ఈ వాక్యం ఎంత బాగుంది' అని పాఠకుడు నిలిచిపోడు, గద్యరచనకి చెయ్యగలిగినపని తప్ప వేరే పనిని వారి శైలి చెయ్యించదు; ఇందులో అఘాతాలూ, ఎత్తులూ, బహిర్గతం కాని రహస్యమైన తొణికిసలూ, ఏమీ లేకుండా సాఫీగా నడిచిపోతుంది. ఆ విధంగా వారు చెప్పదలుచుకున్నదానికి వారు అలవరచుకున్న శైలి సరైందే ననాలి. చెప్పదల్చుకున్న విషయం స్పష్టంగా వున్నప్పుడూ, శైలినిగురించి ఆదుర్దాపడకపోవడం, మన రచయితలు వీరివద్దనుండే తెలుసుకోవలసిన విషయం అనిపిస్తుంది.

'యస్'

## హాస్య కథలు

రచయిత: చింతా దీక్షితులు, క్రౌను సైజు, 188 పుటలు, వెల: రెండు రూపాయలు, ప్రాప్తిస్థానం: నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు.

ఆంగ్లభాషా ప్రభావంవల్ల ఓంప్రథమంగా తెలుగులో కథారచన ప్రారంభించినవారిలో శ్రీ చింతా దీక్షితులుగారొకరు. ఈయన ఎంతక్లిష్టమైన భావాన్నయినా తేలికైన భాషలో చిన్నపిల్లలకు కూడా అర్థమయ్యేలాగు చెప్పగలిగిన శక్తిగలవాడు. బాల సాహిత్యానికి ఈయన చేసిన సేవ అమూల్యం.

ఈ కథా సంపుటిలో పదిహేను కథలున్నవి. ఇవన్నీ నవ్వుపుట్టించే కథలే. దీక్షితులుగారు కొన్ని

కథలలో కుక్క, పిల్లి మొదలైన జంతువుల స్వభావాన్ని సహజంగా చిత్రించారు. ఆ జంతువులు చేసే ప్రతి చేష్టకు చిత్రమైన అర్థాలు చెప్పటానికి ప్రయత్నించారు. "పాకశాస్త్ర పరీక్ష" అనే కథలో ఆధునిక విద్యావిధానంలోని అవకతవకలను కళ్ళకు కట్టినట్టు చూపించారు. "అగ్రాసనాధిపత్యం"లో సభకు అధ్యక్షత వహించేవారు ఎలా అబద్ధాలు మాట్లాడుతారో, తమకు తెలియనివాటిని గురించి ఎలా ప్రసంగిస్తారో, మామూలు ధోరణిలో ఎలా ఊకదంపు ఉపన్యాసాలు దంచేస్తారో మొదలైన యథార్థవిషయాలను బహు రమ్యంగా వర్ణించారు.

కథకునికి మానవుల అధర్మప్రవర్తనంపట్ల, సనాతన పండితుల ఛాందసంపట్ల గల అసహనభావం చాలా కథలలో స్పష్టంగా కనిపిస్తున్నది. విద్యార్థులకు నేర్పే శాస్త్రపాఠబోధనా పద్ధతులను సైతం కథా రూపంలో ఆకర్షణీయంగా చెప్పటయే దీక్షితులుగారి కథా సంవిధాన కళానైపుణ్యానికి ప్రబల తార్కాణం.

వట్టికొండ రంగయ్య.

---

# గ్రంథస్వీకృతి

౧. దీక్షితదుహిత

శ్రీ శివశంకరశాస్త్రి — వెల ౧-౪-౦

౨. పద్మావతీచారణచక్రవర్తి

శ్రీ శివశంకరశాస్త్రి — వెల ౦-౧౨-౦

3. రత్నాకరము

శ్రీ శివశంకరశాస్త్రి — వెల ౦-౧౨-౦

పై పుస్తకములు వలయువారు:
సాహితీసమితి;
నాంపల్లి-హైదరాబాద్

౪. కవిప్రియ

బిల్హణకథ:
పద్యనాటిక
శ్రీ శివశంకరశాస్త్రి — వెల ౧-౮-౦

వలయువారు:
సుందరాం అండ్ సన్సు, తెనాలి.

౫. ఆంధ్రరచయితలు

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి — వెల ౨-౮-౦

వలయువారు:
మణిమేఖల
పల్లిపాలెము: కాకినాడతాలూకా

౬. ప్రకృతివైద్యము

వలయువారు:
శ్రీ యోగాశ్రమము — వెల ౦-౮-౦
మునులతోట (మోర్తోట),
రేపల్లెతాలూకా, గుంటూరుజిల్లా.

# శిల్పి ప్రచురణము

# Cottage Industries of India

సంకలన కర్తలు

వి. ఆర్. చిత్రా: టి. యన్. శ్రీనివాసన్

'శిల్పి' సంపాదకులు



ఇది అన్ని రాష్ట్రాలలోను, ప్రధాన స్వదేశసంస్థానాలలోను ఉన్న కుటీరపరిశ్రమలను గురించి, సమగ్రంగా, తయారు చేసిన ఆంగ్లగ్రంథము. సుప్రసిద్ధులయిన అర్థశాస్త్ర వేత్తలు, పారిశ్రామికులు వ్రాసిన వ్యాసాలతోను, ప్రత్యేక చిత్రాలతోను ఎంతో ఆకర్షకంగా తయారవుతోంది.

ఇది డెమ్మీ ఆక్టేవో సైజులో 300 పేజీల గ్రంథము. 30 పేజీల ఆర్టు సప్లిమెంటుతో సహా 1947 మేలో తయారవుతుంది.



ఇది 37, ఆచారప్పన్ వీథిలోని బి. యన్. కె. ప్రెస్సులో, బి. నాగిరెడ్డిగారిచే ముద్రింపబడి, 10, నరసింగపురం వీథిలో: ఆంధ్రశిల్పి కార్యాలయంలో శ్రీమతి డి. ఆర్. చిత్రాగారిచే ప్రకటింపబడినది. సంపాదకులు: వి. ఆర్. చిత్రా : పి. గణపతిశాస్త్రి



# సచిత్ర మాస పత్రిక

సంపాదకులు

శ్రీ గణపతిశాస్త్రి : శ్రీ చిత్రా




౧౦, నరసింగపురం వీథి,

మౌంట్ రోడ్, మద్రాసు.

# వి ష యా ను క్ర మ ణి క



## శి ల్పా లు




మయూరము

శ్రీ మనీషిదే



# సంపాదక సమీక్షలు

## కాంగ్రెసు నఖశిఖ పర్యంతమూ కుళ్ళింది!

ప్రకాశం మంత్రివర్గం రాజీనామా ఇచ్చినప్పటినించీ—దానికి గల అసలు తెరవెనక కారణాలేమిటో చాలామందికి తెలియవు. కాంగ్రెసు సర్వాధికారుల దురహంకారమే దీనికి కారణమని చాలామందికి తట్టినా, అసలు తెరవెనక జరిగిన భాగోతం అంతా మొన్న మే ౧౦ వ తేదీని డాక్టరు పట్టాభిచేసిన ప్రకటనవల్ల బట్టబయలయింది!

ఈ ప్రకటన అనేక కారణాలవల్ల చాలా ముఖ్యమైనది. ముఖ్యంగా ప్రకాశం మంత్రివర్గం రాజీనామాకు, ఆంధ్రులలో కొంతమందిచేసిన గూడుపుఠాణీలకు, కారణాలేవో దీనివల్ల స్పష్టపడుతున్నాయి. కాని డాక్టరు పట్టాభి అనుకున్న ఫలితంమాత్రం దీనివల్ల శూన్యమైంది. డాక్టరు పట్టాభి తాము కేవలము నిర్దోషులమనీ, పదవీ వ్యామోహానికి చాలా దూరంగా ఉన్నామనీ నిరూపించదలుచుకున్నారు. కాని, దానికి వ్యతిరేకంగా తామూ ప్రధాన మంత్రిపదవికోసం చాలా ఇదై అనేకవిధాల ప్రయత్నించినట్టూ, చివరికి 'ద్రాక్షపళ్ళ వైరాగ్యం' అవలంబించినట్టూ చక్కగా ధ్వనిస్తూంది. ఈ విషయంలో ఎవరెవరు ఎన్నెన్ని గూడుపుఠాణీలు ఎలాగెలాగ లేవదీశారో అవన్నీ శ్రీ ప్రకాశంగారు సహేతుకంగా తగినన్ని వ్రాతసాక్ష్యాలతోకూడా తమ 'జీవితయాత్ర' ద్వితీయ సంపుటంలో ప్రకటించబోతున్నారని తెలుస్తుంది. ఆంధ్రులందరు అచిరకాలంలో అవి న్యాయంగా పరిశీలించి న్యాయాన్యాయాలు తేల్చుకోగలరు.

డాక్టరు పట్టాభి ప్రకటనలో శ్రీ ప్రకాశంగారికి ప్రజలు సభక్తికంగా సమర్పించిన నిధినిగూర్చిన ప్రసక్తి కనిపిస్తూంది. ఈ నిధి ఇచ్చిన

దాతలు కాంగ్రెసు సర్వాధికారులకు ఈ నిధి కేవలము శ్రీ ప్రకాశంగారికి వ్యక్తిగతంగా ఇచ్చిందేకాని దీనితో కాంగ్రెసుకు ఏమాత్రము ప్రసక్తి లేదని చాలాకాలంకిందటనే తెలియజేసినట్లు తెలియవస్తూంది. అయినా కాంగ్రెసు అధికారులు ఈ అభిప్రాయంతో ఏకీభవించలేదు. శ్రీ ప్రకాశం గారు కాంగ్రెసు అధికారుల అభిప్రాయం ప్రకారం నడుచుకోవడానికి సమ్మతించినా వారికి అది సమ్మతంకాలేదు. అదీ అధికారప్రమత్తత అంటే! ఈ విషయంలో కాంగ్రెసు ఈ నిధులని గురించి ఎంతతక్కువ చర్చిస్తే అంత మంచిదని మా సలహా! కాంగ్రెసు హైకమాండు అభిషేకించదలుచుకున్న రాజాజీని మదరాసు ఎసెంబ్లీ సుతరామూ అంగీకరించనంది! ఇక్కడ కాంగ్రెసు సర్వాధికారులను కొన్ని ప్రశ్నలు అడగవలిసి ఉంది! కాంగ్రెసు ప్రజాస్వామ్య పద్ధతులమీద నడిచే సంస్థేనా? అయితే మద్రాసు శాసన సభ్యుల ప్రాథమిక ప్రజాస్వామ్యపు హక్కులు ఏమైనట్లు? ఈ శాసన సభ్యులంతా తమ నాయకుణ్ణికూడా ఎన్నుకోడానికి అర్హతలేని యుక్తాయుక్త జ్ఞానశూన్యులేనా? అయితే అల్లాంటి అన్యాయ్యులని ఈ హైకమాండు శాసన సభలకు అభ్యర్థులుగా ఎందుకు నిలబెట్టింది? ఇదంతా రాష్ట్రంలోని ప్రజలను ప్రజాస్వామ్య నాటకంతో మోసగించడం కాదా?

డాక్టరు పట్టాభి ప్రకటనలో ఇంకొక చిత్రమయిన విషయం ఉంది. రాజగోపాలాచార్యులుగారిని మద్రాసు శాసనసభా సభ్యులు తిరస్కరించిన తరవాత—ప్రకాశంగారి మాట అల్లాగ ఉండనిద్దాము—అధమపక్షం పట్టాభి గారినైనా నాయకుడుగా కాంగ్రెసు హైకమాండు సూచించవలిసింది. అలా జరక్కపోవడానికి కారణం తెలియదు. పాపం! డాక్టరు పటాభి గాంధీజీతో విన్నవించినట్లు వారు ౩౧ సంవత్సరాలపాటు ఎ. ఐ. సి. సి. లో ఉన్నారు! ఇంచుమించుగా ౧౭ సంవత్సరాలు వర్కింగు కమిటీలో సభ్యులుగా ఉన్నారు. వైశ్యసూత్రకారులైన మహాత్ములకు బ్రాహ్మణభాష్యకారులని పేరు పడ్డారు! సత్యాహింసలు సంపూర్ణంగా అవగాహన చేసుకుని ఆచరణలో పెట్టిన ధీరులు! అల్లాంటి వారిని అధమపక్షం రాజగోపాలాచార్యులుగారి నాయకత్వం తిరస్కృతమైన తర్వాతనైనా హైకమాండు సూచిస్తే

## కాంగ్రెసు నఖశిఖ పర్యంతమూ కుళ్ళింది!

కాంగ్రెసు నాయకత్వంలో యుక్తాయుక్తజ్ఞానం పూర్తిగా నశించినట్లు కని పిస్తూంది. వీరిలో ఇప్పుడు తమ మాట నెగ్గించుకోవాలన్న అహంభావము, అధికారమత్తత తప్ప మరేవీ కనిపించడంలేదు.

డాక్టరు పట్టాభి అన్నట్లు ఈ వ్యవహారాలేవీ వర్కింగుకమిటీ పర్యవేక్షణ కిందకి వెళ్ళినట్లే కనబడదు. కేవలం ఇద్దరు ముగ్గురు వ్యక్తులు వ్యవహారాలన్నీ నిర్ణయించివేసినట్లు కనిపిస్తుంది. కొన్నికోట్లమందికి సంబంధించిన వ్యవహారాలు ఇంత గుడ్డిదర్బారుగా ఒకసంస్థ నిర్వహిస్తూండడము చాలా సిగ్గుచేటు! అందులోను పావలాసభ్యులుకూడా కాని మహాత్ముల నియంతృత్వపద్ధతి మరీ గర్హ్యంగా ఉన్నదని వ్రాయడానికి చాలా కించ పడుతున్నాము!

ఆ ఉన్న ఇద్దరు ముగ్గురు వ్యక్తులలోనుకూడా సంపూర్ణంగా ఏకాభిప్రాయం ఉన్నట్లు కనబడదు. ఒకరు ఏటికిలాగితే ఇంకొకరు కోటికి లాగారు. చివరికి మద్రాసురాష్ట్రం మంత్రివర్గ నిర్మాణంలో హైకమాండు ఆవగింజంతైనా శ్రద్ధపట్టి వ్యవహరించినట్లు కనబడదు! డాక్టరు పట్టాభి అన్నట్లు పటాలానా, పటేలు తమలోతమరు వంతులుపోయి, చివరికి మద రాసు రావడంకూడా మానివేశారు. ఈ విషయంలో ఇంకా ఈ సంచికలో శ్రీ ప్రకాశంగారి లేఖ పరిశీలిస్తే చాలావింతలు బయలుపడతాయి! ఈ విధము యిన గుడ్డిదర్బారుకి ఫలితము! అది అందరికీ తెలిసిందే! దాన్నిగురించి ప్రత్యేకంగా వ్రాయవలసిన అవసరంలేదు! హైకమాండు మనస్తత్త్వం ఎరిగిన అధికారపూరితులు తమ స్వార్థపూరణంకోసం గాని, హైకమాండు అనుగ్రహం సంపాదించడంకోసంగాని ప్రకాశం మంత్రివర్గ పతనానికి ప్రయ త్నించడంలో విడ్డూర మేమీలేదు. దానివల్ల హైకమాండులో అధికార మత్తులు తమపంతం నెగ్గిందని సంతోషించి ఉండవచ్చును! దానికి ఫలితం! ఈవేళ కాంగ్రెసు మంత్రులు పోలీసుల సహాయంలేనిదే కాలుకదపడానికి కూడా జంకుతున్నారు. ఎవరైనా దండలమీద ముచ్చటకొద్దీ ధైర్యంచేసి ఇవతలికివస్తే 'దండ' ప్రహారణాలు జరుగుతున్నాయి! ఇదీ ఈవేళ పరిస్థితి! ఈ సమస్యమీదనే మళ్ళీ ఎన్నికలుజరిగితే ఈ మంత్రివర్గంలోని ఆంధ్ర మంత్రులు, ఆంధ్రశాసనసభ్యులు చాలామంది ఓడిపోతారని నిస్సందేహంగా చెప్పవచ్చును! దానికి వారు సిద్ధపడతారా?

అయినా ఈపరిస్థితుల్లో మేము కాంగ్రెసు సర్వాధికారులకే ఎక్కువ జవాబుదారీ ఉన్నదని అంటున్నాము. వారు కేవలం అహంభావం విడిచి, ఇప్పటికైనా ప్రజాస్వామ్య పద్ధతులు అవలంబించవలసి ఉంటుందని హెచ్చరిస్తున్నాము!

ఈవిషయంలో ఆంధ్రులందరికీ గూడా ఒక విషయం విన్నవించవలసిఉంది. ఇప్పటికయినా ఆంధ్రులు మేలుకుని, ఆంధ్రజాతి, దేశము, ఒకటి ఉన్నదనీ, మనం కేవలము ఔత్తరాహులకు తొత్తులుగా మారిపోకుండా ఉండాలనీ అనుకుంటే—మన వ్యక్తిత్వం నిలబెట్టుకోవలిసిన అవసరం ఎంతైనాఉంది. డాక్టరు పట్టాభిగారి ప్రకటనవల్ల ఔత్తరాహులు మద్రాసు ప్రాంతీయులయెడల చూపిస్తూన్న దురహంకార పద్ధతులకు చక్కని ఉదాహరణ లభిస్తుంది. దీనివల్ల ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రం సంపాదించుకోకపోతే ఔత్తరాహులకు దాసులుగా మారే పరిస్థితులు ఏర్పడవచ్చునని కూడా అనిపిస్తోంది. అవసరమైతే మనం భారతసమాఖ్యలోంచి విడిపోయే స్వాతంత్ర్యంకూడా సంపాదించుకుంటేతప్ప మనకి మోక్షంలేదు! ఇప్పటికైనా ఆంధ్రులు పరులపంచల్లో జేరి స్తోత్రపాఠాలుచేస్తూ తమలో తాము కలహించుకోవడంకంటె చేతులుకలుపుకుని సత్వరాంధ్ర రాష్ట్రసిద్ధికి ప్రయత్నిస్తారా! లేకపోతే ఔత్తరాహుల పాదప్రహారణాలకు తలలొగ్గుతూ 'దాసోహం' అంటూంటారా?

పి. గణపతిశాస్త్రి.

# వసంతము

## మలయానిలుఁడు — పుష్పములు

నీవెవ్వరోహో! — నేవకుళమునోయ్
నీవెవ్వరోహో! — నే మాలతినోయ్
మీరందరు మరి యెవరెవరోహో!
మేమా! మామిడి మొగ్గలమోయి!
నీవెవరు పూవా! నే కింశుకము నోయి!
నీవెవరు పూవా! నే చంకపము నోయి!
మీరంద రెవ్వరే మిసిమి పూలారా!
మేమందరము నా శిరీషముల మోయి!

## మలయానిలుడు

మరచిపోయితిని గిరుల మరులుగొని
విరులజేరి సరసమ్ము లాడగా!
వసంతకుసుమ లతాంగులు మెచ్చగ
వని విహరింపగ వలపు జనించెడి!
నా హృదయం బారసాలవనమున
నవపర్ణంబుల నవకము కలరెడి!
తరుణ కుసుమముల తలచినంతనే
తల్లడిల్లు నామది పరవశమై!

## రసాలము

ఓ మలయమారుతమ! ఓ చైత్రమిత్రమా!
ఉయ్యాల లూపగా రావేల నోయి!
సయ్యాట లాడగా రావేల నోయి!
నవపర్ణముల మేను నానతో పులకింప,
నవకముగ పులకింప రావేల నోయి!
నవ్వు వెలయింపంగ రావేల నోయి!
నే నొక రసాలమును; నెనరు పులకలతోడ,
నీవు వచ్చెడి త్రోవ నిలిచియున్నానోయి!
నీరాక యిప్పుడే నిక్కివిన్నానోయి!
నాశాఖలను జేరి నా హృదయ ముప్పొంగ,
నవగీతికలు పాడ రావేల నోయి!
నామనసు మురియంగ రావేల నోయి!

## తరుణి

అందాలు చిందు నీ యారామ శోభలో
అనుగు విరికన్నెనై యవతరించితినేని,
నయగారి నడలతో రాడా! — ననుజూచి
ననువుతో నుబ్బిపోడా!
చిగురు జొంపము చీర చెంగలింపగ దాల్చి
సొగసు పొదరింట వగలాడినై సోలంగ,
వలపు తెలియగ నేరడా! — ననుజేరి
పొలయల్క దీర్చిపోడా!
తేటిజవరాలు ఝుమ్మించు శ్రుతినేయంగ,
తేనె లూరంగ కోయిల కన్నె పాడంగ,
నాట్యాలు సలుపరాడా! — నను జేరి
నర్మి తెరిగించి పోడా!
విరిచెలులు చాటుగా విరుగబడి నవ్వంగ,
చిరుసిగ్గుతో తీవజోల నే నొదుగంగ
నా సరస నూగ రాడా! — నా ప్రియుడు
ననుప్రేమ దేల్చిపోడా!

# వసంతము

## తరుణుడు

పరిమళంబుతో పరవశమందిన
తరుణుల తలపులు చిగురొత్తంగా,
వదనముపై నీలాలకరేఖలు
చెదరి విలాసము రేకెత్తంగా,
కటాక్షశోభలు కళకళలాడగ
మిటారి నవ్వులు మిసమిసలాడగ
తరుణాయిత లావణ్య జీధితులు
తరంగాయితములై మురిపింపగ,
కులుకునడల వలపుల గిలిగింతలు
మలగొన రమ్మా, మలయానిలమా!
కుసుమశరుం డదె కొమరు కోరికల
కూకరించె నిను కోయిల కూవుల!

శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి



# నవ భారతి

ప్రకృతి నిత్యవసంతాన పరవశమూ నృత్యశాల
పురుషు డనంతుడ జేయుడు విశ్రమించు పాంథశాల—
స్మిత భారతవదనం కాశ్మీర సీమ గతచరితం!
ఆనందాశ్రు స్రవంతుల నభిషేకించు హిమాంశుడు,

ఛాయా హస్తములు సాచి సాగిలపడు హిమవంతుడు —
కుసుమాలంకృత శిరముల కౌగిట ముద్దిడు నాథులు
తారలు వెలుగు సరస్సుల తనివిని మూర్కొను తరువులు!
ఒక మధురోహాగ, కథగా
దేశదేశ జనవందిత దివ్యమూర్తి కాశ్మీరం!

నాటి చిత్రస్వప్నం ఏనాడో చితికెక్కింది—
నేటి ప్రకృతివధ్యశాల, నేటి నరులు బలిపశువులు
శవాలు కావాలంటే వాయువు నమ్మేదారలే.

అణా కొక్క పోరుని తెగనమ్మి ఒక శతాబ్దమయ్యె
నేల, నీరు, నింగికూడ నాదే నన్నాడు రాజు
ఇంటికి, వంటికి, మంటికి ప్రత్యణువున పన్నుముద్ర!
ఊడ్చుకుపోయిన వన్నీ: ఆస్తులు, ఆశలు, అసువులు

పొయిలో నాగలి మండెను, బొందిలో ప్రాణాలు మండె
క్షామభూత వికృతపదము రెండు టాకులెగసి కమ్మె,
ఈడ్చికొట్టె చలిగాడ్పులు, మంచు తుపానెత్తి వచ్చె
తన ఎముకలు తనే నమలి నరశరీర మల్లాడెను

ప్రాణపూర్ణ నరహృదయము చీలి చివికి శిథిలమయ్యె
కరువుచెరిచి, బ్రతుకవెరిచి కటకటబడు కంకాళాల్
వీధులబడి దుస్స్వప్నపు నీడలవలె తడబడుతూ
సాగిరి ముందుకు ముందుకు......!

కాని దూరదూరంగా కనులుచెదురు దృశ్యంగా
ఎవరివో ఉద్యానవనా

ఎవరివో మణిమందిరాలు!
అన్న మన్న మను కేకతో అనదలు, శిశువులు, ఆర్తులు

మృతదేహాపు నిశ్శబ్దపు నాళములౌనడి వీథుల
జాగిలముల నాలుకలై సాగిరి ముందుకు ముందుకు!
మేఘ ఛత్రశాలలో నవోఢలైన ఫలవృక్షాల్
విరుగబడే వరివెన్నులు 'రా రండ'ని చేతులెత్తె!

ఆరగించమని పంటలు ఆహ్వానిస్తున్నాయి
అన్నా తురుతా పౌరులు ఆవురు మంటున్నారు—
మరఫిరంగి నీడలెవో
మధ్య వాలి భయపెట్టెను!

ప్రకృతి కాంతయాపంటకు, పురుషమూర్తియా ప్రజలకు
కరకు కత్తు లెవో మధ్య
'కంచుగోడ' నిలబెట్టెను!
నుదురు నెఱియలైన ప్రజలు నోరూరిన నీళ్ళు నమలి
పిడికిళ్ళు బిగించి;
చూచి,
పెదవులు బిగించి ఏడ్చిరి!
రాత్రి కాటుక బరిణె—

భటులు మిడుతల దండు
ప్రజలు జలజల రాలిపడు పండుగింజలు!
అరుచు భూ మాతనే
చెరుచు రాక్షసియౌచు

కాలమెన్నాళ్ళు దుర్గతిని సాగిందో...
తొలికోడి కూసింది,
కులికింది తూర్పు
జగతి జనదీక్ష వజ్రాయుధమ్మై లేచె,

## నవ భారతి

కణ కణం కాశ్మీర క్రాంతికీలలు పలికె!
"ఆపండిక! ఆపండి!
మా బ్రతుకులు పావులుగా మీరాడిన చదరంగం
ఆపండిక! ఆపండి!"

"ఖాదిర్ కోసం వస్తే కాల్చి నేల కూల్చారా
జోసి, అజిజ్, జైనాజ్ లేచా రాజ్ఞాపించా
రాపండిక! ఆపండి!"

"ముందువెనుక సరిహద్దులు రష్యా, భారతభూములు
అచట జీవశక్తి రగిలి ప్రతినాళం ప్రచలిస్తే
ఇచట అహర్నిశలు దరిద్రాంధకార మూర్ఛితులే;
అచట ప్రాణనృత్యోత్సవచైతన్యం, సంగీతం
కొత్త సమాధులకిట ఒకబెత్తెడైన చోటులేదు"

"నడవండిక! నడవండి!
జీవన్మరణాల మధ్య చెరసాలే మిగిలిందా
షేర్-ఇ-కాశ్మీర్ పిలుపున చితిపేర్చాలి ప్రభుతకు
నడవండిక! నడవండి!"

కోటమీది బావుటాకు గుంపులు గద్దలు మూగెను
కోటమూల రాజుగుండె గుడ్లగూబలా మూల్గెను
షేర్-ఇ-కాశ్మీర్‌ను పట్టి పిడికిటనొక్కెను పిశాచి
కాని, కటకటాలనుండి

గర్జించిం దాసింహం!
కంపించెను కిరీటాలు,
కదిలెను జనసమూహాలు
మసీదులో మహాసభలో నేల యీనినట్లు ప్రజలు!

"ఉసురుపోసి వానిపంట లూడ్చిన మనమేగదా
కసవుపోగులా నేడిటు కాలిన మనమేగదా,"

# ఆంధ్ర శిల్పి

"చిరకాలం సేద్యంలో చివికి శిథిలమౌ నాగలి
నవపతాకపై నాగలి
దుష్టుల కంకరగుండెలు దున్నండిక దున్నండి!"
"నేలంతా గిరులుగీసి నిర్దయ చీల్చారుగాని
నిరవధిక ప్రజాసముద్ర మెవరే బంధించగలరు?"
హఠాచ్ఛబ్ద మొకటి గుండెలవియ భూమి కంపించెను
అసదుల్లా బాలుని హాహాకారం విన్పించెను
పిశాచాలకోరల్లా, పిడుగుల జడివానలాగ
పై విరుచుకుపడి సైనికపటాలాలు, ఫిరంగులు...
దిక్కులకెగజిమ్ము రక్తతేజ మెసగె చరమ సంధ్య;
నెత్తురు గుడ్డు గడాయని ఒడిలో కెత్తినవో యన

రక్త సిక్త భూమి ధవళహిమలోయల ప్రతిఫలించె:
కాంతి హీనవదనంలా కమ్మెను చీకటిరాత్రి
మృత వీరులనేత్రాలై చుక్కలు మిరుమిట్లు గొలిపె!
నిర్భయ గంభీర వేది నిలిచిందా ప్రజాకోటి!
జీవన్మరణాల వృథాచింత పొగులు ప్రకృతిలా;
పసిపాప.లమాయకులై భయపడి ఆక్రందిస్తే;
పగిలిన మసీదుగోడల బహు సహస్రరంధ్రాలై
దేవుని నేత్రాలు వెలిగి తిరుగుబాటు బోధిస్తే—

పలికింది ప్రజాకంఠం
పగవలె, యుగధర్మంవలె!
"ఈ బాపుటానీడ—
ఎక్కడిదిరా శాంతి?
ఈ ఫిరంగుల మోత—
ఎక్కడిదిరా శాంతి?
నడవండిక! నడవండి!
"పిశాచాలకెరవై మాభారతి కాకలివై

# నవ భారతి

ఎన్నిశతాబ్దాలీగతి ఇనుపగుండ్లు మింగిందో
గడ్డిపోచ ఎదిగి వాడి కత్తులమొనలై సాగెను
నడవండిక! నడవండి!
"పొలిమేరలు, పుంతగట్లు కొలిచే బానిసలారా!

పాలికాపు, పాకివాడు, పనిచేసీ తిననివాళ్ళు!
నడవండిక! నడవండి!"—
"కత్తులబోను పగిల్చిన కాశ్మీరం వచ్చిన
ఓ భారతప్రజానేతా! పండితుడా!
వందనాలు!
ఇస్లామాబాద్, భద్గాం హింసలో బలి నైతిమయ్యా,
చిత్రవధలో చితికెను మా సిల్కు పాక్టరీ వర్కర్;
పచ్చని భూములపై నులివెచ్చని నెత్తురు లోడ్చక
తెలుపునలుపుగీతలతో గెలిచిందే జాతి? చెప్పు!

పోరితెగిన వీరతనువు పొమ్మందయ్యా ముందుకు
చెరచబడిన వనితశవం అరిచిందయ్యా పొమ్మని"—
"నడవండిక! నడవండి!
బిడ్డ పాలకొరకు తనువు భిక్షాపాత్రయిన తల్లి

భావి మహోన్నతికి ప్రాణ బలిదానం చేయుతండ్రి
ప్రగతిజగతిబీజాలై పకపకనవ్వే శిశువులు
కదిలి కదిలి గతంవదిలి
కవిసిరి ముందుకు ముందుకు!

రణ తోరణమై కన్నులు రాజిరగులు తున్నాయి
రణశంఖాలీవదనాల్, రథచక్రాలీ పాదాల్
రణకవచాలీవక్షాల్, అరుణపతాకలు దేహాల్
కదిలి కదిలి గతంవదిలి
కవిసిరి ముందుకు ముందుకు!

దేశదేశ జనహర్షిత దీక్షాశక్తి లభించెను,
గుడిగంటలు కంపించెను, జడివానలు క్రమ్మరించె
జూలు విదల్చెనువృక్షాల్, గర్జించెను మేఘశ్రేణి
సలసలకాగె సరస్సులు, చలించె తారాపథాలు

హిమగర్భాలుడికి క్రిందికురికె జలప్రళయంలా
కదిలి కదిలి గతంవదిలి
కవిసిరి ముందుకు ముందుకు!
పురాఋషి బృందసామగాన ప్రతిశ్రుతులూగే
పుణ్యహిమాలయలోయల పొర్లెను క్రోధాగ్నిజ్వాల
కదిలి కదిలి గతంవదిలి
కవిసిరి ముందుకు ముందుకు —
ఆర్తులనాథులశాంతులు శతసహస్రసైనికులై
కదిలి కదిలి వచ్చి చుట్టుముట్టి రదే —
అదేకోట!
కేతనములచేతులెత్తి నృత్యమాడు పెనుభూతం
బాష్పవాయునిశ్వాసం, పెనుకోరల తుపాకులు
మెరుములురుములై పైపై కురికె జనుల నాహుతిగొన
పాడింది ప్రజాకంఠం
పగవలె, యుగధర్మంవలె!
''ఇదే బాస్టిలీ ఇదే!
ఏదీ పారీకమ్యూన్?
ఎదిరించండయ్యా ఓ గతులాగిన పతితులార!
''పడివున్నామయ్యా మా
పురుషులపట్టి వధిస్తే
వనితను రక్షించలేని జాతికిమిగులు సమాధి!
' ఇదే తుదివిషాద గీత

# నవ భారతి

ఇదే తొలి నిషాద గీత
ఎక్కడ కూడూగుడ్డా ఎండమావు లౌతాయో
అక్కడ సృజనాశక్తికి హారతియౌతుంది జగతి!
‘‘అప్పు డివి పింగాణీకళ్ళు

ఇపుడు మరఫిరంగిగుండ్లు!
దూదిపింజ లీహాస్త్రాల్
ఎత్తిన వజ్రాయుధాలు!
ఆవరించరండి ఒహో! ఆక్రమించరండి ఒహో!’’

ఆర్తుల నాథు లశాంతులు శతసహస్ర సైనికులై
యువకులుచితజ్ఞానులైరి, వృద్ధులు యువవీరులైరి
బరిసెలు, బల్లెములు పార లెత్తిన లక్షలచేతులు
పగతో పైపై కెగబడు పర్వతశ్రేణులు ప్రజలు!

నాడు జనస్వేదంలో నానిన స్మృతి తెలిసిందో
కోటగోడ చలువరాళ్లు ఫెళఫెళ క్రిందికి రాలెను,
రాళ్ళద్దిన అడుసున జనరక్తం భగభగమండెను,
సింహపీఠిపునాదిలో చిరనిద్రాముద్రితులౌ

అసంఖ్యాక మానవాస్థికలు మేల్కొని పెకలించెను.
అగ్నినాల్క లాక్రమించె, ఆవరించె నాకాశం!
కదలండిక! కదలండి!
కోప దగ్ధమైనచోట ధూమమెగయు, ధూళిలేచు,

చిరనరకవ్యథా జీవితశేషం చిరుపొగతీగలు
సాగి, నిముసమూగి, పూర్వస్వప్నగాథలాహరించు!
నడవండిక! నడవండి!
బుద్ధుని చిరస్వప్నంకై, జీసస్ స్వర్గంకోసం

నరజాతిప్రగతికోసం,
నాకోసం,

# ఆంధ్రశిల్పి

ప్రళయరుద్రు త్రినేత్రమై, మతప్రవక్తఖడ్గంలా
చావుబ్రతుకు లధిగమించి సాగే నరచరిత్రలా

నడవండిక! నడవండి!
భావిశిశు ప్రసవక్షణం
చీలిన మృదుకాలంలా సాగిందీ ఉదయసంధ్య!
చేపిన మాతృస్తనమై పొంగిందీ భరతభూమి!

ఓం శాంతిః శాంతిః శాంతిః.

శ్రీ అనిశెట్టి సుబ్బారావు





చలికాలం

శ్రీ మనీషిదే

# వినోదము

## శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు

౧

సాయంకాలమయినది, దీపముల నింకను వెలిగింప లేదు. సముద్రపుటొడ్డున, ఇసుకలో, ఏదో ఆలోచనా ప్రవాహంలో మునిగినట్లు, తలవంచుకుని చౌదరి ఒంటరిగా మైలాపూరు వైపు నడచిపోవుచున్నాడు—క్వీన్ మేరీసు కాలేజి సమీపించినాడు. ఒకసారి అతడపుడు అప్రయత్నముగ, తలయెత్తి, కలయజూచినాడు. ఆకస్మికంగా, దృశ్య మొక్కటి అతని దృష్టిని ఆకర్షించింది. తటాలున ఆగి, ఒకసారి ఆ వైపు అతడు దృష్టిని సారించి,—పరికించినాడు. ఒక యువకుడు, ఒక జవరాలు—విలాసముగ నడుచుచు,ఒకరిపై నొకరు వాలుచూపులు విసరికొనుచు చిరునగవులు తీగెలు సాగించుకొనుచు,-మధ్యమధ్య చేయి చేయియు కలుపుకొనుచు,—మధురాలాపముల నాడుకొనుచు—తన్మయులై—తనకెదురుగా వచ్చుచుండుట—చౌదరి చూచినాడు. మోహాతిరేకమున ప్రవర్తించుచున్న ఆ మిధునమును గాంచి, చౌదరి ఆశ్చర్యములో, వారికెదురై,

"ఏంరోయి—అంకినీడు...నిన్నే!...ఎప్పుడు వచ్చావు మద్రాసు?" అని పలకరించినాడు. చౌదరి మాటలా జంటకు వినిపించలేదు. అపుడు గట్టిగా, చౌదరి—

"ఒరే—అంకినీడు! నిన్నే పిలవడం! ఎన్నాళ్ళయింది వచ్చి మద్రాసు?" అని, మళ్ళీ పలకరించినాడు.

చౌదరి మాటలు ఈటెములవలె చెవినిబడి-తన్మయులైయున్న ఆ మిధునమును, త్రుళ్ళిపడజేసెను. అంకినీడు చౌదరిని చూచి ఒక్కింత వెల్లబాఱెను. అతని చెంత నేయున్న యువతి, ఇంచుక చకితయై, పయ్యెద సవరించుకొనెను. పిమ్మట చౌదరి వంక తిరిగి మందహాసంచేసి, మొగము అవతలవైపుకు త్రిప్పుకొనెను.

అంకినీడు, చౌదరిని చాలాకాలమునుండి యెఱుగును. అతని మేనమామల యూరే చౌదరిదికూడ. చౌదరి వంటి చిరపరిచితులు కన కెవరయిన కనిపించగలరని అంకినీడు లేశము ననుమానించలేదు. అదిగాక అతడు విలాసముగా సంచారముచేయుటకు మైలాపూరు సముద్రపుటొడ్డును అందులకే ఎంచుకొన్నాడు. చౌదరిని, ఒక యాభయిగజముల దూరములో చూచియుండినచో, అక్కడనుండియే అంకినీడు తన ప్రక్కనున్న జవరాలిని బలవంతముగా, కంటికి కనబడకుండా, దూరముగా ఈడ్చుకొనిపోయి, అంతర్ధానమయేవాడు. ఇదేవిధముగా, చౌదరి యెదురగుట, అంకినేనికి సంకటమయ్యెను. తనరహస్యమేదో బయట పడినట్లు-తానేదో తప్పుపని చేసినట్లు, ఒకవిధమైన వెఱపు, చలివలె అంకినేనికి శరీరముమీదికి ప్రాకెను. గుండె లోనికి చొచ్చుకొనిపోయెను. ఒక్క ముహూర్తమునేపు ఆతనిగుండె కొట్టుకొనుటమానింది. నోట తడికూడ ఆరిపోయెను. తానుచేసిన దోషము నలుగిరికి-అందులో ముఖ్యముగా తన్నెరిగినవారికి తెలిసినపుడు-మానవుడు పడే విన్నబాటు, చూచే వారికి నిజంగాజాలిపుట్టించగలదు. అపుడట్లేయున్నది అంకినేని దుస్థితి. కాని కొంత తెప్పరిల్లి, లేని యుత్సాహమును దెచ్చుకొని, అంకినీడు, చెంతనున్న

చేడియకుముందు నిలువబడి, యేమియు ఎఱుగని వాని వలె, "నిన్న ఉదయం వచ్చాను" అని జవాబిచ్చెను.

"నాతో అబద్ధమాడుతున్నావు! బలరామయ్య చెప్పినాడు-నిన్నటికి నాలుగురోజులయిందటగా-నీవు మద్రాసు వచ్చి?...కమలనయన విలాస్ హోటల్లో రెండుగదులు ప్రత్యేకముగ తీసికొని ఉన్నావటగా?"

అంకినీడు జవాబు చెప్పేలోగా, చౌదరి మరల అందుకుని, గ్రుక్క త్రిప్పుకొనకుండా.

"అయితే-నీవు-బలరామయ్య నిన్న-నిన్న సాయంకాలము 'రంగదామ్' థియేటరువద్ద కలుసుకొని చాల సేపు మాట్లాడినాడటగా?" అని ప్రశ్నించినాడు.

జవాబు ఏమియు చెప్పలేక, అంకినీడు తబ్బిబ్బై ఊరుకున్నాడు-అతడు వైవర్ణ్యమునొందుట పరికించి, చౌదరి తన ధోరణి మార్చినాడు. సానుభూతి ప్రకటిస్తూఉన్నట్లుగా సాధు కంఠధ్వనితో.

"ఇంటివద్ద, మీ మామయ్య వగైరాలు అందరు కుశలంగా ఉన్నారా?...ఎన్నాళ్ళు పట్ణమకాం? ఈ వూరువస్తే, మనవైపువారికి ఓ పట్టాన్ని విడిచి ఇళ్ళ మనసురాదు" అని పరామర్శచేసినాడు-దానితో తెప్పరిల్లినట్లు తన చెంతనున్న చేడియవైపు అంకినీడు ఒకసారి దృష్టి సారించినాడు-కంఠం సవరించుకుంటూ, అతడు,

"ఆ! అందరు కులాసాగానే ఉన్నారు... నేను ...రెండుమూడు రోజులలో వెళ్ళిపోవాలనుకుంటున్నాను-వచ్చినపని ఇంకా పూర్తికాలేదు-అప్పుడే మామామయ్య ఉత్తరం వ్రాసినాడు-నిన్న వచ్చింది.

"కోతలు సమీపిస్తున్నాయి, తొందరగా రావలసినదని" అని సమాధాన మిచ్చినాడు.

ఆ మాటల నాలకించుచు, చౌదరి, అంకినేని చెంతనే నిలువబడి, పరాయత్త చిత్తతతో, సముద్రపు కెరటాలవైపు తెప్పవాల్పక చూచుచున్న తరుణిపై చూపు నిల్పియుండెను. అంకినీడది గమనించలేదు-"ఈమె ఎవరు? ఈమెపేరు? ఈ వూరేనాయీమెది?—ఎక్కడనుండి వెంటబెట్టుకొని వచ్చినావు" అని ఏమియు తెలియనట్లు చౌదరి ప్రశ్నలు కురిపించెను.

ఈ ప్రశ్నలు దొర్లివచ్చుచున్నప్పుడు, ఆ వాల్గంటి చూపొకటి మందహాసముతో కలిసి చౌదరి కంటిలో లీనమయ్యెను. దానిని గమనించలేదు అంకినీడు.

"ఈమె—ఈమెపేరు సునంద" అని నుడువుచు, అంకినీడా తరలాక్షి వంక దిరిగెను. "ఈమె క్వీన్ మేరీసు కాలేజీలో ఇంటరు-సెకండియరు-చదువుచున్నది-మా శివరామయ్య బావ మేనకోడలు. మొన్న శనివారం మధ్యాహ్నం మవుంటురోడ్డులో కిషన్ చంద్ చల్లారామ్ షాపువద్ద కనిపించింది. ఎన్నాళ్ళో అవడంచేత ఈమెను చూచి-చిరపరిచయం ఉండడంచేతను ఈ రోజున వాళ్ళింటికి వెళ్ళినాను-రమ్మంటే-ఒకసారి బీచికి షికారుగా వచ్చినాము-సరదాపడి" అని జవాబు ఇచ్చినాడు.

ఈ మాటలు అంకినేని నోట వెలువడుచున్నప్పుడు ఆ యువతి విలాసముతో ఒకసారి తలయెత్తి ఆతని వంక చూచింది. వెంటనే తలవాల్చి, కనొబ్బమలు ముడుచుకొని సముద్రామువైపు దృష్టి సారించింది. అంకినీడది గుర్తించలేదు—

"ఓహో! అలాగా! ఈమె పేరు సునందా!" పేరు నాకు తెలియదుగాని, ఈమెను ఒకటి రెండు సార్లు ఎక్కడనో చూచినట్లు గుర్తుగా ఉన్నది. కొంచెం పరిచయమయిన ముఖంలాగే ఉన్నది" అని చౌదరి ఆ విలాసివంక చూస్తూ అన్నాడు.

ఆ మాటలతో, కొంచెం వెఱపుదీఱి, అంకినీడు "అవును! మద్రాసులో కాపురముంటున్న వానికి, ఈమె ఒకటి రెండుసారులయినా కనబడిఉండడంలో

చింత లేదు, స్నేహంకూడాకలిసినా ఆశ్చర్యంకలగదు!'' అని సాభిప్రాయంగా సమాధానమిచ్చినాడు.

గిర్రున తిరిగిచూచింది ఆ సుందరి-ఆపైన అంకినీడు వంకచూచి,

"అంకినీడు! కొంచెం నాజూకుగా మాట్లాడుట ఎఱిగిఅయినా ఉండాలి, నేర్చుకొనియైనా ఉండాలి. దేశాటనంవల సంస్కారం కల్గిన నీవంటివాళ్ళు'' అని చురుక్కుమనునట్లుగా పలికింది.

"నీవు అలుగుటకు అవకాశమిందు ఏమీలేదు. సునందా! నర్మోక్తికే నీవు''అని అంకినీడు అంటూ ఉండగా, చౌదరి, ఆ మాటకు అడ్డమువచ్చి, ఒక వంక సునందను పరికించుచు, "అయితే-ముందు నీ కార్యక్రమమేమిటి? ఎప్పుడు నీ ప్రయాణం?'' అని అన్నాడు.

ఆ మాటలో నొక విపరీతార్థము స్ఫురించినట్లు చూచింది సునంద.

"రేపు సాయంకాలము వెళ్ళిపోదలచుకొన్నాను-కాని సునంద మేనత్త, రేపుండి యెల్లుండి వెళ్ళి పోదువుగాని, రేపురాత్రికి మా యింటి విందవై రావలసింది. అని బలవంతంచేస్తున్నది. అందుచేత రేపుండి, రంగధామ్‌లో కిస్మత్ చిత్రాన్నిచూచి, ఎల్లుండి, కావలసిన బజారు సామాన్లు అవీ కొనుక్కొని, సాయంకాలం పూరీ ప్యాసెంజరులో వెళ్ళి పోతాను రేపు కిస్మత్ చిత్రాన్ని చూడడానికి తానుకూడా నాతో వస్తానంటున్నది, సునంద—'' అని కండ్లు చికిలిస్తూ, సునందవైపుచూస్తూ జవాబిచ్చినాడు అంకినీడు.

"ఈయన చెప్పేదంతా నిజమని అనుకోకండి''అని నవ్వుతూ, సాహసించి ఎకసక్కెమాడిందిసునంద.

"స్వల్పవిషయాల సత్యాసత్యములగురించి విమర్శించుకొనడం స్నేహంలో ఉండే మాధుర్యాన్ని చెరుపుటకు కారణమవుతుంది'' అని చౌదరి సద్ది చెప్పినాడు—ఆ మాటకు ఒక దినుసు తీగె నవ్వు నవ్వింది సునంద! ఆ మందహాసంచూచి పులకితుడైనాడు అంకినీడు. వట్టి అమాయకునివలె కన్పట్టినాడు చౌదరి! వెంటనే అంకినీడప్పుడు, తన చూపు చౌదరివైపు త్రిప్పి.

"ఎన్నోపర్యాయములు నోటిదాకావచ్చి, అడగడం, మరచిపోతూఉండడం జరిగింది—అయితే. సుబ్బయ్యా ఏంచేస్తున్నావు ఈ పట్నంలో నీవు? ఊరికే మావంటివాళ్ళవలె, సోమరితనంగా, కాలం గడిపే స్వభావం కలవాడవు కావుగా నీవు?'' అని అడిగాడు.

"ఏమీ లేదు! ఈ వూళ్లో ఒక ఫిలింకంపెనీ ఉంది. "మందాకినీ ఫిలింస్'' అని. దానిలో ప్రొడక్షను మేనేజరుగా ఉంటున్నాను. నెలకు రు 250-లు జీతమిస్తున్నారు. వచ్చేనెలనుంచి, ఫిలిం కంపెనీకి మేనేజరు కాబోతున్నాను. జీతం రు. 500 లు ఇస్తారు!'' అని ప్రత్యుత్తరమిచ్చినాడు చౌదరి.

"అదృష్టవంతుడవు సుబ్బయ్యా నీవు!...'' అని అంకినీడు, ఇంకా ఏమేమో అనబోవుచుండగా, సునంద, మాటకు అడ్డువచ్చి, అంకినీడువైపు తిరిగి-చాలా ఆలస్యమయింది ఇప్పటికే—దీపాలు ముట్టించినారు. బాగా చీకటిపడింది. ఇంటికివెళ్లాలి'', అని అన్నది.

"అవును—మరచిపోయాను మాటలధోరణిలో. నిన్ను మీ యింటివద్ద దిగబెట్టి వెళ్లాలి కద్సూ!'' అని అందుకొన్నాడు అంకినీడు.

సునంద, ఆపలుకులకు సమాధానము చెప్పుటకిష్టము లేనట్లు,—రెండు మూడు గజముల దూరము నడచిపోయి, వాళ్లకను

కుంటూ నిలువబడింది.

"క్వీను మేరీసు కాలేజీలో చదువుకునే పొరుగూరి పిల్లలు హాస్టలులో నివసించాలని నిర్బంధములేదు? ఈమె హాస్టలులో ఉండడంలేదా? ఇల్లు అని అంటున్నావేమిటి—అంకినీడు?" అని ఆశ్చర్యం ప్రకటించినాడు చౌదరి.

ఆ మాటకు, అందుకొని అంకినీడు,

"మొదట్లో, సునంద వుమన్సు హాస్టలులోనే ఉండేది కాని అక్కడ భోజనం అది సదుపాయంగా వుండక పోవడంచేత, వాళ్ళమామయ్యకువ్రాసి, మేనత్తను రప్పించుకొని, వేరే ఒక ఇల్లుతీసుకొని—రాయపేటలో కాపురముంటున్నది." అని సమాధానం చెప్పినాడు.

సునంద ఏమీ మాటలాడలేదు. అక్కడ మరియొక క్షణంకూడా ఉండుట కిష్టములేనట్లు మాత్రం దగ్గడం ప్రారంభించి మనోభావం ప్రకటించింది.

"అలాగా!" అని అన్నాడు చౌదరి, ఏమియు తెలియనట్లు.

"ప్రొద్దుపోతున్నది, వెళ్లాలి—అలస్యమైంది ఇప్పటికే" అని అంటూ ముందుకు రెండడుగులు వేసి సాగినాడు అంకినీడు.

అక్కడనుండి కదలుటకు ఇష్టములేనివానివలె కనిపించినాడు చౌదరి.

"నమస్తే" అని అన్నది సునంద.

"నమస్తే" అని అన్నాడు అంకినీడు.

"సు-నం-దా!" "న-మ-స్తే" "మాకు పునర్దర్శన భాగ్యము ఎపుడు లభిస్తుందో" అని అన్నాడు చౌదరి.

"నమస్తే! అలాగే నేనుకూడా అభిలషిస్తున్నాను పునర్దర్శనము." అని అంటూ సునంద నాట్యంగా ముందడుగు వేసింది.

"అంకినీడూ" మళ్ళీ కనపడతావుగా? అని అన్నాడు చౌదరి,

"చెప్పలేను" అంటూ చీకటిలోనికి సునందను వెంట నిడుకొని నడచిపోయినాడు అంకినీడు.

౨

కమల నయనవిలాస్ హోటలులో, ఆ మరునాడు, రాత్రి ఎనిమిది గంటలకు అంకినీడు తనగదిలో సినీమాకు పోవుటకు సిద్ధమగుచున్నాడు - తొందర తొందరగా సింగారించుకుంటున్నాడు - వేషధారణము పూర్తిచేసికొని, పెట్టెలో - తాను క్రొత్తగా మోజుపడి కొనితెచ్చుకున్న గోయాసెంటును వాసన చూచి, పూసుకున్నాడు. కమనీయమైన సౌరభము తెమ్మెరలుగా నాసికాపుటములందు ప్రవేశించుచుండ, ఒక విధమయిన నిర్భరానందమును అనుభవించుచు నిలువుటద్దమున కెదురుగా నిలువబడి తన వేషమును పరికించుకొనుచుండెను - అంతలో గది తలుపు లెవ్వరో కొట్టినట్లయ్యెను.

వెంటనే, వెనుకకు దిరిగి, 'ఎవరు వారు' అని ప్రశ్నించి, మెల్లగా తలుపు దగ్గరకుబోయి, తెఱచినాడు.

భయవిహ్వలయైన తరుణి యొకతె, సుందరి, తటాలున లోపలకు, ఆతని దూసుకొని, ప్రవేశించెను. విస్మితుడైనాడు ఆమెను గురించి - అంకినీడు - "రక్షించండి, రక్షించండి - రక్షించాలి మీరు - నే నిపుడొక విపత్కరమైన స్థితిలోనున్నాను...... తెనుగువారని, మావైపువారని తెలుసుకొని శరణార్థినై వచ్చి, మిమ్ములను ఆశ్రయిస్తున్నాను." అని పలికింది ఆలేజవ్వని - తత్తరపాటుతో. కొన్ని క్షణములసేపు అంకినీడు, చైతన్య విహీనుడైయుండి, మాటలాడలేకపోయెను - స్తబ్ధుడై శిలాప్రతిమవలె నిలువబడి, ఆకర్షించుచున్న ఆ రమణి రూపురేఖా విలాసములను పరికించుచుండెను. అంత నా సుందరి "అయ్యా! మీకు పుణ్యం ఉంటుంది! ముందుగా,

ఆ తలుపువేసి గడియపెట్టండి ! నామాట—నామొ ఱాలకించండి —ఆ దుర్మార్గుడు - వాడు - వెంట తఱుముకొనివస్తున్నాడు - ఇంతలో ఇక్కడకు రాగలడు-వచ్చిపడేలోపల తలుపువేసి గడియ బిగించండి బాబు !" అని ఆక్రోశించెను.

అప్రయత్నంగా, అంకినీడు, ఆమె సౌందర్య సౌరభమును ఆఘ్రాణించుచూ, తలుపుమూసి, గట్టిగా గడియ బిగించినాడు - అతని వైఖరిని పరిశీలించుచున్న, ఆ జవరాలు మరల, దైన్యముట్టిపడునటుల, "అయ్యా! ఆ రాక్షసి ఇక్కడికికూడా నన్ను, వెదకుకుంటూ తఱుముకొని రాగలడు - నన్ను కాపాడాలి. నన్ను కాపాడాలి అతని బారినుండి ! ఈ ఒక్కపూట కాపాడితే, ఉదయం ఎక్స్‌ప్రెస్సులో మావూరు వెళ్ళిపోతాను-తెల్లవారకుండ వెళ్ళిపోతాను ఇక్కడ నుంచి - ఈరాత్రి మాత్రం నన్ను ఏలాగో కాపాడాలి - పుణ్యం కట్టుకోండి" అంటూ గద్గదికతో - మధ్యమధ్య కన్నీరు గార్చుచు, కొనగోటితో ఆ బాష్ప కణములను శృంగార ముట్టిపడునట్లు నాట్యముతో తుడుచుకొనుచు, శరణువేడెను. ముగ్ధుడై, ఆమెనే తిలకించుచున్న అంకినీడు, ఉద్రేకముతో-

"అమ్మాయీ ! నీ వెవ్వరో, నీ సంగతి ఏమో, నీ కిపుడు కలిగిన ఆపత్తుఎట్టిదో నాకేమీ తెలియదు. ముందు" - అని పలుకుచుండగా, ఆమె, అర్థోక్తిలో అందుకొని "ముందుగా నన్ను రక్షించి పుణ్యము కట్టుకోండి, మిమ్ముల నాశ్రయిస్తున్నాను. తరువాత నా కథంతా వివరంగా, సావధానంగా చెప్పకుంటాను" అని అన్నది.

మారుమాట చెప్పలేక, అంకినీడు, కొంత సాహసం వహించి -

"సరే! నీ వెవరయినను సరే!—నీకు వచ్చిన భయంలేదు ఏమీ ! నీవు ఇక్కడనే ఉండవచ్చును. - కాని యిపుడు నేను బయిటికి పోతున్నాను—" అని అన్నాడు.

ఆ చివరమాటలు చెవిని సోకినంతనే, త్రుళ్ళిపడి, ఆమె, "బాబోయి! మీరు నన్ను ఇక్కడ ఒంటరిగా విడచి వెళ్తారా ! - అదిగో వస్తున్నాడు. ఆ బూట్ల చప్పు డతనిదే - నన్నుకూడా మీవెంట తీసుకొని వెళ్ళండి, నేను ఈ రాత్రి మీతోనే ఉంటాను - లేకపోతే; అమ్మో -" అని భీతిని వెల్లడించుచూ, వేడుకొనెను.

అంకినీడు నిర్ఘాంతపోయినాడు. అతని నోటివెంట మరల మాట రాకుండగనే, ఆమె, "ఏమండీ! మాట్లాడరేమండి ! ఆ చప్పుడు అతనిదే! అతడు లోపలకు రాకముందె నేనాతని కంటబడకుండా, నన్ను ఎక్కడనైనా దాచండి. దాచండి, దాగుకొనడానికి తావు చూపించండి. బాబోయి - బాబోయి ! వస్తున్నాడండి" అని విహ్వలయై, భయముతో కంపించుచు, తలదాచుకొనుటకు, గోప్యమయిన స్థలము కొరకు గదినంతయూ కలయదిరిగి, చివరకు స్నానాల గదిలో ప్రవేశించి, తలుపు వైచుకొనెను.

భీతార్తయై, తత్తరపాటుతో గది నాల్గుమూలలు అటునిటు పరుగెత్తుటలో, ఆమె సిగలో సువాసనలు వెదజిమ్ముచున్న పుష్పగుచ్ఛము క్రింద జారిపోయెను. దాని నామె గుర్తించలేదు.

తన గదిలో రెండు మూడు నిమిషములనుండి జరుగుచున్నదానిని గురించి విమర్శించుకొనలేని స్థితిలో నుండెను - ఆ కథ నాటకమో, లేక నిజమో, అతనికి తెలియకపోయెను. ఒకింతసేపు, ఆజవ్వని కథంతా నిజమని తోచెను అతనికి. ఉత్తరక్షణమున ఆ జవ్వని దంతయూ నాటకము గావచ్చునని సంశయము కల్గెను - చివరకు ఆమె ఆక్రందనము, అశ్రువులు, భయకంపితగాత్రము,ఆమెవాక్కు - అన్నియూ

నిజముగా నామె ఆర్తయై, భీతచిత్తముతో తన్ను శరణు వేడినదని నిర్ణయించుకొనెను. తనాశ్రయించిన స్త్రీకి, అబలకు, శరణమిచ్చి కాపాడవలెనని, సంకల్పించుకొనెను. ఆతని మనసులో పరుగెత్తుచున్న ఆ విధమైన వితర్కభావములు ఆతని ముఖమందు స్పష్టముగా ప్రతిఫలించుచుండెను. ఇంతలో అవతలనుండి యెవరో తలుపు దడదడ కొట్టసాగిరి.

అంకినీ డుద్రేకముతో "ఎవరవతల ? తలుపు బద్దలు కొట్టుతున్నారు ?"అని అరచెను. ఆ మాటలను వినిపించుకొనకయే, ఆవతల మనిషి, మరల తలుపులను గట్టిగా కొట్టసాగెను. అంకినేనికి కోపము వచ్చెను—క్రిందపడియున్న పూలచెండు ఆతని దృష్టినాకర్షించెను. అవతలనున్న వ్యక్తి, ఒకవేళ లోపలకు వచ్చినచో ఆ పుష్పగుచ్ఛము కంటబడి ఏమయినా అనుమానమునకు కారణముకాగలదని కాబోలు, అంకినీడు శరవేగముతో, దానిని ఒక సోఫా క్రిందికి, కాలితో తన్నెను—అవతల మనిషి ఎడతెఱపిలేకుండ, "తలుపు" తలుపు! తలుపుతీయండి. అని అరచుచుండుటవలన, గత్యంతరము గానక, ఉక్కిరిబిక్కిరియై, ఆ యుత్తరక్షణమున, అంకినీడు తలుపు తెరచెను.

తలుపు తెఱచీ, తెఱవడంలో, అవతల వ్యక్తి, భీకరాకృతితో లోపల తటాలున ప్రవేశించి గదివంతయు నొక్క త్రుటిలో కలియవెదకి, "ఆమె! అది ఏది ? ఎక్కడఉన్నది ?" అని ఉఱిమినట్లు ప్రశ్నించినాడు.

అంకినేనికి విపరీతముగా రేగివచ్చింది రోషము-అభిమానమొకటి ఆవేశించింది ఆతని శరీరముపై—వెంటనే, ఆతడు.

"ఎవడవురా నీవు ? నా గదిలోని కీవిధంగా దూసికొనివచ్చుటకు—మర్యాద—నాగరికత ఎఱుగని పశువులాగున ప్రవర్తిస్తున్నావేం ?" అని గర్జించినాడు. అంతట ఆ నూతన వ్యక్తి, ఆ పాదమస్తకము కోపములో కంపించుచు,

"నేనెవ్వడనో,తరువాత తెలుస్తుందిలే! మాటలు మాత్రము దురుసుగా రానియ్యకు మర్యాద ఎఱుగని పశువు నీవో నేనో, నీకే తెలియాలి!......ముందు నా ప్రశ్నకు జవాబు చెప్పు—లేకపోతే—మర్యాద దక్కదు—అది ఎక్కడఉన్నదో చూపించు, దాన్ని యివతలకు పంపించు! ఇక్కడకు పరుగెత్తుకొని వచ్చి నీ గదిలో దూరిందే, దొంగలాగున—దాన్ని ఇవతలకు నడిపించు—మర్యాదగా—"

అని గద్దించినాడు ఆ క్రొత్తమానిసి.

"అరే! నోరుమూసుకొని, ముందు నీవు గుమ్మం దాటు—తరువాత దానిసంగతి చూడవచ్చును అట్టే ప్రేలకు." అని అన్నాడు అంకినీడు.

"దాన్ని—ముందుగా—చూపించి యివతలకు పంపించు—మర్యాదగా!" అని మళ్ళీ గంభీరంగా, కొట్టవచ్చినాడు, అడిగినాడు.

"నోరుమూసుకో! పశువా!" అని రోషమంతా మూర్తీభవించినట్లు పలికినాడు అంకినీడు: "అది ఎవ్వరో ?—నీవెవ్వడవో? నాకేం తెలుసు! ముందు-గుమ్మందాటి-అవతల ఉండి, మరీ మాట్లాడు!—పో! పోరా పక్షీ! పో! కదలవేం? ముందు-కదులుతావా-కదలవా ?—కదలకపోతే-" అని అంటూఉండగా, ఆ ఆగంతకుడు, అగ్గోత్థిలో,

"ఏడిశావు! ఏంజేస్తావు నీ మొహం! ముందు దాన్ని ఇవతలకు నెట్టి, మరీమాట్లాడు" అని ఎదిరించి జవాబిచ్చినాడు—

"ఛీ! అవలకు నడు - అది—-ఇదీలేదు ఇక్కడ!"

"ఒరే మాటలు సరిగా రానియ్య! ఒక్కడు ఉంటూన్న నీ గదిలోనిక్కి, ఏ ఆడదీ రాకపోతే గుమ్మనివాసనలు వెదజల్లుతూ, ఆడదాని సిగలోనుండి

జాతిపడీనట్లు కనబడుతున్న ఆ పూలచెండు ఎక్కడనుంచి వచ్చింది సోఫా క్రిందికి” అని గర్జించినాడు.

క్రోధముజ్వాలవలె ఎగయుటచేత, దానిని ఆపుకోలేక, ఆ క్రొత్తమనిషిని, అంకినీడు సాగదీసి ఒకతన్ను తన్నబోయినాడు—ఆ తావుదప్పించుకొని, ఆక్రొత్త వ్యక్తి,

“ఓ—నీకు ఒక స్నానాల గదికూడా ఉంది? అయితే- స్నానాల గదిలో దాన్ని దాచిపెట్టావన్న మాట—ఇవతల ఉంటే కనబడిపోతుందని! ఇలాంటి నీచపు పనులు—పరాయి ఆడవాళ్ళను గదులలో దాచుకొని—సిగ్గులేక—హోటళ్ళలో వ్యభిచారం సాగిస్తున్నావటరా? ఇపుడు నీవా నేనా మర్యాద గలవాళ్ళము—పశువ్వు, నీవా నేనా?” అని పలుకుచు, అడ్డమువచ్చిన అంకినేని తప్పించుకొని, గభాలున స్నానాలగది తలుపులు, తన్నినాడు.

భయభ్రాంతయై కంపించుచున్న, అక్కడి జవ్వనిని రెక్కపట్టుకొని యివతలకు యీడ్చుకొని వచ్చినాడు. “ఇక్కడ దాగున్నావా? రంగీ! అంకు మగని ఆశ్రయించుకొని; రా! నీ సంగతి కనుక్కుంటాను.”అని గద్దించుచు, బరబరలాగుకొనివచ్చినాడు.

భయంతో కంపించిపోవుచూ, ఆ సుందరి, “బాబోయి! రక్షించండి— రక్షించండి—చంపేస్తున్నాడు. అలాచూస్తూ ఊరకుంటారేమండి? చంపేస్తాడు. ఇంకేంగతి;” అని అంటూ, ఆతని పట్టులో నుండి విడిపించుకొనుటకు గింజుకొనుచు, నేలపైపడి సాగడం ప్రారంభించింది.

“ఓ అమ్మాయి! నీకువచ్చిన భయం ఏమీలేదు. నా గదిలో నేనుండగా, వీడేమి చేయగలడో చూస్తాను.” అని పలికినాడు—అంతవఱకు, ఆనూతన వ్యక్తి చేసినదానికే మండిపడుచున్న అంకినీడు. కోపము నాచుకొనలేక, ఒక ఆడదాన్ని ఆ విధముగా రెక్కపట్టుకుని ఈడ్చుకొని రావడంచూచి సహింపలేకపోయినాడు—అంతట నాతడు ఒక్క ఉఱుకున ఆ క్రొత్త మనిషిమీదపడి, ముఖంమీద, తన శక్తి కొలది సాగదీసి ఒక ముష్టిఘాతం ప్రయోగించినాడు. ఆఘాటికి తట్టుకొనలేక క్రొత్తమనిషి, చాపచుట్టవలె దభాలున నేలకూలినాడు—అంతదాక వికృతహాసం చేస్తూ, కోపం మూర్తీభవించినట్లుండిన మనిషి నేలకూలి, స్పృహతప్పినట్లు పడియున్నాడు.

“రంగమ్మా! నీకువచ్చే భయం ఏమీలేదు.” అని ఓదార్చుచు, అంకినీడారమణిని చేయి అందించి లేవదీసినాడు.

“ఏమండి! మీ గుద్దుకు తట్టుకోలేక కూలినాడు- తల దిమ్మువదలి, తెలివివచ్చి, లేచేలోపల, నన్ను ఇక్కడనుంచి దాటించండి బాబు—సుఖమైన స్థలానికి—బాబు! మీ ఋణం తీర్చుకోలేను—” అని రంగనాయకి దీనాలాపములు సాగించింది.

అంకినేనికి ఆ తరుణంలో, ఏం చేయుచున్నాడో, ఏమిచేయవలెనో, తోచలేదు—ఒక ముహూర్తం కూడ గడవలేదు—

తలుపు తాళంవేసుకొనలేదు-హడావిడిగా, “రా-రంగమ్మా! నావెంట” అని అంటూ, అంకినీడా సుందరాంగిని, చేయిపట్టుకుని గదిలోనించి బయటకు దుముకెను—మెఱుపు తీగెలవలె, వారుఘయులు, మేడమెట్లు దిగి, క్రింద వేచియున్న టాక్సీ కారులోనికి ఉఱికిపడినారు—కారుకూడా ఒక క్షణమైనను ఆలస్యముచేయకుండ, తూరీగవలె ఎగిరిపోయింది.

ఇంచుమించుగా పదినిమిషములుసేపు నడిచింది కారు—సరాసరివచ్చి, లాయడ్సురోడ్డులో, కొబ్బరితోటకు ఎదురుగానున్న సందులో, కుడివైపున, లాంతరు స్థంభమునకు సమీపముగానున్న డాబాముందు ఆగింది కారు.

కారు నడుచుచున్నంతసేపు అంకినీడు రంగ నాయకి, ఒకరితోనొకరు సంభాషించలేదు—ఉభయులు, ఏదో ఆలోచనలలో నిమగ్నులయి ఉన్నట్లు మాత్రము స్పష్టమయ్యెను.

కారు, ఆగడంతోనే, వీధివైపు ఉన్న గేటు తెఱచుకొని ఒక ముసలిది బయటకువచ్చి, "అంకినీడుగారు! ఇదిగో మీకు ఉత్తరం" అని కవరును చేతికందించింది. కవరును చఱ్ఱున చింపి, కారులో టాపులైటు వేసుకొని ఆతురతతో చదివినాడు అంకినీడు—అందు ఈవిధముగ నున్నది.

"ప్రియ సఖుడ!

క్షమించాలి! నీకంటె ముందుగావచ్చి, అతడు నన్ను వెంటబెట్టుకొని వెళ్లుచున్నాడు-ఏం చెయ్యను? పాపం! నీకు నిరాశ అయింది. అయినా ఏమీ అనుకోవద్దు.

వరలక్ష్మి"

కవరును, ఉత్తరమును కోపంతో ముక్కలు ముక్కల క్రింద చింపి, నలిపి, అవతల పారవేసినాడు, అతడు.

మందహాసంతో, రంగనాయకి, ఆతని ముఖము వంక చూస్తు,

"అయితే! ఏమండి - వరలక్ష్మి - కాదు-సునంద కొరకు వచ్చినారా? ఇంత శ్రమపడి" అని అడిగింది.

"అవును" అని అన్నాడు నిరాశలో కలిసివచ్చిన రోషముతో, అంకినీడు.

"నాతో కాస్త ముందుగా చెప్పినారు కారేమండి?" అని రంగనాయకి ప్రశ్నించింది.

"ఏమిటి చెప్పేది నీతో!" అని విసుగు, కోపము ప్రకటించినాడు అతడు.

"కాదండీ! వరలక్ష్మి - కాదు, సునంద, చౌదరితో వెళ్ళేముందు మాతో - అంటే నాతోనూ, మీ చేత తన్నులు తిన్నాడే, అతనితోనూ - చెప్పింది. ఆమెను నీకు అందకుండా చేయమని, చౌదరి మమ్ముల పురమాయించినాడు. ఈ నాటకమంతా ఆడమని.

అంకినేనికి పట్టరాని ఉక్కురోషం వచ్చింది. "నీవు ఎవ్వరిదానవు - ఎవరు నీవు" అన కాఠిన్యం ప్రకటమగునట్లు ప్రశ్నించినాడు.

"కాదండి! కోప మెందుకండి! ఈ మాత్రానికి నేను-నాపేరు కమల-రంగనాయకి కాదు. నేను, వరలక్ష్మి - అంటే సునంద, రాజీవలోచన, నీలవేణి, సరోజి, పుష్పవనం, యింకావున్నాము లెండి - మేమంతా సినీమా స్టూడియోలలో "వగైరా" వేషాలు వేయుటకు, అవసర సైవేద్యాలకు ఉపయోగపడే 'ఎక్స్ట్రాల'ము ఉన్నాము - మీచేత ముక్కుమీద గ్రుద్దు తిన్నాడే - అతడూ ఎక్స్ట్రాలలో చేరినవాడే! రోజుకు రెండున్నర ఇస్తారు - పనిఉన్న రోజున - ఈ నాటక మాడుటకు తన్నులు తినడానికి పదిహేను రూపాయలిచ్చినా డతనికీ చౌదరి!" అని పలికింది వాల్చూపులతో పరామర్శ చేయుచు ఆ బిత్తరి. "ఆఁ!" అని నిర్ఘాంతపోయినాడు అంకినీడు, "నాకేమి అర్థం కావడంలేదు" అని అన్నాడు.

"మీ మెదడులో ఊహించేశక్తి- గుంజులేదు. వట్టి ఖాళీ!" అని ఎకసక్కె మాడింది ఆ మిటారి!

అంకినీ డేమియు మాట్లాడలేకపోయినాడు. అంతలో తిరిగి సంభాషణ కొనఅందుకొని, ఆమె,

సరే! ఏమాలోచిస్తున్నారు? ఇప్పు డిక్కడనుంచి ప్రయాణ మెక్కడికి? అని అడిగింది.

"ఎక్కడి కేమున్నది? సునంద నాతో సినీమాకు 'కిస్మత్' చూడడానికి వస్తానన్నది. మే మిద్దరము కలిసి వెళ్ళి, కులాసాగా బాక్సులో కూర్చుని, చిత్రం చూస్తూ ఆనందించాలని అనుకున్నాము" అని అన్నాడు అంకినీడు. "అనుకున్నాము కాదు. అనుకున్నారు.

ఆడదాని మనసు గ్రహించలేని సరసులు! మీ కిస్మత్ బాగానే ఉంది—అయితే — వరలక్ష్మికి - కాదు సునందకు బదులుగా నేను రావచ్చునా కిస్మత్‌కు, మీతో?" అని, కులుకు చూపింది ఆమె.

"అయితే పద!" అని అన్నాడు, అవిచారంగా అంకినీడు—మెల్లగా, టాక్సీకారు, కదిలింది.

దగ్గరగా, అంకినేనికి, దగ్గరగా జరిగింది ఆ కులుకులాడి.

"సాగర్ టాకీస్"కు పో, అని అన్నాడు డ్రైవరుతో అంకినీడు.



# బుర్రకథ

## శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడు

### బృందగీతి

నందన వన సుమదళాల
పరిమళమిది వీడలేము
మందమంద మలయానిలు
కౌగిలి విడువంగలేము
సుందరవన విలోకనమ్ము
హృదయము విస్ఫారితమ్ము
సత్వరసా లోసనమ్ము
చిదానంద జీవనమ్ము!

[క్రమక్రమంగా సన్నగిలుతూ వినిపించే మంగళ ధ్వనులు.]

అజాతశిశువు

అబ్బ! ఎంత వెలుగు! నిత్యసౌందర్యోపాసు లీలోక వాసులు. ఎంతధన్యులో! దివ్యలోకాలనుంచి ఇంత దూరం వచ్చినా, ఈ తేజస్సు...ఆఁ...అదిగో అనతి దూరంలోనే ఈ తేజస్సంతా తమోదేవితో ఐక్యమై పోతోంది. ప్రేమామృతంతో నింపారు నన్నీ మహాపురుషులు-ప్రేమలో ఔన్నత్యాన్నందుకొని నిశ్శేషంగా కరగిపోయిన నేను నా ఆనందాన్ని మానవులకు పంచుతా. అప్పుడుకాని నా ఆత్మ అనంతంగా వృద్ధి పొందదు. అదే దైవత్వం!

(మంగళధ్వనులు వినబడవు)

(ఉద్వేగంతో) వెలుగంతా ఏదీ, నేనెలాపోవాలి; ఒకక్షణం ఆగితే ఈచీకటిని చూడకలుగుతానేమో. (నిశ్శబ్దం) ఇప్పుడేదో మసకమసకగా దృగ్గోచరమౌతూంది. క్షణమాత్రంలోనే దివ్యలోకంనుండి ఇంత దూరం రాగలిగానా! ఈప్రదేశమంతా చల్లగా, వింత అనుభవాన్నిస్తోంది. నాచుట్టూ ఏవో మినుకు మినుకుమంటూ మెరుస్తున్నాయి. ఇదొక లోయలాగుంది. చంద్రమండలమై ఉంటుంది. ఇంతచల్లని కిరణాల కౌగిలిలో కరిగిపోయే తమస్విని ఎంతధన్యురాలో! నేను నా గమ్యస్థానం చేరుకోడానికి ఎంతకాలం పడుతుందో. అమరలోకాన్ని మరపించే సౌందర్యం భూలోకంలో కనపడుతుంది. కల్లోలినీ తరంగాలపై నాట్యంచేసే అరుణోదయ ప్రభలూ, ఉదయ రవి రాగంలో పులకలెత్తి వికసించే పుష్పాలు, శుభ్ర జ్యోత్స్న ప్రభలలో తన్మయత్వాన్ననుభవించే ప్రకృతీ, ప్రతీక్షణం వింతరంగులతో వెలిగే మబ్బులు, ఎన్నిజన్మలెత్తినా మర్త్యలోకంపై అభిమానాన్ని పెంపొందిస్తున్నాయి.

నా గమ్యస్థానానికి దారిచూపే వారెవరూ లేరూ? చేరువలో ఏదో సమీపిస్తున్నట్లలికిడవుతూంది. (కొంచెం ఆగి, బిగ్గరగా) ఎవరక్కడ, నా గమ్యస్థానమైన మర్త్యలోకానికి దారిచూపగలరా?

(దేవదూత ప్రవేశం)

దే:—నీ గమ్యస్థానాన్ని మరోదినంలో చేరగలవు.

అజా:—ఎవరు మీరు?

దే.— నేను దేవదూతను

అజా:—నా గమ్యస్థానానికి దారి చూపగలరా?

దే:—నీకింకా జీవితంమీద అభిలాష పోలేదూ? అమరలోకం నీకు శాంతి నియ్యలేకపోయిందా?

అజా:—జన్మరాహిత్యం కోసమే, నాలో పొర్లి ప్రవహిస్తున్న ప్రేమను మానవులలో పంచడానికి మళ్ళీ జన్మిస్తున్నాను. మర్త్యలోకానుభవం నాస్మృతి

పథంనుంచి కొంచెం తొలిగిపోయింది. అయినా ఆ లోకంనుంచి అమరలోకం ప్రవేశించిన కొందరు భూలోకంలో కష్టాలున్నాయన్నారు. నేను జన్మించి మానవాభ్యుదయానికి తోడ్పడతాను. నాదారి చూపరూ ?

దే:—నన్ను వెంబడించు. ఇదిగో, ఈ శిరాన్నుంచి నీగమ్యస్థానాన్ని చూడగలవు.

అజా:—(ఆత్రతగా) ఎక్కడ? నాకిప్పుడులెక్కలేనన్ని నక్షత్రాలు కనిపిస్తున్నాయి. ఏదిభూమి ? ఆ అగ్నిజ్వాలలతో ప్రకాశిస్తున్నదా ?

దే:—కాదు, అదుగో. నీకాపెద్దగోళం కనపడుతోందా ? చూపుమేరవరకూ వింతరంగులతో ప్రకాశిస్తోందికదూ; ఆక్కడనుంచి తూర్పుగాచూడు అల... అటు...అదిగో, పాలపుంత వెనక.

అజా:-పాలపుంత వెనుక ఏమీగోచరించటం లేదే!

దే:—నిదానించి చూడు.

అజా:—ఔను ఆ మినుకుమినుకుమంటూ ప్రకాశిస్తున్నదా ? అదే భూలోకమా ?

దే:—నువ్వప్పుడే వెలుతురు చూస్తున్నావు. ఆ గోళాన్నే మానవులు సూర్యుడంటారు.

అజా:—దానిచుట్టూ ఏవో గోళాలు పరిభ్రమిస్తున్నట్లున్నాయి.

దే:—ఆ కనిపిస్తున్నవాటిలో మూడోది భూమి. ఏ కిక్కడికి చిన్నదిగా కనిపిస్తోంది కదూ! అక్కడ కూడా నీకు సౌందర్యం కనపడుతుంది. అనుభవించలేని కష్టాలుకూడా ఉంటాయి.

అజా:— నే నెన్నికష్టాల ననుభవించినా నా ఉన్నతాదర్శాన్ని విస్మరించను.

దే:—అ నేకులా నిశ్చయంతోనే జన్మిస్తారు. కాని కష్టాలకు లొంగిపోతారు. పుట్టుకవల్ల విశాలమైన మనస్సు సంకుచిత మౌతుంది.

అజా:—ఇంకా కొంత దూరం నన్ను తీసుకుపోవూ ?

దేవ:—వీల్లేదు. నేను నెరవేర్చవలసిన కార్యముంది. దానికోసమే నేను నిరీక్షిస్తున్నాను.

అజా:—ఏమిటది ?

దే:—మర్త్యలోకంలో ఇంతకు పూర్వమే చనిపోయిన ఒక మృతజీవికి అమరలోకానికి దారి చూపాలి. ఈ లోకంనుంచి వెళ్ళేటప్పుడు అందరూ నీ లాగే నగ్నంగా పోతారు. కాని మృతజీవులు ఈ లోకంలో ప్రవేశించే సమయాన్నికూడా మానవ కల్పితమైన తొడుగు నొకదాన్ని తమచుట్టూ నిర్మించుకుంటారు. వారి స్థూలదృష్టికి ఆ తొడుగు కనిపించదు. ఆ తొడుగు, వారి సహజత్వాన్ని, మంటల్ని కప్పే పొగలా మరుగుపరుస్తుంది. ఆ తొడుగును విసర్జించేటట్లు చేయడమే నావిధి. అమరలోకం ప్రవేశించడం ఆ తొడుగుతో అసంభవం.

అజా:—నాకోరిక మన్నిస్తావా ?

దే:—ఏమిటది !

అజా:—నీ నియమిత కార్యాన్ని నెరవేర్చడానికి నా కనుజ్ఞ నిస్తావా ?

దే:—నువ్వనుకున్నంత సులభసాధ్యం కాదేమో! సరే!—అదుగో, అలా చూడు. మగతగా నిద్రలో నడుస్తున్నట్లు మర్త్యలోకవాసనలతో మృతజీవి ప్రవేశిస్తున్నాడు మనం ఇక్కడే ఆగుదాం.

(దూరాన్నుంచి మృతజీవి)

మృతజీవి:—అమ్మయ్య ! నాలోని రుగ్మత అంతా మాయమయింది. నా శరీరం తేలికైనట్లుంది. ...ఏవో శిఖరాల నధిగమిస్తున్నట్లుంది. కొంచెం విశ్రాంతి తీసుకుంటా.

దే:— అదిగో, వింటున్నావా! అతని సంభాషణంతా గడచిన జీవితాన్ని గురించే. ఇంకా పురా

భావాలు అతన్ని వెంటాడుతున్నాయి. ఉండు. ఇంకా ఏమో మాట్లాడుతున్నాడు. ఆతని గడచిన బతుకు బరువులన్నీ త్వరలోనే తేలికపౌతాయి.

మృ:—నేను మరణించానా ? లేదేమో! నాలోని 'నేను' పోయి నేనే విశ్వాన్ని అయ్యానేమో!— నేనే లేకపోతే విశ్వం ఏదీ ?—ఏవో దివ్యలోకాలట! దివ్యలోకాలంటూ ఉంటే నేను నా స్థానం నుంచి అక్కడికెందుకూ పోవడం ?......అదంతా స్వప్నం. దూరానికి నున్నగా నీలంగా కనిపించే శిఖరాలు, మబ్బులమాటున ప్రకాశిస్తూ ఆకాశాన్ని ముత్యంలా మార్చే సూర్యుడూ, పచ్చికబయళ్ళూ...

జే:—అదిగో, సమీపిస్తున్నాడు మన్ని. అతన్ని ఆవరించిన మైకాన్ని పోగొట్టి పైనున్న తొడుగు పోగొట్టు—వెళ్ళు—నేనిక్కడే ఉంటాము.

అజా:—సోదరా! ఇటు—నేను నీకు సాయం చెయ్యడానికి వచ్చాను.

మృతి:—ఎవరు మీరు ?

అజా :—నేను అజాత శిశువును.

మృత:—అజాత శిశువా...అలాంటి దెక్కడా లేదు.

అజా:—నీ కింకా నమ్మకంలేదా ? ఇటుచూడు... నేనిక్కడున్నా.

మృత:—ఆకారంలేని ఆత్మలు! అసంభవం— తంత్రులులేని సంగీతమా ? అదిగో నీకూ ఆకారం ఉందే!

అజా:—మర్త్యలోకంలో నా శరీరంకూడా ఈ ఆకారమే కలిగి ఉంటుంది.

మృత:—మర్త్యలోకంలోనా ?

అజా:—నేనక్కడకే వెడుతున్నా !

మృత:—అయితే—నేనూ...

అజా:—నీ శరీరం ఇంతకుముందే మృతిపొందింది.

మృత:—అయితే, ఈ శిఖరాలు, నక్షత్రాలు, ఇదే అమర లోకమా ?

అజా:—కాదు. అమరలోకానికి మార్గం ఈ లోయగుండానని దేవదూత చెప్పాడు.

మృత:—అయితే స్వర్గమనేది ఉన్నట్లయితే దానికి ఇది మార్గమా ? నేనూ ఈ మార్గాన్నే అనుసరిస్తాను. స్వర్గాన్ని పొందటానికి నేనేంచెయ్యాలో చెప్పవూ?

అజా:—నీపై నున్న తొడుగు విసర్జించు

మృత:—ఇదా! దీన్ని నేను జీవించినంతకాలం ధరించాను. జీవితంలో అనేక అనుభవాల ఫలితంగా దీన్ని సృష్టించుకున్నాను.

అజా:—అయినా సరే! దాన్ని విసర్జించినదాకా నీవు స్వర్గంలో ప్రవేశించలేవు.

మృత:—ఇదిలేనిదే నేనే లేనన్నమాట...ఎలాగ?

అజా:—అది తొడుగు మాత్రమే.

మృత:—కాదు. ఇది నా వ్యక్తిత్వాన్ని నిరూపిస్తుంది. ఇదిలేకపోతే నా వ్యక్తిత్వం నశించిందన్న మాట. మర్త్యలోకంలో నీ జీవితాన్ని సామాన్య మానవునిలా గడుపుదామంటే నువ్వు చాలా కష్ట పడతావు.

అజా:—నాకేమీ తెలియటం లేదు.

మృత:—ఇతరులపై నీ ఆధిక్యాన్ని నీవు నిరూపించకపోయినట్లయితే నువ్వు చాలా హీనస్థితిని పొందుతావు. ప్రతీ మానవుడూ నిన్ను పక్కకు నెట్టుతూ నీ అశక్తత నూతగా తీసుకొని అభివృద్ధి పొంది నిన్నింకా నికృష్ట స్థితికి తీసుకుపోతాడు. నా అనుభం నేర్పిన పాఠం ఇది.

అజా:—అయితే, మానవులు ఒకరికొకరు సాయ పడరూ ?

మృత:—నీ అమాయకత్వానికి నేను చాల విచారిస్తున్నాను. నీ జీవితంలో చాలా కష్టాలు పొందుతావు.

అజా:—ఎంత ఆశ్చర్యంగాఉంది. మానవులలో ప్రేమకీ, మంచితనానికీ స్థానంలేదూ? జీవితంలో శాంతిలేదూ?

మృత:—శాంతి! శాంతిని నేను స్వప్నాల్లో చూశాను. జీవితంలో ప్రతినిత్యం పోరు జరుగుతూం టుంది. అదే శాంతి మానవులకి. ప్రతీ మానవుడూ స్వార్థంకోసం పాటుపడతాడు.

అజా:—ఐతే ప్రపంచాని కభ్యుదయం ఎలా కలుగుతుంది?

మృత —ప్రపంచానికి అభ్యుదయమంటూ ఉంటే మానవుల ప్రయత్నంవల్ల ఎన్నటికీ కాదు.

అజా:—నేను మానవులు ప్రేమాస్పదులను కొంటున్నాను.

మృత:—వారికి జీవితం గమ్యస్థానం తెలియదు.

అజా:—అయ్యో! నాజన్మ తప్పడం ఎలా? నేనా కష్టాల నన్నిటినీ అనుభవించవలిసిందే?

మృత:—అక్కడకూడా ఇలాగే నిరాడంబరంగా జీవిస్తూ, నీ ప్రేమచే అన్నింటినీ జయిద్దామనుకొంటే నీ జీవితం దుర్భరంగా ఉంటుంది. మానవులు నీవంటే నిర్లక్ష్యంగా ఉంటారు. జీవితంలో అమాయకులే ఎక్కువ కష్టాలనుభవిస్తారు. నువ్వు మెలకువకలిగి ఉండాలి. నీచుట్టూ తొడుగు నిర్మించుకో. మానవులను దగ్గరకు రానీయకు. నీ తొడుగులో నీ సహజత్వాన్ని మరుగుపరచు. ప్రతీ మనిషికీ రెండేస్థితులు. తను మరొకరికి బానిసగా, వారి ఆజ్ఞానువర్తిగానైనా ఉండాలి. లేదా తనేనాయకుడుగా, అధికారిగా ఉండాలి. నీకు కావలసినదాన్ని బలవంతముగా లాక్కో. నీ సౌహార్ద్రంచే జయిద్దామనుకొంటే దాన్ని నీ వెన్నటికీ పొందలేవు. గంభీరంగాజీవించు. వెర్రిగా ఏవో కలలుకంటూ, అన్నిటినీ నమ్ముతూంటే నీకు అధోగతే. మోసగించడం నేర్చుకో. అలాగైతే జీవితం కులాసాగా ఉంటుంది. ఏం? నీకు నమ్మకం కలగటంలేదూ? నా శరీరంలో ప్రతి అణువూ గ్రహించిన సత్యమిది. నేనూ నీలాగే అనుకొన్నాను. దానికి ఫలితమే ఇది. నా జీవితంలో పత్తుల్ని చూసి ఈర్ష్యపడేవాణ్ణి. మానవుల మేధస్సులన్నీ తమో నిర్మితాలు. వారిలో సామరస్యం లేదు.

అజా:—మానవాభ్యుదయానికి పాటుపడదామను కొన్నా, నీవిది చెప్పక పూర్వం—

మృత:—వెర్రివాడా, మానవులలో ప్రేమకి స్థానం లేదోయ్!

అజా:—అందుకేనా నీవాతొడుగు నిర్మించు కొన్నావు?

మృత:—నీ కిప్పు డర్థమౌతోందన్నమాట. సరే— నేనేమార్గా న్ననుసరించాలో చెప్పవూ?

అజా:—నీ తొడుగును విసర్జించనంతవరకూ నీ గమ్యస్థానానికి నువ్వు పోలేవు.

మృత:—నీ ఉపయోగంకోసం దీన్ని విసర్జించ మంటున్నావా? నాకు దారి నువ్వు చెప్పకపోతే నేనే తెలుసుకుంటా. ఇదిగో, చూడు నేనీదారి నను సరిస్తాను. (క్షణం నిశ్శబ్దం)

దే:—ఎక్కడికి నీ ప్రయాణం.

మృత:—అమరలోకానికి.

దే:—నీ అహంభావాన్ని విసర్జిస్తేనే నువ్వక్కడికి చేరగలవు,

మృత:—నువ్వూ అదే ఆజ్ఞాపిస్తున్నావా? మరి నా వ్యక్తిత్వం?

దే:—అవన్నీ మర్త్యలోకంలోనే.

మృత:—నా విజ్ఞానం, మేధస్సు...

దే:—అవన్నీ నీ శరీరంతోటే నశిస్తాయి. దేవలోకంలో మానవుల కర్థంకాని విజ్ఞానంతో ప్రకా

శిస్తారు. ప్రతికార్యంలోను వారి విశిష్టత స్పష్ట మౌతుంది.

మృత:—నా తొడుగు!—నేనే అది—ఎలా ?

దేవ:—విసర్జించు—తప్పదు.

మృత:—నేను విసర్జించలేను.

దేవ:—ఐతే నీ పూర్వస్థితిలోనే ఉంటావు. కొంత కాలానికిగాని తెలుసుకోలేవు.

మృత:—అంతవరకూ నే నాగలేను.

దేవ:—అయితే నీ తొడుగు విసర్జించు.

మృత:—సరే!..(క్షణం నిశ్శబ్దం) నా తొడుగును విసర్జించాను. అమ్మయ్య! నేనెంతకాలానికి విముక్తు ణ్ణయ్యాను. విశ్వంలో లీనమయ్యాను కష్టాలు, కోర్కెలు, కృత్రిమత్వం నన్నంటవు. అయ్యా! మనం స్వర్గలోకానికి ప్రయాణం చేదామా!

దే:—నన్ను వెంబడించు. అజాత శిశూ! సెలవు.

(నిశ్శబ్దం)

అజా:—అతని జన్మ ధన్యమైంది. స్వర్గధామాన్ని చేరుతున్నాడు. కాని నా మార్గమే కంటకావృతం. నా అమాయకత్వానికి నవ్వాడతను. నే నిలాగే ఉంటే మానవులంతా నవ్వుతారేమో! నాకు మంచి పాఠాన్ని నేర్పాడు. ఇంక నేను మానవులచే మోస గింపబడను. నేనాజ్ఞాపిస్తాను. బానిసనుకాను. అతను విసర్జించిన తొడుగును నేను ధరిస్తాను. (నిశ్శబ్దం) ఇంక నా మార్గాన్ననుసరిస్తాను!

Clifford Bax వ్రాసిన ఆంగ్లనాటికకు స్వేచ్ఛానువాదం.



# గౌరవంకోసం

శ్రీమతి వట్టికొండ విశాలాక్షి

విమల ఈసారి అత్తవారింటికి వచ్చిన దగ్గరనుంచీ విమల భర్తకు ఆమెలో ఏదో ఒక ప్రత్యేకత కనపడుతూఉంది. ఇదివరకు తనకు కావలసిన పనులన్నీ తను చెప్పిచేయించుకోవలసివచ్చేది. ఇప్పుడు మాత్రం అలాకాదు. వాటంతటవే సరీగ్గా వేళకు తయారై ఉంటున్నవి. ఎప్పుడు ఇదివరకు ఇక్కడకు వచ్చిన తరువాత రెండునెలలకో మూడునెలలకో "మాఊరు వెళ్ళివస్తాను" అనేది. ఇప్పుడు అలాంటి గడువులు నాలుగైదు దాటిపోయినా అడగలేదు. ఇదీ ఆశ్చర్యంగానే ఉంది ఆమె భర్తకు. విమల తానెందుకోసం ఏ పనిచేస్తున్నాననిగానీ, తానీలోకంలో ఎందుకోసం జీవిస్తున్నానో అనిగానీ ప్రశ్నించుకోవాలని కూడా అనుకోకుండా జీవితాన్ని గడుపుతూ ఉంది.

పొయ్యిరాజేద్దామని విమల వంటగదిలోకి పోతూ ఉండగా ఒక కుఱ్ఱవాడు ఆమె చేతికి కవరు ఇస్తున్నాడు. అంతలో ఆమె భర్తవచ్చి "ఏమిటా కవరు? ఎవరా కుఱ్ఱవాడు?" అని ప్రశ్నలమీద ప్రశ్నలు కురిపించాడు ఆదుర్దాగా.

"ఏమో ఏమిటో మా అన్నయ్య పంపించాడట. ఈ కుఱ్ఱవాడు మావూరి కుఱ్ఱవాడే" అన్నదామె కవరు చింపుతూ.

"ఏమి వ్రాశాడు? ఇలా ఇవ్వు"

"ఉండండి చదివి ఇస్తాను" అన్నదామె ఉత్తరం చదువుకుంటూనే. అడగగానే తనకు ఇవ్వలేదని కోపంవచ్చి ఆయన అవతలకు వెళ్ళాడు. ఆమె పొయ్యికెదురుగా కూర్చుని ఉత్తరం చదివింది. అప్రయత్నంగా ఒక్కసారి పుట్టినింట్లో విషయాలన్నీ జ్ఞాపకం వచ్చాయి. ఏమో దీర్ఘంగా ఆలోచిస్తూ కాగితాలతో బొగ్గులపొయ్యి వెలిగించి పంచదార సీసా కోసం వంటగదిలో నుంచి లేచివెళ్ళింది.

"ఏదీ ఉత్తరం?" అన్నాడామె భర్తకోపంగా. ఆమె తెల్లపోయింది.

"ఏమిటి అలా చూస్తావు? ఆకుఱ్ఱాడు తెచ్చిన ఉత్తరం ఏదీ?" అన్నాడు మళ్ళీ కళ్లు ఉరుముతూ.

"అక్కడే వేశానేమో చూస్తాను" అంటూ గబగబా వంటగదిలోకి వెళ్ళింది. తన స్వాధీనంలోలేని చేతులతో ఇటు సామానటు అటుసామానిటు కూడా విడిగా సర్దుతూ వెదుకుతూఉంది. ఎక్కడా కనపడదు. ఇంకా ఏవో పారేసిన కాగితాలుఉన్నైగాని తన అన్నయ్యవ్రాసిన ఉత్తరం మాత్రం కనపడలేదు. బహుశః పొయ్యిలో పెట్టిఉంటానేమోననుకుంది. ఏమి చేయటమా? అని ఆలోచిస్తూ ఉంది. అంతలో "ఏదీ ఉత్తరం?" అంటూ రానేవచ్చాడు భర్త.

"ఎక్కడ వేశానో జ్ఞాపకంలేదు. ఇదంతా వెదికినా కనిపించటంలేదు." అన్నది విమల ఇంకా వెదుకుతూనే.

"ఇంతలోకే అంత మతిమరపు వచ్చిందేం? బాగానే బొంకావులే" అన్నాడు నములుదునా మింగుదునా అన్నట్లు చూస్తూ.

"బొంకానా? బొంకటం ఏమిటి? నిజంగా నాకు తెలియదు. బహుశః పొయ్యిలో పెట్టిఉంటానేమో."

"అది. ఇక దీనికి తిరుగేలేదు."

"అదేమి టలా అంటారు? మీతో ఎప్పుడైనా అబద్ధమాడానా? అంతమాత్రం నామీద మీకు నమ్మకంలేదా?"

ఎన్నిసార్లు అబద్ధం ఆడివుంటావో నాకేం తెలుసు? ఇప్పుడు కళ్ళారాచూచాను కాబట్టి తెలిసింది. ప్రతిదీ కళ్లారా చూడగలమా?"

"మీ రేమిటో చంపేకంటే ఎక్కువ బాధకలిగే

టట్లు మాట్లాడుతున్నారు. మీకీవిధమైనఅభిప్రాయం వుంటేమాత్రం నేనీప్రాణాలతో కూడా ఉండటం వ్యర్థమే"

"నేనూ అదే అనుకుంటున్నాను."

"ఆ ఉత్తరం నిజంగా మా అన్నయ్య వ్రాసిందే. నేను వెళ్ళి చాలా కాలం అయిందని తప్పక తీసుకెళ్తానని, నాకు ఎప్పుడు వీలౌతుందో చెప్పమనీ వ్రాశాడు. అంతే. అంతకంటే ఇంకేమీ లేదు."

"ఏమో నాకెలా తెలుస్తుంది? అప్పుడే నీ చేతిలో నుంచి తీసుకుంటే తెలిసేది."

"మీరంత పెద్దవారు. ఈ లోకంలో మీకెన్నో అనుభవాలు ఉండిఉండవచ్చు. మీరే అలా అనుమానిస్తే ఇంకా నేనేం చెప్పగలను? ఇంతకు ఆ ఉత్తరం లేదు కదా మీసందేహాన్ని తీర్చేందుకు? నేనేం చేయగలను?"

"లేకుండా చేశావు గనకనే నీ సంగతి నాకు తెలిసింది. ఇంత కాలాన్నుంచీ ఏమైనా కనిపెట్టగలిగానా? కనకనే ఇద్దరు ముగ్గురు నన్ను ఏదో మాటమీద చూచాయగా ఎత్తిపొడిచారు. నీ వింత ద్రోహివని నేననుకోలేదు." అంటూ బయటకు వెళ్ళిపోయాడామె భర్త మీసాలు సవరించుకుంటూ. ఆ రోజునుంచే ఆమె మంచంపట్టింది. ఆమె తల్లి, అన్నయ్య వచ్చారు. ఇంటికి తీసుకెళ్తామన్నారు. ఆమె ఒప్పుకోలేదు. ఇక్కడే వైద్యంచేయిస్తున్నారు నయంకాకపోగా ఆ రోజుకారోజు ఎక్కువౌతూ ఉంది. ఆమెకు మాత్రం ఆ జబ్బు నయంకావాలనే కోరికగాని, అవుతుందనే విశ్వాసంగాని లేదు.

ఆమె చాలా గౌరవస్తురాలు. ఆమె గౌరవం కోసం వెనుదీయకుండా ఎట్టిత్యాగమైనా చేస్తుంది. గంభీరంగా ఉంటుంది. ఇతరులకు బాధకలిగించేటట్లు ఒక్కమాట కూడా మాట్లాడదు పొరపాటునైనా. ఆమె నవ్వులో చల్లని లేతవెన్నెలలు కురుస్తూఉంటై. ఆమెచూపులు చురుకుగాగానీ, తళతళలాడుతూగాని ఉండవు. చాలానిర్మలంగానుజాలిగాను,హృదయాన్ని కదలించేవిగాను ఉంటవి. ఇవి ఆమెకు స్వభావసిద్ధంగా అలవడిన గుణాలేకాని మధ్యలో నేర్చుకున్నవికావు. అందుకే ఆమెకు నిదానము, సంఘములో గౌరవమర్యాదలు, సహృదయత విజ్ఞానముగల రామారావుతో పరిచయమైంది. ఆమెకు రామారావుకంటే ఈ లోకంలో ప్రియమైన వస్తువు మరొకటిలేదు, తనమూలాన రామారావు గౌరవం ఎక్కడపోతుందో అని చాలా జాగ్రత్తగా ఉండేది. రామారావుకూడా అలాగే.

రామారావుకీ, విమల అన్నయ్యకు ఎక్కువ స్నేహం. అందువల్ల విమల ఇంటికి రామారావు తరుచుగా రావటం సంభవిస్తుండేది. వచ్చినప్పుడల్లా విమల, రామారావుకూడా లోకంలో మంచిచెడ్డలు, విద్యవిజ్ఞానాలను గురించి ఎక్కువగా చర్చిస్తుండేవారు. విమల ఏ కొంచెంసుస్తీగాఉన్నా ఆమె మళ్ళీ ఆరోగ్యంపొందేవరకు రామారావు కూడా ఎంతో జాగ్రతతీసుకునేవాడు. చివరకు ఒకరికొకరు కనిపిస్తూ ఉంటే ఎంత బాధలైనా అవొక బాధలుగా తోచేవికావు. ఇదంతా వారి ఆచరణలో స్పష్టమౌతూ ఉండేదికాని ముఖాముఖీ ఒక్కసారి కూడా సంభాషణలో వచ్చేదికాదు.

విమలకు సంబంధం వచ్చింది. ఆయన చాలా వయస్సుమిగిలి నాయన. చాలా ఆస్తీ ఉన్నది. సాంప్రదాయం అదీ మంచిది. కొంత వయస్సు మిగిలిపోయినప్పటికీ ఆస్తి ఉన్నదికదా సుఖపడుతుందని పెద్దవాళ్లు ఆ సంబంధాన్ని ఖాయంచేశారు. ఆమెకు ఆకస్మికంగా చాలా జబ్బుచేసింది. అంత జబ్బుచేసినా ఎందుకోగాని రామారావుమాత్రం వాళ్ళ ఇంటికి రాలేకపోయాడు. ఆమెకు ఎలా ఉన్నదీ ఇతరుల ద్వారా తెలుసుకునేవాడు. మరీపెద్ద జబ్బు కొద్దికాలంలోనే తగ్గిపోయినా మొత్తంమీద ఆమెసరియైన ఆరోగ్యాన్ని పొందలేదు. ఆమె కసలది జబ్బ

కాదు. హృదయంలో సంఘర్షణ ఈ సంబంధం ఇష్టంలేదని చెప్పలేకపోతే తన జీవితమే నాశనమౌతుంది. చెపితే అవతలమాటపోతుంది. పెద్దవాళ్లు ఒప్పుకోకనూ పోవచ్చు. అదీకాక పెద్దవాళ్ళకు వ్యతిరేకిస్తున్నదని లోకం దుమ్మెత్తిపోస్తుంది. ఎటూ తేలకకొట్టుకులాడింది కొంతకాలంవరకు. రామారావు సలహా తీసుకుందామా అనుకుంది. కాని రామారావుకూడా మాటపోవటానికిగాని లోకంచేత దుమ్మెత్తి పోయించుకోవటానికి గాని అంగీకరించే మనిషి కాదనుకుంది. ఆఖరుకు విషాన్ని మింగినట్లుగా జీవితాన్నే మింగేసుకుని వ్యతిరేకించకూడదనే నిర్ణయానికే వచ్చింది.

ఆమెకు వివాహమై అత్తవారింటికి వచ్చింది మొదలు ఆరోగ్యంగాగానీ, ఉత్సాహంగాగానీ కనపడేదికాదు చూచేవాళ్ళకు. ఆమె చిన్నప్పటినుండీ జబ్బుమనిషేనట అనుకునేవాళ్లు అత్తవారి వూళ్ళో తెలియని వాళ్ళంతా. అనుకోవటమే కాదు ఆమె అందరికీ అలాగే కనపడేదికూడా. ప్రాణంలేనట్లుగా చాలా నెమ్మదిగా మాట్లాడేది. ఎక్కడ క్రిందపడిపోతుందో అన్నట్లు నడిచేది. ఇవన్నీ ఆమెకు మొదటినుండీ ఉన్నవే. ఇప్పుడు పరిస్థితులేమంత బాగుండకపోటాన మరీ ఎక్కువైనై. ఆమె అత్తవారి వూళ్లోవాళ్ళు ఆమెను మొదటినుండీ ఎరిగి ఉండక పోవటాన ఆమె పద్ధతులకు ఆశ్చర్యపోతుండేవాళ్లు. ఆమెను గురించి ఎవరి ఇష్టంవచ్చినట్లు వాళ్లు చెప్పుకుంటుండేవాళ్ళు. ఆమెకంతా తెలుసు. కాని ఆమెమాత్రం చలించేదికాదు. లోలోపల బాధపడుతూనే ఉండేది. అత్తవారివూళ్లో ఆరోగ్యం బాగుండకైతేనేమి అక్కడి పద్ధతులకు అలవాటుపడలేకనైతేనేమి తరుచుగా పుట్టినింటికి వెళ్ళి అక్కడ కొంతకాలం ఉండివస్తూ ఉండేది. ఆమెపుట్టినింటికి వెళ్ళినప్పుడల్లా రామారావు మామూలుగా వస్తూపోతూనే ఉండేవాడు. ఆమెతోకూడా ఎప్పటిలాగానే మాట్లాడుతూఉండేవాడు. ఇరువురు మాట్లాడుకునేటప్పుడు తమకు తెలియకుండా విచారంలో లీనమౌతుండేవారు. ఆమె అక్కడ ఉన్నప్పుడు మాత్రం కొంతనయంగా ఉండేది. అత్తవారింటికి వచ్చిన తరువాత మళ్ళీ ఎప్పటిలాగానే ఉండేది. రాత్రిళ్లు అత్తవారింట్లో వెన్నెల్లో తిరుగుతూ ఉంటే తన వివాహంకాకముందు రామారావు తమ ఇంటికి వస్తూపోతూ ఉండటం, వెన్నెల్లోకూడా అనేక విషయాలు మాట్లాడుకోవటం అవన్నీ ఒక్కసారి కళ్ళకు కట్టినట్లుండి భరించలేక వెంటనే చీకట్లోకి వెళ్ళేది. ఇకాయింట్లో ఉండలేననుకునేది. కాని తప్పుతుందా? అలాగే లోకం ఏమనుకుంటుందోననే భయంవల్ల ఏదో ఒకవిధంగా కొంతకాలాన్ని గడిపేది. తరువాత మళ్ళీ పుట్టినింటికి వెళ్లేది. వెళ్ళిన రోజు సాయంకాలమే రామారావు తమ ఇంటికి వచ్చేవాడు. "అక్కడ ఎలా ఉంటున్నది విమల?" అనేవాడు. ఇప్పటికైనా కొంత బాధ మరచిపోగలుగుతున్నావా? లేదా? అన్నట్లు జాలిగా చూస్తూ.

"అక్కడ ఎలా ఉండటానికి అవకాశాలున్నవో అలాగే ఉంటుంది" అనేది విమల తనకళ్ళల్లో నీళ్ళు కనపడకుండా తలవంచుకుని. విమల అత్తవారింటి వద్ద ఉండగా రామారావు ఆవూరు ఏదోపనిమీద వెళ్ళి విమల యింటికికూడా వెళ్లాడు. అప్పుడు చాలా సంతోషంగానే మర్యాదచేసింది. తరువాత ఆలోచించుకుంటేమాత్రం తన అత్తవారింటికి రామారావు రావటం ఏమంత మర్యాదగా ఉండదేమోననుకుంది. తను పుట్టినింట్లో ఉన్నప్పుడు తరువాత ఒకసారి "మీ రెప్పుడైనా ఇక్కడకు వస్తూఉండటం వల్ల లోకు లేమీ అనుకోరుకదా?" అన్నది రామారావుతో. రామారావు మనస్సు చివుక్కుమన్నది.

"అవును అందుకనే రావద్దనుకుంటున్నాను నేను కూడా. కాని నేనెందుకో రాలేదనుకుంటానేమోనని

వచ్చాను. ఇకముందు రాను క్షమించు.'' అన్నాడు రామారావు నేరస్థునిలాగ.

''నేనిలా అన్నందుకు కష్టంగా ఉన్నదామీకు!''

''ఎందుకు కష్టం? నేనే చెపుదామనుకుంటున్నాను ఇకరానని. కాని నీవే ముందు చెప్పగలిగినందుకు చాలా సంతోషిస్తున్నాను.''

''లోకం ప్రతిమనిషినీ అర్థం చేసుకునే పరిస్థితిలో లేదుకదా? తరువాత మనలను అర్థంచేసుకోలేని లోకాన్ని నిందించేకంటే మనమే లోకాన్ని అర్థం చేసుకుని నడుచుకోవటం మంచిదని అన్నాను.''

''అవును తప్పకుండా అలాగే నడచుకోవాలి. గౌరవం పోయినతరువాత ఈ లోకంలో ఎందుకూ పనికిరాం.''

''మీకు కష్టంగా ఉంటుందేమోనని చాలా భయపడ్డాను. కాని అలా జరగనందుకు చాలా సంతోషం''

''అసలు నీవు ఇక్కడకు వెంటవెంటనే వస్తూ ఉండటంగాని, నేను మీ యింటికి రావటంగాని-ఇది కూడా ఏమంత బాగాలేదనుకుంటాను.''

''నిజమే. నేనిక్కడకు వచ్చినందువల్ల మీరు ఎక్కువగా కనుపిస్తూ ఉండటంవల్ల మనస్సుకు కొంత ప్రశాంతంగా ఉండటమే కాకుండా ఈ నీళ్ళలో లేక చిన్నప్పటినుంచీ ప్రేమతో పెంచిన అమ్మ అన్నయ్యవాళ్లు దగ్గర ఉండటానోకాని ఆరోగ్యం కూడా చాలా బాగుంటుంది. అందువల్ల కూడా ఇక్కడకు ఎక్కువగా వస్తూఉంటాను. ఈ విషయంకూడా చెప్పకుంటూనే ఉంటారట అక్కడవాళ్ళంతా మాట్లాడితే పుట్టినింటికివెళ్ళి కూర్చుంటుందని. కాని ఏంజేయను? అబ్బ! అక్కడ ఒక్కనిమిషం ఒక్కయుగంగా గడుస్తుంది. ఆవూరు కొత్తకావటాన నేనెవరింటికీ పోయేదీలేదు ఎవరు మా యింటికివచ్చేదీ లేదు. కొంచెం సరదాగా మాట్లాడుకోవటానికి తగ్గ మనుష్యులెవ్వరులేరాయింట్లో. నిజంగా ఇంకొకళ్ళైతే ఈపాటికి ఏంజేసి ఉందురో అనుకుంటాను.''

''ఎవరైనా చేసేదేముంది? అయిందేదో అయింది. ఇక మనగౌరవం మనం కాపాడుకోవటమే కావలసింది.''

''అలా అనుకునే ఇకమీదట ఇక్కడకుకూడా రావద్దనుకున్నాను. అనవసరంగా లోకులచేత నిందలు భరించటం దేనికి? ఏదో ఒకరకంగా అక్కడే జీవించగలిగినంతవరకు జీవించేదీ ఆశక్తి కాస్తానశించగానే రాలిపోయేది. ఇకమీదట మాత్రం ఇక్కడకురాను'' అని కళ్ళకు పైటచెరగు అడ్డం పెట్టుకుంది. రామారావు ఇక నక్కడ కూర్చోలేక వెంటనే లేచి పోయాడు. అంతే. మళ్ళీ కనపడలేదు రామారావు తనకు.

అదంతా ఒక్కసారి జ్ఞాపకంవచ్చింది విమలకు. తానింతకాలాన్నుంచీ సంఘంలో గౌరవం కోసమని చేసినదంతా ఈ రకంగా పరిణమించినందుకు చాలా పశ్చాత్తాప పడింది. లోకంలో మంచికి మంచి లభ్యమయ్యే సమయం ఎప్పుడొస్తుందో అని ఆవేదనతో కళ్లుమూసుకుంది. ఒక్కసారి రామారావు కనపడ్డాడు, చివరి క్షణాల్లోనైనా చివరిసారిగా తన రామారావుకు తన హృదయాన్ని విప్పిచూపించాలనిపించింది. అది ఈ పరిస్థితుల్లో ఉత్తరంద్వారా తప్ప సాధ్యపడదు. లేనిసత్తువను ఉత్సాహాన్ని బలవంతాన తెచ్చిపెట్టుకుని లేచికూర్చుని వెంటనే ఉత్తరం వ్రాసి రామారావుపేర పోస్టు చేయమని తమ అన్నయ్యచేతికిచ్చింది. ఆ ఉత్తరం పూర్తికాగానే తన బాధ్యత ఈ ప్రపంచంలో తీరిపోయినంత సంతృప్తితో ఒక దీర్ఘ నిశ్వాసం వదలుతూ అతినీరసంగా మళ్ళీ పక్కమీద వాలి కళ్ళుమూసుకుంది.

రామారావు విమలను గురించి బాధపడగాపడగా తానెందు కీవిధంగా బాధపడుతున్నాడో అర్థంకాక మెదడులో ఒకవిధమైన ఆలోచన బయలుదేరింది. విమల ఆ పరిస్థితికి రావటానికి కారణం తానుకూడా నేమో ననుకున్నాడు. ఆమె ఆలోచనలవెంట నేను

పడిపోయానే కాని ఆమెకు సరియైన మార్గాన్ని చూపలేకపోయా ననుకున్నాడు. ఏది ఎలాగైనా విమల ప్రస్తుతం జబ్బునుండి బయటపడితే అదే పది వేలనుకున్నాడు. విమల అన్నవద్దనుంచి జవాబుకోసం నిరీక్షిస్తూ వరండాలో అటూ ఇటూ పచారుచేస్తున్నాడు కాలుకాలిన పిల్లిలాగా. అంతలోకీ ఉత్తరం వచ్చింది. ఆత్రతతో చింపాడు. అది విమల వ్రాసిన ఉత్తరం. ఆప్యాయంగా హృదయానికి హత్తుకుని మెల్లగా చదవటం ప్రారంభించాడు.

రావ్వూ,

నీకు ఉత్తరంవ్రాయటం నా జీవితంలో ఇదే మొదటిసారి ఆఖరిసారికూడా అనుకుంటాను. ఈ బాధలతో ఇక నేను ఎక్కువ కాలం జీవించలేను. జీవించాలనే కోరికే నశించింది. డాక్టర్లు కూడా నిరాశాపూరితమైన చూపులు చూస్తూ మా అన్నయ్యతో ఏమిటో రహస్యంగా మాట్లాడిపోయారు. మాఅమ్మ అన్నయ్య చాటుచాటుగా కళ్ళనీళ్లు తుడుచుకుంటున్నారు. దీనిని బట్టైనా జీవించననే నిర్ణయానికి రావచ్చు. కాని చివరి పరిస్థితుల్లోనైయినా పొరపాటును నేను గ్రహించినందుకు చాలా సంతృప్తిగా ఉంది. నిజంగా గౌరవంకోసమని జీవితం అంటే ఏమిటో తెలియకుండా జీవితంలో సహజంగా ఉండే కోరికలేవీ తీర్చుకోనకపోవటమే కాకుండా తలంపులోకి కూడా రానివ్వకుండా వాటిని విషపు పురుగుల్లాగా భావించాను. ఇదంతా ఎవరికి తెలుసు? అంతా నాకే ఎదురైందీనాడు. ఇప్పుడు ఎంత విచారించినా ఏమి ప్రజయోజనం? నాకీ సంబంధం వచ్చిననాడే ఎదిరించవలసింది. అప్పుడే పెద్దపొరపాటు పడ్డాను. ఆ పరిస్థితుల్లో నీవైనా నాకు కొంచెం ప్రోత్సాహం ఇస్తే ఎలా ఉండేదో రావ్వూ! ఇక మాత్రం ఇలాంటి పొరపాటు పడవనుకుంటాను. పోనీ నా జీవితానుభవమే నీకూ లోకానికీ కూడా పాఠం చెపుతుందిలే!

విమల.

రామారావు పుస్తకంలో పుటలు తిరగవేస్తున్నట్లుగా మెదడును తిరగవేస్తూ హృదయ ఖారంతో కుర్చీలో కూలబడ్డాడు.



# రాష్ట్రపతికి లేఖ

## శ్రీ టంగుటూరి ప్రకాశం

శ్రీ కృపాలనీగారు!

మీరు నాకు వర్కింగుకమిటీ మార్చి ఆరవతారీఖున చేసిన తీర్మానం చూపించగానే, ఆ తీర్మానంలో "శ్రీ ప్రకాశంగారు ఇకనించి పార్టీ లీడరుగా ఉండకూడ"దని ఉంది. కాబట్టి వెంటనే నేను నా రాజీనామా పత్రం మీచేతుల్లో ఉంచాను. ఈవిధంగా ఆజ్ఞాపించడంలో వర్కింగు కమిటీ "శాసనసభ్యుల్లో చాలామంది శాసనసభా నాయకులు, ప్రధానామాత్యులు అయిన శ్రీ ప్రకాశంగారిమీద విశ్వాసరాహిత్యం నిష్కర్షంగా తీర్మానించినట్టుగా" అభిప్రాయపడడమే కారణము. అంతేకాదు, ఈవిధంగా "నిష్కర్షగా శాసనసభ్యుల్లో అనేకులు విశ్వాసంలే"దని చెప్పినప్పుడు శాసన సభానాయకుడుగా ఉండడం కూడా అనుచితమని వర్కింగుకమిటీ అభిప్రాయ పడింది. వర్కింగుకమిటీ తీర్మానంలో "కాంగ్రెసు గౌరవాన్ని" గురించి ప్రస్తావించారు. ఆ "కాంగ్రెసు గౌరవం" సంరక్షించే అభిప్రాయంతోనే నేను మీ ఆదేశానుసారం నాపదవికి రాజీనామా ఇచ్చి, దానివల్ల వచ్చే పరిణామాలన్నీ ఎదుర్కున్నాను. ఇప్పుడు శాసనసభా నాయకుని విషయమైన ప్రశ్న సమసిపోయింది కాబట్టి ఈక్రింది విషయాలు నేను వర్కింగు కమిటీ పర్యవేక్షణకోసం నివేదించడం సముచితమని అనుకుంటున్నాను.

ఎల్లాంటి దోషికైనా నేరారోపణ తెలియజేయడము, ఆత్మనిర్దోషిత్వం స్థాపించుకోడానికి అవకాశం ఇవ్వడము అనేవి ఉన్నాయి. వర్కింగుకమిటీ నామీద ఎల్లాంటి దోషారోపణా చెయ్యలేదు; నావిషయం నేనే మీ చెప్పుకోవడానికి అవకాశం ఇవ్వకుండానే నేను శాసనసభానాయకుడుగా ఉండడానికి అనర్హుణ్ణని నిర్ణయించింది.

వర్కింగుకమిటీ చేసిన తీర్మానంలో "కాంగ్రెసు కార్యక్రమం ఆచరణలో పెట్టడంలో ఏవైనా అడ్డంకులు వస్తే తప్ప కమిటీరాష్ట్రీయ వ్యవహారాల్లో కలగజేసుకో"దని సూచించింది. "ఇన్నాళ్ళనించీ ఈవిషయం ఇల్లాగే జరుగుతూం"దని కూడా ఆ తీర్మానంలో ఉంది. అయితే ఆచరణలో మాత్రం వర్కింగు కమిటీ ఈ తీర్మానం అతిక్రమించి చాలా దూరం వెళ్ళింది. అయితే ఇక్కడ మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వం ఏ విషయంలోను కూడ కాంగ్రెసు కార్యక్రమానికి వ్యతిరేకంగా వెళ్ళలేదని చెప్పవలసి ఉంది. ఇక కాంగ్రెసు క్రమశిక్షణ విషయంలో చూడామంటే, కాంగ్రెసు వర్కింగుకమిటీ అవలంబించిన విధానంవల్ల అది ఏమాత్రము బాగుపడలేదని ఈక్రింద విషయాలనిబట్టి తెలుస్తుంది.

ఒక రాజకీయపక్షం అధికారంలోకి వచ్చినప్పుడు ఉద్యోగాల విషయంలో ఆ పక్షంలో ఉన్నవారినందరినీ ఎప్పుడూ కూడా సంతృప్తిపరచలేదు. అందుచేత కొంతమందికి మంత్రి పదవులు రాలేదని లోలోపల ఉక్రోషం ఉండితీరుతుంది. అయితే ఈ పదవుల విషయంలో ఒకసారి ఒక నిర్ణయం జరిగిపోయిందని తెలియగానే, ఆపక్షంలోని వారంతా పక్షనాయకుని నిర్ణయానికి కట్టుబడి క్రమశిక్షణకి అనుకూలంగా ప్రవర్తిస్తూ ఉంటారు. కాని కాంగ్రెసు కార్యవర్గమే పైనించి మంత్రివర్గం కూలదోయడానికి సంతకాలు

జాగర్త చెయ్యవలిసిందని సలహాలిస్తూంటే కొంచెం అటూ ఇటూ ఊగిసలాడేవాళ్ళు కూడా మంత్రివర్గ ప్రతికూల పక్షంలోచేరి నూతన మంత్రివర్గంలో పదవులకోసం అర్రులు చాచడం సహజము. మౌలానా అబుల్ కలాం అజద్ నాతో పార్లమెంటరీ కమిటీ మద్రాసు వ్యవహారాల్లో జోక్యం కలగజేసుకోవలసిందని మాటిమాటికీ మద్రాసు సభ్యులు ప్రార్థిస్తూన్నట్లు చెప్పాడు. కాని దానికి ఆయన ఎంత మాత్రమూ సమ్మతించలేదట! ఆయన దీనికి సమ్మతించక పోయినా ఇతరులు దీనికి అంగీకరించినట్టు కనిపిస్తుంది. అసలు శ్రీశంకరరావు దేవుని ఈమంత్రివర్గం సమస్య విచారించడానికి పంపించడంలోనే మద్రాసు మంత్రివర్గాన్ని అపనిందపాలు చెయ్యాలనే ఉద్దేశం ఉన్నట్టు కనిపిస్తుంది. ఆయన ఇక్కడికి వచ్చినప్పుడు ఊరంతా "ఆయన ఉన్న మంత్రివర్గాన్ని తొలిగించి కొత్త మంత్రివర్గం స్థాపించే ఉద్దేశంతో వచ్చా"రని బాగా పుకారుగా చెప్పుగున్నారు. ఆపైన అప్పటికి కాంగ్రెసు లెజిస్లేచరు పార్టీలో ముందు ముందు ఏ పక్షం నెగ్గుతుందో ఊహించుకుని ఆ ప్రకారం, ఓట్లు వేశేవారు బాగా ఉన్నారు. విశ్వాసరాహిత్య తీర్మానానికి అనుకూల్యం చూపించడంవల్ల, కార్యవర్గము, మంత్రివర్గవిచ్ఛేదానికి బాగా మార్గదర్శకులయ్యారు. అసలు మంత్రివర్గాన్ని కాంగ్రెసు కార్యవర్గం సంరక్షించి ఉండవలిసింది. కాని ఈ విశ్వారాహిత్యానికి ప్రోద్బలం ఇవ్వడం అనే అస్త్రంతో దాన్ని ఛిన్నాభిన్నంచేసి ఛేదించివేసింది!

ఫిబ్రవరి ౨౮వ తేదీని జరిగిన లెజిస్లేటివుపార్టీ మీటింగులో నేను నాతుది తీర్మానం చెప్పవలసి వచ్చింది. పార్టీ నియమావళి ప్రకారం ఏదో ఒక నిర్ణయం చెప్పక తప్పింది కాదు. నేను ఆ నియమాలన్నీ చాలా జాగ్రత్తగా పరిశీలించాను. వాటిల్లో ఎక్కడా కూడా పక్షనాయకుని మీద విశ్వాస రాహిత్యం ప్రతిపాదించడానికి అవకాశంలేదు. ఒక నిర్ణయం మంచిదైనా చెడ్డదైనా పార్టీలో వారంతా ఆ నిర్ణయానికి తలవొగ్గి అది అక్షరాలా ఆచరణలో పెట్టవలిసిందే! ఇంక ఈ విషయానికి పార్టీ వ్యతిరేకించినప్పుడు ఏ ప్రజాసంస్థలోను, కూడా ఒక పద్ధతి-క్రమశిక్షణ ఉండడం దుర్ఘటమైపోతుంది. అధ్యక్షుని తుదినిర్ణయానికి బద్ధులు కాని వారు దారుణమైన క్రమశిక్షణా భంగంచేశారు. ఇల్లాంటి చర్యలకి ఎల్లాంటి చర్యలు తీసుకోవాలో అన్న విషయము, దాని విషయమైన అత్యావశ్యకత, నేను కార్యవర్గానికే వదిలివేస్తున్నాను.

నేను కాంగ్రెసు, లెజిస్లేజరుపార్టీ విశ్వాసం పోయినా పక్షనాయకత్వపదవి పట్టుకుని వేళ్ళాడతాననే దృష్టితో ఉండి వ్యవహరించిందనుకుంటాను. పదవులు అనే మాటేలేని పురాతనకాలంనించీ నేను కాంగ్రెసుకోసం నా సర్వస్వమూ ధారపోశాను. అటువంటప్పుడు నా విషయమై ఇటువంటి అభిప్రాంయంతో ఉండడం చాలా అన్యాయము. చిరకాలనించి కాంగ్రెసుసేవ చేస్తూన్న నావంటివాడి విషయంలో కాంగ్రెసు కార్యవర్గానికి అనుమానం ఉన్నా, నేను మార్చి 30వ తేదీని పార్టీ మీటింగు ఏర్పరిచానన్న విషయమైనా అటువంటి అనుమానాలనుపోగొట్టి ఉండవలసింది. ఆ మీటింగు ఇంకా కొంచెం ముందుగానే ఏర్పాటు చేదామనుకున్నాను గాని, ఇక్కడకూడా "కాంగ్రెసు గౌరవ"మే నన్ని విధంగా చేయించింది. బడ్జెట్టు పూర్తి కాక పోవడమే ఈ ఆలస్యానికి కారణము. ఈ విషయంలో కొంత జవాబుదారీతో వ్యవహరించాలిగాని, చిత్తం వచ్చినట్లు వ్యవహరించడానికి వీలులేదు. ఇందులో రాష్ట్రం

మంచిచెడ్డలుకూడా ఆలోచించవలసి ఉంది. పార్టీ మీటింగులో కొన్ని విషయాలు ఆమోదించబడ్డాయి. అవన్నీ బడ్జెట్టులో ప్రవేశపెట్టాలి. హఠాత్తుగా మధ్యన మంత్రివరం మారితే ౯౩ వ సెక్షనుకూడా అమలులోకి వచ్చే సూచన లున్నాయి. నిలుచున్న పాటుగా నేనీ జవాబుదారీలన్నీ విడిచిపెట్టడానికి వీలులేకపోవడంవల్ల పైవిధంగా వ్యవహరించవలిసి వచ్చింది.

ఇంక వర్కింగుకమిటీ తమ తీర్మానంలో "పార్టీలో చాలామందికి నా మీద విశ్వాసంలే"దని వ్రాశారు. ఈ "విశ్వాస రాహిత్య విషయంలో నా అనుభవం కొంత విశదపరుస్తాను. డాక్టరు రాజన్ మార్చి ౧ వ తేదీని హిందూలో ప్రచురించిన ప్రకటనలో "ఇప్పుడు తేలవలిసిన ప్రశ్న ఏమిటంటే రాజాజీ పక్షంలోంచి మంత్రివర్గం బలపరచడానికి ఎంతమదిని తీసుకోవలిసి ఉంటుంది అన్నదే!" అన్నాడు. గడచిన మాసపు పరిస్థితులు అవి. ఆయన అభిప్రాయ ప్రకారం నా మంత్రివర్గం మీద విశ్వాసరాహిత్యం తీర్మానించడం గాని, నన్ను రాజీనామా ఇవ్వమని అడగాలనిగాని అప్పట్లో అనుకున్నట్లు కనబడదు. తరువాత అవిశ్వాస తీర్మానం బయలుదేరటానికి కారణాలేమిటో తెలుసుకోవాలంటే ఇంతకంటె వేరేవిషయం ఏమికావాలి? కాంగ్రెసు శాసనసభ్యు లంతా వర్గాలుగా మారిపోయారు. ఈ వర్గాలు తమ బలాలన్నీ మంత్రి పదవులు గుంజుకోవడానికి సాధనాలుగా ఉపయోగించాయి. వారు మంత్రిపదవులకోసం చేసిన హంగామాలో కాంగ్రెసు కార్యక్రమానికి సంబంధించిన ప్రశ్నలేవీ బయలుదేరలేదు. అదీగాక వారు అభిలషించే పదవులసంఖ్యను; వారికి అనుకూలంగాఉన్న సభ్యుల సంఖ్యలకు కూడా ఎక్కడా తాడు, బొంగరము అందడంలేదు. న్యాయంగా ఈ వర్గాలకి రావలసిన వాటికంటె వారిగొంతెమ్మ కోరికలు అత్యధికంగా ఉండేవి. అల్లాంటప్పుడు వారి కోరికలు తీరకపోవడంలో ఆశ్చర్యమేమీలేదు. వెంటనే దానికి పర్యవసానం "విశ్వాస రాహిత్యం" కింద పరిణమించింది. ఇక్కడఒకచిన్నవిషయంచెప్పవలసి ఉంది. వర్కింగు కమిటీ తీర్మానానికి కారణమైన విశ్వాసరహితుల సంతకాలసంఖ్య తప్పని మార్చి ౨౧వ తారీఖున జరిగిన ఎన్నికల ఫలితాన్నిబట్టి రుజువయింది. అసలు ఆ సంతకాల జాబితా శ్రీ శంకరరావ్‌దేవ్ మద్రాసునించి ఢిల్లీవెళ్ళిన తరవాతగాని నాకు అందనేలేదు. ఆ సంతకాల జాబితాలో ప్రముఖులయిన శ్రీ అన్నామలై పిళ్లై, శ్రీ అర్. వి. స్వామినాథన్‌గార్లు తరవాత నాపార్టీ నాయకత్వంకోసం బాగా ప్రచారం చేసిన వారిలో ప్రముఖులయ్యారు. ఆ సంతకాల పట్టికలో పేరులున్న ఇద్దరు ప్రముఖులు ఆ సంతకాలు మావికావని పత్రికల్లో బాహాటంగా ప్రకటించారు. ఇంకో ఇద్దరు తమదగ్గిర సంతకాలు గుంజుకోవడానికి ఏయే పద్ధతులు అవలంబించబడ్డాయో తెలియజేస్తూ బహిరంగంగా ప్రకటించారు. వర్కింగుకమిటీగాని, మీరుగాని, ఈ విషయంలో నిర్ణయానికి వచ్చేముందు నేను ఈ విషయంలో ప్రత్యేకంగా కోరిన విచారణ జరిపించి, ఈ సంతకాల జాబితా ఎల్లాగ తయారయిందో పరీక్షించి ఉండవలిసింది.

ఒక రాజకీయ పక్షంలో ప్రత్యేక వర్గాలుండడం క్రమశిక్షణ నిర్మూలించి వేస్తుంది. ఇంతేగాదు; ఈ వర్గ పక్షపాతం ఒక్కొక్కప్పుడు, అసలు పార్టీ ఆశయాలకే విరుద్ధంగా తయారయ్యేది. అసలు ఈ విశ్వాసరాహిత్య తీర్మానం బయలుదేరడానికి చాలా కాలం పూర్వమే కొంతమంది వర్గనాయకులు మంత్రివర్గంమీద నీలాపనిందలు బయలుదేరదీశారు. పక్ష నియమావళి ప్రకారం పార్టీలో వర్గా లుండ

## రాష్ట్రపతికి లేఖ

డానికి వీలులేదు. అందుకని నేనీ వర్గాల సంగతి తుదముట్టించడానికి ప్రయత్నించాను. ఈ అభిప్రాయంతోనే కాంగ్రెసు వర్కింగు కమిటీ ప్రత్యేక సమావేశం ఏర్పాటు చెయ్యవలిసిందనీ, అందులో కాంగ్రెసు లెజిస్లేటివు పార్టీలో వర్గాలుండడంవల్ల కాంగ్రెసు లెజిస్లేటివు పార్టీకికలిగే అనర్థాలు విచారించవలిసిందనీ కోరాను. కాని, కాంగ్రెసు కార్యవర్గం నా కోరిక లేవీ లక్ష్యపెట్టకుండా ఒక నిర్ణయానికి వచ్చేశారు. చివరికి నేను చెప్పవలసింది కూడా వినలేదు. దీనివల్ల నేను మళ్ళీ పార్టీనాయకుడుగా ఎన్నుకోబడడానికి చాలా అవాంతరాలేర్పడ్డాయి. ఇందుచేత ఈ రాష్ట్రంలో కాంగ్రెసు కార్యాచరణకు చాలా అడ్డంకులేర్పడ వచ్చును. ఇక్కడ ఒక విషయం ముఖ్యంగా గమనించవలిసిఉంది. ఈ తీర్మానంచేసిన కార్యవర్గంలో ఒక సభ్యుడు మద్రాసు లెజిస్లేటివు పార్టీలో ఒక వర్గానికి నాయకుడు; ఆ పైన భారత ప్రభుత్వంలో ఒక సభ్యుడు కూడాను!

ఈ జరిగిన ఎన్నికలలో ౧౧౬గురు నాకు వ్యతిరేకంగా వోటుచేశారు. ఈవిషయంలో మీరు ఆలోచించవలసిన ప్రశ్నలివి: ఈ వోట్లు ఎల్లాంటివి? అవి నిజాయితీ ఉన్న వోట్లేనా? లేకపోతే ఇందులో వర్గరాజకీయాల సంబంధం ఏమైనా ఉందా? విశ్వాసాన్నిగురించీ విశ్వాసరాహిత్యాన్ని గురించీ కాంగ్రెసు లెజిస్లేటివు పార్టీ సభ్యులు అవలంబించిన వైఖరివల్ల ప్రజాసామాన్యంలో ఎంత ఉక్రోషం బయలుదేరిందో మీరు గ్రహించలేరు.

ఒక రాష్ట్రీయ ప్రభుత్వం ప్రజాసామాన్యం ఉపయోగంకోసమై ముఖ్యమైన కార్యక్రమం అమలులో పెడుతూంటే—దాని విషయమై ఈవిధమైన వైఖరి అవలంబించడం ఏమీ బాగాలేదు. ఇప్పటికి కూడా నేనొకవిషయం అడుగుతున్నాను. ఒక ప్రముఖుడైన హైకోర్టు జడ్జీని ఏర్పాటుచేసి ఒక నిష్పాక్షికవిచారణ జరిపించండి. అంతేగాని ముందే పక్షపాతదృష్టి ఏర్పరుచుకున్న కమిటీని ఏర్పరచకండి. నేను ఇదంతా ఈ రాష్ట్రంలో కాంగ్రెసు గౌరవము, కాంగ్రెసు హైకమాండు గౌరవము, సంరక్షించడానికే చేస్తున్నాను. అంతేగాని పోయిన నా ఉద్యోగం తిరిగి సంపాదించుకోవడం కాదని గమనించ గోరుతున్నాను.

భవదీయుడు
టంగుటూరి ప్రకాశం



# రేవతి డైరీ

శ్రీ "కౌండిన్య"

సరస్వతి శశిభూషణరావులు భార్యాభర్తలు.

[సమయం:— ఉదయం సుమారు 7 గంటలకు. స్థలం శశిభూషణరావు యింట్లో డ్రాయింగ్ రూము. రావు కుర్చీలో కూర్చుని ఏదో శూన్యాకాశం వైపు చూస్తూఉంటాడు. సరస్వతి కాఫీకప్పు చేత్తో పుచ్చుకుని పక్కనే నుంచుని ఉంటుంది.]

శశిభూషణ:-(నిస్పృహగా) ఏమిటో యీవాళ మనస్సేం బాగాలేదు సరూ. ఏం, బాగాలేదు.

సరస్వతి:-ఏం మళ్ళీ ఏమొచ్చింది. మీ స్నేహితురాలు రేవతమ్మగారు జ్ఞాపకం వస్తున్నారేమిటి?

శశి:-పోదూ, నీ వేళాకోళం నువ్వూను!

సర:-(కొంటెగా) నిజం చెప్పండీ. ఇప్పుడు మీ కావిడ జ్ఞాపకం వచ్చిందా లేదా? అబద్ధం ఆడకూడదు...ఏం?

శశి:-(నిదానంగా) అవును. ఏమిటో పొద్దున్న నిద్ర మెలుకువవచ్చే సమయానికి...కళ్లకట్టినట్లుంది ఇప్పటికీ......కల. తెల్లచీర కట్టుకుంది. ప్రింటెడ్ బోర్డర్. నే కొన్నది, జ్ఞాపకం ఉందా, పుట్టిన రోజు ప్రెజంట్ ఇచ్చాము...ముద్దుగా కట్టుకుంది.

సర:-కాఫీ చల్లారిపోతోంది.

శశి:-జడలో గోరింటపువ్వులు, చిరునవ్వు నవ్వుతూ ఆ కళ్లు, మా స్నేహం మొదటిరోజులు జ్ఞాపకంవచ్చాయి...గుమ్మంలో నుంచుంది..."రా, లోపలికి" అన్నాను..ఏముటోలా చూసింది. చేతులో ఓ గోరింటపువ్వుల గుత్తి...అది ఇద్దామా మానదామా అని అన్నట్లుగా చూస్తూ నిలబడింది.

సర:-ఇవ్వడాని సందేహం ఎందుకు. మీ కిష్టమేనని తెలుసుగా. నేను ఉంటే పక్కన [illegible] సందేహింపవచ్చు. మీ కళ్లల్లో నేనుండనుగా. ఉంటే మాత్రం నేనేం ఒద్దంటానా. ఇచ్చేదావిడ పుచ్చుకునేవారు మీరూను. మధ్యనే నెవరు?

శశి-ఏమిటో...పోనిద్దూ. కలనిపట్టుకుని మనం దెబ్బలాడుకోవడం ఎందుకు?...మూడేళ్ళయింది కాదూ......

సర:-(మాట కడ్డువస్తూ) ఊరికే అన్నానండీ. అప్పుడే కోపం...చెప్పండి.

శశి:-ఏముంది చెప్పేటందుకు—అలాగే నిలబడిపోయింది గుమ్మం దగ్గరే కొంచెం సేపు...కల కరిగిపోయింది.

సర:-అబ్బ. అలాకాదు, సరిగ్గా చెప్పాలి...నిజంగానే, నేనేం మాట్లాడను, చెప్పండి వింటాను...చెప్పరూ?

శశి:-అలాగే నిలబడిపోయింది. అబ్బ, తలుచుకుంటే ఏమిటో గుండె ఝల్లుమంటుంది ఇప్పటికీ...అలానుంచున్న మనిషి చూస్తూచూస్తూ ఉండగానే మారిపోయింది. ఆ నవ్వు ముఖం అంతాపోయిఏమిటో ఒక విచారరేఖ...నిస్పృహా...ఆ ముఖంలో కనిపించాయి. చూస్తూ చూస్తూ ఉండగానే, ఆ తెల్లచీర మసకమసకయిపోయింది ... రేవతి గాలిలో కరిగిపోయింది. రివ్వున గాలి వీచింది. ఎక్కడినించో ఒక

పేకముక్క ఎగిరివచ్చి మన గుమ్మానికి తగిలి ఇంట్లో పడింది. కొంతసేపు నివ్వెరపోయి చూస్తూ నిలబడ్డాను. తరవాత ఆ పేకముక్క ఏమిటా అని తీసి చూశానుట...ఘుమఘుమలాడుతూ అక్కడ పడి ఉన్న ఆ గోరింటగుత్తిని తీసి నువ్వు తలలో పెట్టుకున్నావుట.

సర:-అదేమిటి నే నెక్కణ్ణించొచ్చాను అక్కడికి!

శశి:-ఎక్కణ్ణించి రావడమేమిటి. నువ్వింతసేపూ నా ప్రక్కనే ఉన్నావుట. (సందేహంగా) ఉన్నావు కాబోలు.

సర:-ఉన్నాను గదా పోనీ...ఆ పేకముక్క ఏమిటిట?

శశి:-నలిగిపోయి, తూట్లుపడ్డ అరకు ఆసు.

[బయటనుంచి]

పోస్టు:-శశిభూషణ్ రావుగారు.

శశి:-వెళ్ళిచూడు.

[సరస్వతి బయటికివెళ్ళి పోస్టుబంట్రోతిచ్చిన ఒక Packet పట్టుకుని లోపలికి వస్తుంది.]

సర:-ఏదో రిజిస్టర్డ్ ప్యాకట్ అండీ. పుస్తకంలాగుంది.

శశి:-(ఆశ్చర్యంగా)రిజిస్టర్డ్ ప్యాకెట్టా. పొద్దున్నే రిజిస్టర్డ్ ప్యాకెట్ ఏమిటి?

పోస్టు బంట్రోతు:-నిన్నే వచ్చిందండి. కాని తమరింటి దగ్గరుండరుగదా మధ్యాహ్నం అని, ఇప్పుడు తెచ్చానండి.

శశి:-[ప్యాకెట్ చూస్తు] - కల్కటా - ...... From ......

సర:-అదేమిటి అలా విస్తుపోయి చూస్తూ కూర్చున్నారు. అతన్ని పంపెయ్యండి, రసీట్ సంతకంచేసి. ఎవరి దగ్గరనుంచి.

శశి:-(పోస్టు బంట్రోతుతో) ఇదుగో రసీట్... (నిట్టూర్చి) - రేవతి దగ్గరనుంచి!

సర:-రేవతి దగ్గరనుంచా? చిత్రంగానే ఉందే!

శశి:-ఇదుగో యీ సంతకం ఆర్ పొడక్షరం. అప్పటికీ, ఇప్పటికీ...మనిషి మారినా సంతకం మారలేదు.

సర:-కాని తమాషాయే. ఇప్పుడే మనం ఆవిణ్ణి గురించి మాట్లాడుకుంటున్నాం, ఆవిడ దగ్గరనుంచి ఉత్తరం!...విప్పండి ప్యాకెట్, ఏం పుస్తకమో.

శశి:-ఏమిటో విప్పిచూడ్డానికి అట్టే ఉత్సాహంగా లేదు సరూ. పొద్దున్నటికలే జ్ఞాపకంవస్తోంది ...(Packet మెల్లిగా విప్పుతాడు)

సర:-మొత్తంమీన చాలా అందంగా ప్యాక్ చేసిందండి. ఎంతమంచి పుస్తకమోగాని, మొఖమల్ గుడ్డలో చుట్టిపంపింది...మీరేగాని, నేను చూడకూడదేమో! లోపలే చదువుకుంటున్నారు.

శశి:-చూడు. (పుస్తకం సరస్వతిచేతికిస్తాడు. ఆ పుస్తకం అట్టమీద వ్రాసినది చదువుతుంది సరస్వతి)

సర:-"ఛిన్న తంత్రి"—నా జీవయాత్ర. ప్రియమయిన నా శశికి, సరస్వతికి, ప్రేమపూర్వకంగా... ఇంకేం—"ప్రియమైన నా శశి." బాగుండదని నా పేరు గూడా తగిలించింది. ఫరవాలేదు. ఇంక మీరు కుళ్ళక్కరలేదు.

శశి:-నాలుగేళ్ళయింది అలా నన్ను సంబోధించి, రేవతి. ఇన్నాళ్ళకి మళ్ళీ—నా ప్రేమ మీకెవరికీ అర్థంకాదు సరూ...ప్రేమంటే తప్పర్థం తీయడంతప్ప మీరు దాని ఔన్నత్యం నిర్మలత్వం గ్రహించలేరు.

సరు:-మీ రేవతి గ్రహించిందిగా, మూడేళ్లపాటు! ఆ తరవాత యింకోళ్లల్లో గ్రహించింది. ఇప్పుడు ఇంకా ఎంతమందిలో గ్రహిస్తుందో? అక్కడెక్కడో. కలకత్తాలో (లోపలిపుట చూస్తూ) ఇదేమిటి, ఏదో పుస్తకం అనుకున్నా! డైరీ!...

శశి:-రేవతిడైరీ ఆ! ఎంత జాగ్రత్తగా దాచుకునేది తెలుసునా వెనకటి రోజుల్లో...ఇలా తే.

సర:-(మొదటిపుటచూస్తూ) ఉండండి "సెప్టెంబర్ ౧౭" ...నిన్న సెప్టెంబర్ ౧౭ కాదూ. ఏ సంవత్సరం..."౧౯౪౦"—౬ ఏళ్లయింది...

శశి:-౧౯౪౦ సెప్టెంబర్ ౧౭! ఇలా తే సరూ, నే చదువుతా... "సెప్టెంబరు ౧౭—౧౯౪౦ క్వీన్ మేరీస్ హాస్టల్......కాలేజీలో విశేషం ఏంలేదు. కె కొంచెం పిచ్చిపిచ్చిగా మాట్లాడాడు. వీళ్ళకింకేం లేదు. నేను వినిపించుకోలేదు. సాయంత్రం సారథి హాస్టల్కొచ్చాడు. అతనితో కూడా ఎవరో స్నేహితుడు కూడా వచ్చాడు, ఇంట్రడ్యూస్ చేశాడు సారథి. కొత్తఆయన యూనివర్శిటీలో రీసెర్చి చేస్తున్నాడుట. శశిభూషణరావు కొంచెం గర్వంగల మనిషిలా కనిపిస్తాడు. పోనీ, నాతో మాట్లాడడానికి అంత నామోషీ అయితే నా దగ్గరకే రానక్కర లేదు."

ఫస్ట్ ఇంప్రెషన్ అదన్నమాట.

సర:-(వేళాకోళంగా) ఎవరు మీరేనా ఆమనిషి. మా బాగా వ్రాసింది.

"సెప్టెంబర్ ౧౮—౧౯౪౦, ౬—౩౦ ప్రొద్దున.

శశి:-కొత్తస్నేహితుణ్ణి గురించి తొందరపడ్డానేమో అనిపిస్తోంది. ఎందుకో, సెప్టెంబర్ ౧౭, జ్ఞాపకం ఉంచుకోవాలి."

సర:-ఎందుకుట?...రోజువారీగా చూస్తూ కూర్చుంటే అయినట్టే.

శశి:- (డైరీమూసేస్తూ) పోనీ మానేస్తా. సావకాశంగా ఇంకోమాటు చదువుకుందాం.

సర:-ఊఁ, అలా వల్లకాదు. ఓరెణ్ణాళ్లు పోనిచ్చి ఏరోజేనా తియ్యండి.

శశి:-డిసెంబర్,—ఊఁ డిసెంబర్ ౧౫.

డిశంబర్ ౧౫—౧౯౪౦.

"నా బర్త్డేపార్టీ కులాసాగానే గడిచింది. కాస్సేపు వీణవాయించాను. పెద్దపెద్దు ప్రెజెంట్స్ వచ్చాయి. పార్టీ త్వరగా ముగించుకుని హాస్టల్కి బయలుదేరాము. శశిభూషణ రావుగారి మకాం మైలాపూర్ కాబట్టి, నాతోనే వచ్చి హాస్టల్ గేటు దగ్గర దిగబెట్టారు. లోపలికి రమ్మన్నా రాలేదు. Thanks చెపితే కోపం వచ్చింది. దారిపొడుగునా ఎన్నో మాటలు నేను మాట్లాడాను గాని, ఆయనేం మాట్లాడలేదు. ఏమిటో తమాషా మనిషి. వెళ్ళబోతూ వెళ్ళబోతూ చాలా బాగా వాయించారండీ వీణ అని జేబులోంచి ఏదో చిన్నవస్తువు తీసి చేతులో పెట్టి, "బర్త్ డే ప్రెసెంట్, ఇది నాది" అన్నారు. చిన్న సీతాకోక చిలక బొమ్మ. అభ్రకపురేకుమీద, రంగు రంగుల పువ్వులరేకు లతికించి చేశారు చిన్నది. "చాలా బాగుందండీ" అన్నాను. "కాని క్షణభంగురం దాని అందం. ఆలోపలఉన్న నిర్మలమయిన అభ్రకమే నిత్యం." అని చిన్న నవ్వు నవ్వి చక్కా వెళ్లారు."

డిసెంబర్ ౧౬—౧౯౪౦ ఉదయం.

"రావుగారు అన్నమాటలే రాత్రంతా నా చెవులో ప్రతిధ్వనిస్తున్నాయి. సీతాకోక చిలుక. అవును, నన్ను నిజంగా అర్థంచేసుకున్న వారెవరు! పోనీ ఆ సీతాకోక చిలక్కిలాగే నాకూ లోపల నిత్యమయిన పదార్థం ఒకటి ఉందని గ్రహిస్తే అంతేచాలు... ఏమిటో మనస్సేం బాగులేదు...మాట్లాడక మాట్లాడక చివరికి యీ మర్మ సందేశం ఏమిటో... నాకేమి పిచ్చా ఏమిటి? ఆయనేమంటే నాకేం...

జూన్. ౧౩. ౧౯౪౧.

యీవాళేం బాగాలేదు. శశి, నాడైరీలో శశి అంటే తప్పేం, పిక్చర్కి రాలేనన్నాడు. వాళ్ళింటి

కెవరో బంధువు లొచ్చారుట...వాళ్లూ ఇప్పుడే రావాలీ?...మనిషిలో ఒక ఉదాత్తత ఉంది. ఒక ఓపిని...ఏదేనా నిదానించే మనిషిలా కనిపిస్తాడు. మొన్న ఏదో నోరుజారి, నా జీవితానుభవాలలో ఒక్కటి, మరిచిపోయి చెప్పేసి నాలుక్కరుచుకున్నాను...తరవాత కొంతసేపు మాట్లాడలేదు. చీకటడిం!తర్వాత హాస్టల్‌దాకా దిగబెట్టడానికి వస్తూ ఆ ప్రస్తావన మళ్ళీ ఎత్తాడు...ఎంత సానుభూతి! నిజంగా ఇదే ఇంకొోళ్ళయితే నన్ను యాగీచెసెయ్యరూ...ఏమిటో శశి ఉన్నంతసేపూ నా మనస్సులో ఒక ప్రశాంత వాతావరణం ఏర్పడుతోంది...ఇదంతా నా ఇమాజినేషన్ ఏమో.

ఏప్రిల్ ౨౫. ౧౯౭౨.

శశిభూషన్ నాకు శశి అయిపోయాడు. వారాని కొకమారయినా చూడకపోతే నాకెందుకో తోచదు. శశి భార్య వచ్చింది వాళ్ల ఊరునుంచి. ఇక్కడ కాపురం పెడతారట. అయితే శశి నన్ను చూడ్డానికి తరుచు రాడన్నమాట...శశి అలాంటివాడు కాడు, తప్పకుండా వస్తాడు...రాకపోతే, నేనే వెళ్లతాను ...వెళ్లను. తక్కిన స్నేహితులంతా నన్ను చూడ్డానికి ఒస్తూంటే యితన్నిమాత్రం నేనెందుకెళ్లాలి, చూడ్డానికి... వెళ్లాలి...ఎందుకో మాత్రం తెలియదు.

డిశంబరు ౬

శశి, సరస్వతి హాస్టల్‌కి చూడ్డానికొచ్చారు. సరస్వతినిగురించి నే నునుకున్నవన్నీ నిరాధారాలని నిశ్చయం అయింది. నన్నుగురించి ఏవో ఏవో చెడ్డ అభిప్రాయాలుంటాయని, శశికీ నాకూ ఉండే స్నేహాన్ని అపార్థం చేసుకుంటుందనీ అనుకున్నాను. కాని చాలా మంచి పిల్ల. శశికి తగిన భార్య. వాళ్ళిద్దరి దాంపత్యం చూస్తే నాకు ముచ్చటవుతుంది ......ఎక్కడో నూటికొకటి కోటికొకటి అలాంటి దాంపత్యాలు...అన్నట్టు మొన్నటిరాత్రిలా వుందీ అడిగాడు శశి, నాకెలాంటి భర్తకావాలని కోరుకుంటానని...నాకు సరస్వతికి పట్టిన అదృష్టం పడితేనా...ఛా యిదేమిది? మనస్సు ఇలా పోతోంది... నాకు పెళ్ళయే యోగమే ఉంటే ౬ ఏళ్లక్రిందటే అయిఉండేది. నాకు పెళ్లయితే నే పడ్డబాధలన్నీ ఎవరుపడతారు. ప్చ్...ఏమిటో నన్నంతా మరో మరో దృష్టితో చూసేవాళ్ళే కాని, నిజంగా ప్రేమించే వాళ్లు కనిపించరు. అందరు చదువుకున్న పిల్లల అదృష్టం ఇలాగే ఉంటుందో? నా రాతేనో ఇది... అబ్బ! తలనొప్పి బద్దలవుతోంది!"

శశి:-డిశంబర్......

సర:- డిశంబరు ౧౫ తియ్యండి. జ్ఞాపకంఉందా ఆరోజు. ఆరోజు రాత్రంతా కుళ్లుతూ కూర్చున్నారు, నిద్రకూడా పోకుండాను.

"డిసెంబరు ౧౫-౧౯౭౨

శశి:-"పొద్దురోజీ వాళ...శశితో అనవసరంగా మాటపట్టింపు పెట్టుకున్నాను. చూడ్డానికి వచ్చిన వెంటనే రావాలా వాదన...పోనీ అతనేనా కొంచెం మెత్తబడకూడదు. నేనే అనుకుంటే, నాకంటె పొగరుబోతూ. ఇద్దరికీ పట్టుదలే అయితే ...రేపు మళ్ళీవస్తాడా...ఇది...మనస్సులో పెట్టుకుని రావడం మానేస్తాడా...ఏమో...౧౭ సాయంత్రం ప్రయాణం అని తెలుస్తే వస్తాడేమో? తెలియదేమరి...నా అహంభావమే నన్ను ఇంతదాకా తెచ్చింది. ౧౬ రోజులు! శశిని చూడకుండా...అబ్బ ...వెళ్ళేలోపుగా ఒక్కమాటు రమ్మని కబురుచేస్తే ...నే చెయ్యను. అతన్నే రానీ...ఏం తనకు మాత్రం అంత పట్టుదల ఎందుకు? నాకంటె పెద్దగా...

పిచ్చిపట్టుదల......

జనవరి ౧. ౧౯౭౩ రాజమండ్రీ.

న్యూ ఇయర్ గ్రీటింగ్స్ అందరి దగ్గరినించీ

వచ్చాయి. నా శశిదగ్గరినించి తప్పు...శశికి నిజంగా కోపం వచ్చింది. ఉత్తరమేనా వ్రాశాడుకాదు. ఛీ నా పెంకితనంవల్లనే ఇంతవరకూ తెచ్చుకుని ఇంకా ఏడవడం ఎందుకు అభాగ్యురాలిని. మద్రాసు వెళ్ళడం తోటే క్షమాపణ వేడుకుంటూ...క్షమాపణ! నాలో ఎంత మార్పొచ్చింది. నేను క్షమాపణ వేడుకోడం! ప్రేమ ఎంతయినా చేయిస్తుంది...ప్రేమా ? ...తప్పు......

జనవరి ౪, మద్రాసు.

అమ్మయ్య...నా శశి మళ్ళీ నావాడయ్యాడు... జనవరి ౪...పుణ్యదినం. అబ్బ...ఆ రెండు ఘడియలూ ఎలా గడిచాయో తలుచుకుంటే నవ్వొస్తుంది. సిగ్గూ వస్తుంది. క్రింద విజిటర్స్ రూమ్‌లో కూర్చున్నాడు. కబురొచ్చింది పైకి. ఎంతో ఆత్రంగా వెళ్లాను, ఎన్నో చెప్పాలని. విజిటర్స్ రూమ్‌లో ఒక్కడే కూర్చున్నాడు ఒక మూలన కుర్చీలో... నేను గుమ్మంలో అడుగెట్టాను...తలఎత్తిచూశాడు. రేవతీ! అన్నాడు. నా నోట్లోంచికూడా ఆ సమయంలోనే శశీ! అన్నముక్క బయటపడింది. ఒకళ్ళకొకళ్లు ఎదురుకుండా, కూర్చుని ఏడ్చేశాం. మౌనంగా మా హృదయాలు మాట్లాడుకున్నాయి... ఒకళ్ళమీద ఒకళ్లువాలి...ఛా...దుర్మార్గపు ఆలోచనలు...తప్పా...ప్రేమ ఉప్పొంగినప్పుడు ఆశ్లేషణ వాంఛ కలగడంలో తప్పేమిటి...అది కామంకాదే... ఇప్పుడప్రస్తుతం అది...ఇంక జాగర్తగా ఉండాలి. ఏమయితేనే మళ్ళీ నా శశి నాకు దక్కాడు.”

శశి:-చాలా కళ్ళకి కట్టినట్లు డిస్క్రైబ్ చేసింది ఆ రోజు సన్నివేశం మాత్రం...ఏమిటో సరూ...నేనింతవరకు స్నేహంచేసిన వ్యక్తులలో కంటే రేవతిలో నేనేదో అనిర్వాచ్యమయిన ప్రేమను చూడగలిగాను. అది కామం అనను...కాని ఒక విధమయిన అర్ధ్రిత. ఆమె నా దగ్గర ఉండాలనే కోరిక ...భేదాభావంగా నా సుఖదుఃఖాలను పంచుకోవాలనే ఆశ...మీ కందరికీ అర్థంకావు సరూ. మీరందరూ సంకుచితంగా ఆలోచిస్తారు ప్రేమభావాన్ని. ప్రేమంటే దైహికమనే మీ అభిప్రాయం. అది ప్రేమ అనను. కామం...నిజమైన ప్రేమకి, శరీరం ప్రధానం కాదు.

సర:-అర్థం కాకకాదు. కాని ఒక్కొక్క పరిస్థితులలో అది శారీరికంగా మారడానికి అవకాశాలున్నాయనీ, అంచేత జాగ్రత్తగా ఉండాలని. ఇంకోసంగతి. అందరు మీఅంత నిబ్బరంగానూ,పవిత్రంగానూ ప్రేమిస్తారని అనుకోవడానికి అవకాశంలేదు. నిజమయిన ప్రేమయితే దానికి తరుగెందు కుంటుంది...స్నేహాలన్నీ పవిత్రమయిన ప్రేమపూరితాలే అయితే, స్నేహబంధాలు విడిపోవడాని కవకాశము లేనేలేదే... ఇంత మీరు చెప్పే రేవతిస్నేహంమాత్రం ఏమయింది?

శశి:-అదే నా కర్థం కావడంలేదు సరూ. ఇదివరకటిదాకా పోనీ, ఇది నా మనస్సులోనే కాని, తనలో లేదేమో అనుకున్నాను. కాని యీ డైరీచూస్తే.

సర:-ఏమిటో, మీరింత మీ స్నేహాన్ని హృదయపూర్వకంగా తీసుకున్నారు గాని, ఆవిడకి మీరు పదిమందిలో ఒకరు...ఆవిడ మీ స్నేహాన్నంత సీరియస్‌గా తీసుకోలేదేమో అని నా అనుమానం... చదవండి తెలుస్తుంది. లేకపోతే అంతమంచి స్నేహం ఇలా విరిగిపోవడానికి ఎక్కడా కారణం కనిపించదు...అదేమిటి పుస్తకం మూసేస్తున్నారేం.

శశి:- (బాధగా)...ఇంక చదవను...యీ ఘట్టంతోనే ఆపెయ్యనీ, మిగిలిన విషాదగాధ తెలిసిందేగా, అనుభవ పూర్వకంగా...పోనీ రేవతికూడా నన్ను ఒకప్పుడు ప్రేమించింది, అంత హృదయపూర్వకంగా, అని తెలుసుకున్నా...చాలు...ఆ మధురభావంతోనే విరమించనీ...

# రేవతి డైరీ

సర:-అసలు సంగతి చివర ఉంటుంది. అది చదవండీ. యీ డైరీ ఇప్పుడు మీకెందుకు పంపిందో అది తెలుసుకోవద్దూ...పోనీ నే చదువుతా ఇలా తేండి... (పుస్తకం తీసుకుని పేజీలు తిరగేస్తూ) ౧౯౪౩, ౪౪-౪౫-౪౬...ఆగస్టు ..చాలా ఖాళీలున్నాయి. ౧౯౪౩ తర్వాత అట్టే ఏం వ్రాయనే లేదు. సెప్టెంబరు, ౧౨, ౧౩, ౧౪—ఇంక తర్వాత ఏమీలే నేలేదే! అబ్బా, పేజీన్నరుంది ఆఖరురోజున!

"సెప్టెంబరు ౧౪, ౧౯౪౬ కలకత్తా

శశీ:-మూడు సంవత్సరాలు కావస్తోంది నిన్ను చూసి...దుర్మార్గురాలిని. నువ్వు ఎన్ని ఉత్తరాలు వ్రాసినా జవాబైనా వ్రాశానుకాను...ఎంత నొచ్చుకున్నావో. నన్ను తిట్టుకున్నావా, శశీ...నా హృదయంలో ఉన్న ఆరాటం తెలుసుకుంటే నన్నర్థం చేసుకోగలవు. ఎన్నోసార్లు అన్నావు జ్ఞాపకముందా? "రేవతీ నిన్నింత ఎరిగిఉన్న నా దగ్గిర కూడా ఏదో దాస్తున్నావు" అని?...నిజమే...ఒక్క సంగతి మాత్రం దాచాను. అది నా జీవితావసాన సమయాన నీకు చెపుదామనుకున్నాను. ఇప్పుడందుకే నీకీ డైరీ పంపుతా...ఇది నీకు ౧౭ వ తారీఖున అందుతుంది... సెప్టెంబరు ౧౭! జ్ఞాపకంఉందా? ౬ సంవత్సరాల క్రిందట యీ రోజున నువ్వు నా జీవితంలోనికి ప్రవేశించావు. అప్పుడే నా హృదయం అవ్యక్తంగా ఆత్మీయ పరిచయానందం అనుభవించింది...శశి!... నా జీవితంలో నీకు తెలియని రహస్యాలు లేవు. నన్ను పూర్తిగా తెలుసుకున్నవాడవే కాదు, అర్థం చేసుకున్నవాడవు, నువ్వొక్కడవే...అదే నాకు పదివేలు. ఇంకేమీ కోరను...జీవిత జంఝూమారుతంలో ఎగరగొట్టబడి, నా శీలమూ, నా వ్యక్తిత్వము రక్షించుకునే దీక్షలో నలిగి, ఈ దాక్షిణ్య రహిత సంఘము యొక్క అపవాదులకు తూట్లుపడ్డ హృదయంతో నీ మొగసాలను వ్రాలాను...శశీ!...నీ అమృత సాహచర్యంలో నాకు శాంతి లభించింది, ధన్యురాలనయ్యాననుకున్నాను...కాని...అభాగ్య జీవిని నేనా అదృష్టానికి నోచుకోలేదు. రానురాను, మన స్నేహబంధం ప్రేమబంధంగా మారుతూ ఉందేమో అని నా కనుమానం తోచింది. సరస్వతి ఉత్తమురాలు. మీ దాంపత్యం అపురూపం, అటువంటి దాంపత్య జీవితంలో నా కారణంగా అపశ్రుతి ఉత్పన్నమవుతుందేమో అని భయపడ్డాను. ఆ భీతి నా మనస్సుకు తోచడంతోటే నా కర్తవ్యాన్ని గ్రహించాను... నువ్వు నన్ను ఎంతగా ప్రేమించావో, సరస్వతికూడా నన్నంతగా ప్రేమించింది. నాకు తెలుసు......కాని, పురుషులు తన ప్రేమధనాన్ని ఇద్దరు స్త్రీలకు సమభావంతో పంచియివ్వగలడు. కాని...ఇద్దరు స్త్రీలు ఒక పురుషుని ప్రేమను పంచుకోవడానికి అంగీకరించరు. అది స్త్రీ ప్రకృతి...బలవంతంగా మన ప్రేమబంధాన్ని తెంపుకున్నాను. నిన్ను ఎంతో నొప్పించాను. నాయందు నీకు అసూయ పుట్టించడానికి అసహజంగా కూడా ప్రవర్తించాను...ఈ యజ్ఞంలో నేను ఎంత వ్యథపడ్డానో, ఎంత కుమిలానో ఆ భగవంతుడికి తెలుసు. ప్రత్యక్షంగా ఉండకుండా ఉండడంకోసం కలకత్తా వచ్చేశాను.

సెప్టెంబరు ౧౭!—ఆ పవిత్ర దినంకోసం ఎదురు చూస్తున్నాను. జీవితం అంటే రోతపుట్టింది. ఎండి మోడైన నా హృదయం నీ చల్లని ప్రేమలో, చిగిర్చి పుష్పించింది. ఆ ప్రేమ ప్రసూనాన్ని నీకు కానుకగా అర్పించి కడసారి సెలవుతీసుకుంటున్నాను...శశీ! సరస్వతికి నా ప్రేమగాథను చదివి వినిపించు. తన యెడ అపచారంచేసి ఉంటే ఏ విధంగానైనా, క్షమించమని చెప్పు. స్త్రీ, స్త్రీ హృదయాన్ని అర్థం చేసుకోగలదు. శశీ!...యీ డైరీ చదివిన తర్వాత

ప్రేమ పూర్వకంగా, ఒక్కసారి "రేవతీ" అని పిలు! ఆ పిలుపు నాకు వినబడుతుంది నేనే లోకంలో ఉన్నాసరే...అదే నా ఆఖరు కోరిక... సెలవు......

(యీ ఆఖరు పంక్తులు చదువుతూ ఉంటే శశి కళ్ళు చెమ్మగిల్లుతాయి. హృదయభారం ఎక్కువవుతుంది. సరస్వతి అలాగే ఆ డైరీ వైపు చూస్తూ నిలబడిపోతుంది. కళ్ళనీళ్లు కమ్ముతాయి.)

శశి:-(రుద్ధకంఠంతో) రేవతీ!!

సర:-(బరువుగా) ఎంత అగాధమైన ప్రేమ... అటువంటి పవిత్ర ప్రేమమూర్తిని సముఖంలో ఆరాధించే భాగ్యం నాకు లేకపోయింది. అదృష్టహీనురాలిని నేను!



# చిత్రకారుడు శ్రీ మనీషిదే

శ్రీ. టి. యన్. శ్రీనివాసన్

శ్రీ అరవిందులు ఒకచోట ఇలాగ వ్రాశారు. "ఈ రోజుల్లో సౌందర్యానికి మూల్యం తగ్గించి ఔప యోగికతను ఖరీదు హెచ్చించడం ఒక ఆచారం అయిపోయింది. యూరోపు ఖండంలో అనుస్యూతం గాను, బలంగాను వస్తూన్న సంప్రదాయంవల్ల ఈ ఔపయోగికదృష్టి తగ్గింది.

భారతదేశంలో ప్రచారంలో ఉన్న ఆత్మరహితము, ధనప్రధానము అయిన విద్యావిధానంవల్ల మనకి మన ప్రాచీన సంప్రదాయాలతోను, సంస్కృతితోను, ఉన్న సంబంధం మొదలంటూ తెగిపోయింది. అయితే మనకి సహజంగా ఉన్న భావనాబలంవల్ల, భావోద్వేగంవల్ల మృదులమైన ఆధ్యాత్మికతవల్ల అదిపూర్తిగా నశించిపోకుండా అంతరాంతరాల్లో సంరక్షించుకోగలిగాము. అందుచేతనే మన జీవనదృక్పథాల్లో అది ఇంకా మెరుస్తూ ఉంటుంది."

సౌందర్యానుభూతివల్ల ఎంతో మేలుకలుగుతుంది. ఈ ఉపయోగం గ్రహించనంతవరకు, మానవుల మనస్సు మానవమనః పరిధులలోనే సంచరిస్తూ ఉంటుంది. అందువల్ల మానవహృదయం కళవల్ల క్రమంగా ఉన్నత పరిధులను అందుకుంటూ ఉండాలి. ఇల్లాగ మానవహృదయం బాగా కళానుభూతికి అలవాటు పడ్డాక, కళలో ప్రాకృతికత (Naturalism) పోయి బాగా పరిణతిచెందిన సాంకేతికత (Simbolism) ప్రవేశిస్తుంది. ఈ సాంకేతి కళామూర్తులు, సృష్టించిన చిత్రకారులకు, దర్శించే ప్రేక్షకులకు, హృదయాల్లో ఆనంద తరంగాలు నృత్యం చేస్తాయి. ఇంతేకాక దీనివల్ల నిత్యనూతనాలైన కళామూర్తులు సృష్టించాలనే సృజనదాహానికి ఉపశాంతి చేకూరుతుంది. అంతేకాదు; ఈ విధమైన దృక్పథం అవలంబించడంవల్ల గత యుగాల్లోను, భావి యుగాల్లోను, స్వతంత్రకళాపద్ధతులు అవగాహన చేసుకుని ఆనందించే సానుభూతికూడా ఏర్పడుతుంది.

శ్రీ మనీషిదే ఇలాంటి స్వతంత్ర కళాసంప్రదాయం అవలంబించిన ధీరచిత్రకారులు. వారిది సాంప్రదాయికంగా చిత్రకారులను, రచయితలను ఉద్భవింపజేసిన వంగీయ కుటుంబము. వీరిది అసాధారణమైన భావనాసామర్థ్యంతో మెరిసే ప్రతిభ. వీరి విద్యాభ్యాసం భారతీయ సంస్కృతి క్షేత్రమైన శాంతినికేతనంలో జరిగింది. ఆయన శ్రీ గురుదేవుల పాదపద్మాల సన్నిధిని ఉండి భారతీయ విజ్ఞానామృతం తనివితీర ఆస్వాదించారు. శ్రీ మనీషిదే వర్ణాల్లోను, ఆకృతులలోను సిద్ధహస్తులై ఈ ఉభయమూ సమ్మేళనచేసి మహత్తరమైన కళామూర్తులు సృష్టించారు. శ్రీ మనీషికి ఒక కళాసృజనమే జీవన తపస్య. ఈ ఆదర్శంతో ఆయన చిరకాలంనించి వస్తూ పాతబడిపోయిన ఎన్నో కళా సంప్రదాయాలు ఛేదించివేశారు. అందుచేతనే ఆయన కళాసృష్టి తిలకిస్తే బూజుపట్టిన పురాతన బంధనాలన్నీ తెగ త్రెంచివేసిన మహా స్వాతంత్ర్యం గోచరిస్తుంది.

ఈ సంచికలో ఈ చిత్రాలన్నీ మొట్టమొదటగా ప్రచురిస్తున్నాము. వీటిల్లో ఆయన కళావైవిధ్యం బాగా గోచరిస్తుంది. ఇందులో శ్రీ రమణ మహర్షి చిత్రం తిలకిస్తే మహర్షిని కళ్ళారా చూసినవారికి త్రిభంగిగా నిలబడిన శలాకవంటివారి మూర్తిప్రత్యక్షు

మవుతుంది. ఈ భంగిమ ఒకసారి చూస్తే మళ్ళీ ఎన్నటికీ మరిచిపోలేము. మహర్షి సామాన్యంగా ఆశ్రమంలో సంచరించేటప్పుడు పాలవలె తెల్లనైన కాషీ నంధరిస్తారు. చిత్రకారుడు ఇది చాలా చక్కగా చిత్రించాడు.

తరువాతిది, వంకరలు తిరుగుతూన్న జానపద మార్గము. దీనికి మధ్యన గుబురుగా పెరిగిన ఒకచెట్టు కనిపిస్తుంది. ఇందులో వెలుగు నీడల ఖేలనం ఎంతో మనోహరంగా కనిపిస్తుంది. 'చలికాలం'లో ఒక టిబెట్టునివాసిని గట్టిదుప్పటీ కప్పుగుని సుఖంగా కూర్చుంది. ఇది ఎంతో వాస్తవిక దృక్పథంతో రచించిన చిత్రం. ఈ చిత్రంలోని దృఢరేఖలు గజగజ వణికించే చలికాలము, అప్పుడు అవసరమైన వెచ్చదనము సూచిస్తున్నాయి. 'ముఖచిత్రం'లో శ్రీ మనీషిదే 'దాక్షిణాత్యయువతిని' చిత్రించాడు. ఆ నాసికపై నున్న ఆ ముక్కెర, చక్కగా దువ్విన జుట్టు ఆ చిత్రానికి ఒక 'ప్రత్యేకత' ఇస్తున్నాయి. ఎంత ప్రయత్నించినా ముద్రణలో చిత్రాల సహజ సౌందర్యం రావడంకష్టము. అయినా ఈ చిత్రాలను బట్టి శ్రీ మనీషి అత్యుత్తమమైన కళా పరిపూర్ణత అందుకో గలిగాడని చెప్పవచ్చును. శ్రీ మనీషికి స్వసామర్థ్యంలో అచంచలమైన విశ్వాసం ఉంది. అందుకనే కళలో ఆయనకొత్తవిలవలు ఏర్పరచ గలిగాడు. ఆయనకు ఉన్నది అంధకార పూరితమైన ఆకాశం చూచి, అరుణోదయ రేఖలు భావించే విహంగమ హృదయంలోని అచంచల విశ్వాసం. అటువంటి అచంచల విశ్వాసం శ్రీ మనీషికి అంధకార పూరితములైన అతి నవ్యచిత్ర మార్గాల్లో నూతన రీతులు కనుగొనేటట్లు చేసింది.

శ్రీ దే ఇంకా తరుణ వయస్కులే. వారిది అట్టే నలుగురిలోకీ చొచ్చుకుపోయే స్వభావం కాదు. ఆయన సరళవర్తనము, నిత్యపరిశ్రమ చూస్తే వారియందేకాక వారి కళమీద కూడా సహజమైన గౌరవం కలుగుతుంది. ఆయన చిత్రాలవల్ల, వారు ఇంకా భారతీయ కళలో కొత్త అంతరువులు అందుకో గలరని అతిసులభంగా చెప్పవచ్చును.

అనువాదకుడు 'శిల్పి'





దాక్షిణాత్య యువతి

శ్రీ మనీసి. దే

# గ్రంథ విమర్శనము

**పద్మావతీ చరణచారణ చక్రవర్తి : దీక్షిత దుహిత. శ్రీ శివశంకర శాస్త్రి; ప్రాప్తి స్థానము : సాహితీ సమితి, తెనాలి.**

అది చాలాకిందట. కాకినాడలో నవ్యసాహిత్య పరిషత్తు జరిగినప్పు డనుకుంటాను. శ్రీ నాగేశ్వర రావు పంతులుగారి సమక్షాన పద్మావతీ చరణచారణ చక్రవర్తి ప్రదర్శించారు. సభ్యులు నాటిక ఆమూలాగ్రమూ నిశ్శబ్దంగా తిలకించి ఆనందించారు. ఒక ప్రఖ్యాతాంగ్ల విమర్శకుడు కవిత చాలామందికి అంద జెయ్యాలంటే కవితాత్మకములైన రూపకాలమూలంగానే అది సాధ్యపడుతుందని చెప్పాడు. ఆంగ్ల వాఙ్మయంలో కవితాత్మకములైన రూపకాలకు ఒక ప్రత్యేక స్థానం ఉంది. చాలావరకు ఆంగ్ల వాఙ్మయంలో గొప్ప కవులందరు కావ్యనాటికలు వ్రాసినవారే! ఆంధ్రంలో శ్రీ శివశంకర శాస్త్రిగారు ఈ కావ్య నాటికలు బహుధా రచించారు. ఆధునికులలో ఈ శాఖలో వారిదే అగ్రస్థానం. వారి తరవాత ఎవరూ ఈ శాఖవిషయంలో శ్రద్ధవహిస్తూన్నట్టు కనబడడం లేదు! యువకులు చాలామంది ఈ శాఖలో పరిశ్రమించడం ఎంతైనా అవసరము.

'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' 'దీక్షితదుహిత' శాస్త్రిగారి చేతిలో సానతేరిన రత్నాలలా తయారయ్యాయి. కవిప్రియ, వకుళమాలిక విడిచిపెడితే ఈ రెండూ శాస్త్రిగారి కావ్యనాటికా వాఙ్మయంలో ఉత్తమోత్తమమైనవని చెప్పవచ్చును.

పద్మావతీ చరణచారణ చక్రవర్తి జయదేవకవి కథ. పద్మావతీ చరణచారణ చక్రవర్తి మొదట చాలాకిందట ప్రచురితమైంది. మళ్ళీ ఇప్పుడు విశ్వజనీన గ్రంథావళిలో శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారి సంపాదకత్వాన వెలువడింది. పుస్తకము చూడడానికి అన్నివిధాలా ముద్దులు మూటకట్టుతూంది. ఆంధ్రదేశంలో పుస్తకాలు సొగసుగా ముద్రించే దృష్టే కనబడడం లేదు. శ్రీ శాస్త్రిగారు కవిత్వంలోనే కాక జీవితంలోకూడా అన్ని విషయాల్లోను సౌందర్యం ఆకాంక్షించేవారు. దీనిలో కవితలో, కూర్పులో, కథాసంఘటనలో, పుస్తకంలో సౌందర్యం కానవస్తూంది.

శాస్త్రిగారి కవిత్వంలో భావోన్మాదం విశృంఖలమై ఉండకుండా, ఒక ఆత్మసంయమనం కానవస్తూ ఉంటుంది. ఇందులో ప్రతిపద్యము ఒకమనోహర శిల్పంతో చెలువారుతూ ఉంటుంది. ఒక ఉదాహరణ ఇచ్చి చక్కని వాటికి ఇది ఉదాహరణ అనడం మిగిలిన వాటిని చక్కనివి కావని ధ్వనింప చెయ్యడమే అవుతుంది; అయినా కొన్ని ఉదాహరిస్తాను.

"పికుల విందుగా వేణుకుంజముల
మురళీరవము ముహుర్ముహురుల్లసిల్ల
కనుల పండువు సేయు క్రముకమార్గము
వకుళావనీజముల్ వాసించుచుండు
తాపమ్ము పున్నాగ తరువులు పాపు"

ఇంకొక చోట.

"రాజ్ఞి యొసగెను మణినూపురద్వయంబు
రత్నతాటంకము లొసంగె రాపుత్రి
ఒసగినాడు నృపుండు కేయూరయుగళి
కాంచిదామమ్ము హారమ్ము కంకణములు"

'శిల్పి'

'దీక్షితదుహిత' కూడా శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి సంపాదకత్వాన ఇదే ప్రథమముగా విశ్వజనీన గ్రంథావళిలో పుస్తకాకారంలో వెలువడింది. దీనికి

శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులుగారు విపులమైన పీఠికకూడా వ్రాశారు. అప్పయ్య దీక్షితుని వితంతు కుమార్తె మంగళాంబ తండ్రిగారి శిష్యుడైన చంద్రమౌళిపై అనురాగము ప్రదర్శిస్తుంది. క్రమంగా ఉభయులకు పరస్పరానురాగం కలుగుతుంది. తండ్రి అప్పయ్య దీక్షితుడు కుమార్తెకు వివాహము చెయ్యడమా చెయ్యకపోవడమా అనే సందేహంలో పడతాడు. చివరకు వివాహము చెయ్యకూడదనే విశ్చయిస్తాడు. ఇది చారిత్రికమైన ఒక ఐతిహ్యం తీసుకుని యథాతథంగా చిత్రించినట్టు కనిపిస్తుంది.

"చెంగల్వలంబోలు చిన్నిపాదాల
అనుగు నెచ్చెలి మెట్టినట్టిమార్గంబు
పులకితంబయి వన్నెపూవులుపూయ
రత్నకంబళమట్లు రంజిల్లుచుండు
నాప్రేయసీ పదన్యాస సౌభాగ్య
మొందిన యీ సుందరోపవనంబు
శ్రీ ప్రయాగమహత్త్వ సిద్ధిచే సర్వ
దేవతలకుగూడ తీర్థరాజంబె
అనిమిషదుర్లభంబైన యీ దివ్య
మంగళ విగ్రహ మహిత స్తవంబు
గ్రహియించు భాగ్యంబు కలుగుటేలాగొ
పెనగొను సంభ్రమ ధీ విస్మయాలు!"

శ్రీ శాస్త్రిగారు తమరచనలతో నేటి ఆంధ్ర కవులలో సమున్నతస్థానం అలంకరించినారు. పీఠికలో శ్రీ భట్టాచార్యులు శాస్త్రిగారు ఒక మహాకావ్యం రచించే ప్రయత్నంలో ఉన్నారన్నారు. ఆ మహాకావ్యం సంస్కృతంలో రచించమని వారి వినతి. కాని ఆ మహాకావ్యము ఆంధ్రానికి అలంకారంగా సంతరించ వలసిందని నా ప్రార్థన.

'శిల్పి

---

# గ్రంథస్వీకృతి

**౧. నా జీవితము**

రచన: మోహన్‌దాస్ కరంచంద్ గాంధి,
ఆంధ్రీకరణము:
పోలవరపు శ్రీరాములు. వెల ౧-౮-౦

**౨. ప్రపంచ చరిత్ర**

రచన: జవహర్‌లాల్ నెహ్రూ అనువాదము:
చింతాదీక్షితులు వెల ౨-౦-౦

**3. సామ్రాజ్యము**

రచన: లూయీఫిషర్, ఆంధ్రీకరణము: పండితారాధ్యుల నాగేశ్వరరావు వెల ౧-౦-౦
వలయువారు: కల్చరల్‌బుక్స్ లిమిటెడ్,
పెరంబూరు:: మద్రాసు.

**౪. విశ్వరహస్యము**

వసంతరావు, వెంకటరావు.
సాహితీసమితి. వెల ౧-౦-౦

**౫. జగత్తు – జీవము**

వసంతరావు వెంకటరావు
సాహితీసమితి. వెల ౧-౦-౦
వలయువారు:
వసంతరావు వెంకటరావు, ఎం. ఎస్‌సీ.,
మహారాజావారి కళాశాల, విజయనగరం.

**౬. కాంగ్రెస్ వైద్యదళము**

మలయాయాత్ర.
శ్రీ చింతలపాటి శివరామశాస్త్రి వెల ౧-౮-౦
వలయువారు: శ్రీహరనాథమురళి, తెనాలి.

ఇది 37, ఆచారప్పన్ వీధిలోని బి. యన్. కె. ప్రెస్సులో, బి. నాగిరెడ్డిగారిచే ముద్రింపబడి, 10, నరసింగపురం వీధిలోని ఆంధ్రశిల్పి కార్యాలయంలో శ్రీమతి బి. ఆర్. చిత్రాగారిచే ప్రకటింపబడినది. సంపాదకులు: శ్రీ గణపతిశాస్త్రి; శ్రీ చిత్రా.




# సచిత్ర మాస పత్రిక

సంపాదకులు

శ్రీ గణపతిశాస్త్రి : శ్రీ చిత్రా




౧౦, నరసింగపురం వీథి,

మౌంట్ రోడ్, మద్రాసు.

# విషయానుక్రమణిక



## శిల్పాలు



# సంపాదక సమీక్షలు

## ఆంధ్రులు అనుక్షణమూ అప్రమత్తులై ఉండాలి!

ఆంధ్రులు చిరకాలంనించీ అభిలషిస్తూన్న స్వరాష్ట్రం కనుచూపు మేరలోకి వచ్చింది. అయితే ఇంకా అడుగడుక్కీ విఘాతాలే కానవస్తున్నాయి. మనం కొంచెం అప్రమత్తులమై ప్రయత్నిస్తే ఈ విఘాతాలన్నీ తొలగిపోవచ్చును.

కాని ఒకపక్కన ఇంకా ఆంధ్రరాష్ట్ర ప్రశంస ఎత్తామోలేదో అప్పుడే మద్రాసుప్రధాని తిరపతి, చిత్తూరు, తమిళరాష్ట్రంలో చేరవలిసినవేననిఒక ప్రకటన చేశారు. తరవాత మళ్ళీ తూనాబొడ్డు అనుకున్నారనుకోండి! మద్రాసు విషయంలోమాత్రం తీవ్రమైన వాగ్వాదం చెలరేగుతూ ఉంది. ఇక్కడ ఎంతెంత పదవుల్లో ఉన్నవారు ఏరే విధంగా మాటాడినా ఒక 'సరిహద్దు సంఘము' నిర్ణయానికి అందరూ కట్టుబడవలసి ఉంటుంది. ఆ సరిహద్దు సంఘం నిర్ణయానికి ముందే అదీ ఇదీ మాదని చెబుతూండడము, లోపలఉన్న అనవసరమైన తొందరపాటుమాత్రమే తెలియజేస్తుంది.

అయితే ఒకవిషయము. మద్రాసువంటి నగరానికి కేవలమూ తాత్కాలికమైన జనసంఖ్యే గాకుండా చాలాకాలంనించీ ఈ నగర నిర్మాణానికీ అభివృద్ధికీ ఖర్చయిన ఆంధ్రుల ధనమూ, సేవా కూడా పరిగణించాలి. ఇంతేగాకుండా చారిత్రికంగా ఈ నగర నిర్మాణంకూడా సమీక్ష చెయ్యవలసి ఉంటుంది. సహజంగా ఇవ్వన్నీ సరిహద్దుసంఘము నిర్ణయించవలసిన ప్రశ్నలే. బొంబాయి విషయంలో గుజరాతీవారు, మహారాష్ట్రులు ఇది

మాటంటే మాదనే వివాదాలలోకి దిగారని తెలుస్తూంది. వారుకూడా ఈ విషయంలో అనేక సమస్యలు పరిష్కరింపవలిసి ఉంటుంది. ఆ మార్గాల్లోనే మద్రాసునగర సమస్యకూడా ఒక నిష్పాక్షికమైన మధ్యవర్తి పరిష్కారానికి వదిలివెయ్యడమే సబబైన మార్గము.

ఈ విషయంలో ఇంతకు పూర్వం ఒరిస్సాలోను ఇంకా మిగిలిన రాష్ట్రాలలోను, కలిసిపోయిన ఆంధ్రభూభాగాలన్నీ మళ్లీ ఆంధ్రంలో చేరేదాకా మనం ఏమరకూడదు. మనం ఆంధ్రరాష్ట్ర పదానికి మద్రాసు ప్రభుత్వాధికారంలో ఉన్న ఆంధ్రభాగం మాత్రమే అని అర్థం చెబుతున్నాము. ఇప్పుడు ఆ అర్థం విస్తరించి, హైదరాబాదు, మైసూరు మొదలైన రాష్ట్రాలలో అంతర్భూతములైన ఆంధ్ర భూభాగాలన్నీ తిరిగి మన ఆంధ్రరాష్ట్రంలో చేరే ప్రయత్నం చెయ్యాలి. అంతవరకూ మన ఆంధ్రరాష్ట్రం సిద్ధించలేదనే అనుకోవాలి!

ఈ విషయంలో రాయలసీమలోను, తెలంగాణంలోను నివసిస్తూన్న ఆంధ్రుల అపోహలన్నీ తొలగించి, అన్ని విషయాల్లోనూ వారిని కూడగట్టుకోవాలి.

సరిహద్దులలో ఉన్నవారంతా తమతమలో ఐకమత్యం కుదుర్చుకుని సరిహద్దు సంఘానికి ఎదట సాక్ష్యం ఇవ్వడానికి సంసిద్ధులై ఉండాలి. ఇందులో ఇంకా తగిన ప్రయత్నాలేమీ జరగక పోవడము చాలా శోచనీయము.

మరి ఒకమాట! ఆంధ్రరాష్ట్రం అంటే ఇంతకాలంనించీ అనుకుంటూన్నది, కొంతమంది ఒకేభాష మాట్లాడేవారు ఒకరాష్ట్రంలో చేరడమే. కేవలము ఒకేభాష మాట్లాడేవారు ఒకచోట గుమిగూడడం జరిగినంత మాత్రాన్ని ప్రయోజనం ఏమీ ఉండదు. రాష్ట్రంలో ఉన్నవారందరికీ జాతిమత వర్ణవివక్షతలేకుండా సమానమైన ఆర్థిక, రాజకీయ సంస్కృతి స్వాతంత్ర్యాలు కలిగించాలి. అంతేగాదు; ప్రపంచ చారిత్రిక గమనపద్ధతి ననుసరించి, ఆంధ్రరాష్ట్రం సామ్యవాద పద్ధతులపై ఏర్పడడం కూడా అత్యవసరం!

## సంపాదక సమీక్షలు

ఈ విషయంలో ఆంధ్రులందరూ జాగరూకతతో ప్రవర్తిస్తూ అన్ని సమస్యల కంటె ఆంధ్రరాష్ట్ర సమస్యకు అత్యంత ప్రాముఖ్యం ఇచ్చి తత్సాధనకై ప్రయత్నిస్తారని నమ్ముతున్నాము. ఈ మధ్య మద్రాసు రాజధానిలో రాజకీయరంగంలో వీచిన గాలిదుమారాలు ఆంధ్ర రాష్ట్ర సమస్యకు అత్యంత ప్రాముఖ్యం కలిగించాయని వేరే వ్రాయనక్కరలేదు. ఈ పరిస్థితులలో సరియైన పునాదులపై నిర్మించిన ఆంధ్రరాష్ట్రం ఒకటే మన ఆశాకిరణమని ఎంత శీఘ్రంగా గమనిస్తే అంత మంచిది.

శ్రీ గణపతిశాస్త్రి

# విరహ గీతి

ఏదేశ మేగినాడో - ప్రాణేశు
డెంత నిష్ఠుర హృదయుడో!

సౌందర్యశోభ గుప్పిటబట్టి మర్దించి
సాంద్రచంద్రికలు చిందరవందరగ జేసి
మంచుముత్యాలు సింగారించుకొను పూల
మాయగా రాల్చి బూడిద బ్రుంగగా జేసె—ఏదేశ...

విహరింప మాని యుద్యానమున కోయిలలు
వెలయించు గీతి చిక్కని వెన్నెలల నిండ
ఈ శీతరాత్రి వెన్నెలకీల బడద్రోసి
ఏ కానకంతలో నిడుములకు జిక్కెనో—ఏదేశ...

కరిమబ్బు దెసల గుండెలు జల్లుమన గ్రమ్మ
మెరపుచిల్వలు భయానకలీల విహరించె
పురులు విప్పార కేకలు క్రేంకరింపంగ
ఉరుమగా సాగె ప్రాణాలు తల్లడమంద—ఏదేశ...

అలకలో నప్సరస మొయిలులో గూర్చుండి
తల దువ్వుకొనుచు నేడ్చుచునుండె గాబోలు!
కురియగా సాగె వర్షము నిరంతరముగా
తిరిగి రాడాయె నా ప్రియు డిట్టియెడ గూడ—ఏదేశ...

నా కెరుక లేకుండ నను పల్కరింపకయె
ఏకతమ ననువీడి యిటు లేగ న్యాయమే!
ప్రాణేశ, యీ దీనురాలిపై కోపమా!
ప్రాణాలు పోవు నీవిక కానరాకున్న!

ఇకనైన కరుణ రాదా! నామీద
నెట్లు జీవింతు, నాథా!

శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవ స్వామి
సాహితీ సమితి

# హృదయోపహారము

నే నొక సంజవేళ రమణీమణి! నందనరమ్యభావనో
ద్యానమునన్ మెయిన్ దలిరుటాకుల పాన్పునవాల్చి, నీ ప్రతీ
క్షానిరతాక్షియుగ్మమతిసక్తి నిమేషమె విస్మరింప, నెం
దేని భవచ్చలచ్చరణ మించుక మించగునంచు వేచితిన్.

అది హేమంతదినావసానము ; వినీలానోకహచ్ఛాయలం
దుదయించెం జరఠారుణచ్ఛవిమయూరోత్ఫుల్ల బర్హమ్ము ల
య్యదనన్ నీ వరుదెంచు సవ్వడికి సర్వాశాలతా వృక్షరా
జి దరోద్యన్ముకుటమ్ములన్ గడుఁ బ్రతీక్షించెన్ నినుంపన్గొనన్.

నీ పాదధ్వని యల్లనల్లన మదిన్నిండార సంతోష బా
ష్పాపూర్ణమ్మయి కన్నుదోయి మహనీయానంద మందెన్; నిర
శాపారంగతమైన నా హృదయ మాశ్వాసమ్మునన్ నిర్వృతి
స్వాపమ్మందె భవత్పదాంచల కణావాప్తింగలం గాంచుచున్.

అడుగిడునంత నీ వెడదయందొక వెల్లువయై ప్రమోద మె
ల్లెడల మహాబ్ధివోలె నుదయించి కనుంగవ మోడ్పుగూర్ప, నీ
నడ నును సవ్వడిన్ హృదయనాదములల్లన నేకమై వినం
బడ నరుదెంచి, నన్నుఁ బెనవైచితి నీవలవంత కౌగిలిన్.

ఇరువుర మా కవుంగిలి నదేగతి సుందరదేశకాల వి
స్ఫురణ విహీన మానసిక మోహమునం గనుమూయుచు—యుగాం
తరముగ భాసిలెం ద్రుతగతమ్మునిమేషమునుం బ్రశాంతమం
థరముగ నంత మేల్కను వినమ్రవిలోచనదృష్టిపాళికిన్.

ఆనందేందిర నిశ్చలోల్లసిత నేత్రాంతమ్మునన్ బాష్పపూ
రానన్ మౌక్తిక పంక్తి వెల్గ, హసితారమ్యాధరా! మానస
శ్రీ! నీవంత ననుంగనుంగొని, దృఢాశ్లేషమ్మొగిం జార్చి, వం
శీనాదాతిగ మివ్వచోమృతము వర్షింపన్ మదిం జొక్కితిన్.

శ్రీ గణపతి శాస్త్రి

# పాట విసురు

చూపులో సిరి చిందువాడా
ఓపలేని గుండె లోతులు
పాటలో పలికించి పోవేరా
బంగారి మామా!
తేట తేనెల తీపులూలి కేలా
రావోయి నా వన్నెకాడా
రావోయి నా చిన్నివాడా

* * *

పండి వాలిన కంకులన్నీ
పట్టి మీటిన తంబురాలో
పంతమాడే పాట బాడాలోయ్
బంగారి మామా
వంతు బోయే వరస లెత్తాలోయ్
రావోయి......

* * *

కాటుకా కొండాల మలుపున
ఏటిలో నీలాల జలజల
మూటగట్టిన పాట విసరాలోయ్
బంగారి మామా ముచ్చటైన
పదాలు పలకాలోయ్
రావోయి......

* * *

చంకలో పసివాని కన్నుల
ఝల్లుమనిపించేటి మాటల
వీరకతలే తెల్పిపోగదరా!
బంగారి మామా!
వేడినెత్తురు పొంగి పోవలెరా!
రావోయి......

* * *

నాటిచేవా నాటిజీవము
నేటి మన బైరాగి బ్రతుకున
ఊదగా వ్రాయించిపోవేరా
బంగారి మామా!
బూదిలో పూరించరా నిప్పురవ్వ
రావోయి......

శ్రీ కొనకళ్ళ వెంకటరత్నం

# మా ఊరు

చరిత్ర కంట్లో
నల్లటి నలుసు
మా ఊరు !
హింసా హింసల
మధ్యన నలిగిన
మా నాలుగిండ్లు
నలుగురు రాజులు
నడిచిన పుంతల
నాలుగు లక్షల
ప్రాణుల రక్తంతో
వ్రాయించిన శాసనాలై,
నాల్కలేని
బండలలా
నిలుచున్నై
ఊరి బయట
దర్వాలై, గోరీలై
దడిపించుచు
పిల్లల !
కుబేరుడే మెట్టిన
ఈ గడ్డన
నాగ జెముడు
పుష్పించెను !
కొండ మీది
పులులు
గుహ దాటి రావు ;
ఊరి రైతులు
కోట్ల
గడి దాటి రారు !
పానశాల నరసింహుని
గుక్కకు చాలని
ఊరి చెరువు !
మా పాలిట
ప్రాజెక్టే వరమైనా
మహాజర్ కాయితాలు
మోసి మోసి
కాయలు కాచిన
మాకరణం చేతులు
కరువు కన్న
క్రొయ్య బారి
గోపరాజు లేడని
చెప్పెను !
ఊరి బావిలో
పాతాళం నాకొద్దని
రెక్కలు కట్టుండని
ఘోషించే
తాబేటికి
వంత పాట
పాడి పాడి ఎండినై
మా కుతుకలు !
మా చేలల్లో
పచ్చ గడ్డి
మచ్చుకు లేదిక

చూస్తున్నాం
చుక్కల లోకం!
నాల్క లేని
మా గుడి గంటలు
మ్రోగెను
దేవీ నవరాత్రుల!
సిరుల చినికిన
శిఖర దీపం
నూనె లేక
పదోనాడు కునుకుదీసె!
ఊరి బళ్లో
జార్జి రాజు,
లైబ్రరీలో గాంధీ!
ఊరి బయట
రోడ్డు ముందు
మైలు రాయి
మా భవిష్యత్తు!
చింత తోపులో
వచ్చే వైద్యాయికి
వినిపించే
రాకాసి మూలుగు!
రాకాసి నోరుకట్టు
భూత వైద్యుని
మంత్రంలా
హోరని వీచే గాడ్పులు!
మతి చెడ్డ
పెద్ద సెట్టికి
మళ్లీ పెళ్లి చేసినా,
రూపాయలు
పట్టీలు వేసినా
నిమ్మరసం తలంటినా
తిరగలేదు
విరుగుడు
దత్త స్వీకారమ్మని
వ్రాస్తున్నారు
వ్రాలునామా
పైని వేటు దార్లు!
సాయంత్రం
పరుగెత్తే
సూర్యుణ్ణే వెక్కిరిస్తు
కాపుపిల్ల
కొడవలి!
పొరుగింట్లో
వేగు చుక్క
పొడిచిందాకా
సేకాడి తిరిగివచ్చు
శాస్త్రిగారు
ఉదయపు గోదానానికి
దిద్దిన
విభూతి రేఖలలా
తెల తెల మను
తూర్పున
కిల కిల మని కాకులు!
చరిత్ర కంట్లో
నల్లటి నలుసు
మా ఊరు!!

శ్రీ ఏల్చూరి సుబ్రహ్మణ్యం.

# MUSINGS

## "చలం"

హింస, అహింస, సత్యం అబద్ధం, ప్రేమ, ద్వేషం ఇట్లాంటి వాటిల్లో భేదాలు - కార్యంలోకన్న మనసులోవున్న వాస్తవగుణంమీద ఆధారపడతాయి. నేను కొట్టను. చంపను. అనడానికీ కాని నేను కదలను. అడ్డపడతాను అనడానికీ ఆట్టే భేదంలేదు. మనసులో ఏకోపంలేకండా చంపనూవొచ్చు. పూర్తి కోపంతో అడ్డపడి వూరుకోనూవొచ్చు. బెర్నార్డుషా నాటకంలో సీజర్ని "సింహం నీ మీదికొస్తే ఏం చేస్తావు? నీక్షేమ ఏమవుతుంది అప్పుడు?" అంటే, "చంపుతాను. నామీద ఏకోపంలేకండానే ఆసింహం నన్ను చంపుతుంది. అందుకని ఏంకోపంలేకండానే దాన్ని నేను చంపుతాను" అంటాడు. తోవలకి అడ్డం పడుకుంటాం, మాపంతం నెగ్గిందాకా తిండి మానేస్తాం. అరుస్తాం. అనడంలో ఎంత ఉత్తమకార్య సాధనకైనాసరే, ఎంత అహింసవుందో చెప్పలేము. నెగ్లీ Farson, "ఇండియాలో సత్యాగ్రహం ఎట్లా వుందంటే, చెడ్డభర్తకి అన్నివిధాలా అడ్డుతగిలి భరించలేనంత ప్రాణంతీసి, తనని తన్నేట్టు చేసుకుని, వీధినపడి "చూడండి తెలుస్తోందా వీడెంత దుర్మార్గుడో!" అని అరిచే భార్య చర్యలాగుంది" అని రాశాడు.

చిన్నపిల్లల శిక్షణలో కూడా ఇదే సమస్య. కొట్టకూడదు పిల్లల్ని. కాని శిక్ష తప్పదు. తన్నడానికీ ఆగదిలో బలవంతంగా కూచోపెట్టడానికీ ఆట్టే భేదం లేదు. కొట్టడం పశుత్వము కావడమూ, ఎక్కువ క్రోధానికి ఆస్కారం కావడమూ, అనేవితప్ప చాలా దయతో తన్ననూ వొచ్చు, క్రోధంతో గదిలో పారెయ్యనూవొచ్చు. ముఖ్యం బిడ్డని అర్థంచేసుకోడం, జ్ఞానం వల్లనూ, ప్రేమవల్లనూ కోపాల్ని హృదయంలోంచి తీసుకోడం, అనేవి.

ఇదే పెద్దవారి యెడల అన్వయిస్తే, ఎందుకు వాళ్లు తమ ధర్మాన్ని అతిక్రమిస్తున్నారో, సంఘద్వేషులౌతున్నారో తెలుసుకుని, జ్ఞానంతో ప్రేమతో వాళ్ళమీదికోపాన్ని తీసేసుకోడం.

వెర్రి డేంటో వొచ్చిందంటే, ఇదంతా చాలా సులభమైనట్టూ, మనం చెప్పే యీ మాటల ఇతరులు వింటే చాలు, సమస్యలన్నీ పరిష్కారమైనట్టూ, యుద్ధాలు ఆగిపోయేట్టూ బోధించడం. బోధించే మనలో లేదు, ఆ గొప్ప గొప్ప యోగులు అనుకునే వాళ్ళలో లేదు. "ఎప్పుడైతే దేశనాయకుల మనసులు పరిశుద్ధమౌతాయో, ఉపాయమూ, బలమూ, స్వార్థపరత్వమూలేక, దయా, ప్రేమా ఆత్మజ్ఞానమూ వారి నడతని ఉద్బోధిస్తాయో, ఆ నిమిషాన" అని చాలా సులభంగా గోటితో మీటేస్తున్నట్టు రాస్తారు.

చివరికి యోచించగా మనము ఇంకోరితో ఐక్యమైతేనేగాని, భేదభావం పోతేనేగాని, ఆ రెండో వారియెడల, ఏ ఉపకారమూ జరుగదు.

అట్లాంటి భేదభావం పోయినరోజున, కొంచెం పోయినాసరే, విక్టర్‌హ్యూగో, బిషప్ లే అవుతారు మనుషులు. వాళ్లు ఎన్నివేల యేళ్ళలో తటస్థిస్తారో యీ లోకానికి. కాని ఈనాడు సాధ్యమైనట్టు మాత్రం మాట్లాడులో వుంటాము.

ఐనా, ఉద్దేశ్యంనించి కార్యమేగాని, కార్యంనించి ఉద్దేశ్యమూ మారేట్టుంది. కొట్టడం చంపడం చేస్తున్నమనిషిలో ఇదివరకువున్న దానికన్న

క్రమంగా క్రౌర్యం ఎక్కువ పెరుగనూవొచ్చు. అందువల్లనే కౌర్యానికి కూడా కొంత విలువ వుంటుంది.

సమానంగా అందరికీ పంచాలి అనే సూత్రం ఆచరణలో పెట్టడానికి హింసామార్గం దోచుకోడం, అహింసామార్గం చట్టాలద్వారా, పన్నులద్వారా, ధనికుల్ని దోచుకోడం. క్రౌర్యం లేకపోవడమే భేద మంటే, అట్లా కాకపోవొచ్చు. చాలా క్రౌర్యంతో చాలా చట్టాలు ఏర్పరుస్తారు. ఆ క్రౌర్యాన్ని కప్పేట్టు ధర్మం మాట్లాడతారు. అంతేభేదం. "పేదవాళ్లు ధని కుల ఇళ్ళకు కన్నాలువేసి దోచుకుంటారు. ధని కులు బీదవాళ్ళని ప్లీడర్ల ద్వారా దోచుకుంటారు" అనిపిస్తాడు గాల్స్వర్దీ గావును. దోచుకోడంలో హింసవుంటే, అది చట్ట సమ్మతమైనప్పుడు, ధర్మం ముసుగు కప్పుకుని పనిచేస్తోందన్నమాట.

హాస్టలులో నన్ను మిత్రులు వెలేసినప్పుడు, ఏ మిత్రుణ్ణి అడిగినా "ఏమ్మో! నాకేం తెలుసు? వాళ్ళందరూనూ." అన్నారు.

అట్లానే సాంఘికంగా తప్పుచేసిన వాళ్లని అనాగరికుల్లో తంతారు. నాగరికులు వెలేస్తారు. అది కాని నాడు చల్లగా వొదిలి వూరుకుంటారు. ఆ మనిషిని తమలో వొకర్నిగా అంగీకరించరు.

పురుషుడికి బహు భార్యాత్వం కూడదు అనే చట్టం ఎందువల్ల ఆమోదం పొందింది? ముఖ్యంగా స్త్రీలలో కసి తమకులేని హక్కు పురుషులకి ఎందుకు వుండా లని. తమకు ఆ హక్కు కావాలని అడగడానికి సిగ్గూ పాతివ్రత్యభావం అడ్డు. కొందరు పురుషులు ఏదో అనుభవించిపోతున్నారని తక్కిన పురుషుల ఈర్ష్య. అట్లాంటి చట్టంవల్ల ఎవరికి ఉపకారం జరుగుతుందని అనుకుని మోసపుచ్చుకుంటున్నారు, అది జరగుతుందా అని ప్రశ్నైనా రాదు.

మద్యపాన నిషేధం దయావంతులే పూనుకున్నట్టయితే, మద్యపానంమీద కసే మనుషులకి లేకపోతే, తాగేవాళ్ళమీద నిజమైన జాలేవుంటే, తప్పకుండా ఆ చట్టం ఇంకోవిధంగా అమలులూకి వొచ్చేది. ఇన్ని రేషన్లలో అదొక మితిగల రేషన్గా ఏర్పరచడం, ప్రస్తుతం తాగేవాళ్ళకి పర్మిట్లు ఇచ్చి, ముందు ఇతరులకి అలవాటు కాకుండా చెయ్యడం మొదలైనవి. ప్రజలకి మద్యపానం చెడ్డదని ఒకసూత్రం ఆధారం చేసుకుని, అనేకవేలజనాన్ని ఇంతక్రూరంగా ఆకస్మాత్తుగా బాధపెట్టడం జరగదు. ప్రజల ఆరోగ్యాన్నీ, నీతికీ, ధనసమృద్ధికీ ఈవిధంగా బలవంతపు సంస్కారాలు ప్రారంభిస్తే, ఇహలోకసంస్కారం, జీవితసారం పీల్చేసిందాకా ఆగదు. ధర్మపరులైన మనుషులూ, ధర్మబద్ధాలైన దేశాలంత భరింపరానివి వుండవనుకుంటాను.

ఈమధ్య రేడియోలో తెలుగుమేటి కథకులందరూ కలిసి ఆదర్శజీవులని ఒక నవలను రచించారు. మరి ఏంజరిగిందో, ఒకవిషయం బలవంతంగా వాళ్ళమీద విధించడంవల్లనో, లేక ఆ ఆదర్శమేమిటో అందరికీ ఏకంగా చర్చించకపోవడంవల్లనో, ఏవొక్కరైనా చక్కనికథలు రాయగల మనుషులు ఏకమై ఒక వికృతాన్ని తయారుచేశారు. అది నవలా కాదు, కథా కాదు, సైకాలజీకాదు. అదేదో ఒక డెవిల్. సైకలాజికల్ నవలవుంటుందనీ,దానిముఖ్యమైన feature కథ వుండకపోవడమనీ ఆరేడియో అధికార్లు ఎవరో దూరంగా విన్నట్టున్నారు. గొప్పకవుల్ని ఆనాటి ప్రజ మెచ్చుకోలేదు, నన్నూ మెచ్చుకోడంలేదు, కనక నేను గొప్పకవి నన్నట్టుంది. ఆదర్శమంటే ప్రజాసేవా, ఆదర్శవివాహం అని నిర్ణయించారు. ప్రజాసేవ ఆదర్శం అని తామే నిర్ణయించుకుని, ఆదర్శజీవులం కనక ప్రజాసేవ చెయ్యాలని, ప్రజాసేవ అంటే చాలా మర్యాదగా సర్టిఫికెటు పొందిన వితంతు శరణాలయం హరిజనసేవాఅనీ, వాళ్ళు ఆ పనులు ప్రారంభించారు. ప్రజాసేవకీ అప్రయత్నంగా ఇతరులబాధని సహించలేని కరుణకీ సంబంధం

వుంటుందనికూడా తోచలేదు. ఆదర్శవివాహం, మూఢమని పెళ్ళిపాటలూ, పల్లకీలూ, అగ్నిహోత్రాలూ తీసేశారు. ఈ విజ్ఞానసాధకులకి, తాళిబొట్టూ, పెళ్లి అనేవాటిల్లోని మూర్ఖం తట్టనేలేదు. రచయితల విజ్ఞానసాహసాల్నిబట్టే జనించారు ఆదర్శజీవులు.

ఇంక "లోపాలు ప్రేమించడమా, సహించడమా?" అని తర్జన భర్జనలు చేశారుగాని లోపాలు అంటే వీరి అనుభవం ఎంత లోతులేనిదో స్పష్టంగా తెలుస్తోంది. లోపం అనేది ఎక్కడ? వారిస్వభావంలోనా, మనకు గిట్టకపోవడంచేత మనమనసులోనా? గొప్పలతోబాటు, జన్మతోపాటు పెనవేసుకుని ఎన్నడూ నశించని స్వభావచ్ఛాయలై ఎన్నిలోపాలు! లోపాల్ని ప్రేమిస్తే, ప్రేమించేదాన్ని సంస్కరించడమెందుకు? ఇట్లాంటి ఆలోచనలే రాలేదు.

ఇంతమంది ఆర్థిక రచయితలూ చేరి ఆ ఆదర్శజీవుల ఆర్థికస్థితి ఏమిటో, వాళ్ళబతుక్కి డబ్బు ఎక్కడిదో వ్రాయనేలేదు. ఆ జీవులు లోకం అధోగతిలో వున్నదని నడుంకట్టారేగాని తమకి ఆదాయం ఎట్లా వొస్తోందో, ఆ ఆదాయం తాము ఉపయోగించుకోడం తమకి ఎంత ధర్మమో ఆలోచించరు ఆ ఆదర్శజీవులు. ఇంతమంది ప్రజ అన్నంలేక మాడుతోవుంటే తాము విజ్ఞానమనీ, మంచి ఇల్లూ, భోజనమూ, ఇదంతా తమకి ఉండడానికి ఎట్లా సమర్థించుకున్నారో తెలీదు. వాళ్ళు ఆదర్శజీవులూ, విజ్ఞానసాధకులూ, లోకసంస్కర్తలూ గనకనే ప్రశ్నించాల్సివొచ్చింది ఇంత ముఖ్యమైన విషయం ఎట్లా మరిచారో అని. కాని ఆ ఆదర్శజీవులు మారక తప్పదు. ఎందుకంటే man is the distorted image of God. అదే ఇంకోవిధంగా God is the idealised image of man.

లోకసంస్కారం, ఆర్థికవిప్లవం అనే ఆదర్శాలలో ఎంత escapism వుందో, ఈ ఆకలిమాన్పే యోధులు తాము కనే ఆదర్శస్వప్నాలలో స్వంతానికి ఎంత వీలుగా తమ ధనవ్యయాల్ని మరిచిపోగలుగుతున్నారో, చాలా చక్కగా ప్రదర్శితమయింది.

రేడియోవారి గట్టిహద్దులు లేకపోతే ఇంతకన్న తప్పకండా మంచికథ వొచ్చివుండు ననిపిస్తుంది. కాని వారి కళాదౌర్జన్యానికి యీ మేథావులు ఎందుకు తలలు వొంచారా అని. డబ్బా? కీర్తిగావును. పత్రికాధిపతులు వొక్క intellectual సర్వజ్ఞులైతే, యీ రేడియోవారు విజ్ఞానికేగాక కళకీ, సారస్వతానికీ సంపూర్ణాధికారం తీసుకున్నట్టున్నారు దేశంలో. సంగీతంవాళ్లూ, పాటకులూ, రచయితలూ, నటకులూ వారిచ్చేడబ్బుకోసం వారిదాసోహం చేస్తున్నకొద్దీ. చాలా సహజం మనషులకి తాము సర్వతోముఖప్రవీణులమనుకోడం. గొప్ప యూనివర్సిటీ చేయవలసినపనిని చేస్తోంది రేడియో ఆఫీసు. క్రమంగా కొన్నేళ్ళలో ఏరాగాలు సంగీతానికి పనికి వొస్తాయో, ఏ వాయిద్యాలో, ఏ నవలలు ఎట్లా వ్రాయాలో, ఏ నాటకాలు ఎట్లా వుండాలో సులభంగా నిర్ణయించేసేట్టున్నారు. ఎందుకంటే వుద్యోగాలకీ, తాత్కాలికధాన్యులకీ ఆ దేవతలచుట్టూ తిరగిన ఆర్టిస్టు అరుదౌతున్నాడు. ఎప్పుడూ ధనమే రాజులరూపానో, ప్లీడర్లరూపానో, రేడియోవారి రూపానో కళావిర్భావపు హద్దులు నిర్ణయించడం తప్పదుకాబోలు!

# "తత్త్వానుకృతి: కళ"

## శ్రీ ఆచార్య పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

### సాహితీ సమితి

కవికి మానవజీవితము, తన పరిసరాలు, జగద్వ్యవహారానికి కావలసిన ముఖ్య సూత్రాలు అనేవి ప్రధాన విషయాలని అందరు అంగీకరించవచ్చును. కాని కవి జీవితమును యధామాత్ర్యకంగా అనుకరించాలా, లేక ప్రదర్శించాలా, లేక వ్యాఖ్యానించాలా అనే విషయంపై అనేక భిన్నాభిప్రాయాలున్నవి. గ్రీసుదేశంలో అరిస్టాటిల నే తత్త్వజ్ఞుడు కళ జీవితానుకృతి (Minesis) అన్నాడు. అనుకృతి శబ్దానికి ప్రదర్శన, వ్యాఖ్యానమునని పలువురు నిర్వచిస్తూ అతని వాదమును బలపరచ యత్నించారు. ఇక భారతీయ సాహిత్య విమర్శనా సంప్రదాయం గమనిస్తే మనకు భరతనాట్య శాస్త్రంలో ముఖ్యమైన సన్నివేశాలు, భావాలు కనపడుతున్నవి.

షష్ఠాధ్యాయంలో భరతుడు నాట్యధర్మి అని లోకధర్మి అని రెండున్నవన్నాడు. లోకంలో మనము నిత్యమూ చూచేది, అనుభవించేది లోకధర్మి. కాని నాటకంలో ఇదంతా ఇమడ్చబడలేదు. కొన్నిమార్పులవసరము. ఆ మార్పులనే నాట్యధర్మి అన్నాడు. ఈ దృష్ట్యా వీటిని నిర్వచించటానికి బయలుదేరినాడు (13-15, 17, 22, 23 అధ్యాయాలు).

శబ్దంలోను, గానంలోను, వేషధారణలోను నాట్యధర్మియొక్క వైశిష్ట్యం ఉన్నది. ఉదారములు, మధురములునైన శబ్దాలను కవి ప్రయోగించాలి. ఈ శబ్దాలు అర్థమునకు లోబడిఉండాలి. అనగా కవి శబ్దస్వరూపమునుచూచి విభ్రాంతుడై వాటిని ఉపయోగించరాదు. భావార్థ ద్యోతకమగునా కాదా యని విమర్శించి శబ్దమును ప్రయోగించాలి. అర్థవశానుగమమైన శబ్దము కావాలి. భవభూతి అనినట్లు మహాకవులకు ఋషులకు "వాచ మర్థోనుధావతి." వారే శబ్దముపయోగించినా వారి భావ వ్యక్తీకరణకు యోగ్యమయేది ఔతుంది. నిగూఢమైన భావమును చెప్పేశబ్దాలు పనికిరావు. అనగా శ్రీహర్షాది కృతులలోని శైలి నాటకములో యుక్తమైనదికాదు. మృదులలిత పదార్థయుతమై ఉండాలి. విద్వజ్జనులకు సౌఖ్య మిచ్చేవి, నృత్యానికి యోగ్యమైనవి ఐన శబ్దాలు ప్రయోగింపబడాలి. కమండలుధారులైన సన్యాసులవద్ద వేశ్య లేవిధంగా రాణించలేరో, అలాగే శ్లేషయమకాను ప్రాసాదులతో కూడిన నాటకముకూడా శోభించదన్నాడు భరతుడు. శబ్దవిషయకమైన నాట్యధర్మి ఇది. లోకధర్మికి నియమాలు, నిబంధనలు లేనేలేవు. (17, 120-131).

రెండవది వాచికాభినయమైన సంగీతము. ఇది నాట్యధర్మిగా పరిగణింపబడవలెనంటే స్వరాలంకారములతో కూడుకొని ఉండాలి. ఇందులోని శబ్దాలకు పైన చెప్పిన నిబంధనలన్నీ ఉంటవి. మూడవది రంగస్థలము. జీవితంలోని సన్నివేశాలను కవి గ్రహించినప్పటికీ, అతని నాటకములోని పాత్రలు రంగస్థలమువీుదనే ప్రదర్శింపబడతవి. అందుచేత జీవితంలో కనబడే రంగస్థలము నాటకములోనికి అనువదింపబడలేదు. జీవితంలో కనబడే మేడలు, ఇళ్ళు, ప్రయాణాలు మొదలైన ముఖ్య సన్నివేశాలు రంగస్థలంవీుద చూపబడలేవు. కావున వాటికి ప్రత్యామ్నాయంగా కొన్ని చేయబడతవి. సమనస్కులైవ ప్రేక్షకులు వాటిని భావించుకోవాలి, శైల

యాన, విమానగమన, ఆయుధప్రహారణాదులు,మృతి, నిద్ర మొదలైనవేవీ చూపబడవు. ఇదే నాట్యధర్మి. ఇక నాల్గవది వేషము. వేషభాషాదులనుబట్టి రంగస్థలములో చూపబడినవి, ప్రేక్షకులు భావింపవలసినవి, తెలిసికొనబడతవి. ఇలాగే స్వగతాలు ఉంటవి. సన్నిహితంగా మరొక పాత్ర ఉన్నప్పటికినీ, ఒకడనుకొను స్వగతవాక్యములు పైకి ఉచ్చారితములైనా అతనికి వినబడవని మనం గ్రహించాలి. ఇదే రీతిగా ఒక్కొక్కప్పుడు అనుక్తమైనదికూడా వినబడుతుంది. ఇదంతా నాట్యధర్మి (14, 22, 23).

లౌకికధర్మ వ్యతిరేకమైన ధర్మము నాట్యములో ఏమీలేదు. కాని లోకములోని ప్రక్రియాక్రమమునకన్నా రంజింపచేయవలెనని, నట వ్యాపారంలో కవి తీసికొనివచ్చే వైచిత్రమే నాట్యధర్మి. అంటే కవి లోకానుసరణచేసిన వైచిత్రయోగ్యత్వంలో దానిని ప్రదర్శించాలి. అందువలననే, "స్వభావో లోకధర్మేతు నాట్యధర్మే వికారతః" (23. 192) అన్నాడు. స్వభావసిద్ధము, స్వతః సిద్ధమునైనది లోకధర్మి. దానిలో యత్కించిత్తుగా మార్పులనుచేసి, తద్విశిష్టతను ప్రదర్శించటమే నాట్యధర్మి.

"యోయంస్వభావో లోకస్యసుఖదుఃఖ క్రియాత్మకః
సోఽంగాభినయ సంయుక్తోనాట్య ధర్మీతుసా స్మృతా" (14-78).

సుఖదుఃఖసమన్వితమైన లోక వ్యవహారమును అభినయములో మేళవించితే నాట్యధర్మి ఔతుంది. కావుననే "నాట్యప్రయోగేతు ప్రమాణం లోక ఇష్యతే" అన్నాడు. నాట్యమునకు ప్రమాణము, మూలమునైనది లోకమే. దాని వ్యతిరేకముగా, భిన్నముగా కవి ప్రదర్శించరాదు. "లోకః ప్రమాణం హికర్తవ్యం నాట్యయోక్తృభిః" అన్నాడు.

దీని పర్యవసాన మేమంటే కవికి కావలసిన సాధన సామగ్రి జగత్తులోనే ఉన్నది. దానికి దిక్కరించి పోరాదు. కాని జగత్తులో కన్పించే ప్రతి దానికి తన కావ్యములోగాని నాటకములోగాని ప్రవేశపెట్టరాదు. కవి తనకు వలసిన ముఖ్యవిషయాలను బాహ్య ప్రపంచమునుంచి జాగ్రత్తగా పరిశీలనానంతరము ఏరుకోవాలి (Selection). కావ్య ప్రతిభ ఈ Selection పై ఆధారపడి ఉంటుంది. ఇందులో కొంత అనుకృతి ఉండి తీరుతుంది.

ఈ అనుకరణవలన ప్రయోజన మేమున్నదని ఆనందవర్ధనాదులు త్రోసివేశారు. కాని అనుకృతి అంటే కేవలము బాహ్యస్వరూపములను తీసికొనిరావటమా ? అని ప్రశ్నించాలి. ఎలాంటి కవియైనాతను గ్రహించి ప్రదర్శించబోయే విషయంలో తన భావాలనుకూడా మేళవింపచేస్తాడు. ఇట్టిసంఘటన ఎందుకు జరుగుతుందంటే కవి తనపరిశీలనలో కేవలము బాహ్యాకృతితో తృప్తిపడడు. అంతరంగికమైన సత్యమును, యదార్థమును అవగాహనము చేసికోటానికి ప్రయత్నిస్తాడు. ఆతత్త్వముతో తన భావములను అనుభూతిని మేళవించి ప్రదర్శిస్తాడు. ఈ ప్రదర్శ శబ్దముఖముగా నుంటుంది. కాని శబ్దము భావార్థ ద్యోతకమైన ప్రతీక కావటంచేత మన మనస్సుకు, ఆత్మకు వెంటనే చొరవచేసికొని పోతుంది. ఆశబ్దము బాహ్యవిషయమును విమర్శించేది కాబట్టి మన ఇంద్రియాలకుకూడా సంతృప్తినిస్తుంది.

కాని బాహ్యవిషయములోని తత్త్వావధారణ చేయటానికి ఆత్మసంస్కారము కావాలి. మానసికాభివృద్ధి, నైతికబలము, సంస్కృతి గలవాడే బాహ్య పదార్థంలో సాక్షాత్కృత ధర్ముడౌతున్నాడు. కావుననే ఋషులను మంత్రద్రష్టలన్నారు. ఋషి కానివాడు కవికాదని తౌతభట్టపాదు

లన్నారు. తత్త్వదర్శన కలవాడే ఋషి. విచిత్రమైన భావములతోను, ధర్మములతోను వ్యక్తీకరింపబడేది తత్త్వము, దీనికి ఆత్మసంస్కృతి కావాలి,

అందువలననే ఐతరేయ బ్రాహ్మణములో (6-17) దేవశిల్పానుకృతివలననే మనశిల్పము జన్మించుచున్న దనిచెప్తూ, ఈ దేవశిల్పములు ఆత్మసంస్కృతులనీ, వీనిచేతనే మన ఆత్మ సంస్కరింప బడుతుందనీ చెప్పినారు. విష్ణుధర్మోత్తరంకూడా (42-48) శిల్పము ప్రధాన విషయమునకు సాదృశ్య మత్యవసర మంటున్నది. ఏవిషయానికైనా అంతర్లీనమైన తత్త్వమును మరుగుపరచి, తప్పివేసేది బాహ్యాకృతి. ఈ ఆకృతి నశించునది. కాని కవి ప్రదర్శించు భావములో శాశ్వతత్వముండాలివి. కావున కవి అనుకరించేది బాహ్య విషయంలో అంతర్లీనమైన తత్త్వము.

ఈ తత్త్వము శబ్దరేఖాదులలోనికి ప్రవేశిస్తుంది. శకుంతలాచిత్రమునుచూచి భావమధురమైన రేఖను ఆనందిస్తూ.

"మధురావస్థాన దర్శనీయో భావానుప్రవేశః,

ఆలాపన కౌతూహలం మే జనయతి"

అన్నాడు విదూషకుడు. భావము అంతర్యామిగా బాహ్యాకృతిలోనికి ప్రవేశించి మన ఆత్మకు ఇంద్రియాలకూ ఆనందం చేకూరుస్తుంది. కావున ఆత్మేంద్రియ సంయోగముచే వ్యంగ్యంగా ప్రదర్శించబడే తత్త్వమేకళ అని నిర్వచనము చెప్పకోవచ్చును.

ఈ ప్రదర్శన పూర్తిగా సమాధిని సాధించినవానికే లభ్యమౌతుంది. శిల్పము శిథిల సమాధివలన కాంతివిసంవాద మౌతుందని మాలవికాగ్నిమిత్రములో అందుకనే మహాకవి కాళిదాసు పల్కినాడు.



# కళలు - మానవ జీవితము

శ్రీ రాజా రంగయ్యప్పారావు

ఆర్థిక విప్లవం ప్రపంచాన్ని రణరంగంగా మార్చింది. ప్రపంచ పరిస్థితులన్నీ పరిశీలిస్తే ఎటు జూచినా గాఢజీమూతాలే కనబడుతున్నాయి. యుద్ధం శాంతించిందన్న మాటేగాని యుద్ధ కారణాలు సమసిపోలేదు, జాతుల మధ్యా—సామ్రాజ్యాల మధ్యా రగిలిన క్రోధజ్వాలలు చల్లారినట్లు లేదు, సాముదాయిక రాజ్యాల సభాపరిస్థితి జూచినా మళ్ళీ యుద్ధం వస్తుందా అనిపిస్తోంది.

ప్రాపంచిక రాజ్యాల దృష్టిఅంతా నేడు ఆటం బాంబులమీద కేంద్రీకరింపబడుతోంది. అమెరికా ఎక్కువగా తయారుచేసి దాచుకుంటున్నదేమో అని రష్యా భయం—రష్యాకూడా తేలికగా యాటం బాంబులు కనిపెట్టిందేమోననే వదంతీ వ్యాపించింది.

జర్మనీ జపానులు పోయి రష్యా అమెరికాలు ప్రపంచ రాజకీయాన్ని ఆక్రమిస్తున్నాయి. ఇంగ్లండు ప్రథమస్థానాన్ని గోల్పోయి తృతీయానికి వచ్చింది.

ఈ సామ్రాజ్యాలేగాక పీడిత రాజ్యాలు, జాతులు, స్వాతంత్ర్య సమరం సాగిస్తున్నాయి. యథార్థమైన మానవ స్వాతంత్ర్యం గుర్తింపబడే వరకూ ఈ అగ్నిజ్వాలా—ఈ రక్తపాతమూ ఆగేటట్టు లేవు. కేవలం ఆర్థిక సూత్రాలతో, ఆర్థిక వేత్తలతో పాలింబడే సామ్రాజ్యాలు మానవ స్వాతంత్ర్యాన్ని గుర్తించేటట్టు లేవు.

ఇంతేగాక క్షామబాధ ప్రజాసంఘాన్ని పీడిస్తోంది. సస్యశ్యామలమైన భారత భూమియందే తిండిలేక కోటి ప్రాణాలు పోయాయి. గుడ్డలేక దేశం అల్లాడుతోంది. తిండీ గుడ్డా కఱవైన నేటి భారతావనియందే మతకలహాలు కారణంగా రక్తపాతం జరుగుతోంది కూడా.

అస్వాతంత్ర్యమే క్షామాన్నీ—రక్తపాతాన్నీ సృష్టించిందని గ్రహించినా నివారణోపాయం మాత్రం ప్రాపంచిక రాజకీయంమీద ఆధారపడి వుంది.

ఈ మహా సంక్షోభంలో కళలు అవసరమా? ఆవిర్భంచునా? అనే విషయాలు చర్చనీయాలు కావా?

అతి దరిద్రమైనా— అధికైశ్వర్యమైనా కళలకు ప్రతిబంధకాలే అని ప్లేటో నిర్వచనం.

అతి దరిద్రం ప్రాచ్య దేశాలనూ అధికైశ్వర్యం పాశ్చాత్య దేశాలనూ ఆవరించివుంది.

భారతదేశంలో మరీ అన్నవస్త్రాలకు లోటు ఏర్పడింది. భారతీయుల్లో 50%కు పూర్తిగానైన ఆహారం లేదు. కావలసినంత ఆహారం తినేవాళ్ళుకూడా సరియైన ఆహారం తినడంలేదు. విటమిన్లు తక్కువవడంచేత అనేక జబ్బులు వస్తున్నాయి. అందులో ముఖ్యంగా బియ్యం తినేవాళ్లు మరీ దుఃస్థితిలో నున్నారు.

పప్పు పదార్థాలు, 5 మొదలు 1.5 ఔన్సులు, కూరగాయలు 6 ఔన్సులు, నూనె 1 ఔన్సు కంటే తక్కువ. గ్రుడ్లు మాంసం మొదలయినవి 1.5 ఔన్సులు, పళ్లు చాలా తక్కువనే చెప్పాలి. పాలు కూడ మరీ తక్కువే. ఈ రోజుల్లో నెయ్యి పాలు అసలే దొరకడంలేదు. ఈ కారణాలచేత జబ్బులకు లోనై చాలమంది మరణిస్తున్నారు.

శిశు మరణాలలోను, బాలెంత మరణాలలోను,

భారతదేశం ప్రథమశ్రేణికి వచ్చింది. సగటు ఆయుస్సులో ఆఖరు తరగతికి వస్తోంది.

మనకు వైద్యాలా తక్కువ— మందులా విదేశాల నుంచి రావాలి. వైద్యశాలలయినా జనబాహుళ్యానికి సంబంధించిన పల్లెపట్టులకు అందుబాటులో లేవు. విద్యా విషయంలో చూచినా 100 టికి 10 మంది మాత్రమే చదువుకున్నవాళ్ళు.

ఈ పరిస్థితుల్లో దేశముంటే, ప్రకృత పరిస్థితి అల్లకల్లోలంగాను—భావిపరిస్థితి అగమ్య గోచరంగాను కాలముంటే, కళా సౌందర్యమూ—కళా విజృంభణమూ—వాటిని గురించిన ప్రశంసా ప్రాచుర్యాలు ఎంతవరకూ సమంజసం ఎంతవరకూ నిలుస్తాయి? అని మనమందరం ప్రశ్నించుకోవలసిందే.

"పోయెనే సిరులెల్ల
పోయెనే మనసెల్ల
కాలసుందరి కాలి
గజ్జె మోతలతోడ
నేను నిల్చుటయెడ నేది?"

అని కళాహృదయం ఆక్రోశించే కాలమిది.

అయినా కళాకాంతి నశించేవి కావు "నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః" అన్న రీతిగా కష్టసుఖాలకు అతీతమైన మానసికోన్నతి నుండి ఆవిర్భవించే కళ అణగిపోదు—ఆరిపోదు.

"ఏల సుఖదుఃఖములకు నూగింతు నెడద
ప్రాణమున్నంతవరకునే పాడుకొందు"నని రససాక్షాత్కారము నాకాంక్షించు కళాహృదయం లక్ష్యసిద్ధికై ప్రయాణిస్తూనే ఉంటుంది.

సామాన్య హృదయానికీ కళాహృదయానికీ తేడా వుంటుంది.

సామాన్య జీవితానికి ఆహార సంపాదనాది దైనందిన వ్యవహార సంతృప్తియే సుఖము. ఆ సౌఖ్యాగ్రము నుంచే సౌందర్యాన్ని వీక్షిస్తుంది.

కళా జీవనం ఆకలి మంటలనుండీ అజరామరత్వాన్ని-దుఃఖాంధ తమసంలోనుంచి తేజఃపుంజాన్ని సృష్టించుకొంటుంది.

కళా సౌందర్యం ఆత్మ సంబంధీ—అతి లోక మానసిక సంస్కృతీ అయివుంటుంది.

సామాన్య హృదయం, ముందుకోరేది శాంతి. సుభిక్షం. తర్వాత సౌందర్యం.

కళా హృదయం కోరేది సత్యం—శివం—సుందరమే.

ఈ రెండూ విభిన్న ప్రవాహాలే. పొత్తేమిటి? అంటారేమో? జాగ్రతగా పరిశీలిస్తే వైరుధ్యంలేదు. అవినాభావసంబంధమే గోచరిస్తుంది.

ఒకటి స్థూలదృష్టీ ఇంకొకటి సూక్ష్మదృష్టీ అనిపించుకొంటాయి.

ప్రతి జీవితానికీసౌందర్యానందాలు కావాలి. ఎంత క్షామపీడిత ప్రజాసంఘమైనా ఆహారమే కాని విద్య అవసరంలేదని త్రోసివేయదు—ఎంత క్రూర హృదయమైనా కళా సౌందర్యం ముందు ద్రవించక మానదు. ఎందుకంటే మానవశరీరానికి ఆహార మెంత ముఖ్యమో మానవ హృదయానికి ఆనందమూ అంత ఉజ్జీవనకరమే.

కేవల జననమరణ సంసారాది క్రియా పరిభ్రమణం తిర్యగ్జంతు ధర్మం. విజ్ఞానానందములే మానవత్వపు నికేతనాలు. దీనినిబట్టి భౌతిక జీవిత సామగ్రి అనావశ్యకమనికాదు. మానవునిలో మనశ్శరీరాలస్థానమే వీటికిని కలదు.

పురాతన మానవుడు నాగరకతోషఃకాలంలో తన కాలమంతా ఆహార సేకరణార్థమే గడిపేవాడు. తన ప్రతిస్పర్థులైన వ్యాఘ్రసింహాలతో పోరాడడమూ, రాత్రిమొదలు ఉదయంవరకు పంచభూతాల బారినుండి తప్పించుకొనడమూ, గుహాగేహాలలో భార్యాపిల్లలతో కాలం గడపడమూ జరుగుచుండేది.

# కళలు - మానవ జీవితము

తన విరోధ శక్తులతో పోరాడడానికి బంధు మిత్రులతో సాంఘికజీవనం చేసేవాడు. ఆనాటి మానవుల్లోనైనా కళా భావాలు అంకురించక పోలేదు. పురుషులు గుహాద్వారాలను సమంగా చెక్కడమూ- స్త్రీలు మృగాలను మానవులనూ చిత్రించడమూ జరిగేది. అవే శిల్పానికీ చిత్రకళకీ అంకురాలు. మానవ హృదయంలో కళాస్రవంతి గుంఫితమై వుంటుందన డానికిదే తార్కాణం.

ప్రాథమిక శిల్పం ప్రాథమిక చిత్రణం ఇప్పటికీ గుహాప్రాంగణ భిత్తికల్లో కనిపిస్తూ ఉంటాయి.

లలిత కళలయిన శిల్పము—చిత్రకళ, కవిత్వము, గానము మొదలయినవి ఈజిప్టుదేశంలో—గ్రీసు దేశంలో—గంగానది సింధునదీ ప్రాంతాల్లో ప్రథమతః ఆవిర్భవించి అభివృద్ధిచెందాయి. ఇచ్చట ప్రజలకు జీవితసామగ్రి తేలికగా దొరకడమే కారణం. వారికి కావలసినంత విరామం కూడా ఉండేది. అందు వల్ల మానసిక కృషికీ—వికాసానికీ అవకాశం లభించింది.

కళాభివృద్ధికి ఆర్థిక శారీరిక సౌష్ఠవాలు ముఖ్యా వసరాలు. కళలకూ జీవితానికీ ప్రతిస్పర్థ లేదనడమే కాకుండా అవినాభావసంబంధమున్న దనడమే సమంజసం.

ఇది కేవలం వ్యావహారిక జగత్తు. దీనిలో సత్యం-శివం—సుందరం అనే పరమార్థాలకు క్రియాకలాపం ఉంటుందా! ఈ ఆర్థిక వాహినిలో—ఈ విజ్ఞాన రంగంలో—ఈ క్షణక్షణ పరిణమిత రూపజగత్తులో నాశనములేని, కల్యాణమూ చ్యుతీలేని సౌందర్య మూనా! ఎంతవరకివి విశ్వసత్యాలు? అనే సందేహాలు స్ఫురిస్తాయి.

ఎందుకంటే పరమాశయాలు అంతర్జగత్తుకు సంబంధించినవే కాని వ్యావహారిక జగత్తునందు లక్షింపదగినవి కావనీ, వస్తుగతాలు కావనీ తీవ్రవాదన వుంది. ఇది ఎంతవరకూ సమంజసమో పరిశీలించాలి. ఎందుకంటే ప్రస్తుత ప్రాసంగిక విషయం లలిత కళలను గురించే గనుక సౌందర్యంయొక్క నిజస్వరూపాన్ని గురించీ సౌందర్యస్థానాన్ని గురించీ చర్చించడం అవసరం.

"మానసికము" అనే పదం వ్యక్తిగతమానసిక నిశ్చయానికే చెందుతుంది. అంటే మానసికమైన నిశ్చయం చేసుకొంటే ఆయావ్యక్తుల మనోభావాన్ని బట్టి వుంటుంది. "వస్తుగతమైన నిశ్చయం" మానవునికి బహిర్గతమైన ప్రకృతి విశేషములలో ఒక ప్రత్యేక విషయంపై గురించిన వివరణం.

మానసిక నిశ్చయాల నైజగుణం ఎలాంటిదో చూదాం.

ఇద్దరు వ్యక్తులున్నారు—ఒకరికి మాంసాహారం అలవాటు, రెండోవారికి శాకాహారం అలవాటు. మంచి మాంసాహారం తెచ్చి వీరిద్దరియెదుటా ఉంచితే ఒకడు మంచిది చాలా బాగుందంటాడు, ఇంకొకడు ఏమీ బాగాలేదు సరిగదా చెడువాసన దగ్గరకే వెళ్ళలేకపోయానంటాడు. వీరిద్దరి జిహ్వాలు వేరువేరు అలవాట్లకు లోనై ఉన్నాయి కాబట్టి వీరిద్దరి అభిప్రాయాలు భేదాలుగా ఉంటాయి. ఇవి వీరిద్దరి అనుభవాలు.

"మాంసం రుచిగా ఉన్నది" అనే నిశ్చయం "మాంసం దుర్వాసనగా ఉన్నది" అనే విషయాన్ని అనృతం చేయజాలదు. ఎందుకంటే ఈ రెండు నిశ్చయాలు ఒకే వస్తువునుగురించిన వైనప్పటికీ వేరువేరు మానసికానుభవాలపై ఏర్పడ్డ సత్యాలు. వీటినే వ్యక్తిగత నిశ్చయాలు అని చెబుతాము.

ఈవిధంగానే సముద్రం చూచినప్పుడు ఒక్కొక వేళ నీలంగాను ఒక్కొకవేళ ఆకుపచ్చగాను కన

పడుతుంది. ఇది సూర్యకాంతి ప్రసారణంవల్ల ఏర్పడ్డ వర్ణవైచిత్ర్యం. ఒకడు వర్ణాంధుడైనట్లుయితే అందరికీ కనుపించినట్లు కనబడదు. ఈ చిక్కులన్నీ ఉంటాయి కాబట్టి "సముద్రపువర్ణం నీలం" అంటే "నాకు సముద్రం నీలంగా కనుపిస్తుంది" అని అన్వయించుకోవాలి. అప్పుడు సరిగా మనోనిశ్చయంలాగ దృఢపడుతుంది.

వస్తుగత మనోనిశ్చయాల ప్రమితి వేరు. దీనికుదాహరణంగా గణితశాస్త్ర ప్రమాణాలు పరిగణనీయాలు.

3+2=5 అంటాంగాని దీని విషయంలో ఎవ్వడూ కూడా 3+2=5 లాగ తోస్తోంది అనడు. ఎందుకల్లనంటే 3+2=6 అంటే అనవచ్చునని ఎంత "మానసిక సిద్ధాంతవాది" అయినా అనడు. ఈ సంబంధాలు అంకెలకుగల పరస్పర మైత్రిని తెలియజేసే విషయాలు కొబట్టి. ఎవరయినా 3+2=6 అంటే తప్పు అని నిస్సందేహంగా అంటాం.

సాధారణంగా ప్రకృతి శాస్త్రవేత్త వాతావరణంలో "సత్యం శివం సుందరం" అనే పరమార్థాలను గురించికూడా చేసేనిర్ణయం వ్యక్తిగతాలనే తేల్తుంది. ఎందుకంటే ఇష్టానిష్టాలబట్టి అందాల్నీ నీతుల్నీ ఏర్పాటు చేసుకొంటాంగాని వీటికి స్థిరమైన నైజగుణం లేదనే వాదానికి ప్రకృతి శాస్త్రం బాగా తోడ్పడుతుంది. ఏదయితే మనం కంటితో చూడగలుగుతామో—చేతితో తాకగలుగుతామో అదీ సత్యంగాని తదన్యం సత్యంకాదని ఇటీవలివరకూ ప్రకృతి శాస్త్రవాదం. మనం అనుకొనే పరమార్థాలు కంటితో చూచేవీ చేతితో పట్టుకోబడేవీ కావు గనుక ఈ వాదాన్నిబట్టి సత్యం అని శాసించలేము.

ఈ వ్యక్తిగత వాదానికి ఇంకొక బలం ఇరువదియవ శతాబ్దపు మానసిక పరిణామవిమర్శనా శాస్త్రం. (Psycho analysis) ఈ శాస్త్ర పితామహుడు ఫ్రాయిడ్. ఇతని సిద్ధాంత ప్రకారం మన మానసిక నిశ్చయాలన్నీ బాల్యంనుండివచ్చే పరిసర పరిస్థితుల సాముదాయికానుభవాల ప్రాభవముపై ఆధారపడి ఉంటాయనిన్నీ, మన అంతర్మనస్సే మానసిక సిద్ధాంతాలను మన స్వాధీనం లేకుండా చేస్తుందనిన్నీ.

ఇపుడు పాలంటే నా కిష్టంలేదంటే చిన్నపుడు ఏదో కారణంచేత పాలంటే అయిష్టం కలిగిందన్న మాట. ఎత్తుప్రదేశాన్నుంచి దిగువకు చూడ్డం భయమయితే చిన్నప్పుడు ఎత్తునుంచి పడివుండాలి—లేదా ప్రస్తుతపు ఉన్నతపథంలోంచి అధోగతి పాలవుతాననే భయమైనా ఉండాలి. ఈయన సిద్ధాంతాల్లో కలలు కూడా చాలా ప్రాముఖ్యతకు వస్తాయి. సఫలీకృతాలుకాని కోరికలు కలల్లో ప్రతిబింబిస్తాయని ఇతని సిద్ధాంతం.

ఈ నవీనశాస్త్రం దినదినాభివృద్ధిపొంది ముఖ్యంగా వైద్యశాస్త్రంలోకీ - విద్యా విధానంలోకీ చొచ్చుకు వస్తోంది.

దీనివల్ల ప్రతినిశ్చయమూ ఎంతవరకు నిజమా అని గాక ఈ వ్యక్తి ఎందుకిలా అనుకొంటున్నాడు? ఇలా అనుకొంటున్నందువల్ల ఇతని మానసిక పరిస్థితిని గురించి మనకేమి తెలుస్తుంది? అనే విషయాలే పరిగణింపబడతాయి.

నేను ఈ చిత్రం బాగున్నదంటే - ఈ చిత్రంలో అంతర్మనస్సుకు అనుకూలమైన అనుభవం వ్యక్తీకరింపబడిందన్నమాట. ఈ రాగం శ్రావ్యంగా ఉన్నదంటే చిన్నపుడు విన్న ధ్వనుల్లో ఏదో ఒక ధ్వని దీనిని జ్ఞాపకం చేస్తున్నదన్నమాట. బాగాలేదంటే చిన్నపుడు ఈ ధ్వనిని గురించిన ప్రాతిపదిక ప్రతికూలమైనదని అర్థము.

దీన్నిబట్టి మతంకూడా ప్రాచీన మానవుని పాంచ

# కళలు - మానవ జీవితము

భౌతిక, పరిసర ప్రాబల్యం ప్రకటనమీదనే ఆధార పడిఉంది. అగ్ని, వాయువు, భూకంపము, అతి వృష్టి అనావృష్టులు - ప్రాథమికుల్ని నిశ్చేష్టుల్ని జేశాయి.

పాపం ఏంజేస్తాడు అసహాయుడు, ప్రాకృతుడు, ఈ మహాభూతాల దాడిని తట్టుకోవడానికీ - ఈ సము దాయాన్ని లోబర్చుకోవడానికీ అతి ప్రాకృత భావంతో భగవంతుణ్ణి సృష్టించుకొన్నాడు.

తాను ఈ మహాశక్తుల్ని స్వాధీనపర్చుకోలేక పోయినా భగవంతుడు ఈ శక్తుల నన్నిటినీ స్వాధీన పర్చుకొనే శక్తిమంతుడు. అందువల్ల తనకు కష్టం వచ్చినప్పుడు మొక్కుకొనీ - ప్రార్థించీ - ఎలాగో వీటి బారినుండి తప్పుకోవడానికి ప్రయత్నిస్తాడు.

"ఓ విష్ణూ! మిత్రునివలె సుఖము కలిగించువాడవు, ఉదకమును పుట్టించువాడవు, విస్తారముగా అన్నము కలిగించువాడవు, రక్షించువాడవునై అన్ని విధముల గొప్పవాడవు, నీవై యుందువుగాక. ఇట్టివాడవు గనుకనే నీస్తోత్రము నీ మహత్వమెరింగిన యజమానునిచేత మాటిమాటికి హెచ్చింపబడుచున్నది." (ఋగ్వేదము)

కాబట్టి మానవుడు దేవుణ్ణి సృష్టించుకొన్నాడే కాని దేవుడు మానవుణ్ణి సృష్టించలేదు.

క్రమక్రమంగా నాగరకతా - ప్రకృతిశాస్త్ర విజ్ఞానం అభివృద్ధిపొందినకొలదీ-భగవంతునికి మొక్కడమూ - బలులివ్వడమూ తగ్గిపోయాయి.

అయినా మానవజీవితం ఏ మాత్రమూ సర్వస్వ తంత్రము కాలేదు.

ఇరవయ్యో శతాబ్దపు ప్రకృతిశాస్త్ర పరిజ్ఞానం వల్లను, ఐనస్టీను - జీన్సు - రూథరుఫోర్డు మొదలయిన మహాపరిశోధకుల శక్తివల్లను, పరమాణువుల లోని అంతర్భాగాలయిన విద్యుచ్ఛక్తీ - మహావిశ్వం లోని అసంఖ్యాక గ్రహకూటాలు - వాటి అంతులేని విస్తీర్ణాలు బోధపడ్డాయి.

పరమాణువుల మధ్యలో ఈ మహావిశాల ప్రదేశా లున్నాయి. ఈ ప్రదేశాల్లో ఏప్పుడేదిజరుగుతుందో ఎంత గొప్ప గణితశాస్త్రవేత్తలయినా నిర్ణయించలేక - ఈ చెప్పలేనితనాన్నే అనంతగణిత శాస్త్రసంఖ్యగా తీసుకొన్నారు.

భారతీయ విజ్ఞానంలోనైనా ఆస్తికతకూ నాస్తికతకూ ఇదే కేంద్రము.

ఈ అనంతత్వమే ఆస్తికతలో ఈశ్వరునిదైనది - నాస్తికతలో సంఖ్యాంకితమైనది.

ఈ మహావిశ్వంలో మన భూగోళం సూక్ష్మాతి సూక్ష్మం. ఇందులోనే మానవజీవిత మున్నట్టు భౌతికశాస్త్ర పరిశోధనలవల్ల తెలుస్తుంది. చివరకు సూర్యునికాంతి తగ్గితేనో లేక ఈ గ్రహకూటం ఇంకొక గ్రహకూటానికెతగిల్తేనో ఈ మానవజీవితమంతా భగ్నమే.

అంటే చివరకు అంతా ఒక ప్రమాదంమీద ఆధారపడిందని నిశ్చయమైంది. కాబట్టి మనం ఏం చేస్తామంటే ఇదంతా భరించలేక మానసికశాంతి కొరకు దీని కంతకూ ఒక సూత్రధారుడున్నాడనీ - అతడు మానవుణ్ణి రక్షిస్తాడనీ భ్రమపడతాం.

ఈ పంథాలో సత్యం - శివం - సుందరాలు అనే పరమార్థాలుకూడా వాస్తవికమైన వస్తువులుగాక మానవుడు నిర్మించుకొన్న ఊహాగేహాలే.

ఊహాజన్యాలే అయినా పరమాణు సంయోగ వియోగాల్లలో ఏర్పడే ఆద్యంతాలు లేని సృష్టీ - అందులో అంతర్వ్యాపినియై ఉండే జీవాన్నే సత్యమనీ-పరస్పరాకర్షణ ప్రేమబంధాన్నే శివమనీ-కష్టసుఖ భయానంద దృశ్యాలనే సుందరమనీ - గ్రహించిన మానవుని ఊహలో వాస్తవం ఉన్నది.

మానవ వ్యావహారికాశయాలకూ మానసిక సంతృప్తికీ,- శాంతికీ, పరమార్థాలు మూలాధారాలు. ఇది ఈ భయంకరవిశ్వప్రవృత్తిలో చిరశాంతికే ప్రోజ్జ్వలాలు. కాబట్టి ప్రాదుర్భవ కారణం మానసిక ప్రీణనమే అయినా సత్యంమీద ఏర్పడ్డవి ఉత్తమలక్ష్యాలనిపిస్తాయి.

వ్యక్తిగత సిద్ధాంత ప్రకారం "మంచి అవసరం" అంటే నేను అలా అనుకొంటున్నాను గాని నిజంగా మంచిని చెప్పడంలేదు ఎందుకంటే అది లేనేలేదు. ఇది అందంగా ఉందంటే నా మానసిక తత్త్వాన్ని వెలిబుచ్చుతున్నానుగాని అది లేనేలేదు.

అందువల్ల ప్రాచీనులు ఏవయితే వారికి సంతోషాన్ని ఇస్తాయో అవన్నీ మంచివన్నారు. రానురాను మంచి అనే సంగతి మాత్రమే మిగిలి ఎందుకు మంచివన్నారో మరచిపోయాం. మంచితనం పూర్వం శాంతినీ సౌఖ్యాన్నీ ఇచ్చింది. అది ఒక పారమార్థికమైంది. అలాగే వారికి సంతోషాన్నిచ్చిన వాటిని అందం అన్నారు. అందం సంతోషాన్నిస్తుందే కాని సహజగుణం కాదు. అందం నైసర్గికమే అయితే ఇన్ని వాదాలుండవు. అందం సంతోషాన్ని అందవిహీనం విషాదాన్నీ కల్గిస్తే ఇన్ని భేదాలెందుకున్నాయో అర్థం అవుతుంది. కాబట్టి ఏది ఉత్తమకళావస్తువో అని నిర్ణయించడానికి ఏది ఎక్కువమందికి ఆనందాన్నిస్తుందా అని చూస్తేచాలు.

కాని సత్యం శివం సుందరం అనే పరమార్థాలను కూలంకషంగా పరిశీలిస్తే వ్యక్తిగత మానసిక సూత్రాలు కావనీ-వస్తుగత నైజగుణాలుఅనీ సువ్యక్తమౌతుంది.

సాధారణంగా ఒక మానవుడు ఒక సత్యాన్ని చెప్పాడంటే అది సత్యంయొక్క నిరూపణే అవుతుంది కాని ఆ మానవుని మానసిక—ఆశయం కాదు.

నేను ఈ సాయంత్రం విశ్వకళాపరిషద్విద్యార్థులకు కళావిషయాన్ని గురించి ఉపన్యాసం చేస్తున్నానంటే ఈ విషయం ఇతరులు వినకపోయినా, ఎవ్వరూ దీని విషయం తర్జుమాచేయకపోయినా ఈ సభమాత్రం జరిగిపోతుంది. ఎవరైనా గ్రామఫోను ప్లేటుమీద రికార్డు చేస్తే అది ఎప్పుడు ఈ మాటలన్నీ చెప్పమంటే అప్పుడు చెప్తుంది.

ఇవి మానసిక వ్యక్తిగత సిద్ధాంతం ప్రకారం ఈ విషయం చెప్పేవాడికి ప్రియం కాబట్టి వాడి మనస్తత్త్వానికి నచ్చింది కాబట్టి చెప్పాడనడానికి వీల్లేదు. వ్యక్తిగత సిద్ధాంతం సత్యంయొక్క స్థిరతను తాత్కాలిక ప్రయోజనంచేత స్వస్తి చెప్పుతుంది.

ఈ విధంగానే సౌందర్యం విషయంలో పరిశీలించుదాం.

"తాజ్ మహల్ దివ్య సౌందర్యభవనం" అని మనం అనేమాటకు అర్థమేమిటి !

ఈ భవనంలోని చంద్రకాంతశిలలవలె - దీనిస్థూల స్వరూపంవలె - సౌందర్యంకూడా సమాధికి చెందిన ఒకనిగూఢ పరిమాణమేనా ? లేక కొంతమంది కళాస్రష్టల మానసికమృగుల సంచారభావమేనా ?

ఈ సౌందర్యం నిగూఢపరిణామమే అయితే జిజ్ఞాసులు ఆనందిస్తారు. పామరులు విస్మరిస్తారు, మానసిక మృగుల సంచలనభావమే అయితే విజ్ఞానులెవరో పామరులెవరో నిర్ధారణచేయలేము.

సామాన్యవిషయాల్లో ఒక వ్యక్తి ఈ చిత్రం అందంగా ఉన్నదంటే అది చూచినపుడు అతనికి మానసిక సంచలనం కల్గి ఆనంద ముత్పన్నమైనదని అర్థం. ఇటో వ్యక్తి అందంగాలేదంటే అతనికేమీ ఆనందం కలుగలేదని అర్థం. ఇందులో ఎవరు చెప్పినదీ తప్పు అనడానికి వీలుండదు.

ఈవిధంగా శిల్పిఎవరైనా తాజ్ మహల్ అసహ్యం



గాను అవకతవకలుగాను ఉన్నదంటేనూ కాళిదాసు కంటే మావూరి కవిగారే గొప్పవాడంటేనూ ఏమంటాం?

ఇది ద్రష్టల విజ్ఞాన విహీనతవల్ల వచ్చినమాటకే గాని కళావస్తువులలోపం కాదని వెంటనే చెప్పేస్తాం.

ఈపంథాలో తాజ్‌మహల్‌లోనూ కాళిదాసు కావ్యంలోను కళాసౌందర్యం నిగూఢమై యున్న సత్యమేగాని ద్రష్టయొక్క మానసిక సంచలనం వల్ల ఏర్పడేదిగా పరిగణించం.

ప్రకృతిశాస్త్రం వస్తువుయొక్క బరువు తెలుపుతుందిగాని సౌందర్యాన్ని తెలుపలేదు. ఇది ప్రోద్బలంచేసుకొని బరువు నిజమనీ సౌందర్యంకాదనీ అనగలమా?

మానసిక సిద్ధాంతం నిజమైనట్లయితే చిత్రంయొక్క అందంగాని-సంగతులయొక్క శ్రావ్యతగానీ - కావ్యంయొక్క ఉజ్వలరస స్వరూపంగానీ వీటిని గురించి ఆనందించే మానవసమూహాన్ని బట్టి నిర్ణయం చేయవచ్చును. ఈపరిస్థితిచాల ప్రమాదకరమనీ అసత్యకరమనీ — సర్వజనవిదితమే.

నన్నయ గొప్పవాడా పంచరత్నాలు వ్రాసిన ఛాందసుడు గొప్పవాడాఅనేవిషయం ఒక పామర కూటములో చర్చకువస్తే ఆ నన్నయగారి అర్థంగాని కవిత్వం కంటే తేలిగ్గా అర్థమయ్యే ఈకవిత్వమే మంచిదని తేలవచ్చు.

కాళిదాసు నాటకం కంటె ఏవో చిన్న నాటకం చాలామందికి సంతోషం కల్గించవచ్చు. ఈసత్యం ఉపాధిగా తీసుకొని కాళిదాసుకంటె ఇతడే గొప్పవాడని చెప్పవలసివస్తుంది. ఈవిధమైన నిర్ణయం ప్రాజ్ఞులెవరూ ఒప్పుకోరు.

మనంచూచేవస్తువులన్నీ ఆనందాన్ని కలిగించవు. కొన్నివస్తువులే కలిగిస్తాయి. మురికిగుంటలుగాని - కలుపుపెరిగినతోటలుగాని ఆనందాన్నివ్వవు. సుందర సరోవరంగాని - నందనోద్యాన వనంగాని సౌందర్య భావాల్ని కలిగింపజేస్తాయి.

ఎందుచేత? వీటిలో హృదయాన్ని ఆకర్షించే సౌందర్యం ఉంది కాబట్టి.

సౌందర్యం కేవలం మానసికమే అయితే ఏవస్తువులోపడితే ఆవస్తువులో కనపడవలసిందేకదా. అలా కాదు - ఇది ఎక్కువ లలితకళల్లోనే ప్రస్ఫుటంగా బహిర్గత మవుతుంది. అందువల్ల సౌందర్యం వస్తుగత మనే నిర్ధారణ అయిపోతుంది.

ప్రపంచంలో రెండురకాల వస్తువులుంటాయి. కొన్నివస్తువులను వాటికొరకే వాటిని కోరతాం. అవే పరమార్థాలు. కొన్నివస్తువులను ఈపరమార్థాలు సాధించడానికి కోరతాం. వీటిపరమావధి పరమార్థాలయిన సత్యం, శివం, సుందరాలను సాధించడమే.

ఉదాహరణకు విద్య తీసుకొందాం.

విద్య ఎందుకు? విజ్ఞానం కలిగించడానికి. విజ్ఞానం ఎందుకు? ప్రపంచంలోని పరమార్థాలను ఆనందించడానికీ - అనుభవించడానికీ - సృజించడానికీ తగ్గ శక్తి కలుగుతుంది కాబట్టి.

పరమార్థాలెందుకు? దీనికి ఇంక జవాబులేదు ఇంతటితో ప్రశ్నలు జవాబులు ఆగిపోవలసిందే. ఇంకా ప్రయత్నిస్తే పరమార్థాలు సంతోషాన్ని కలుగజేస్తాయి కాబట్టి అని చెప్పవచ్చు.

సంతోషం ఎందుకు? ఇంక దీనికి జవాబు లేదు— కాని - విచారంకంటే సంతోషం మంచిదనీ అందరూ సంతోషం కోరతారు కాబట్టి అనీ చెప్పాలి.

సంతోషం సంతోషంకొరకే- అదే పరమోత్కృష్టమయిన పరమార్థం.

అయితే అన్ని పరమార్థములు సంతోషం కొరకేనా?

అవునని కొందరు తత్వవేత్తలన్నారు కాని అదే సిద్ధాంతం కాదు. సంతోషంకూడా ఒక పరమార్థమే కాని ఇదే ఏకైక పరమార్థంకాదు.

నేనుఎందుకు ఇపుడు మాట్లాడుతున్నాను నన్ను విద్యార్థులు పిలిపించారు కాబట్టి. ఇంతమందిలో ఉపన్యసించడం నాకు ఇష్టం కాబట్టి. కాని నేను ఉపన్యసించడం కేవలం నాసంతోషం కొరకే కాదు. నాకు తోచినంత వరకు సత్యాన్వేషణచేసి అది మీకు వినిపించడం, ఇది మీకు చెప్పి సత్యం యొక్క నైజ గుణాన్ని నిరూపించితే మీలో చాలామంది "సత్య శివసుందరాల నే పరమార్థాలనుగ్రహించి ఆనందిస్తా" రని నా ఆశయం. సత్యాన్ని ప్రతిపాదించడము, మీచే గ్రహింపజేయడము. ఇచట నాపరమార్థమవుతుంది గాని నాసంతోషముకాదు.

ఈవిధంగానే ప్రస్తుతం మనకు సంబంధించిన సౌందర్యంకూడా.

మానవుడు సాధారణంగా సౌందర్యాన్ని అభిలషిస్తాడు - వికారాన్ని నిరసిస్తాడు. కృతకచిత్రాల్లో నైతే నేమి-ప్రకృతిలోనైతే నేమి అందం సర్వదా అభిలషణీయమే కాని ఉత్తమకళోపాసకుడు ఇంతటితో నే ఆగడు. ఇతనికి కళాదేవీ సంసేవనమే జీవిత పరమావధి. ఈకళారాధనకొరకే దరిద్రాన్నీ ప్రాపంచికపు ఈసడింపును లెక్కచేయక తన సర్వ సౌఖ్యాలను అర్పించియైనా సరే తనహృదయంలో రగుల్కొనే ఉత్తమాశయాన్ని కళాముఖాన్ని బహిర్గతంచేసి గాని శాంతింపడు. ఇలాగ మనం ఎంత మందిని చూడడంలేదు. వీరుచచ్చిపోయేవరకూ ప్రపంచ నిద్ర మేల్కోదు. అప్పుడుగాని వీరి పేర్లు మానవ చరిత్రలో నాటుకోవు.

అందువల్ల ఈ పరమార్థాలకల్ల మనం అభిలషించేది సంతోషం కాదు - ఆనందం. సుస్థిరానందజన్యమైన అమరత్వమే మహాపరమార్థం.

"నిత్యం నీరజలోచనం నిరుపమం నీవార శూకోపమం నిర్భేదానుభవం నిరంతరగుణం నీలాంగరాగోజ్వలం నిష్పాపం నిగమాగమార్చితపదం నిత్యాత్మకం నిర్మలం నిష్పుణ్యంనిఖిలం నిరంజన పదం రామం భజే తారకం"

తా॥ నిత్యుడు, పద్మములవంటి కన్నులుగలవాడు, ఉపమానములేనివాడు, నివరిగింజ ముల్లువలె సూక్ష్మ రూపుడు, అభేదానుభవస్వరూపుడు, ఎడతెగని గుణములు కలవాడు, నల్లనిశరీరశోభచే ప్రకాశించువాడు, పాపశూన్యుడు, వేదశాస్త్రములచే పూజింపబడుపాదములు కలవాడు, నిత్యుడు, నిర్మలుడు, పుణ్యశూన్యుడు (పుణ్యపాపశూన్యుడని యర్థము.) సర్వస్వరూపుడు అజ్ఞానశూన్యుడునైన తారకరాముని సేవించుచున్నాను"

శ్రీరామకర్ణామృతము

[సశేషము]

# ప్రదర్శిత చిత్రాలు



బజారు



విమానాలు

శ్రీ ఎ. వి. రామమూర్తి.



పోలో

శ్రీ కరిమి.

# ప్రదర్శిత చిత్రాలు



దుర్గ

శ్రీ నందలాల్ బోసు.



దిష్టి బొమ్మ

శ్రీ పి. . ప్రభాకర్



కుప్పం

శ్రీ యస్. గా

# వర్జీనియా వుల్ఫ్

శ్రీ ఆచంట జానకిరామ్

౧

"సీతాకోక చిలుక. చిన్నది; పసుపు పచ్చని రెక్కలు రెపరెపలాడిస్తూ నా కిటికీ అద్దాన్ని అంటి పెట్టుకు ఉంది—తానో భాగమైన ఈ మహా ప్రపంచకంతో ఏవిధమైన పేచీ లేకుండాను.

అది పుష్యమాసము.

ఉదయపుపూట.

ఎంత అందము! ఎంతహాయి!!

నా కిటికీముందు కూర్చొన్నాను - ఏదో చగువు కొంటూ, వ్రాసుకొంటూ......

కిటికీబయట, కొంచెం దూరంగా, పెద్దపొలమూ, పొలముకాపు, అప్పుడే, చేను దున్నడము ప్రారంభించాడు.

నాగలి సాగినంతమేర నల్లగా, జాల్లుగా ఉంది. క్రొత్తనేలలోని చెమ్మ ధగధగ మెరుస్తోంది, ఆ లేత ఎండలో.

నిమిషనిమిషమూ అతిశయించి పోతూ వున్న ఈ జీవకళ బయట ఎంతటి ఉత్సాహాన్ని కలిగిస్తోంది!!

పుస్తకంమీద దృష్టినిలపడానికి సాధ్యంకాలేదు.

అవతల బూరుగుచెట్టుకొమ్మలనిండా కాకులు - కొమ్మకొమ్మకు ఓ వంద కాకులు. కారు నల్లని పెద్ద పెద్ద ముళ్లు వేసిన బ్రహ్మాండమైన వలను ఆకాశంలో ఆరవేసినట్టుంది, వేయి కాకులతో ఆ ముసలి బూరుగుచెట్టు.

ఆ కాకులు ఏదో సభచేస్తున్నాయి......

ఉన్నట్టుండి, ఆకాశంలో ఆరుతూ ఉన్న ఆవల గాలిపోసుకున్న తెరచాప లా పైకి ఉబికింది! కావు కావుమంటూ వేయి కాకులూ పైకి లేచి, మళ్లా కూర్చున్నాయి ఆ చెట్టు పైననే.

పొలముకాపు పొలము దున్నుతూనే ఉన్నాడు.

పొలము కాపును, నాగటి ఎడ్లను, ఆ పొలాన్ని, అన్ని జీవులకాశ్రయమైన ఆ వృద్ధ వృక్షాన్నీ, ఆవహించిన మహాశక్తి నా కిటికీ అద్దాన్ని అంటిపెట్టుకున్న చిన్ని సీతాకోకచిలుకనూ ఆవహించింది.

అద్దపు ఈ మూలనుంచి ఆ మూలకూ, మళ్లా ఆ మూలనుంచి ఈ మూలకూ, ఎగురుతోంది ఈ చిన్ని జీవము.

ఆ సీతాకోక చిలుకను చూస్తూనే ఉండిపోయాను-తతిమ్మా వ్యాపకాలన్నీ మానివేసి.

ఎంతో జాలి వేసింది!

బయట ఎంతకాంతి! ఎంతటి ఉత్సాహము ఎంతటి జీవకళ!!"

"విశ్వాన్నే ఆవరించిన ఈ జీవచైతన్యమంతా ఓ చిన్ని సీతాకోక చిలుక రూపంతో అనుభవించడమేనా దాని గతి? పాపము!" అనిపించింది. కాని, ఆ చిలక మాత్రము తనకు లభించిన అవకాశాన్ని పూర్తిగా అనుభవిస్తోంది.

ఎంత ఉత్సాహంతో ఎగురుతోంది!

రెక్కలు అల్లల్లాడిస్తూ అద్దానికి ఓమూల వాలేది. అక్కడ ఒక క్షణం నిలిచి మళ్లా మొదటి చోటికే అతి వేగంగా! ఈ సారి మూడోమూలకు! ఆతర్వాత నాలుగో మూలకు......

బయట, అనతిదూరాన, ఎంత విశాలమై-

పచ్చిక బయలు! ఎన్నెన్ని పొలాలు! ఎంతెంతలేని చెట్లు! వాని అవతల అంతులేని ఆకాశం !!

కాని, నా కిటికీ అద్దాన్నే అంటిపెట్టుకున్నది. ఆ చిన్ని సీతాకోకచిలుక !......

ఆ సీతాకోక చిలుకను చూస్తూ ఉంటే, ప్రపంచ జీవ స్వరూపము సన్నని రేఖాకారంగా, నా ముందు, రెక్కలమీద ఎగురుతూ ఉన్నట్టు తోచింది నాకు.

కిటికీ అద్దపు ఒక మూలనుంచి మరోమూలకు అది ఎగిరినప్పుడల్లా ప్రపంచమే వింత చైతన్యంతో కదలినట్టు తోచింది నాకు.

ఆ చిన్ని జీవమే ప్రపంచ జీవాత్మ!

కాని, నాలోనూ, నావంటి లక్షలాది జనులలోనూ నిబిడి వుండి, మాచేత నిమిషనిమిషము ఏదో క్రొత్త సమస్యనుగురించి తీవ్రంగా ఆలోచింపచేసే మహాశక్తిలో ఒక అణువుకదా - ఈ నాయెగుట రెక్కలల్లలాడించే సీతాకోక చిలుక!

ఒక చిన్ని కణము!- అని తోచినప్పుడల్లా దానిపైన పట్టరాని జాలికలిగేది.

అపరిచిత వ్యక్తి ఎవరో, శతసహస్ర రూపంగా భూమిపై వెలిసిన 'జీవం' లోంచి ఒక చిన్ని పూసంత తీసి, రంగువేసి రెక్కలతికించి వదలినట్టుంది ఈ సీతాకోక చిలుక!

కాని, దానివంక చూస్తూ ఉంటే, ఏ మహా చైతన్యంలో అది ఒక భాగమో ఆచైతన్యాన్నే మరచిపోయేటట్టు చేస్తుంది - ఈ చిన్ని జీవము..........

ఇల్లా కొంచెము సేపు ఎగిరి, ఎగిరి, చివరకు కిటికీ కమ్మీపైన వాలింది. రెక్కలు ముడుచుకుని అక్కడే ఉండిపోయింది.

నేనూ నా పుస్తకంలో లీనమై పోయాను— కొంచెము సేపు సీతాకోక చిలుకను గురించి మరచిపోయాను.........

కొంతసేపయాక తలపైకెత్తి చూశాను: సీతాకోక చిలుక తన లాస్యకేళికి మళ్ళా ఉపక్రమిస్తోంది.

కాని, ఏం జరిగింది?

ఏదో లోపము.

ఎన్నిసార్లు ప్రయత్నించినా రెక్కలు పూర్తిగా విప్పుకోలేక పోతోంది. కొంచెము పైకి ఎగరడము, కాస్సేపు ఎగిరెగిరి, కిటికీ అంచున వాలిపోవడము— ఏవో ఇతర విషయాలు ఆలోచిస్తూ ఉన్న నేను ఈ జీవి పడుతూఉన్నపాట్లు సరిగ్గా గమనింపలేదు, మొదట. కాని, ఏవో సీల మరమ్మతు అవసరమై, మర కాసేపు ఆగిపోయింది; సీల బాగుపడ్డాక మర మళ్ళా ఎప్పటిలా పని చేస్తుంది." అని మాత్రం అనుకున్నాను, పరధ్యానంగా. అంతేకాని, 'ఆ సీల ఎందుచేత పాడైనది' అనే తర్కానికే పోలేదు నా ఊహ.

ఇల్లా ఏడు పర్యాయాలు ఎగిరి ఆఎగిరి ఖరి పర్యాయం దభాలున కిటికీ అంచుపై పడిపోయింది - ఆ పచ్చని సీతాకోక చిలుక!

వెల్లకితుల పడిపోయింది.

రెక్కలు రెపరెప కొట్టుకుంటోంది - పాపము!.

ఆ విఫలయత్నాలు చూస్తూ ఉన్న నాకు హఠాత్తుగా గోచరించింది: సీతాకోక చిలుక ఎంత ప్రయత్నించినా, పైకి ఎగరలేకపోతోంది. కాళ్లు పూచిక ముళ్లకంటె సన్నని ఆ కాళ్లు. ఆడుతున్నాయే కాని, నడుము లేవడములేదు.

నాచేతిలో ఉన్న కలాన్ని, పాపము! ఆసరా చేద్దామనుకున్నాను. కాని, లాభంలేదని తెలిసింది: కాళ్లుకూడా ఆడటములేదు.

దానిని ఓడించిన శత్రువుకోసమే అన్నట్టు నలుదిక్కులా పరికించాను నేను......ఏమిటి? - అప్పుడే మధ్యాహ్నమా!

# వర్జీనియా వుల్ఫ్

పొలములోని పని ఆగిపోయింది.

బూరుగుచెట్టు పైన ఒక్క కాకిలేదు.

ఏ చెట్టు మీదా ఒక పిట్టలేదు!

అన్నీ ఏటివొడ్డుకు వెళ్లాయి దాహమేసి.

చెట్టుకింద నీడలో నాగటి ఎడ్లు నెమరుకూడా వేయడంలేదు - కళ్లు మూసుకునే పడుకున్నాయి...

ప్రపంచాన్ని ఆవరించిన మహాశక్తి అల్లాగే ఉంది. దాని ప్రభావము ఏమీ తగ్గలేదు.

ఐతేమాత్రం, ఏదో నిర్లక్ష్యం, ఏదో ఉదాసీనత- ఏ విషయాన్నీ పట్టించుకోకపోవడము!

ఎందుచేతనో, ఈ చిన్ని సీతాకోకచిలుకమీద కక్ష కట్టినట్టుంది ఆ మహాశక్తి! ఇంక ఆ జీవి ఏంచేసి ఏం లాభం?

నేనుమాత్రం ఏం చేసి ఏం లాభం?

ఆ చిట్టి కాళ్లు గిలగిల తన్నుకుంటున్నాయి - ఎంత ధైర్యంతో, ఎంత పట్టుదలతో ఎదుర్కొంటోంది!......తలుచుకుంటే జనసహస్రాన్ని, మహాపట్టణాలని, చిటికలో రూపుమాపకలశత్రువును, ఈ పచ్చని చిన్ని ప్రాణి ఎంతటి మొండి ధైర్యంతో ఎదుర్కొంటోంది - ఆసన్న మృత్యువును!

మృత్యువుతో పోట్లాడి జయింపడానికి ఎవరి తరమూకాదు అని నాకు తెలుసు.

కాని, ఆ సీతాకోకచిలుక మాత్రం, గిలగిల తన్నుకుంటూ, తన చావును నిరోధిస్తోంది.

కొంచెము సేపు ఆగి, మళ్లా ఓసారి గబగబా కొట్టుకున్నాయి, పూచిక ముళ్లకంటె సన్నవి ఆ కాళ్లు.

ఈ సారి విశ్వప్రయత్నం వేసి సరిగ్గా నిలువకలిగింది, సీతాకోక చిలుక. ఎల్లాగైన ఈ ప్రాణం నిలపాలని ఎంత కోరానో!

ఇంత అల్పప్రాణి - ఎవరికుంటుంది ఈ కీటక ప్రాణాన్ని నిలబెట్టుకోవాలని - కాని ఇంతటి సాహసంతో, ఆ మహాశక్తితో పోట్లాడుతూ ఉండడము చూస్తూ ఉంటే ఎవరికి జాలికలుగదు? నా చేతిలోని కలాన్ని మళ్లా పైకెత్తాను - ఆ యోధునికి కొద్దిగానైనా ఆసరా ఇద్దామని.

ఎగరబోయిన ఆ జీవి అల్లాగే ఆగిపోయింది.

కాళ్లు కదపడంలేదు.

రెక్కలు ముడుచుకుపోయాయి.

ఇంక నిరోధములేదు......

చనిపోయిన ఆ సీతాకోక చిలుకను చూచినకొద్దీ, ఉదయం, విశ్వాన్నే ఆవరించిన ఆ జీవ చైతన్యాన్ని గురించి ఎంత అబ్బుర పడ్డానో, దాని తలఎత్తిన యీ ప్రాణిని నా కళ్ల ఎదుటనే ఎత్తుకుపోయిన మృత్యువును గురించి అంత అబ్బుర పడ్డాను.

కాని, ఆ సీతాకోక చిలకమాత్రం, అస్థితిలోనూ, ఎంత గంభీరంగా ఉంది! ఎంతనిశ్చలంగా! కొన ఊపిరితో, తన అందమైన రెక్కలను విప్పుకుని, ఎంత అందంగా,ఎంత ఉదాత్తంగా ఉండిపోయింది!!'

"The Death of a Moth" అనే ఈ రచనలో వర్జీనియా రచనా నైపుణి, ఆధునిక రచయితలలో ఆమె విశిష్టత, చక్కగా విశదమవుతాయి. రచనలో కథ చాలా తక్కువ. మనమందరమూ తరుచుగా చూచే దృశ్యమే. కాని, ఈ విధంగా, కళ్లకు కట్టినట్టు, చిత్రించి ఆఅల్పప్రాణిదెస మనకంతటి అనుకంపం కలుగజేయడము ఒక్క వర్జీనియాకే తగింది. ఐతే, ఇక్కడ సీతాకోక చిలుక నిమిత్తమాత్రమే! మనకు కలిగే జాలి సీతాకోక చిలుకపైనకాదు - మానవునిపైన, మానవ జీవితముపైన.

ఈ రచనలోని వర్ణనలు ఉపాంగములే.

అసలు విషయము: ఆలోచనా శక్తి అవతరించిన నాటినుంచీ, నేటివరకూ, సాధారణ మానవులను మహాతత్త్వవేత్తలనూ కూడా సమాన విస్మయంతో నింపే జననమరణముల రహస్యము.

అతి పదిలంగా గుప్తమైన సృష్టిరహస్యం, ఈ భూమిపై మానవునియాత్ర, ఒక్కొక్క మెట్టు పైకి వెళ్లాలి అనే మానవ యత్నము, మానవుల విచిత్రానుభవాలు, ఎందుకు? ఎక్కడకు? అనే ప్రశ్నలకు సమాధానం - ఇవన్నీ స్వానుభవంవల్ల తెలుసుకోవాలనుంటుంది, అన్వేషకునికి. ఈ అన్వేషణలో రచయితకు కలిగే చిత్రవిచిత్రానుభవాలు తాను అనేకవిధాల వెల్లడి చేయవచ్చు తన రచనలో.

ఇదివరకు, నవలాకారులు, కథపట్టును ముఖ్యంగా గమనిస్తూ నవలలు రచించేవారు.

వ్యక్తిగతమైన ప్రత్యేకానుభవములకు మెరుగులు పెట్టి అందమైన పదజాలం ద్వారా ఇతరులచేతకూడా ఆ భావాలను అనుభవింపజేసేవారు పద్యరచన కలవారైన కవులు—

వర్జీనియా కూడా తన వ్యక్తిగత అనుభవాలనే చక్కని పదజాలంతో వెల్లడి చేస్తుంది - కాని యిది పద్యరచనకాదు.

రచనా ధోరణి వచన రచనా ధోరణి. ఐతే మన కలవారైన ధోరణిని అతిక్రమించే అనేక రీతులుంటాయి ఆమె రచనలో.

మానసికంగానూ, భావనా పటిమవల్లా, తనలో కలుగుతూ ఉన్న అనుభవాలను, తాను చూస్తూఉన్న అద్భుత దృశ్యాలను, చిత్రవిచిత్రమైన తన ఊహలను, అతి రమ్యంగా జడలా అల్లుతుంది. కొన్నికొన్ని సంఘటనలను గురించి కేవలమూ భౌతికమైన వివరాలు అనేకాలు తెలుపవలసివచ్చినా, అవి భూత, భవిష్యత్, వర్తమానకాలమును పాటించి ఒకటి తరువాత ఒకటి రావాలనే పట్టింపులేదు.

ఆ సంఘటనలు, ఆ ఊహలు, ఏ వరుసలో కవి దృక్పథాన అవతరిస్తాయో ఆ వరుసలోనే అవి మాటలుగా వినిపిస్తాయి మనకు

తన కళ్లెదుట జరుగుతూ ఉన్న ఒకానొక సంఘటనను వర్ణిస్తూ ఉంటే, జరిగిపోతూన్న విషయాలకంటె, ఎక్కువగా, పాత్రల మనస్సులలోని ఆలోచనలూ, వారి ఆలోచనలను గమనించే రచయిత మనస్సులోని ఆలోచనలూ యివన్నీ ఎల్లా వస్తే అల్లా వ్రాసేయవలసిందే.

ఎవరరో ఒకరు, ఏ సందర్భంలోనో అన్న మాట కథానాయిక మనోవీధిని ఎన్నెన్నో జ్ఞాపకాలను కల్పింపవచ్చు. ఆమె మనస్సులో ఎన్నో ఊహలు, ఎన్నో కోరికలు, ఎన్నో ఆశలు. ఆమె స్నేహితుని పలుకులు ఆలకిస్తూనే ఉంటుంది - ఊంకొడుతూనే ఉంటుంది. కాని ఆమె మాత్రము, ప్రస్తుత పరిసరాలను దాటి, ఒకప్పుడు వెనుకకూ, ఒకప్పుడు ముందుకూ పరుగులెత్తుతూ ఉంటుంది. ఈ ఊహాపరంపరను 'భావ ఐక్యత' చెడకుండా ప్రతిబింబించడము చాలా కష్టము, అంచేతనే, మధ్యమధ్య, రచయిత తనమాటలూ, అవసరమైతే తన వ్యాఖ్యానమూ, కూడా చొప్పిస్తూ ఉంటుంది.

దీని వల్ల రచయిత కథావస్తువునుంచి, పాత్రలనుంచి విడిగా ఉండి పరిశీలిస్తోందా, అంటే, అదీ కాదు.

ఒకొక్కప్పుడు తనుకూడా ఒక పాత్రేమో అనిపిస్తుంది.

కేవలమూ ద్వైతమూ కాదు, పూర్తిగా అద్వైతమూ కాదు—

వర్జీనియా రచనలలోని ప్రత్యేకత అతి రమ్యమైన ఒకానొక విశిష్టాద్వైత భావము.

ఈ పద్ధతి నవలా రచనకు, చిన్నచిన్న కథలు చెప్పడానికీ ఆమెకు అమోఘంగా ఉపకరిస్తుంది. ఈ పద్ధతిలో సాహిత్యమూ, శిల్పకళా, ఎంతగా కలిసిపోతాయో !

# వర్జీనియా వుల్ఫ్

"...వారు అల్లా ఆ గదిలో మసలుతూ ఉండగా ప్రతి నిమిషమూ, తోటల్లోని సుందర దృశ్యాలు వారి దృష్టిని ఆకట్టుతూనే ఉన్నాయి. దోరగా పండిన పళ్ల బరువుతో కుంగిపోతూ ఉన్న కొమ్మ ఆ కిటికీ అద్దంలో ప్రతిఫలిస్తోంది......ఇటుతిరిగితే కొంచెం దూరాన పచ్చి బయలులో కలిసిపోయే ఆకు - పచ్చని ఆకులు - ఎన్ని ఆకులు !

ఎవరో తలుపు తెరిచారు : లోపలకు చొచ్చుకువచ్చిన సూర్య కిరణజాలంతోపాటు, దక్షిణ ముఖమై ఎగిరిపోతూ ఉన్న పావురపు నీడకూడా, నేలమీద పరిచిన తివాసీమీద పడింది......ఎక్కడో పాలపిట్టకూత, —అగాధమైన ఆనిశ్శబ్ద సముద్రంలో బుడగలా ధ్వని. ఆ పాలపిట్టకూత.........

చూస్తూవుండగానే సూర్యుని వెలుతురు క్షీణించిపోయింది.

ఇంట్లో నీడలు.

బయట, తోటలో ?

తోవ తప్పిపోయిన ఒకే ఒక సూర్యకిరణాన్ని పడుగుగా పట్టుకొని దాని చుట్టూ చీకటి సెల్లాను నేసి వేస్తూన్నై తమాల వృక్షాలు.

ఎంత నిశితమైన కిరణము !—ఎంత అపురూపము !.........

ఎంతగా వెతుకుతున్నానో ఈ ఒక్క కిరణము కోసము !

కాని ఆ కిరణము నాకు దొరకదు......

మా ఇద్దరిమధ్య ఒక అగాధము......

అదే మృత్యువు !"

ఈ రచనలో ముఖ్యమైనది ఆ నిమిషము రచయిత మనోభావము. మనోభావము మారితే ధోరణీ మారుతుంది. ఎప్పుడూ జరుగుతూన్న దృశ్యాలే అయినా వానిని చూస్తూన్నప్పుడు రచయిత మనస్సులో గబగబా కలిగే వివిధమైన భావాలకన్నింటికీ ఒక అన్వయం కలిపించి సత్యాన్ని అవగాహనచేసుకోవాలి అని ప్రయత్నించే జ్ఞానేంద్రియ ప్రతిభ మాటిమాటికీ వర్ణిత దృశ్యాలకి అడ్డం తగులుతూ ఉంటుంది.

"సత్యాలను అభిలషించి, సత్యాన్ని నిరీక్షిస్తూ, విశ్వప్రయత్నంచేసి, కొన్ని మాటలనూ కొన్ని ప్రయోగాలనూ అపురూపంగా సేకరిస్తూ ఉంటాము—తీరని కోరికతో......నా వెనుక ఎవరిదా కేక ? ......నా పక్కగా ఎవరిదా పిలుపు ?......చక్రాల రొద......ఎన్నిచక్రాలు ! ఎన్నిచక్రాలు !! ......ఎక్కడికో ఈ పరుగు ?......దేనికోసం ఈ ఆర్భాటమంతా.........

—నేనూ ఉన్నాను అంటూ, కాలము గంట స్తంభంనుంచి పన్నెండుగంటలు కొడుతూంది—మిట్టమధ్యాహ్నం అయిందన్నమాట ! ఆకాశంలోంచి పన్నెండు వెలుతురు తునకలు కాల ప్రవాహంలో కలిసిపోయాయి......పిల్లలు ఇళ్లకు పరుగు లెట్టుతున్నారు......

అన్వేషణ. అంతులేని అన్వేషణ—సత్యంకోసం.

గుడిగోపురం ఎంత ఎర్రగా ఉందో నీరెండలో, చెట్లనుంచి బంగారు మొహరీలు వేలాడుతున్నాయి ! ......పొగగొట్టాలలోనుంచి వెలువడి చిన్న చిన్ని నల్ల మబ్బులు పెద్ద మబ్బులో కలసిపోతున్నాయి... ...ఎక్కడో ఒక కుక్క మొరుగుతోంది..... ఆ వీథిని "ఇత్తడి సామాను...పాత ఇత్తడిసామాను." అనే కేక......ఎక్కడ దొరుకుతుందీ ఈ సత్యము ?—ఎక్కడ ?"

వర్జీనియా భావపరంపర గమనిస్తే పాశ్చాత్య సాంప్రదాయాలమధ్య పెరిగినా ఆ వాతావరణంలోనే ఉన్నా ఆమె మనో భావం మాత్రం మరీమరీ ఉపనిషత్సాంప్రదాయానికి ఎంతో సన్నిహితంగా ఉన్నట్టు తోస్తుంది.

"ఎంతో కాంతివంతమైన తెరవెనుక సత్యస్వరూపం మరుగుపడింది. సత్యాన్ని తెలుసుకోవాలనే ఆకాంక్షకల నాకు సత్య స్వరూపం దర్శనంకోసం ఆ తెర తొలగింపుదేవా!"

'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి తంహి ముఖమ్. తన్మే బ్రహ్మన్నపావృణు సత్యకామాయ దృష్టయే' - అని ఉపనిషద్వాక్యము.

"ఎట్టకేలకు చంద్రోదయమైంది......

మెరుగుపెట్టిన పెద్దనాణెములా ఆకాశాన చంద్రుడు సాగిపోతున్నాడు...అప్పుడప్పుడు ఒక మేఘపు శకలము అతని తోవకు అడ్డుపడేది. మేఘాన్ని దాటినప్పుడల్లా చంద్రుడు మరింత తీక్ష్ణంగా ప్రకాశిస్తున్నాడు.

కాని చంద్రునికి ఈ విశ్వముతో ఎట్టిప్రసక్తి ఉన్నట్లు తోచదు...అల్లా ఆకాశాన చల్లగా సాగిపోతున్నాడు.—అతని అనుసరిస్తూనే చల్లగా సాగిపోతున్నై రోజులు, వారాలు, సంవత్సరాలు..."

అప్రయత్నంగా సాగిపోయే ఈ రచనలో పైకి కనబడే ఈ అందమే కాదు—ఎంత అంతరార్థముంది!

ఇల్లా వ్రాస్తూ వర్జీనియా తన చదువరులు సదా తనను అర్థంచేసుకోగలరు అనే గట్టినమ్మకంతో ఉన్నట్లు స్పష్టమౌతుంది. తన రచనలను చదివే సాహిత్యప్రియుడు అంతో యింతో సంస్కారము కలవాడు. కాబట్టే క్షణక్షణమూ నవ్యరీతిని రూపకల్పన పొందుతూ ఉన్న సుందరాతిసుందర దృశ్యాలను అతడు ఇట్టే చూచి ఆనందింపగలడు. నిమిష నిమిషమూ మారిపోతూ ఉన్న మనోభావ పరంపరలో అతను నిరాయాసంగా లీనమైపోగలడు—అని వర్జీనియా విశ్వసిస్తూన్నట్లు తోస్తుంది.

రచయితా తానే చదువరీ తానే!—ఈ అవినాభావాన్ని సార్థకపరిచే రచయితలు బహుకొద్దిమంది. వాటిలో వర్జీనియా పేరు మొదట చెప్పాలి.

* * *

ఆంగ్లసాహిత్యానికి, తద్వారా ప్రపంచ సాహిత్యానికి వర్జీనియా రచనలు ఒక కొత్తభావశబలతను ఒక కొత్తలాలిత్యాన్ని ఒక కొత్తప్రతిభను కలిగించాయి.

వ్యక్తిగతంగా తనకు కలిగిన అనుభవాలను అవగాహనచేసుకుంటూ ఆ అనుభవపరిపూర్తి, ఏరికూర్చిన పదజాలపు సహాయంతో లోకపు అనుభవ పరిపూర్తిగా చేయడము, ఈవిధంగా చదువరి మనస్సుకు అద్భుతానుభూతినీ, హృదయానికి ఆనందానుభూతినీ కలుగజేయడానికి రచనా ప్రతిభగల రచయిత అనుసరింపగలమార్గాలను చూపించింది వర్జీనియా వుల్ఫ్.

ఇట్టి రచన చాలా కష్టము. వేయి గులాబీ పూవుల లోంచి పదిచుక్కల అత్తరును తీసినట్టు భిన్నభిన్న వ్యక్తుల అనుభవపరంపరలోంచి శాశ్వతమై ఉత్కృష్టమైన పరమసత్యాన్ని నిర్వచించే రెండుమాటలను కనిపెట్టడము ఆమె రచనల ఆశయము.

* * *

రెండు ప్రపంచయుద్ధాలు ప్రత్యక్షంగా చూచింది వర్జీనియా. మానవుల ప్రకటిత ఆశయాలకు ప్రత్యక్షమైన ఆచరణకు నడుమ ఉండే కందకపు లోతులు తెలుసుకుంది.

మానవుల ఆశయాలు ఒక్కరోజులో మారవు.

కాని తన ప్రత్యేక దృక్పథాన్ని ఇతరులు మార్చలేరు. ఈ తన దృష్టినే నిరంతరమూ తన చదువరుల ఎదుట ఉంచటానికే ఆమె కృషిచేసింది.

వర్జీనియాతో సమానమైన ప్రతిభ, లలిత పదజాలసంపద, రచనానైపుణీ విపరీతమైన స్వాతంత్ర్య ధోరణీ ఆమె సమకాలికులయిన ఇతర రచయితలు

చూపించి ఉండవచ్చు. కాని, చదువరితో వర్ణనా శిల్పమైన సానభూతి, ఇతరులెవ్వరూ చూపని అవినా భావ సంబంధమూ ఈమె ప్రత్యేకతలు. ఈ గుణములే ఈమె రచనలను ఇతరరచనలనుండి వేరుచేసి ఉత్తుంగాచలశృంగముల పైకి తీసుకువెళ్ళకలవు ... ఈవందఏళ్ళలోనూ ఆమెకు ఈడైన స్త్రీరచయిత లేనేలేదు ... ఇంక ఎన్నేళ్ళకు అవతరించకలదో ఆమెవంటి మరొక స్త్రీ రచయిత్రి.

వర్జీనియా రచించిన ఆఖరి రచన ౧౯౪౧ లో పూర్తయింది. 'Between the Acts' 'అంకమూ అంకమూ మధ్య...' అనే పేరుగల ఈ రచన వర్జీనియా అనంతరమే ప్రచురితమైంది. ప్రపంచాన్నంతా ఉర్రూతలూపిన మహాసంగ్రామపు పోకడలు ఈమె రచనను పూర్తిగా ఆవహింపక తప్పిందికాదు. 'కాలము' 'మార్పు' ఇవి మానవస్వభావంతో ఎటువంటి వింతవింత సంఘటనలను కల్పింపగలవో ఈ రచనలో స్పష్టమవుతుంది.

కథావస్తువు 'ఇంగ్లండు'

ఒకానొక వసంతోత్సవ సందర్భంలో ఇంగ్లండు చరిత్ర వేరువేరు దృశ్యాలుగా రంగస్థలంపైన నటించి చూపుతారు. వేరువేరు శతాబ్దాలలో ఆనాటిజనుల జీవితములోని దృశ్యాలు వర్ణిస్తారు.

ఆఖరి దృశ్యంలో మాత్రము వేదికపైన ఎవ్వరూ ఉండరు. నలువంకలా నిలువుటద్దాలుమాత్రం అమర్చి ఉంటాయి.

హాలులో కిటకిటలాడిపోతూ ఉన్న ప్రేక్షకుల సమూహమంతా ఆ నిలువుటద్దాలలో ప్రతిబింబిత మవుతుంది

నేపథ్యమునుంచి లౌడ్‌స్పీకర్‌ద్వారా అపరిచిత కంఠస్వరము 'మీరే, మీరే' ఈ నవనాగరిక ప్రపంచశకలములు-'మీరేం మీరే! అంటూ వినపడుతుంది.

నాటకాంతంలో, వర్తమానకాలపు ప్రత్యేక ప్రత్యేకాంశాలను సమన్వయిస్తూ వినిపించే సంగీతం వర్ణిస్తుంది వర్జీనియా.

"సంగీతము ప్రారంభమైంది.

మొదటి స్వరంలోనే రెండోస్వరం ఇమిడిఉంది.

అల్లాగే మూడవ స్వరమున్నూ......

కాని, ఎక్కడనుంచో అవతరించిన అపశ్రుతి—

మరో శబ్దము...మరొకటి......

ఇలాగ ఒకస్థాయిపైన మరొకస్థాయి.

—ముందుకు సాగిపోతున్నై రాగచ్ఛాయలు.

వానితోకూడా మేమున్నూ......

కొందరము పైపైననే నిలచి పువ్వుల్లా వికసింప ప్రయత్నిస్తున్నాము.

మరికొందరము అగాధమైన అగడ్తలలోకి చొచ్చుకువెళ్ళి ఈ సంగీతపు అంతరార్థాన్ని అనుభవించాలని ఆరాటపడుతున్నాము.

మానసిక సాధనలన్నీ ప్రయోగించి ఇదివరకు ఎన్నడూ ఎవ్వరూ మాపనిదీక్షతో యత్నిస్తున్నాము- అర్థంచేసుకోడానికి......

ఎంతసేపటికో— వేకువ.

ఉషస్సు!

ప్రళయ బీభత్సంలోనుంచి లయ.

గాలిలో సాగిపోయే తీయతీయని రాగచ్ఛాయ కాదు ఇకమీదట.

లోతు తెలియని మహాసముద్రంలోనుంచి ఉబికి వచ్చే ప్రణవ సంగీతము.

దీనిలో మాధుర్యముండి — క్రోధముంది; ... సుకుమార లాలిత్యముంది, కాఠిన్యముంది.

దిగంతములనుంచీ వాయువేగంతో పరతెంచుకు వచ్చిన శతవిధ శబ్దస్వరూపాలు ఒక్కపెట్టున ఢీకొన్నాయి.

అజ్ఞానం పటాపంచలయింది.
సప్తస్వరాలూ మేళవించాయి.
విశ్వ సంగీతం వినిపించింది......"

ఈ విధంగా ముగిసింది, వర్జీనియా వ్రాసిన ఆఖరి రచన.

* * *

వర్జీనియావంటి సునిశితభావంకల స్త్రీ తన పరిసర ప్రపంచకంలోంచి పూర్తిగా వేరుపడడం అసాధ్యం. ఎంత తొలగించుకున్నా తొలగవు కొన్ని కొన్ని బాధలు. వ్యక్తులచేష్టలు సంఘంలో తీరని దురాచారాలూ ఆమెను కలతపెట్టకమానలేదు.

రెండు ప్రపంచయుద్ధాలను ప్రత్యక్షంగా చూచి వాటి బీభత్స శక్తిని చవిచూస్తూ ఈమె మానసికంగా చాలా కలవరపడింది. ఒకప్పుడు ఈ కలవరపాటు తీవ్రమై, ఆమెకు మనస్తిమితము పోయింది కూడాను.

జర్మన్ విమానాలు లండనును నాశనంచేస్తూ వర్జీనియా స్వగృహాన్ని అద్భుతమైన పుస్తకభాండాగారంతోకూడా మంటలపాలు చేశాయి.

వర్జీనియా, ఆమె భర్తా లండన్ ను విడిచి దక్షిణ ప్రాంతాన, సముద్రతీరానికి సమీపంలో ఒక చిన్న ఇంట్లో ప్రవేశించారు. ఇక్కడ శత్రువిమానాలు తమ ఆర్భాటాన్ని రెట్టించాయి. విధి విరామం లేకుండా, రాత్రిం బగళ్ళూ ఆర్తజనరక్షణచేస్తూ గడిపింది వర్జీనియా.

ఆ రోజులలోనే 'Between the Acts' అనే తన ఆఖరి నవలను పూర్తిచేసింది వర్జీనియా. మన మిప్పుడు ఆరచన ఎంతో మెచ్చుకుంటున్నాము. ఆమెకుమాత్రము సంతృప్తికరంగా లేదు. ఎంతో నిరుత్సాహపడింది. ఆ నిరుత్సాహానికి తోడుగా ప్రళయకాలవిధ్వంసాన్ని అనుకరించే విపరీత యుద్ధ పరిస్థితులు ఆమె మనస్సును పూర్తిగా పాడుచేశాయి! మళ్ళా మతిచలిస్తుందేమోనని భయపడింది ఆమె...

భర్త బల్లపైన ఒక చిన్న లేఖ ఉంచింది: "నా మనస్సు పూర్తిగా పాడైపోయింది...ఇక సహింపలేను...నాకు మతిచాంచల్యం తప్పదు...నావల్ల నీవంటి ఉత్తమోత్తమ పురుషుని జీవితము పాడవడం నేను భరింపలేను..."

అలవాటుప్రకారం ఆ ఏప్రిల్ ఉదయాన ఒక్కర్తే నదీతీరంవైపు షికారు వెళ్ళింది......

ఆ మధ్యాహ్నం నదిఒడ్డున ఆమె వాకింగ్ స్టిక్ మాత్రం దొరికింది.

* * *

మానవజీవితానికీ కాలప్రవాహానికీ కల సాదృశ్యాన్ని పరిశీలిస్తూనే తన జీవితమంతా గడిపిన వర్జీనియా వుల్ఫ్ కడకు నదీప్రవాహంలోనే లీనమై పోయింది. ప్రవహిస్తూనే ఉన్న నీరూ తామరాకు మీద నీటిబొట్టులా చలించిపోయే చైతన్యమూ వేరు వేరు రూపాలతో, పదేపదే ఆమె రచనలలో అవతరిస్తూవుంటాయి.

క్షణక్షణమూ మారిపోతూఉన్న అనుభవమయ జీవితంలో గతమునూ, వర్తమానమునూ, భవిష్యత్తునూ తన ఊహలద్వారా, చేష్టలద్వారా, ఆశలద్వారా సమన్వయించుకొనే శక్తి మానవప్రకృతికి కల్పించాలనే ఆమె యత్నం......

తనరచనలద్వారా భూతభవిష్యత్ వర్తమానాల వివక్షతను అంతరింపచేయ యత్నించిన వర్జీనియా నిరంతర ప్రవాహమైన సెలయేటిలో లీనమై పోయింది.

ఆమె రచనలుమాత్రం మిగిలాయి—ఆంగ్లసాహిత్యంలో ఉత్తమోత్తమమైన రచనలు.

# ప్రదర్శిత చిత్రాలు



కాట్స్కిల్ పర్వతాలు

శ్రీ ఎ. ఆర్. మీరాబాయి.



నాలుగు జంతువులు

బి. టి. స్కూలు విద్యార్థులు.





# ప్రదర్శిత చిత్రాలు



అక్కాచెల్లెండ్రు

డేవిడ్ పెయింటర్.



'మొజాక్' రూపచిత్రణము

శ్రీ యస్. షణ్ముఖనాథన్.

# వెలుగునీడలు

శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

ప్రకృతిలో, జీవితంలో వెలుగునీడలు అలుముకు ఉంటాయి. ఆ వెలుగునీడలను చక్కగా అర్థము చేసికొని ఆదర్శమైన సన్నిహితత్వము సాధించగలవాడే నిజమైన కళాశీలి. ఎంకిపాటల్లో ఒక చరణము జ్ఞాపకము వస్తోంది. "ఎంకెవ్వరని లోకమెపుడైన అడిగితే వెలుగునీడలవైపు వేలు చూపెడుదు"అని ఎంకి స్వరూపాన్ని చక్కగా నిరూపించాడు ఆ కళాఋషి. జీవితంలోఉండే కష్టసుఖాల సమాహారమే తన ఉపాస్య దేవత అయిన ఎంకి అని ఆయన నిర్వచనము. ద్వంద్వాలయిన వెలుగునీడలను ఒకతాట పెనచగలవాడే మరి ధన్యుడు.

అయితే ప్రస్తుతము చిత్రకళకు సంబంధించిన వెలుగునీడల గురించినది విషయము. శ్రీ భగీరధిగారి చిత్రాల్లో "వెలుగునీడలు" అనే ఒకబొమ్మ ఉన్నది. ఒక బొమ్మకాదు. ఆయన అన్ని బొమ్మలు వెలుగునీడల సమరస సన్నిహితత్వమును ఆదర్శముగా ఉంచుకొని చిత్రించినవే. ప్రకృతి అంతటా అనంతంగా అలుముకుఉన్న వెలుగునీడల్ని చక్కగా బొమ్మల్లో పొదివికొని కడిగిన ముత్యాల్లాంటి అనేక చిత్రకళాలు ఆయన చిత్రించారు.

ప్రకృతిదృశ్య చిత్రకారుడై వెలుగునీడల్ని చక్కగా ప్రదర్శించటానికి తీవ్రమైన కృషిచేస్తున్న ఇంకొక భారతీయ చిత్రకారుడు శ్రీ వీరేశ్వరసేన్ అనే వంగీయుడు. ఆయన ప్రకృతిలో కొండలమీద, మేఘాలమీదపడే వెలుగునీడల్ని తన చిన్నచిన్న బొమ్మల్లోకి పట్టుకోటానికి ప్రయత్నాలు చేస్తాడు.

బొమ్మలలో వెలుగునీడల కలయికకు Chiaroscuro అంటారు. Appreciation of Beauty అనే పుస్తకములో F. W. Westaway అనే కళావేత్త Chiaroscuro ను గురించి చక్కని భావాలు వ్రాశారు. ఏమంటే బొమ్మలో అంతటా ఒకేమాదిరి వెలుగుగాని, నీడగాని పులుముకుని ఉన్నట్లైతే ఏ విషయము ప్రాధాన్యము వహించలేక పోతుంది. అలాగాక కొన్నిభాగాలు నీడల్లో అస్పష్టముగాను, కొన్ని పూర్తిగా చీకటిలోనూ ఉంచి ఒకానొక ముఖ్యమైన చోట వెలుగుపడేట్లు ఏర్పాటుచేయగలిగితే మన దృష్టి అనవసరమైన విషయాలతో దోబూచులాడుతూ కూర్చోక అశ్రమంగా ముఖ్యవిషయముమీదకు ఆకర్షింపబడుతుంది. బొమ్మలో తాను ముఖ్యముగా చెప్పదలచుకున్న ప్రధానవిషయము దగ్గరకు మనదృష్టిని లాక్కుపోవటానికి చిత్రకారుడు ఉపయోగించే ఈ విధానానికే Chiaroscuro అంటాము. Chiaroscuro రెండువిధాలు. సూర్యకాంతికి సంబంధించిన రంగులనాధారం చేసికొని వెలసినది ఒకటి. కేవలము నలుపు తెలుపు రంగుల నంటిపెట్టుకొని ఉండేది ఒకటిన్ని. సూర్యకాంతికి సంబంధించిన వెలుగునీడల కలయికల్లో అపారమైన పరిశోధనలుచేసి కళాసేవ చేసినవారు పందొమ్మిదవ శతాబ్దము చివరరోజుల్లో పాశ్చాత్యుల్లో Impressionists అని పిలువబడే ఒకచిత్రకారుల కూటమువారు. వారికి నాయకుడు Edward Manet అనే ఆయన.

Manet తన చిత్రాల్లో ప్రత్యేకము వెలుతురు చిత్రిస్తానని శపథం చేశాడు. ఆయన తపస్సు నిజంగా ఫలించింది. ఆయన అన్ని బొమ్మల్లోనూ వెలుతురు కనిపిస్తుంది. ఒక సంగీతముహాల్లో పానీయములు అందిస్తున్న ఒక అమ్మాయిని ఆయన చిత్రించాడు.

ఆ అమ్మాయికి బొమ్మలో ఏమీ ప్రాధాన్యము లేదు. ఆ చుట్టూ షాపులనిండా ఉన్న గ్లాసులు, సీసాలు వాటిమీద మెరిసే వెలుతురు ప్రభావం ఆయన విపులంగా చిత్రించాడు. "రోడ్డుమీద సత్రము" అనే ఇంకో బొమ్మ ఆయన వేసినదే. ఆ బొమ్మ చూస్తే మిట్ట మధ్యాహ్నము మెట్లుదిగి రోడ్డుమీద కాలుపెడితే ఎలా ఉంటుందో ఆ భావం కలుగుతుంది బొమ్మలో. వెచ్చగా వెలుతురు, వేడి మన్ని ఆవరించి నట్లుంటుంది.

అయితే, అలా చిత్రించటమనేది సామాన్యమైన విషయము కాదు. వర్ణములతాలూకు సాంకేతిక శాస్త్రపరిజ్ఞానం ఎంతైనా కావాలి. అతని బృందములో ఈ విషయాల్లో బాగాకృషిచేసి అనేక కొత్త దారులు తొక్కినవారు చాలమంది ఉన్నారు. Camille Pissarro, Claude Monet, Augustice Renoir ముఖ్యులు. ఇంప్రెషనిజములోనే వీరు చేసిన ప్రత్యేకకృషి ఫలితాలుగా అనేక పద్ధతులు ప్రబలినాయి. ఆ రోజుల్లో Divisionism, Pointillism, Luminism అనే పేర్లతో. Georges Seurat అనీ Sisley అనీ ఇద్దరు చిత్రకారులు కూడా ఈ బృందములో పేర్కొనతగినవారు.

ప్రత్యేకము రంగులువేయుటములో కూడా వీరంతా కొన్ని విలక్షణమైన పద్ధతులు అవలంబించారు. రంగులు బాగా ధాతువుగా వెలుగును స్వచ్ఛముగా పట్టి ఇయ్యటానికిగాను వర్ణసమ్మేళనములో అనేక మార్పులు తీసుకువచ్చారు. మనకు సామాన్యముగా నల్లగానూ తెల్లగానూ కనిపించేచోట్ల వాళ్ళకు ఏవో రంగులు కనిపిస్తాయి. పసుపు పచ్చరంగు పక్కని నీడకు ఎరుపునీలము కలిసిన ఊదారంగు చిత్రించేవాళ్లు. అప్పుడు దూరాన్నుంచి పసుపుపచ్చరంగు తెల్లగానూ, ఊదారంగు నల్లగాను కనబడేది. రెండు రంగులు కలపవలసివచ్చినప్పుడు వాటిని కలపక ఒక రంగు పక్కని ఒకరంగు ఉంచటమువల్ల కావలసిన ధాతువును సాధించేవారు. వర్ణములలో స్వచ్ఛత కోసము బొమ్మల్లో సాముదాయికమైన ఒకే భావస్ఫూర్తి కోసము వీరు చాలా ప్రయత్నాలు చేశారు.

బొమ్మలు వెయ్యడములో రూపాలు నిర్మించి వెలుగు నీడలు నింపుకోటంలో చిత్రకారుడికెప్పుడూ ఎదురుగా ఉండే ప్రకృతి అడ్డము వస్తూంటుంది. ఆ కృతికి వర్ణముకు ఎక్కువ శ్రద్ధ కనుపరుస్తాడు, అంతకంటె గాఢమైన tone అనే విషయము విస్మరించి. Tone అంటే వెలుగులోంచి నీడలోకి ఉండే అంతరువులన్నమాట. ఈ అంతరువులను జాగ్రత్తగా పాటిస్తేనేగాని బొమ్మకు ఒక విధమైన స్థిరత్వము, శాశ్వతత్వము రాదు. ఈ విధముగా ఆనాటి కళను పునరుద్ధరించి కళకు ఒక స్థైర్యము చేకూర్చినది Paul Cezanne అనే చిత్రకారుడు. పూర్వ చిత్రకారుల చిత్రాల్లోవలె బొమ్మల్లో బరువు శాశ్వతత్వము తిరిగి సాధించి Impressionism కు ఒక స్థాయీత్వము తీసుకురావటానికి సంకల్పించాడు. తన కృషిఫలితముగా Post - impressionism నకు మూలపురుషుడైనాడు అతను.

ఆయన బయటికిపోయి ప్రకృతిమీద పరచుకుని ఉన్న వెలుగునీడల్ని చిత్రించటానికి అపారంగా కృషిచేశాడు. క్షణక్షణము మారిపోయే కాంతిచ్ఛాయల అడుగుజాడల్లో అలా చిత్రించుకుంటూ పోయేవాడు. చిత్రణలోనే అతని ప్రత్యేకమైన ఆనందమంతా. ప్రకృతిలో ఒక్కొక్కమార్పు వస్తూఉంటే మళ్లీ ఇంకోఫలకము తీసుకుని చిత్రించేవాడు. ఇలా వేసిన బొమ్మలు ఏ పొద దగ్గిరవి ఆ పొదదగ్గిరే వదిలిపోయేవాడు. తన నిరంతరాన్వేషణములో ముందుకు పోవడమేగాని వెనుకమాపులేదు. కాని అతని భార్య చాల ఓర్పుతో అతనివెంట పోయి ఆ పటములన్నీ

వీరితెచ్చి జాగ్రత్తపెట్టేది. అమూల్యమైన ఆకళాతప స్వీకృతులు అలా ఉద్ధరించబడుతూ ఉండేవి.

బొమ్మల్లో తాను తీసుకున్న విషయము ఎంతఉదాత్త మైనదా అన్నది అతని ప్రసక్తికాదు. సామాన్యముగా కొన్నిపళ్ళు, తుండుగుడ్డ, కత్తి ఇటువంటి వస్తువులనే వెలుగునీడల కూర్పులో అతను చూపించే ప్రత్యేక మైన విన్నాణముతో ఒక అద్భుతమైన కళాసృష్టి చేసేవాడు. కాని ఎప్పుడైనా ఇతను మానవచిత్రాలు వేస్తే అందులో Rembrandt చిత్రాల్లోవలె వెచ్చని మానవహృదయం స్పందించేది.

Rembrandt పదిహేడవ శతాబ్దము ప్రారంభ ములో హాలండుదేశములో జన్మించాడు. Manet తన బొమ్మల్లో వెలుతురు చిత్రించి చూపిస్తే Rembrandt నీడలను ప్రధానంగా చిత్రించాడు. జీవితంలో బొమ్మల్లో వెలుగునీడల్ని చక్కగా అనుభవించిన వాడు. అతని కాలంలో అతని బొమ్మలు ప్రజలు సరిగా అర్థముచేసికొనక పోవటమువల్ల జీవితములో చాలాదుర్భరమైన దారిద్ర్యం అనుభవించవలసి వచ్చింది. కాని వాటినన్నిటిని ఎదుర్కొనగల పరి పక్వమైన మనస్సుగల తాత్వికుడుకూడాను అతను.

ఒకసారి ఒక బొమ్మవేయమని కొందరు సైనికులు కోరారు. ఒకప్రాముఖ్యము గలచోట కొందరు యుద్ధసైనికులు రాత్రివేళ కాపలాకాస్తున్నట్లు చిత్రించాలి. Night Guard అని బొమ్మపేరు. ఆఫీసర్లంతా తమతమ రూపచిత్రాలు చక్కగా చిత్రిస్తాడు అనుకున్నారు. కాని వారికి ఆశాభంగము అయ్యింది. అందరిని చీకటిలో అస్పష్టముగా ఉంచేసి ఒకరిద్దరు అనామకుల ముఖాలమీద వెలుగుపడేట్టు చిత్రించాడు. ఆ బొమ్మలో అతను ఆనిశాసమయంలో ఆ కాపలాఅవసరం తాలూకు భయానకత్వం ప్రధానంగా ద్యోతకమయ్యేట్టు చేశాడు. అది వాళ్లకు నచ్చలేదు. అందుకుగాను ఇతనికేమీ ముట్టలేదు. కూడాను! అతని అనంతరం ఆ బొమ్మనే గొప్ప మూల్యానికి అతని దేశమే కొన్నది.

వెలుగునీడల సమన్వయంలో విరివిగా పరిశోధనలు చేసి జీవితం ధారపోసిన ఇంకో ప్రసిద్ధ పాశ్చాత్య చిత్రకారుడు whistler అనే ఆయన. ఆంగ్లకవులలో Swinburn కవిత్వమువలె ఈయన బొమ్మలు పరు షము, పాండిత్యము, తూగు, తూకముగలిగి తీర్చిదిద్దిన ట్లుంటాయి 'అద్దముముందు' అనే ఈయనబొమ్మకు సమ్మోహితుడై ఆ కవి ఒక చక్కనిపాట రాసు కున్నాడు కూడా ఆనందాన్ని పట్టలేక. గంభీరమైన నిశాదృశ్యములు ఆయనహృదయాన్ని లేపి అనేక చిత్రములు వేయించినవి. నిశాశూన్యతమస్సుల్లో అక్కడక్కడ మినుకుమనే దీపికలు ఏవో ప్రశ్నల సమాధానాలుగా తోస్తాయి ఈయన చిత్రాల్లో బొమ్మల కూర్పుతాలూకు మూలసిద్ధాంతాలకు సంబం ధించిన అనేక సూత్రాలకు ఈయన అధికారి. తన సిద్ధాంతాలకోసము Ruskin, BurnJones వంటి ఉత్తమకళావేత్తలతో కూడ స్పర్థపడి విరోధం తెచ్చుకుని ఆర్థికమైన ఇబ్బందులకు గురికావలసి వచ్చింది ఆ రోజుల్లో whistler.

ఈయన పద్ధతులలో చక్కని బొమ్మలు కొన్ని చిత్రించారు మన మద్రాసు లలితకళాశాల ప్రధానా చార్యులు శ్రీ దేవీప్రసాదరాయ చౌదరిగారు. వీరి రూపచిత్రాల్లోనూ, భావచిత్రాల్లోనూ Chiaroscuro ఎక్కువ ఉంటుంది. Palace Doll మొదలైనవి వీరి అత్యుత్తమ చిత్రాలు. Gold and Green అనే ఒక బొమ్మ ఆయనది ప్రసిద్ధమైనది. ఆమాదిరిగా బొమ్మకు పేరుంచటమే ఆయా రీతులలో ఆయనకున్న అభిమానాన్ని వ్యక్తంచేస్తుంది. Whistler తన చాలా బొమ్మలకు అలాంటి పేర్లు ఉంచాడు.

అయితే, ఈ పద్ధతులలో బొమ్మ నిర్వహించటము అంత తేలికైన పనికాదు. రేఖల్లో ఏదో బొమ్మగీచి రంగులు వేయడము మొదలుపెట్టితే ఇది సాధ్యమయేదికాదు. ప్రకృతిలో అంతటా సహజంగా కనిపించి మనకు సామాన్యవిషయమే అయినా బొమ్మల్లో వెలుగునీడ కూర్పుకోసము చిత్రకారుడు ప్రత్యేకము శ్రద్ధతో కృషి చేయవలసి ఉంటుంది. వెలుగునీడలు ఆయా భాగాల్లో ఆక్రమించే ప్రాదేశికమైన సంబంధాలవల్ల అద్భుతమైన సౌందర్యాన్ని, అలౌకికమైన భావాల్ని ఆవిర్భవింప చేయడానికి అవకాశాలున్నాయి. మనము సాధారణముగ ఒక బొమ్మచూసి విస్తుపోతూ మెచ్చుకొనే అనేకపవిత్రమైన భావాలకి కారణము ఈ విధమైన నిర్మాణకౌశలమేనని మనము తరుచు గ్రహించుకోలేము. "ఎంత గంభీరముగా ఉన్నది!" "ఎంత ఉదాత్తముగా ఉన్నది!" అంటాము బొమ్మల్నిచూసి. అదంతా ఆ వెలుగునీడల కూర్పులోనే ఉంటుంది నిజానికి.

ఒక బొమ్మవేయటమంటే వెలుగునీడల్ని ఒక విలక్షణమైన పద్ధతిలో కూర్చి ఒక వినూత్నమైన రసాన్ని ఉత్పన్నము చేయటమేగాని ప్రకృతిలో ఉన్నదానిని దేనిని యథాతథముగా దిగుమతి చేయటము మాత్రముకాదు. అది పూర్తిగా అసంభవము కూడాను. Composition కు సంబంధించిన నంతవరకు బొమ్మంటే అలంకారప్రాయమైన ఒక అందమైనకూర్పు అన్నమాట. అది ఒక మనోహరమైన అల్లికకాకపోతే చూడటానికి కళాత్మకమైన ఆనందాన్ని ఇయ్యలేకపోతే దానికుండవలసిన ముఖ్యమైనగుణమే లోపించిందన్నమాట.

ఒక వస్తువును ఎదురుగ చూస్తున్నప్పటికిన్నీ చిత్రకారుని మనఃఫలకముమీద పూర్వదృశ్యానుభవాల తాలూకు చిహ్నాలు నిద్రాణంగా ముద్రితమయే ఉంటాయి. అతని కళాదృష్టి ఒకసారి మేల్కొన్నదంటే ఇక అతను ఉన్నదున్నట్టు వరవడి దింపటంతో సంతృప్తిచెందడు. అతను తన జ్ఞాపకశక్తిలోనుంచి, జాగృతమైన ప్రకృతిని వడపోసి చిత్రాలుగా సృజించుకోవటము ప్రారంభిస్తాడు ఈ విధంగా అతనికి ప్రకృతిదాస్యం వదలి స్వేచ్ఛారచన సాగుతుంది.

ఇలా చిత్రకారుడు అనుకరణ శృంఖలలు త్రెంచుకొన్న తరువాత బొమ్మకు నిర్ణీతమైన హద్దులు. ఆ హద్దుల్లో ఒదిగేటట్టు తన జీవితానుభవాల్ని దృశ్యమానం చేయటంలో ఉండే ఇబ్బందులూ వస్తాయి. వీటినన్నిటినీ సర్దుకొని చిత్రకారుడు సృష్టించే ప్రతి చిత్రము స్వయంసంపూర్ణమైన ఒక చిన్న ప్రపంచమన్నమాట.

ఒకసారి చిత్రకారుడు బొమ్మవేయడానికి ప్రారంభించేటప్పటికి, కాగితముమీద పెన్సిలు పెట్టేటప్పటికి అతనికల్పనాశక్తికి పనికలుగుతుంది. తన బొమ్మలో పొదగవలసిన సామగ్రిని కూర్చటానికి ప్రారంభిస్తాడు. ఆ ప్రయత్నంలో అతనికి తాను చిత్రించబోయే సామాన్యవస్తువుల తాలూకు అనేకమైన విశేషసత్యాలు గోచరిస్తాయి. ఇటువంటి ప్రయత్నములు చేయగా చేయగా చివరకు మనకంటికి కనుపించే ఈ ప్రపంచానికి పూర్తిగా భిన్నమైన రూపాలుగల మరో ప్రపంచం మన కన్నులముందు రూపించే కళాస్రష్ట తయారవుతాడు. మన ప్రాచ్యచిత్రకళ అంతానూ, పాశ్చాత్యులలో Blake వంటి కొందరి రచనలు ఈ పద్ధతిలోకి వస్తాయి. ఇదంతా మనిషికి అసహజము కాదు. అయినా లౌకికప్రవృత్తిలోపడి అతని సహజశక్తులు మొరటుబారి పోతాయి. అందుకనే అతను మళ్ళీ ప్రయత్నముచేసి ఈ విషయాలు అలవరచుకోవలసి వస్తుంది.

# వెలుగు నీడలు

ఒక్కమాట. వెలుగు - నీడ, వెలుగు - చీకటి అని రెండురకాల జంటలున్నాయి. ఇవి జాగ్రత్తగా వాడుకోవలసిన పదాలు. ఏమంటే కొన్ని సంప్రదాయాల్లో బొమ్మల్లో నీడలు ఉండవు. ఛాయా చిత్రాల్లోవలె ప్రాదేశికమైన అంతరువులుగాని, వస్తుగత బాహ్యసత్యభ్రాంతిగాని ప్రాచ్యచిత్రకళా సంప్రదాయాల్లో కనిపించదు. యాథార్థ్య స్ఫూర్తినిచ్చే వస్తుసహజమైన వర్తులతను బల్లపరుపుగా ఊహించుకొనుటము ప్రతీచీసాంప్రదాయాల్లో సామాన్యధర్మము. నీడ మూడవ పరిమాణాన్ని బొమ్మల్లో స్ఫురింపజేస్తుంది. అందుకని వెలుగు-చీకటి అనివ్యవహరించటము మంచిది. హైందవ చిత్రకళకు, చీనా జపాను మొదలైన అన్నిప్రాచ్యకళా సాంప్రదాయలకున్నూ వెలుగు చీకట్లే ప్రధానమైనవి.

ప్రాచ్య చిత్రకళలో బొమ్మల్లో వర్తులత కోసము అంతరువులు చూపించినా, అది చీకటివెలుగుల కూర్పుకోసము, అల్లిక పెంపకము జిగికోసము తెచ్చుకున్నది గాని, బాహ్య వస్తుసత్యాన్ని నిరూపించేది మటుకు ఎంతమాత్రము కాదు.

కనుక ఒక బొమ్మ విజయవంతంగా చిత్రితమై శాశ్వతంగా నిలవాలంటే చిత్రకారుడు తన బొమ్మలో ఉపయోగించే వెలుగుచీకట్ల కూర్పు విషయంలో అత్యంతము శ్రద్ధవహించాలి. ఎప్పుడు చూసినా కొత్తగా ఉండి శాశ్వతమైన ఆనందాన్ని ఈయగల ప్రతి ఉత్తమచిత్రము ఈ వెలుగు చీకట్ల కూర్పులో ఒక వినూత్నమైన ఓజస్సు కలిగేఉంటుంది.

ఆలిండియా రేడియోవారి అనుమతితో



# అవనీంద్ర

## శ్రీ సంజీవదేవ్

సాధారణంగా భారతశిల్పానికీ, అందులో ప్రత్యేకంగా నవ్యభారతశిల్పానికీ నేడు విశ్వశిల్పసౌధంలో ఒక విశేషమైన గౌరవస్థానం ఉన్నదీఅంటే, అందుకు మూలం శ్రీ అవనీంద్రనాథఠాకూరని వేరే చెప్పనవసరం లేదు. భారతశిల్పానికే కాదు యావత్ ప్రాచ్యశిల్పానికీ పశ్చిమఖండంలో గౌరవస్థానం లభ్యంకావటానికి పరోక్షంగా అవనీంద్రుడే కారణం అనటంలో అత్యుక్తిలేదు.

వంగదేశంలో ఠాకూర్‌పరివారం వెనుకటినుండీ భారత సంస్కృతికి జీవనదిగా ప్రవహిస్తూవస్తున్నది. అందులో ప్రత్యేకం శిల్పాలకు పుట్టినిల్లు వీరి పరివారం. ధార్మికవిషయాల్లో దేవేంద్రనాథఠాకూరు నవ్యభావోదయాన్ని కలిగించితే ఆయన కొడుకు రవీంద్రుడు సాహిత్యరంగంలో నవకాంతులను వెదజల్లాడు. అదేవిధంగా శిల్పరంగంలో అవనీంద్రుడు కూడ.

ఠాకూర్ పరివారపు ఆనువంశికనిలయమైన 'జోరాశంకో'భవనంలో క్రీ. శ. ౧౮౭౧ వ సంవత్సరం ఆగష్టుమాసంలో జన్మించాడు అవనీంద్రుడు కలకత్తాలో. దేవేంద్రనాథఠాకూరుని సోదరుడగు గిరీంద్రనాథఠాకూరుకు అవనీంద్రుడు పౌత్రుడు. అవనీంద్రుని తండ్రిపేరు గుణేంద్రనాథ ఠాకూరు. అవనీంద్రుని తాతయగు గిరీంద్రనాథు చాల కళాసంపన్నుడు. ఆయన స్వయంగా చిత్రశిల్పి. యిరోపీయ విధానంలో గిరీంద్రనాథు మానవరూపాలనూ ప్రకృతిదృశ్యాలనూ చిత్రిస్తుండేవాడు తైలవర్ణంలో. గిరీంద్రుడు సంగీతశిల్పి నాట్యశిల్పికూడ.

అవనీంద్రుని తాతవలెనే అవనీంద్రుని తండ్రి గుణేంద్రనాథ ఠాకూర్‌కూడ విచిత్రరసానుభూతులుగల వ్యక్తి. ఈయనయొక్క అభిరుచులు బహుముఖాలు చిత్రశిల్పం, ఉద్యానకృషి, ఫోటోగ్రాఫీ, జంతుశాస్త్రం, వృక్షశాస్త్రం, మొదలగు పెక్కు విద్యావ్యాసంగాల్లో ఈయనకు అభిరుచి. అవనీంద్రుడు ఇటువంటి సంస్కృతి పూరిత వాతావరణలో జన్మించాడు. జీవితపరిణతికి అవసరమగు ప్రాథమిక కార్యక్రమం యావత్తూ అవనీంద్రుని జన్మకుముందే సర్వసిద్ధంగా వున్నదన్నమాట. ఠాకూరు పరివారంలోని విఖ్యాతవ్యక్తులందరిలో ప్రతికూల వాతావరణలో జన్మించి యేటికెదురీది స్వశక్తిచేత పైకొచ్చిన వారెవరూ! లేరు. అదివరకే తయారుచేసివున్న అనుకూల పరిసరాల్లోపుట్టి పుష్పంలాగా పైకి వచ్చినవారే. ఇచ్చట పురుషశక్తికంటె పరిసరశక్తికే బలంఎక్కువ.

అవనీంద్రున కైదవయేట నార్మల్ స్కూలుకు పంపారు. ఇచ్చట ఆయన దాదాపు రెండుమూడేళ్ళ వరకూ చదువుకున్నాడు. ఒకనాడు ఆ స్కూలులోని ఇంగ్లీషు అధ్యాపకుడు 'Pudding' ను 'పాడ్డింగ్' అని ఉచ్చరించితే అవనీంద్రుడు ఆ ఉచ్చారణ తప్పుఅని పంతులుకు తెలియజేశాడు. అప్పుడు ఆ ఇంగ్లీషుపంతులుకు కోపంవచ్చి అవనీంద్రుని చావ చితగ కొట్టి పంఖాత్రాటితో బడిలోని బల్లకు కట్టివేశాడు. ఆ రోజుతో ఆ పాఠశాలకు స్వస్తి.

నార్మల్ స్కూలు వదలివేసినప్పటినుండీ అవనీంద్రుడు తన తండ్రియొక్క రంగులపెట్టెను ఉపయోగించుకో సాగాడు. ఆరంగులతో, గ్రామదృశ్యాలనూ కుటీరాలనూ, చెట్లనూ చిత్రించటం మొదలుపెట్టి క్రమేణా ఇందులో కొంత ప్రజ్ఞ కనపరచసాగాడు.

ఇదే సమయంలో అవనీంద్రుని పరివారంమొత్తం కలకత్తానుండి కాపురం ఎత్తివేసి గంగాతీరానవున్న

తమ ఉద్యానగృహంలో నివసించసాగారు. ఇచ్చటి ప్రకృతిజీవితం అవనీంద్రుని భావోద్దీపనకు చాల తోడ్పడ్డది. ఆ గంగాతీరపు ఉద్యానం ప్రాచీన శిథిలాల వాతావరణంతో నిండివుంటేది. ప్రకృతి సౌందర్యానికితోడు కొంత భీభత్సరసంతో కూడ నిండి వుంటేవి ఆ నూతన పరిసరాలు. ఆ ఉద్యానగృహం నిండా దయ్యాలు తిరుగుతుంటవనికూడ ఒక ప్రతీతి. తెల్లవారేవరకు, దయ్యాలసంగతేమోగాని, నక్కలూ, తోడేళ్లూ తినివేసిన జంతువుల ఎముకలు మాత్రం ఉద్యానంనిండా కనబడేవట ప్రతిరోజూ. ఈ విధమైన పరిసరాల నివాసం అవనీంద్రుని లేతహృదయం మీద చాల భావోత్తేజనాప్రభావాన్ని కలిగించింది.

దీనికితోడు ప్రకృతి పరిశీలనకూ, వివిధాలైన పక్షుల పరిచయానికీ ఈ నూతన నివాసం ఆయనకు బాగాతోడ్పడ్డది. ఇచ్చట వున్నకాలంలో ఆయన అనేకరకాలైన స్కెచ్‌లు వేశాడు. అందులో గ్రామీణవనితల చిత్రాలు ప్రధానం. ఈ బాలుని అనంతిత శిల్పాసక్తినిచూచి మేనమామయగు నీలకమల ముకర్జీ చాల సంతోషించి చిత్రణకు కావలసిన రంగులూ, కుంచెలూ, కాగితాలు మొదలైన సామగ్రి తెచ్చిఇచ్చాడు. అంతటితో అవనీంద్రుని శిల్పసృష్టి నవచైతన్యాన్ని పొందసాగింది. కాని ఇచ్చట మరొక విషాదఘట్టం సంభవించింది. తండ్రి మరణించాడు.

తండ్రి మరణానంతరం పరివారంమొత్తం గంగాతీరాన్ని వదలి మరల కలకత్తా ప్రవేశించారు. అప్పటికి అవనీంద్రుని వయస్సు పదిసంవత్సరాలు మాత్రమే. కలకత్తా రాగానే అవనీంద్రుని సంస్కృత కళాశాలలో ప్రవేశపెట్టారు. సంస్కృతంలో మంచి ప్రతిభ చూపసాగాడు. పాఠశాలలో ప్రథమ బహుమతులనుకూడ పొందసాగాడు. కాని ఎచ్చట ఏమి చదువుతున్నా తన శిల్పసృష్టిమాత్రం విడవలేదు. ఇచ్చట చదువుతుండగానే బంగాళీలో కవితకూడ అల్లసాగాడు. అల్లిన కవితకు రేఖల్లో రంగుల్లో రూపం ఇచ్చేవాడు.

కొంతకాలానికి సంస్కృత కళాశాలను వదలివేసి ఒక ఆంగ్ల కళాశాలలో ప్రవేశించి ఇంగ్లీషుభాష నభ్యసించాడు. ఇంతటితో విద్యాభ్యాసానికి స్వస్తి చెప్పి కేవలం శిల్పసృష్టిలోనే మునిగిపోయినాడు. రవీంద్రనాథుని 'చిత్రాంగద'కు బొమ్మలు వేయటం తన స్వంతరచనలగు 'శకుంతల' 'దుగ్ధప్రతిమ' మొదలగువాటికి బొమ్మలువేయటం ప్రారంభించాడు. చిత్రసాధనేకాక సంగీతసాధనకూడ సాగించాడు. ప్రత్యేకం జంత్రంలో మంచి ప్రావీణ్యం సంపాదించాడు. రవీంద్రుడు తన గీతాలను గానంచేస్తుంటె అవనీంద్రుడు ఎస్‌రాజ్ వాయించేవాడు.

అవనీంద్రుని కప్పుడు పాతికసంవత్సరాల వయస్సు. కలకత్తా శిల్పకళాశాలకు ఉపప్రధానియగు గిల్హార్డీ అనే ఇతాలియన్ శిల్పివద్ద అవనీంద్రుడు పాశ్చాత్య పద్ధతిలో చిత్రకళ నభ్యసించసాగాడు. తరువాత కొంతకాలానికి ఛార్లెస్ పామర్ అనే ఇంగ్లీషు శిల్పి వద్ద శిష్యత్వం పొంది పాశ్చాత్యపద్ధతిలో తైల చిత్రణ అందులోనూ ప్రత్యేకం రూపచిత్రణమూ అభ్యసించాడు. పాశ్చాత్యపద్ధతిలో తైలవర్ణ చిత్రణలో మంచిప్రావీణ్యం గణించాడు. కాని అవనీంద్రునికి క్రీ. శ. ౧౯౦౦ లో మాంఘీర్ ప్రయాణం సంభవించింది. ఆ ప్రయాణంలో ఐరోపీయపద్ధతిలో తైలవర్ణాలను వాడటంమానేసి నీటిరంగులను వాడటం సాగించాడు. మాంఘీర్‌నుండి తిరిగివచ్చి మరల ఛార్లెస్‌పామర్‌వద్ద నీటిరంగులలో బాగా శిక్షణ పొందాడు. ఇచ్చటనుండి మరల మాంఘీర్ ప్రాంతాలకువెళ్ళి అచ్చటి అనేకదృశ్యాలనూ మానవులనూ, పశుపక్షులనూ నీటిరంగులలో చిత్రించసాగాడు.

అసలు అవనీంద్రుని శిల్పజీవనిలో గొప్ప పరివర్తనం సంభవించటానికి కారణం ఠాకూర్ పరివారపు గృహమగు 'జోరాశంకో'లో దొరకిన ఒక పురాతన

హిందూ - ఇరానీ వ్రాతప్రతి. ఈ వ్రాతప్రతిలోని అద్భుతమైన రేఖాచిత్రాలూ, లిపికారులమూ అవనీంద్రుని కల్పనాశక్తికి నూతనదృష్టిని ప్రసాదించింది. ఇది మొదలు అవనీంద్రుడు పాశ్చాత్యపద్ధతిని విసర్జించి ప్రాచ్యపద్ధతిలో తన చిత్రరచన సాగించాడు. ఈ ప్రాచ్యపద్ధతిలో ప్రథమంగా కృష్ణలీలా చిత్రాలను రచించాడు. పాశ్చాత్యవిధానమైన ఆ ఛాయా కాంతులు ప్రదర్శనాన్ని వదలి సున్నితమైన రేఖలతోనూ శుద్ధమైన రంగులతోనూ చిత్రసృష్టి ప్రారంభించాడు. అప్పటికి అవనీంద్రుని వయస్సు ముప్పది.

మరి కొంతకాలానికి ప్రభుత్వ శిల్పకళాశాల ప్రధానియగు ఇ. బి. హావెల్‌తో అవనీంద్రునికి పరిచయం కలిగింది. తను మొదలు పెట్టిన నూతన ప్రాచ్య పద్ధతిని హావెల్ చాల ప్రశంసించాడు. విచిత్రం ఏమంటె అప్పటి కలకత్తాలోని విద్యావంతులగు వంగీయు లెవ్వరూ అవనీంద్రుని యీ ప్రాచ్య చిత్ర సృష్టిని ప్రశంసించకపోగా పైగా చెడుగా విమర్శించ సాగారు. పాశ్చాత్య సంప్రదాయాలతో నిండిన విద్యాభ్యాసం మూలాన, జాతీయం అయిందంతా హీనం అనే దాస్యభావంవల్లా, యూరపులో పనికి రాని తక్కువరకపు చిత్రాలను మనదేశంలో దిగుమతి కావటంతో వాటినే ఉత్కృష్టశిల్పం అని అనుకొన్న అజ్ఞానంమూలానా అప్పటి విద్యావంతులగు వంగీయులెవ్వరూ అవనీంద్రుని నూతన శిల్ప ఉద్యమాన్ని ప్రోత్సహించక విమర్శింపసాగారు. అప్పటి ఇటు ప్రాచ్య శిల్పశాస్త్రాల ననుసరించిగానీ లేక అటు పాశ్చాత్యదేశాల్లోని ఉత్కృష్ట శిల్ప సంప్రదాయాల ననుసరించిగాని భారతదేశంలో చిత్రించేవారు లేరు. కేవలం తక్కువరకపు చౌకయైన పాశ్చాత్య తైలచిత్రాలను అనుకరణచేయటం మాత్రమే గొప్ప శిల్పంగా భావించటం అప్పటి భారతీయ చిత్రశిల్పులలో ఒక వ్యామోహం అయిపోయింది.

ఈ చౌకరకపు రసజ్ఞతను ఎదుర్కోటం అవనీంద్రునికి చాల కష్టసాధ్యమైన పని అయింది. ఈ ప్రయత్నంలో ఇ. బి. హావెల్ అవనీంద్రునికి బాగా తోడ్పడ్డాడు. భారతీయ శిల్పసంప్రదాయ మర్మాలను ఇ. బి. హావెల్ తన రసవంతమైన లేఖినిద్వారా బాగా ప్రచారం చేయసాగాడు. ఇంకా యీ ఉద్యమంలో తోడ్పడ్డవారిలో ఆనందకుమారస్వామి, సిస్టర్ నివేదిత, ఉడ్రాఫ్, రామానంద చటర్జీ ముఖ్యులు. వీరు తమ రచనలద్వారా అవనీంద్రుని చిత్రసృష్టిపై భాష్యాలు వ్రాసి ప్రజలలోని—భారతదేశంలోనూ ఇతర దేశాలలోకూడ — ప్రతికూల భావాన్ని చాలవరకు తగ్గించారు.

ఈ సమయంలో హావెల్ యొక్క బలవంతంపై అవనీంద్రుడు కలకత్తాలోని ప్రభుత్వ శిల్పకళాశాల ఉపప్రధాని పదవిని స్వీకరించి కొంతకాలం అందులో భారతీయ శిల్పసంప్రదాయాలను విద్యార్థులకు బోధింప నారంభించాడు. అప్పటికి దేశంలో రాజకీయ చైతన్యంవల్ల స్వదేశీ ఉద్యమం మంచి వ్యాప్తిలోకొచ్చింది. 'స్వ' అనే దానికిగూడంతా వుండవలసిన దానికంటె మించిన అతి అభిమానము, 'పర' అనే దానిపైనంతా హద్దులు దాటిన అతి నిరసనా విద్యావంతులలోనూ, వీరి ననుకరించి ప్రజాసామాన్యంలోనూ ప్రబలిపోయింది. ఈ అతిస్వదేశీ ప్రీతి అంతకు ముందున్న అతి పరదేశీప్రీతికి ప్రతిక్రియ. ఈ స్వదేశీ ఉద్యమం అవనీంద్రుడు లేపిన భారతశిల్ప ఉద్యమ వ్యాప్తికి బాగా తోడ్పడ్డది. ఈ నవ్యభావ స్రవంతి ఎంత తీవ్రతరం అయిందంటే, మనసులో యీనూతన భారతశిల్పం నచ్చినా నచ్చకపోయినా అనేకులు పైకి మెచ్చుకొనక తప్పిందికాదు. లేనిచో అరసికులని అంటారేమోనని భయం.

౧౯౧౩ లో పారిస్ నగరంలో అవనీంద్రుని చిత్రాలు కొన్ని ప్రదర్శించబడినవి. శిల్పద్రష్టలూ, శిల్ప రసికులూకూడ వాటిని చాల ప్రశంసించారు.

ఒకరకంగా చూస్తే భారతదేశంలోకంటె యూరపు ఖండములోనే అవనీంద్రుని శిల్పప్రావీణ్యం బాగా గుర్తించబడింది. అసలు రవీంద్రుని సాహిత్యానికంటె అవనీంద్రుని చిత్రకళయే యూరపులో ముందు పరిచయం అయింది. అసలు రవీంద్రుని గీతాంజలిని ఇంగ్లీషులో ప్రకటించటానికి ప్రోత్సహించినవారంతా అవనీంద్రుని పాశ్చాత్య మిత్రులే.

ఈ నూతన భారతశిల్పానికి అవనీంద్రుని అన్న గగనేంద్రనాథు బాగా తోడ్పడ్డాడు. గగనేంద్రుడు సోదరుని యీ నూతనోద్యమానికి తన వివిధ రకాలైన చిత్రరచనలద్వారా నవచైతన్యాన్ని ప్రసాదించాడు. వీరుభయులూ కలిసి ౧౯౦౭ లో 'ఇండియన్ సొసైటీ ఆఫ్ ఓరియంటల్ ఆర్టు' అనే శిల్పసమితి నొకదాన్ని ఏర్పరచినదాని తరఫున ఒక పత్రికను నడప ప్రారంభించారు. దానికితోడు ఒక శిల్ప విద్యాలయాన్నికూడా. ఈ ప్రాచ్యశిల్ప సమితిలోని గృహాలంకారాలన్నీ ప్రాచ్యపద్ధతిలోనే చేశారు. ఇందులోని కర్రసామాను చేసేందుకై మద్రాసునుంచి ధనుష్కోడి ఆచారి అనే దారుశిల్పిని కలకత్తా తీసుకువెళ్ళి ఆయనద్వారా భారతీయ విధానంలో అనేకమైన సామగ్రిని తయారు చేయించారు.

అవనీంద్రుని చిత్రరచనా విధానంలో పాశ్చాత్య పద్ధతిని వదలి దానికి బదులుగా దూరప్రాచ్యపద్ధతిని అందులోనూ జపానుపద్ధతిని అవలంబించాడు అని కొందరు విమర్శించేవారు. ఇది విమర్శించినంత కాకపోయినా మొత్తంమీద కొద్దో గొప్పో యదార్థం అని వప్పుకోవాలి. ఆ రోజుల్లో భారతదేశంలో బయలుదేరిన యీ నూతనప్రాచ్య శిల్పోద్యమానికి జపానీయులుకూడ తోడ్పడ్డారు. కవాగుచీ, ఒకాకురా, కకూజా మొదలైన శిల్పవేత్తలు భారతదేశం వచ్చి అవనీంద్రునితో కొంతకాలం వుండిపోయినారు. అప్పుడు అవనీంద్రుడు వారి విధానాలనుకూడ తన చిత్రరచనలో అవలంబించి చూచినమాట నిజమే కాని, దానినే, శాశ్వతంగా అవలంబించలేదు అసలు ఆ వాదానికొస్తే ఒకదేశ విధానంపైన, మరొకదేశ విధానప్రభావం పడకుండావున్న జాతిగాని సంస్కృతిగాని, సాహిత్యంగాని, లలితకళలుగాని లేవనే చెప్పాలి. వాస్తవానికి జపాను శిల్పంపైన ప్రాచీన భారత శిల్పప్రభావం చాలవరకు పడివున్నదనే సత్యాన్ని శిల్పచరిత్రకారులంతా ఆమోదించిన విషయమె.

ఈ నూతన భారతశిల్ప ప్రచారం భారతదేశపు అన్నిమూలలకు ప్రాకగానే క్రమేణా అవనీంద్రుని వద్దకు అన్ని ప్రాంతాలనుంచి శిష్యులు ప్రవేశించసాగారు. అవనీంద్రుని శిష్యబృందచరిత్రను ఎత్తుకొంటే అదొక ప్రత్యేక వ్యాసం అవుతుంది. అందువల్ల ఇక్కడ ఆ శిష్యబృందంనుండి పూర్తిగా తొలిగివుండటమే మేలనిపిస్తున్నది. కాని ఒక్క విచిత్రం ఏమంటే ఒక్క ఆంధ్రుడైనా ఆ రోజుల్లో అవనీంద్రుని శిష్యవర్గంలో గోచరించరు. దక్షిణప్రాంతానికంతకూ కేవలం మైసూరునుండి వెళ్లిన వెంకటప్ప మాత్రమే కనుపిస్తాడు.

అవనీంద్రుని ప్రతిభకు మెచ్చి కలకత్తా విశ్వవిద్యాలయం ఆయనకు డి. లిట్. బిరుదాన్నిచ్చి గౌరవించి ఆ విశ్వవిద్యాలయంలోని వాగీశ్వరీ లలితకళల పీఠానికి ఆచార్యునిగా నియోగించారు. ఈ ఆచార్యత్వకాలంలో ఆయన ఆ విశ్వవిద్యాలయంలో ఇచ్చిన ఉపన్యాసాలను ఒక సంపుటిగా ప్రకటించారు 'వాగీశ్వరీ శిల్ప ప్రబంధావళి' అను పేరుతో. ఇవన్నీ కూడ బంగాళీలోనే ఉన్నవి. శిల్పసమీక్షా చరిత్రలో యీ ఉపన్యాసాలు ఒక నూతన యుగాన్ని సృష్టించిన వన్నమాట. ఆయన బంగాళీ గద్యశైలి చాల సుందరంగా వుంటుంది; రసోద్దీపనకరంగా వుంటుంది. ప్రతివాక్యం పద్యంవలె ఛందోబద్ధమైనట్లు కనుపిస్తుంది. ఇదొక రసమయ గద్యశైలి.

ఆయన ప్రయోగించే పదజాలమంతా ఆయన రంగుల చిత్రాలకు శ్రావ్య ప్రతిబింబాలా, లేక ఆయన చిత్రాలే ఆయన పదజాలానికి దృశ్యప్రతిబింబాలా, అనేది గుర్తించటం కష్టం. ఈ 'వాగీశ్వరీ శిల్పప్రబంధావళి' లోని బంగాళీ ఉపన్యాసాలను తెలుగులోకి తర్జుమా చేయాలని యీ పంక్తులువ్రాసిన రచయిత ప్రయత్నించి చేతగాక మానుకున్నాడు. వాటిలోని ఆ రసమయ వాతావరణాన్ని తెలుగులోకి తేలేక నానా అవస్థపడి ఆ ప్రయత్నాన్నే విరమించుకున్నాడు. అందరాని అనుభూతిమయం అదంతా. రూపశిల్పంయొక్క రసమర్మాలన్నీ యీ గ్రంథములో పదచిహ్న ప్రయోగంద్వారా ప్రదర్శించబడ్డాయి. పిల్లలకూ పెద్దలకూ పనికివచ్చే అనేక సాహిత్య గ్రంథాల్ని రచించాడు అవనీంద్రుడు బంగాళీగద్యలో. చిత్రకారుడనే పేరు పొందకుండా వున్నట్లయితే అవనీంద్రుడు మంచి సాహిత్యకారుడనే పేరు పొందేవాడే. కాని చిత్రకళ పైకివచ్చి ఆయన సాహిత్య కీర్తిని దాచివేసింది.

అవనీంద్రుడు తన చిత్రాలన్నిటినీ మొగలు సూక్ష్మచిత్రాలవలె చిన్నవిగా రచించాడు. భారతీయ విధానంలో ఆయన రచించిన మొదటిచిత్రం 'అభిసారిక' అనేది. ఇది చండీదాసుని ఒక పదానికి ఆలేఖనం. తదుపరి కృష్ణలీలలనూ, ఉమర్ ఖయాం రుబాయీలనూ, ఋతుసంహార వర్ణనలనూ, మేఘసందేశ ఘట్టాలనూ చిత్రించాడు. అవనీంద్రుని విశ్వవిఖ్యాతిగన్న చిత్రాలలో షాజహాను మరణం, 'ఆలంగీర్' 'ప్రవాసియక్షుడూ' 'తిష్యరక్షితా' 'బుద్ధసుజాతా' మొదలయినవి కొన్ని. పాశ్చాత్య పద్ధతిలో ప్యాస్టల్ రంగులతో వేసిన రవీంద్ర, ఆండ్రూసు మొదలైనవారి రూపపటాలుకూడ ఒక ప్రత్యేకతను కలిగివున్నయి.

అవనీంద్రుడు తన వృద్ధాప్యంలో ఒక క్రొత్త శిల్పవిలాసానికిలోనైనాడు. ఏమంటే ప్రకృతిలోని ప్రతి చిన్నవస్తువునూ పరిశీలించటం. అందుమూలాన ఆ వస్తువులో ఏదైనా ఒకరూపం చిహ్నమాత్రంగా గోచరిస్తే దాన్ని కొద్దిగామార్చి దానిలోనుండి కొంత భాగాన్ని తీసిగాని లేక మరేవస్తువనైనా కలిపిగాని —దానికొక రూపాన్ని ఆపాదించి ప్రదర్శించటం. ఉదాహరణకు ఒక చెట్టుయొక్క ఎండినపుల్ల కొంచెం నక్క ఆకారంగా గోచరిస్తే దాన్ని తెచ్చి తోకతక్కువైతే ఏతాటి జీబునో తగిలించి చెవులు లేకపోతే ఏజామచెట్టు బెరడునో అతికించి దానిని నక్కను చేయటం. అనగా 'ప్రకృతిలోని వస్తువును కొద్దిగా మార్చితే యేదైనా పరిచితమైన ఆకృతి వచ్చేటట్లుంటే అలాంటి వస్తు సముదాయాన్ని సేకరించటం. ఈ క్రొత్త మోజుయొక్క సిద్ధాంతం ఏమంటే శిల్పం అంటె సృష్టించటంకాదు దాగివున్నదాన్ని కనుగొనటం మాత్రమేనని.

అవనీంద్రుని కిప్పుడు దాదాపు నాలుగుసంవత్సరాలు తక్కువయనభైసంవత్సరాల వయస్సు. వృద్ధాప్యంలో మతితిరిగిపోయిందంటారే దాదాపు అదే పరిస్థితి ఇప్పుడు. ఆయన స్వంత పరివారం వారెవ్వరూ లేరిప్పుడు. సంతతిలేదు. భార్య మరణించింది. రవీంద్రుని మరణానంతరం విశ్వభారతికి అధ్యక్షునిగా చేశారు అవనీంద్రుని. ఇప్పుడు శాంతినికేతనమే ఆయనకు లీలానికేతనం.



# తల్లి లేని పిల్ల

## శ్రీ వేలూరి శివరామశాస్త్రి

శతావధాని

౧

చుట్టు పక్కల జొన్నపైరు లోగడ పూసుకున్న పసుపుచివళ్లలో పారాణి పెట్టుకుంటున్నది. అల చందలొకటి నొకటి పెనవేసుకుని జేనెడు మూరెడు కాయలలో నేలకు బంగారు జడ అల్లాయి.

ఎదురుగా కొండ ఉంది, దానిమీది కొరనేగు పొదలూ వెదురు గుమ్ములూ కిచకిచలాడుతున్నై.

చిట్టెమ్మ మేకల మంద నడుమ కూచుంది. చుట్టూ పది పన్నెండు దుత్తలూ ఐదారు చెంబులూ. చిట్టెమ్మ కొడుకు పదమూడేండ్ల వాడు రాఘవులు మేక పాలతో ఒక చిన్న గంట అలికి దానిలోనూ, ఒక చిన్న రాతి తొట్టిలోనూ కుక్కలకూ కుక్కపిల్లలకూ మేకపాలుపోస్తున్నాడు. నడుమ నడుమ చిట్టెమ్మ—'పూరిమేక నిటు తోలు, పుల్ల మేక, మునిపొడమేకా' అని అంటూ వుంటే రాఘవులాయా మేకలను తల్లిదగ్గరకు తోలుతూ ఆమెకు సాయం చేస్తున్నాడు.

రాఘవుల తండ్రి నాగాయ మందచివర నుంచుని మేకలను పరీక్షచేసి పళ్లు కదిలిన వానికి క్షౌరంచేసి చక్రాంకితాలు వేశాడు. కొన్ని మేకల డెక్కల నడుమ ముళ్లు లాగాడు. ఒక పైమేకవి కాలిమీది వెంట్రుకలు లిక్కతో కోసి నెత్తురు కంటచూచి—'ఒరే నాయనా ఉప్పు పెట్టి రుద్దు' అని పురమాయించాడు. రాఘవులు తండ్రికి కూడా సాయం చేశాడు.

చిట్టెమ్మ చుట్టూవున్న దుత్తలన్నీ నిండై. నాగాయ మేకల నన్నిటినీ చూచుకుంటూ మందనడుమగా నడచి చిట్టెమ్మ దగ్గరకు వచ్చాడు. రాఘవులు కూడా అక్కడికి వచ్చి ఉప్పూ నెత్తురూ కలిసిన చేతులు కడుక్కున్నాడు. ఈలోగా తల్లి ఆ పాలన్నీ రెండు కుండలలో నింపుతూ—'నీ విప్పుడే చలిది తిని మీ అక్కలనూ బావలనూ పండుగకు పిలుచుక రావాలి' అని అన్నది. రాఘవుల మనస్సు ఆనంద సాగరం ఒడ్డు చూచింది. నాగాయ ఆలోచిస్తూ నిలబడ్డాడు.

౨

నాగాయ మొదటి భార్యకు సూర్యకాంత మనే కూతురూ రెండో భార్య యీ చిట్టెమ్మకు యశోద పయోద అనే యిద్దరు కూతుళ్లూ రాఘవులనే ఒక కొడుకూనూ. సంక్రాంతికి చిన్నభార్యాకూతుళ్ళూ అల్లుళ్లూ వచ్చే ఆచారం. లోగడ చిట్టెమ్మే స్వయంగా వెళ్ళి తీసుకొచ్చేది. ఈయేడు ఈ భారం కొడుకు నెత్తిమీద పడ్డది. ఎంచేతనంటే కొడుకు చేతికంది వచ్చాడూ, మరి మగడు పెద్దవాడయిపోతే ముఖ్యంగా చిన్న భార్యకు పరాయివా డయిపోతాడు. రాఘవులు కుక్కను వెంటబెట్టుకొని అక్కల నందరనూ పిలిచివచ్చాడు. రాఘవులకు సవతక్క అనే జ్ఞానం లేదు. వానికి అక్క లందరూ ఒకటే. ముందు యశోద వచ్చింది. తరువాత పయోద వచ్చింది. సంక్రాంతి రేపనంగా వాళ్ల యిద్దర మగళ్ళూ వచ్చారు. సంక్రాంతినాడు సూర్యకాంతం ఒక్కత్తే వచ్చింది. సూర్యకాంతాన్ని చూచి చిట్టెమ్మ మొదట

తెల్లపోయింది. మాటాడకుండా వెంటనే యింట్లోకి వెళ్లిపోయింది. సరిగా ఆ సమయంలోనే మంద ముందు నాగాయా, మంద వెనుక రాఘవులూ, వచ్చారు.

'తమ్ముడు రాఘవులు నిన్నుగూడా పిలిచాడా తల్లీ?' అని నాగాయ కూతురిని చూచి అన్నాడు.

'ఆఁ.' అని సూర్యకాంతం సవతితల్లి చూపిన నిరాదరణను మింగుకుంటూంది. సూర్యకాంతంతో వచ్చిన నిండుచూలు మేక ఒకటి సూర్యకాంతాన్ని రాచుకుని నిలబడ్డది.

నాగాయ సూర్యకాంతం అనే దుర్భిణీలోంచి తన మొదటి భార్యను చూస్తూ 'ఉష్' అని ఒక నిట్టూర్పు విడిచి—'అల్లుడు రాలేదేం?' అని అడిగాడు. సూర్యకాంతం దానికి సమాధానంగా గుడ్లప్పగించి 'ఊఁ.' అని కూచుంది.

'ఈ మేకనుకూడా ఎందుకు తోలుకొచ్చావ్? ఇది ఇంత చిక్కిపోయిందేం?'

'ఇది నీ విచ్చిన మేకే. దీనికి మా అమ్మపేరు పెట్టుకున్నాను. ఇది నే నెక్కడికి వెడితే అక్కడికి వస్తుంది. అమ్మ కాదూ, అందుకని. దార్లో ఎక్కడ ఈనిపోతుందో నని బిగలాపడ్డా. అసలు నే నిక్కడికి రావడం దీనికోసమే. ఈ కానుపు తిన్నగా జరుగుతుందని నమ్మకం లేదు. అక్కడ బాగా ఎరిగున్న వాళ్లు లేరు.'

నాగాయ మళ్లా ఒకసారి నిట్టూర్చి యింటికేసి చూచి ఊరూరుకున్నాడు. ఇంతలో గోవర్ధనం ఎత్తుకొని వస్తున్న చిన్ని కృష్ణుళ్లా రాఘవులు మేకపిల్లల గుడిసెలో దూరి కొన్ని ఎత్తుకొవచ్చి అక్కడ దింపి బయటికి వచ్చి సూర్యకాంతాన్ని చూచి సంబరపడి—'అమ్మా! అక్క వచ్చిం దక్క' అని అక్కమాట పట్టుకుని యింట్లోకి వెళ్లాడు.

'మహాలావు దొరికింది అక్క! సవతక్క కూడా ఒక అక్కేనా? ఈ తైతక్క నెవరు పిలుచుక రమ్మన్నా రన్నన్న?' అని చిట్టెమ్మ గద్దించింది. యశోదా పయోదా రాఘవుల కుడియెడమలకు వచ్చి తైతక్క తైతక్క అని అంటూ చెరో చెంపా మెల్లగా వేశారు. ఆ గద్దింపూ ఈ చెంపకాయలూ ఎవరికి ముట్టాలో వారికి ముట్టడంలో ఏ మాత్రమూ ఆలస్యం కాలేదు.

3

నాగాయ తెలవారకట్టే లేచి తత్వాలు పాడుకుంటున్నాడు:—

'మాత్రకొంపలోపల నుండుటాకూ
చీచీ హితవు ఎట్టు లయ్యె నీకూ
వాత పైత్య మనుభవించుటాకూ
ధాత వ్రాసె కాబోలు నీకూ...
..........................
రామ భజన చేయరా లమిడీకా
తామస మదచర ధగిడీకా
..........................

సూర్యకాంతం తోలుకొచ్చిన చూడిమేక ఒక ఆర్తనాదం చేసింది. పక్కనున్న కొండకూడా ఉలికిపడి ప్రతిధ్వనిమిషతో ప్రకృతిని తట్టి లేపింది. తండ్రీ కూతుళ్లొకళ్లకంటె ముందు మరియొకరు ఆ మేక దగ్గరికి పరిగెత్తారు. మేకలమందా మందా లేచి దానికేసి చూచింది. మేక యీనలేక గిలగిలా కొట్టుకుంటూంది.

నాగాయ దాన్ని అమాంతంగా బుజాన్ని వేసుకుని అటూ యిటూ తిరిగాడు. ప్రయోజనం కనబడలేదు. మళ్లా కింద పెట్టి వెనుకకాళ్లు పైకెత్తాడు, కూతురు ముందు కాళ్లూ మెడా పైకెత్తి పట్టుకుంది, నాగాయ వెనుక కాళ్లుచ్చుగుని లాగాడు. లాభం

కనిపించలా అటూ యిటూ నాలు గయిదుసార్లు దొర్లించాడు. కాసేపు కింద కూచుని చూచాడు. మేకకు స్పృహ తప్పతూంది. అటుపిమ్మట మెడ్చిలి గుంటనుంచి తోకదాకనూ గూడలు మొదలుకొని గిట్టలవరకూ రోమాలు మలిపాడు. దానివల్లకూడా లాభం లేకపోయింది. మేక వేలగిలపడ్డది.

నాగాయ 'మీ అమ్మలాగానే ఇదికూడా ఇక బతకదు. దేముడు నా కూతుర్ని బతికించినట్లే దీని పిల్లలను మాత్రం బతికిస్తాడు' అని అంటూ గర్భం లోకి చేయి పోనిచ్చి పిల్లలేవున పడేట్టు చేశాడు. కొంతసేపటికి పిల్ల వళ్ళో పడ్డది. తల్లి పరలోకంలో పడ్డది.

వారివెనుక వారికి తెలియకుండా చాలుగా నిలుచున్న చిట్టెమ్మ—తల్లి గండాన పుట్టిన పిల్ల యింటికి చెరుపు అని పుటుక్కున అనేసింది. ఈ మాట వినక పూర్వమే సూర్యకాంతం మూర్ఛపోయింది.

౪

మర్నాటినుంచీ సూర్యకాంతమూ నాగాయా కలిసి ఒక పాడిమేకను పట్టుకుని యీ తల్లిలేని పిల్లను కుడిపేవారు. ఆ పాడిమేకకు దీనికి పాలివ్వడం ఇష్టంలేదు. అలా యిష్టంలేకున్నా వీళ్ళ బలవంతాన పాలివ్వక తప్పేదికాదు. రాఘవులు దాని కన్నులు మూసేవాడు. నాగాయ దాన్ని రెండుకాళ్ళ సందునా బంధించి బొడ్డు నిమురుతూ ఉండేవాడు. మేకపిల్ల గబగబా పొట్టనింపుకొనేది. ఇలా బలవంతాన పాలు కుడుచుకుంటూ ఐదారు రోజులకా మేకపిల్ల కొంచెం ఒళ్లు చేసింది.

'వాత్సల్యం లేకపోయినా కడుపు నింపుకొని నీవు ఒళ్లుచేశావ్; వాత్సల్యం లేకపోయినా కడుపు నింపుకొని నా కూతురు చిక్కుతూంది; మనిషికి మనస్సున్నందుకు ఇదేగావున్న ఫలం. అందుకే గురువులోరు-

'ఊదే తిత్తులపైగా నుండే
ఉన్నని దెలియర ఓరన్నా'
అని చెప్పారని నాగా యన్నాడు.

'కాదయ్యా! నే నిక్కడికొచ్చాక ఊరా' అని సూర్యకాంతం అన్నది.

మేకపిల్ల ఎత్తురాళ్ళమీది కెక్కి దూకడం మొదలుపెట్టింది. బలుసాకూ కరేపాకూ మూచూచి కొంచెం కొంచెంగా నములుతూంది. మంద అడవికి పోవడమే మొదలు మాపటికి మళ్ళా యింటికి వచ్చేటంతవరకూ దాని మేమేలలో చెవులు చిరతలు పడేవి.

'ఇది సూరేకాంతం కంటె ఎక్కువ అరుస్తున్న దేమే' అని యశోద అన్నది.

'సూరేకాంతం గొంతుకా దానితల్లిగొంతుకా దీని కొచ్చింది' అని పయోద అన్నది.

పడమటి దిక్కంతా బంగారము పూసుకొన్నాక రాఘవులూ సూర్యకాంతమూ నాగాయా ఎవరికి తగిన పుల్లల మోపులతో వారు మంద తోలుకొచ్చేవారు. మంద సవ్వడి వినబడంగానే మేకపిల్లల అరపులతో ఆ కొండ ప్రతిధ్వనించేది. రాఘవులు మోపు కింద పడేసి పిల్లల గుడిసె ఎత్తేవాడు. మేకపిల్లలు అరచుకుంటూ రివ్వున మందలోకి పరుగెత్తేవి. తల్లులుకూడా అరుచుకుంటూ కొన్ని ఎదురువచ్చేవి. కొన్ని పిల్లలా తొందరలో వేరుమేకల దగ్గరకు పోయి పొదుగులో తల గ్రుచ్చంగానే మేకలు మూచూచి యెగిరి యీవలికి గంతువేసేవి. ఆ పిల్లలు తెల్లమొగాలతో బెంగ అరుపులతో ఒకక్షణం విడిగా నుంచుని తల్లి అరుపులు విని తల్లుల దగ్గరకు పరుగెత్తేవి.

ఈ తల్లి లేని మేకపిల్ల కూడా మిగిలిన పిల్లలతోపాటు పరుగెత్తేది. తానుకూడా అరిచేది. ప్రతీ మేకపొదుగు

తోసేనూ మూతిపెట్టి తాపులు తీసేది. మేకపిల్లలన్నీ తమతమ తల్లుల పొదుగులతో అతుక్కుపోతే యీ తల్లిలేనిపిల్ల మేకలమందకు వెన్నుచూపి శూన్యంలోకి చూస్తూ నిలబడేది. ఇంతసేపటినుంచీ దాని అవస్థంతా చూచే దొక సూర్యకాంతం. మేకపిల్ల శూన్యంలోకి చూచేసరికే సూర్యకాంతం చూపుకూడా చనిపోయిన తనతల్లి శూన్యంలోని పోయేది. ఇంతవరకూ అందపు వెలుగు విరజిమ్మే ఆమెకన్నులు అంధకారపు అతల మను మట్టబారే సారంగాలలాగు కనిపించేవి.

మేకపిల్ల సూర్యకాంతందగ్గరకు వచ్చింది. సూర్యకాంతం మరక చెల్లెలి నెత్తుకుని దాని చాపల్యానికి మళ్ళాదింపింది. అది మళ్ళా అరుచుకుంటూ తాపులు తినడానికి మందలోకి పరుగెత్తింది.

తండ్రి తనకు చిన్నప్పుడు చెప్పిన—

.........ఏమి నా ప్రారబ్ధకర్మము ?

స్వామి నన్నిటుచేసి మరచెను.

అనే తత్వం పిల్లంగ్రోవిలోంచి వచ్చినట్టు సూర్యకాంతం నోట్లోంచి వచ్చింది.

౫

నాగాయా రాఘవులూ ఎక్కడి మంద నక్కడ విడియించారు. కొన్నిటికి వాతలువేశారు. కొన్నిటిని దొడ్లోకి తోలి తడికె బిగించారు. పాడిమందను పొదుగుపాటి అగెనారతాళ్ళకు కటుతూవున్నారు.

మేకపిల్ల మేమే అని అరుచుకుంటూ సూర్యకాంతంకడకుపోయి మోకాలు కుడిచి రెండు కుడుపులతో తెల్లబోయింది. సూర్యకాంతంకూడా తెల్లబోయి కూచుని మేకచెల్లెలిని ముద్దుపెట్టుకుని 'నాకుగనుక పాలుంటేనా ?' అని వక్షాని కత్తుకుంది. నాగాయ తనపనిలో ఇదంతా గమనిస్తూనే వుండడం కనిపెట్టి సూర్యకాంతం పిల్లను కిందికి దింపేసింది. ఈ లోపుగా ఎన్నో మేకపిల్లలు తల్లులదగ్గరకు పోతూవుండడమూ పాలుతాగి తిరిగివస్తూవుండడమూ అటూ యిటూ తిరిగి గంతులువేస్తూ వుండడమూ జట్టుకట్టి మళ్ళీ తల్లులదగ్గరకు పరుగెత్తుతూ వుండడమూ యీ లీల అంతా జరుగుతూనే వుంది. మేకపిల్లవాట్లను చూచి తాళ్ళకు కట్టేసిన పాడిమేకల దగ్గరకు పరుగెత్తింది. ఒకపిల్ల దానితల్లిదగ్గర పాలుతాగుతుంటే దాని చాటున పొదుగులో మూతిపెట్టింది. అది వాసన చూచి దానితోక కొరికింది. 'బా' మంటూ ఇవతల కొచ్చి మరొకదాని పొదుగులో రివ్వున దూరింది. అది దాన్ని ముట్టెతో తోసింది. 'బారు'మంటూ బయటపడి అది మళ్ళా యింకోదా ని దాపులకు వెర్రియెత్తినట్టు పరుగెత్తి పాలకెగబడ్డది. చూస్తూనే మెడ మలచి మేకపిల్లచెవి కరచి లాగింది. మేకపిల్ల ఆర్తనాదంచేసి ఆ తాళ్ళ కివకడకు వచ్చి నిలబడి శూన్యంలోకి మళ్ళా దృష్టిసారించింది. దానివి గాజు కళ్ళా ? లేక వెనకకళ్ళా ? గుడ్డికళ్ళుమాత్రం కావు. సూర్యకాంతం ఇదంతా చూస్తూ 'తల్లిలేని పిల్లగతి యింతే' అని అనుకుంటూ దాన్ని నిమురుతూ కూచుంది. సూర్యకాంతానికి తెలియకుండానే కన్నీరు స్రవిస్తూంది. మేకపిల్ల నాకుతూంది. 'నీకు పాలులేకపోయినా కన్నీళ్ళయినా తాగు' అని సూర్యకాంతం అన్నది.

'అమ్మా ! ఆ మేకపిల్ల నిట్లా తీసుకరా' అని నాగాయ హఠాత్తుగా అన్నాడు. సూర్యకాంతం గబగబా లేచి కళ్ళొత్తుకుని చూచేవరకూ నాగాయ పాడిమేకను పట్టుకొనివున్నాడు. రాఘవులు దాని కళ్ళు మూశాడు. సూర్యకాంతం యేకపిల్లను తీసుకుపోయి దానిముంగు వదిలింది. మేకపిల్లపొదుగంతా సెలవులుచేసి మరవలె పాలు పీల్చేస్తూంది. మేకపిల్ల కడుపేకాక సూర్యకాంతం కడుపుకూడా నిండిపోయింది

# తల్లి లేని పిల్ల

చాటుగా నిలిచిన చిట్టెమ్మ—'ఈ పాడు పిల్ల మూలన నా పుట్టింటివారిచ్చిన పాడిమేక పాడయింది.' అని అరిచింది.

'యింకో మేకను మరగెయ్యాలని అనుకుంటూనే వున్నా' అని నాగాయ అన్నాడు.

'ఏ మేకయినా యీ గుండుపిల్ల మూలంగా పాడు పాడయిపోతుంది. ఇది తల్లిగండాన పుట్టింది. దీన్ని మరగిన మేకల్లా చచ్చేదే. దీన్ని పేరటాలు కిద్దామనుకున్నా.' అని అన్నది.

సూర్యకాంతం గడగడ వడకిపోయింది.

'మరో ఉపాయం ఆలోచిస్తా' అని నాగాయ అన్నాడు.

'అది యీ యింట్లో వుంటే ముడుపు తప్పదు' అని చిట్టెమ్మ అన్నది.

'మంచిది.'

ప్రతివాదం లేకపోవడంవల్ల చిట్టెమ్మ మనస్సు తనలో తానే పోటాడుకుని ఆ పెడా యీ పెడా దగ్గమయింది. 'ఇహ పాలు తాగితే బా వుండదు' అని చిట్టెమ్మ చివరి రాయి విసరింది.

'వెంకాయమందలోకి తోలేస్తా లే' అని నాగాయ అన్నాడు.

'వద్దయ్యా, నేను దాన్ని వదిలి ఉండలేను. దీన్ని ఎత్తుకుని యిప్పుడే నేను మావూరికి వెళ్లిపోతానయ్యా' అని సూర్యకాంతం అన్నది.

'మంచిది. పద. నేను నిన్ను దిగబెట్టి తెల్లవారే తలికే తిరిగి మందలోకొస్తా' అని నాగాయ మేకపిల్లను మెడమీద వేసుకున్నాడు. రాఘవులు ఇంట్లోకి పరుగెత్తి అక్కగారిమూట పట్టుకొచ్చి ఆ అంధకారంలో ముందు నడిచాడు.

'తమ్ముడూ, మందదగ్గర నీవు లేక అయ్యా లేక-' అని సూర్యకాంతం ఏమో అనబోతూంటే రాఘవు లడ్డొచ్చి—'నన్ను అక్క లేనివాణ్ణి చేస్తావా?' అని అన్నాడు. సూర్యకాంతం తమ్ముణ్ణి ముద్దెట్టుకుని 'ఎప్పుడో నాకు ఋణమున్నావ్ నడూ నాయనా!' అని అన్నది. వాళ్లు వెడుతుంటే మేకల మందంతా 'మే అమే' అని అరిచింది.



# గ్రంథవిమర్శనము

"ఏమి మగవాళ్ళు!"—౭ నాటికలసంపుటి. రచయిత: న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నార్. ప్రచురణ: అభ్యుదయ రచయితలసంఘం. బెజవాడ.

౧. ఏమి మగవాళ్లు!
౨. నిష్ఫలం.
౩. వృథాయాసం.
౪. సంకల్పం-పర్యవసానం.
౫. మాతృప్రేమ.
౬. విముక్తి.

౭. దయ్యాలలంక-ఈ ఏడూ ఏడుసంపుటీల జీవితాలు. ఒక్కొక్కసంపుటిలో ఒకే సంసారానికి చెందిన ఎందరో వ్యక్తులు; ఒక్కొక్కతరహా మానసికతత్వాలు; అనుకూల ప్రతికూల వాతావరణాలు; జీవికగమనికలోని ఎన్నో వడిదుడుకులు; అన్నీ జీవితంలో సర్వసామాన్యమైనవే; అన్నీ జీవితాన్ని కళ్ళకు కట్టేవే. ఈ నాటికలన్నీ జీవితాన్నుంచి వచ్చినవికనకనే, వీటిలో జీవితం ఉంది.

## వీటివెల

ఈ ఏడూ ఒకేతరంలోని మధ్యమతరగతి సామాజికవర్గజీవితాన్ని ఏడు దృక్కోణాలనుంచి రచయిత పరిశీలనాఫలితాలు; ఈ ఏడు దృక్కోణాలలోను, వివిధవ్యక్తిజీవితాలలోతులు తఱచి, మానసికతత్వాలలో ఆంతర్యాలవెల్లడిగా చిత్రిస్తూ, జీవితంనుంచి అమూల్యమైన సందేశాన్నిస్తున్నారు రచయిత. మన మనసహ్యించుకొనే, భరింపవినిగేజీవితంలోని 'ఫిలాసఫీ'ని తనవాస్తవికచిత్రణద్వారా కళ్ళకుకట్టి, జీవితంపై ఒక ఆశని, మనుగడలో ఒక మార్పును, సంస్కారాన్ని తెస్తున్నారే రచయిత.

అయినా వీటివెల ముప్పావులాలాయే.

## అభ్యుదయ రచయిత

జీవితాన్ని పరిశీలించి, విమర్శించి, రచయితలో, రచనలో గల సహజప్రవర్ధమానసంస్కరణాభిలాషతో, ఆంతరంగిక కావ్యన్యాయం [Implicated Poetic Judgement] చెప్పగలిగిన ఉదాత్తఅర్హత, రససాహితీనిర్మాణంతో మేళవించనిదే ఎంత అపూర్వ శిల్పిఅయినా 'అభ్యుదయ రచయిత' కాలేడు; వ్యక్తి మానసికతత్వాన్ని,ఆంతర్యాన్ని వికల్పం [Analysis] చేయగలశక్తి వస్తునిర్మాణంలో బుజావుకానిదే శిల్పం పరిపక్వత పొందలేదు. పరిపూర్ణశిల్పం, రసదృష్టితో వస్తుప్రాధాన్యతవల్ల చమత్కారవత్వాన్ని సాధించినట్టయితే, ఆ వస్తువే పూర్వాచీన సంతృప్తిపై "సౌందర్యకాంక్ష" [Aesthetic Satisfaction]ను సంతృప్తిపఱచినట్లయితేనే అది 'రచన' అనే నిర్వచనాన్ని పొందగలుగుతుంది; అప్పుడే సహజంగా 'స్వవిశిష్ట' వస్తువు [Content] చమత్కారవత్వ విశిష్టమై సంపూర్ణభావంలో 'అభ్యుదయరచన' కాగలుగుతుంది.

న్యాయమూర్తి రాజమన్నారు అభ్యుదయరచయిత.

## పరిశీలన

రచనలో ఒక్కొక్కసన్నివేశంలో జీవితరంగంలోని పాత్రలయొక్క, పాత్రలలోని జీవితపు ఆంతరంగికప్రవృత్తి పరివర్తనాలు, పోకడలు ఎట్లా ఉన్నవో వికల్పించి పరిశీలించి, ఆతరహాసామాజిక సామాన్య మానసికతత్వ పరిశీలనాన్ని సంస్కరణదృష్టితో చిత్రిచటం "వికల్పిత మానసికతత్వ పరిశీలనాసంస్కరణదృష్టి" అనబడుతుంది ఈ పరిశీలన రాజమన్నార్ ప్రత్యేకత.

'బూర్జువా మానసికతత్వం' 'నాగరికత' అనే ముసుగుతో ప్రపంచానికి ఆదర్శప్రాయంగా చాటబడుతూన్నరోజుల్లో ఆ ముసుగును తొలగించి, అని

పుర్ని చేరిగి, దాని అంతర్యాన్ని బహిర్గతపఱచే దృష్టితో లోకానికి కళ్లు తెరిచారు శ్రీ రాజమన్నారు.

## వస్తువు

సాధారణ సంఘటనలలోని నాగరికుల సాధారణ మానసికతత్త్వమే వారివస్తువు [Content].

జీవితంపై భిన్నదృక్కోణాలలోని ఒక విమర్శను సాధనంగా జీవితంలోని ఒక తత్త్వాన్ని [Philosophy] వ్యక్తంచేసే నైతికశక్తుల [Moral Powers] విలువలబట్టి ఒక నాటికకుగాని నాటకానికిగాని న్యాయం చెప్పాలి.

ఈ లక్ష్యంతో ఈ ఏడునాటికలలోని వస్తువు జీవితాన్ని ఏ భావంతో వ్యాఖ్యానిస్తున్నదో, ఆ వ్యాఖ్యానానికి ఏ పాత్రలు తలలొగ్గి తమ బాధ్యతను ఏలా నిర్వహించుకొన్నారో మనం నిర్ణయించుకొన్నట్లయితే, దాని ఫలితాలపై శ్రీ రాజమన్నారు వ్యక్తిత్వం ఆధారపడుతుంది.

## వ్యక్తిత్వం

జీవితంపై రచయితయొక్క వ్యక్తిగతఅభిప్రాయాలు నవలలో అయితే స్వచ్ఛంగా కనిపిస్తాయి. నవలా రచన ఎప్పుడూ స్వాత్మక [Subjective] మైనదే.

అయితే పరాత్మక [objective] తటస్థదృష్టి [Nuetral Outlook]తో జీవితాన్ని వాస్తవికంగా చిత్రించటం నాటికారచయితకు నిర్వచనం. కనక తెలిసో తెలియకో నాటికారచయిత ఉద్దేశించిన అంతర్యాన్ని ఇదమిద్ధమని నిర్ణయించలేం.

## తరహా

అనిర్ణీత వ్యక్తిత్వం శ్రీరాజమన్నారుది. ఆయన రచనలన్నీ ఒక నిగూఢ తరహాకు చెందుతవి. వాటిలోని నిబిడీకృతార్థాన్ని పదార్థాలనుంచి కాకుండా భావగాంభీర్యంనుంచి గ్రహించి వ్యాఖ్యానించుకోవలసినబాధ్యత, రచయత మనకే వదిలారు. అందలి అవ్యక్తఅంతర్యమంతా [Implication] మనం, మనస్సులో కలిగిన రససంకల్పానికి [Synthesis] మనః చైతన్యమిచ్చి చిత్రణద్వారా అవగాహనచేసుకోవలసివుంది.

## పాత్రౌచిత్యం

దీనికి వీరి పాత్రాపోషణంలోని ఔచితి కొంత వస్తువు నిస్తుంది.

ఒకరచయిత యెన్నుకొనినపాత్రలు ఆ రచనలోని నిగూఢతత్త్వాన్ని [Implied Philosphy] సంపూర్ణంగా నిర్వహిస్తేనేగాని ఆ నాటిక పరిపక్వతపొందదు. దీనినే మనం 'మానసికతత్త్వధాతువు' [Psychological Element] అంటాం. దీనిపైనే ఒకనాటిక యొక్క ఉపజ్ఞ [vitality] ఆధారపడియుంది.

ఆదర్శజీవితాన్ని కాంక్షించే పాత్రలను వాస్తవిక జీవితంలోకి అనువదించాలనే వీరిప్రయత్నం పాత్ర పోషణంలో కొంతవఱకు దెబ్బతినిపించింది. వాస్తవిక జీవితాన్ని పరిశీలిస్తే సరిపడేదానికి ఆదర్శజీవిత చిత్రణంకోసం తహతహచూపి ఏదీ నిర్ణయించలేక పోయారు రచయిత.

వీరి సంవాదరచన సంపూర్ణపరిపక్వతను పొందింది; కాని గూఢత [Concealment] అద్భుతము [Surprise] అనే నాటికాశిల్పముఖ్యాంగాల్లో మొదటిభాగం లోపించింది. దానివల్ల రెండవనికిదా బలం తరిగింది.

ఒక ఉదాహరణ:

పాత్రబలంమీద ముఖ్యంగా ఆధారపడిన వీరి నాటికలు "ఏమి మగవాళ్ళు!" "నిష్ఫలం."

"ఏమి మగవాళ్లు!" లో నాయిక కనకాంగిని పరిచయంచేస్తూ రచయిత చెప్తారు: 'పుట్టింది వేశ్య కులంలో, అవలంబించిన మొదటివృత్తి కులవృత్తియే, గత్యంతరంలేక. సంగీతజ్ఞానం, సౌందర్యం, వాక్చక్యం ఉండడంచేత కీర్తిగడించింది. ఆకీర్తి ఫిలిం కంపెనీ వాళ్ళని ఆకర్షించింది. నటి అయింది. దానితో మొదటివృత్తి వదలివేసింది...ధనం, కీర్తి కావలిసినంత లభించినా గౌరవం, సంప్రదాయం అంటే అభిమానం. వివాహమంటే గొప్ప మర్యాద.'

[పుట ౬.]

అన్నారు. ఇలా పరిచయం చేయటంలో తప్పని సరి వేశ్యావృత్తిపై ఆమెకుగల నిరసన, వివాహమంటే ఆమెకనేకలలు సూచించారు, అలా సూచించటంలో 'సంప్రదాయమంటే అభిమానం అన్నారు.' వేశ్యకు అనుశ్రుత సాంప్రదాయమే వేశ్యావృత్తి. ఇటు సాంప్రదాయంపై "అభిమానం", అటు "వివాహమంటే గొప్పమర్యాద"-ఈ రెండు వ్యతిరేకభావాలు కనకాంగిలో ఎట్లా ఇమిడాయో తెలియదు.

మొదటిదానిని పొరపాటని రద్దుచేస్తూ ముందుకు సాగినట్లయితే "కనకాంగికి అహంభావం, బడాయి లేదు" అంటాడు వేణు [పుట ౭.] అతనే సోమసుందరం, కృష్ణమూర్తుల అసభ్యప్రవర్తన కారణంగా స్త్రీత్వాన్ని అర్థంచేసుకోలేని దీనస్థితికి దిగి కనకాంగితో "నిన్ను పదినిమిషాలు వదలివెళ్ళడానికి జంకుగా వుంది...అవును. నీలాంటిదాన్ని పెళ్ళిచేసుకోవడమే పొరబాటు" అంటాడు [పుట ౧౬.] అది Climax. 'ఛి,ఛీ, ఏమి మగవాళ్లు' అనుపిస్తుంది మనస్సు చివుక్కుమని. కనకవల్లి ఉద్రిక్తయై "కళ్ళనీళ్లు తుడుచుకొని, నిరసనభావంతో పెదవి విరిచి, మంగళసూత్రం చేతితో తెంపి పారవేసి, 'ఛి, ఛీ, ఏమి మగవాళ్ళు' అనుకుంటూ వీథిగుమ్మంవైపు వెళుతుంది." ఇది నాటకాంతం. వళ్ళు ఝల్లుమనవలసిన సంగతి.

కాని, కనకాంగి దృష్టిలో ఆ 'మంగళసూత్రం' పైగల గౌరవాన్ని నాటికలో ముందెక్కడా రచయిత చిత్రించి ఉండకపోవటంమూలాన్ని, రావలసిన Effect రాదు. కనకనే ఈ నాటికకు జీవితమైన అద్భుతం మనస్సుకు హత్తుకోలేదని అనాలి.

మిగతా ఐదునాటికలూ వాస్తవిక జీవితాన్ని చీల్చుకవచ్చినవే. శిల్పంలో, రచనలో, సంభాషణలో, వస్తువులో—అన్నివిధాలా సంపూర్ణమైనవే. జీవితాన్ని అర్థంచేసుకో వాంఛించిన ప్రతివారూ వీరి రచనలు చదవాల్సినదే.

"రాంషా"



# గ్రంథస్వీకృతి

౧. వనమాల

శ్రీ రాయప్రోలు రావు,
సాహితీసమితి పక్షమున
ది ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ
గ్రంథప్రకాశకులు: మదరాసు, తెనాలి,

వెల ౧-౮-౦

౨. శ్రీ అరవింద వ్యాసావళి

అనువాదకులు: శ్రీ వేలూరి చంద్రశేఖరం
చతుర్వేదుల వేంకటకృష్ణయ్యగారు.
శ్రీ అరవిందాశ్రమము: పుదుచ్చేరి.

వెల ౨-౦-౦

# శిల్పి ప్రచురణము

# Cottage Industries of India

సంకలనకర్తలు

వి. ఆర్. చిత్రా : టి. యన్. శ్రీనివాసన్

'శిల్పి' సంపాదకులు



ఇది అన్ని రాష్ట్రాలలోను, ప్రధాన స్వదేశసంస్థానాలలోను ఉన్న కుటీరపరిశ్రమలను గురించి, సమగ్రంగా, తయారు చేసిన ఆంగ్లగ్రంథము. సుప్రసిద్ధులయిన అర్థశాస్త్ర వేత్తలు, పారిశ్రామికులు వ్రాసిన వ్యాసాలతోను, ప్రత్యేక చిత్రాలతోను ఎంతో ఆకర్షకంగా తయారవుతోంది.

ఇది డెమ్మీ ఆక్టేవో సైజులో 300 పేజీల గ్రంథము. 30 పేజీల ఆర్టు సప్లిమెంటుతో సహా 1947 ఆగష్టులో తయారవుతుంది.



వివరాలకు—మేనేజరు.

శిల్పి పబ్లికేషన్సు

**10.** నరసింగపురం వీధి

మౌంట్ రోడ్డు, మదరాసు.

ఇది 37, ఆచారప్పన్ వీథిలోని బి. యన్. కె. ప్రెస్సులో, బి. నాగిరెడ్డిగారిచే ముద్రింపబడి, 10, నరసింగపురం వీథిలోని ఆంధ్రశిల్పి కార్యాలయంలో శ్రీమతి డి. ఆర్. చిత్రాగారిచే ప్రకటింపబడినది. సంపాదకులు: శ్రీ గణపతిశాస్త్రి : శ్రీ చిత్రా.



# 'నా జీవిత యాత్ర'

ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు

బాల్యం మొదలు పంచాశద్వర్షాలవరకూ నడిచిన మహోజ్జ్వల జీవిత గాథ.

ప్రథమ ఖండము

వెల రూ. ౩/—

## 'ఆంధ్ర శిల్పి'

ఆంధ్ర సాహిత్యానికీ, లలిత కళలకీ,

సంస్కృతికీ దోహదమిచ్చే

సచిత్ర మాసపత్రిక

సంపాదకులు :

**శ్రీ చిత్రా**

**శ్రీ గణపతి శాస్త్రి**

సాలు చందా ౯ రూపాయలు

విడి కాపీ ౧౨ అణాలు.



రాబోవు

## 'శిల్పి' ప్రచురణలు

ఆంధ్రకేసరి

శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు

రచించిన

౧. 'నా జీవిత యాత్ర'

ద్వితీయ ఖండము

౨. యోగసూత్ర సిద్ధాంతము

౩. ఈశావాస్యోపనిషత్తు

౪. ప్రశ్నోపనిషత్తు

౫. కఠోపనిషత్తు

౬. భగవద్గీతా భాష్యము

వివరాలకు :— మేనేజరు :

'ఆంధ్ర శిల్పి'

౧౦, నరసింగపురం వీధి,

మౌంటురోడ్, మద్రాసు.

# వి ష యా ను క్ర మ ణి క



## శి ల్పా లు



అప్సరస

శ్రీ కృష్ణలాల్ భట్.

# ఆంధ్రశిల్పి

## సంపాదక సమీక్షలు

### ఆంధ్రుల పరిస్థితులు

భారత దేశానికి స్వాతంత్ర్యం రాబోతూంది. జనసామాన్యానికి కట్టగుడ్డా, తిన తిండీ లేకపోయినా, ఈ స్వాతంత్ర్య భానూదయం భారత దేశానికి ఏదో కళ్ల నీళ్లు తుడిచినట్టుగా ఉంది.

కాని మన ఆంధ్రుల పరిస్థితి! ఢిల్లీమంత్రివర్గ నిర్మాణంలో ఆంధ్రుల పేరైనా స్మరించకుండా ఉన్నారని తెలుస్తూంది. ఇటు రాష్ట్రాల గవర్నర్లలో అసలు మన మాటేలేదు. మద్రాసులో ప్రకాశం మంత్రి వర్గం పతన మయింది మొదలుకొని ఆంధ్రుల అగచాట్లకు అంతూదరీ లేకుండా పోతూంది.

ఏపక్కనించి వచ్చినా ప్రతీ ఉద్యమానికీ తలలు వొంచాము; సమస్తమూ ధారపోశాము. తీరావచ్చాక ఫలితకాలంలో కాంగ్రెసు సర్వాధి కారుల దృష్టిలో, ఆంధ్రం అనేదే నశించినట్టు తోస్తూంది !

అసలు భాషా ప్రయుక్త రాష్ట్రవాదం ప్రారంభించింది మనం! ఈ వాదంవల్ల అనేకమంది ఫలితాలు అనుభవించారు. మనకి అసలు రాష్ట్రం వస్తూన్నదా ? అనేదే సందేహం అయిపోతూంది ! దీని కంతా కారణం ?

మనకి మొదటినించీ మనలో మనం కలహించుకోవడం, ఒకరికి దాస్యం చెయ్యడం బాగా అలవాటై పోయింది. లేకపోతే అన్నివిధాలా

# ఆంధ్ర శిల్పి

సర్వ సమర్థులయిన మన ఆంధ్రుల నాయకుల లీవేళ నస్మరంతులయి పోవడానికి కారణం ఏమి ఉంది !

భారత దేశాని కేదో స్వరాజ్యం వచ్చింది. ఇక నించైనా మనలో మన విభేదాలు మరిచిపోయి ఒక తాడుమీద నడవకపోతే మనకి నామ రూపాలు పోవడం నిశ్చయం. ఈ క్షణం నించైనా మనకి ఆంధ్రరాష్ట్రం ఒక శే గమ్యమని దానికోసం సమస్త శక్తులూ ధారపోదాము. మనలో మన విభేదాలు మరిచిపోయి ఒక తాటికింద నడుద్దాము. మన నాయకుల్లోని భేదాలన్నీ సమసిపోయేటట్లు చేసి వారిలో వారికి ఐకమత్యం కల్పిద్దాము.

మనజాతిలో అటు హైదరాబాదులో ఇరుక్కున్నవాళ్లంతా. రాజకీయంగా అష్టకష్టాలు పడుతున్నారు. ఇటు రాయల సీమలో అన్నవస్త్రాలకి అటమటిస్తున్నారు మనవారీ సమస్యలన్నీ మనవిగా భావించుకొని అన్నివిధాలా సహాయం చెయ్యాలి. ప్రతి ఆంధ్రుడి హృదయంలో భాష విషయలోను, సంస్కృతి విషయలోను, తన రాష్ట్ర విషయంలోను, దృఢాభిమానం కలిగేటట్లు చెయ్యాలి !

మున్ముందు కొత్తఎన్నికలువచ్చేలోగానే మనరాష్ట్రం నిర్మాణం జరిగేటట్లు చూడాలి. ఇవి జరిగిననాడే మనకి ఏ విధంగానైనా విముక్తి! లేకపోతే ఇటు అరవలకో అటు ఔత్తరాహులకో మనం పాలికాపులుగా ఉండవలసిందే.

శ్రీ గణపతిశాస్త్రి.

# కన్నుల చందమామ

[రుద్రమదేవి పురుషవేషముతో నంతఃపురమున కేగినప్పటి దృశ్యము]

వెన్నెలఁ బుక్కిలించు పురవీథిఁ బదాఱుగుఱాల బగ్గిపైఁ
గన్నుల చందమామ చనఁగా జయవెట్టి మహాజనమ్ము వె
న్కొన్నది : తృప్తిదీఱ దనుకొన్న దదేపని చన్నదిక్కు క
న్గొన్నది ; జన్మధన్య మనుకొన్నది ! యద్దెసఁ గూర్మి యెట్టిదో ?
ఆమహనీయమూర్తికి జోహారని రాజగృహమ్ములోపలన్
శ్రీమతు లెందఱో సిరులు చిందెడు కన్నులఁ గౌఁగిలించి ; రా
కోమల హస్త మెత్తి కనుగొల్కుల నవ్విన దృశ్య మే కవి
గ్రామణికంటఁ బడ్డ, నది కమ్మని కావ్యము గాక తీఱునా ?
నవ్వినదిందు కోసమగునా ? తన తాల్చిన రాజవేషమం
దెవ్విధమైన లోటు గనిపింపదె ? యాఁడుతనమ్ము దానికిన్
మవ్వము, జవ్వనమ్ము రసమాధురు లొల్కిన వెంతమాఱినన్
బువ్వసుధారస మ్మొలుకఁ బోయునుగాని విసమ్ము చిమ్మునే ?
లోలవిలోచనల్ ధళుధళక్కని నింగికి దాఁటు నూత్న శం
పాలత లట్లు ముందుఁ బఱవన్ వెనువెంట గమించె నామె, శో
భాలప దృక్కులన్ నిజవిహార గృహోపరి చంద్రశాలికా
నీలసరోజ కుట్టిమ మణీమయ మంటప మధ్యభూమికిన్.
కగ్గని మొగ్గలైన చెలికత్తెలు పట్టిన తాళవృంతముల్
దగ్గర నీదు తన్మృదుపదద్వయి మించుక ముట్టనీయదా
మ్రుగ్గిన పండు లైదువుల ముచ్చటకుం జెవియొగ్గి సొంతకే
లొగ్గని కార్యమన్యహిత మూఁకొన కున్న నిమేషమున్నదా ?
తనపిన తల్లు లిర్వురు సుధామధురోక్తుల కుర్బ 'తన్ముఖ
ప్రణిహితదృష్టులై మృదులపాణి సముజ్జ్వల రత్నకంకణ
క్వణన మెసంగ నామె చిబుకంబు కరాంగుళు లల్లనల్లనన్
బుణుకుచు రాజసమ్మొలుకఁ బోయు మొగమ్మొగ నెత్తిరాదటన్.

'రుద్రమదేవి' నుండి

శ్రీ ఏటుకూరి వేంకటనరసయ్య.

# పసుపు : కుంకుమ

మెరుపులు కురిసే
తొలకరిరాత్రిరి
మంటల దాక గేయం నా
కంఠానికి విసిరిందా
కొంటె పిల్ల.
శిరంలేని నా కంఠం
ధరియించిందా గేయం
గేయమె తే నాకాయం
మంటలె నా మస్తిష్కం
ఎక్కడిదో మూర్ధన్యం
ఆకాశం పాతాళం
ఆవరించు
ఆకళించు
నాకళ్ళకు
పిల్లకళ్ళు
కళ్ళజోడు
ఈనాటికి
ఈనాటికి
మానవలోకం నిండా
మంటల సస్యంకోసం
నాకలమే
హాలమై తే
మంటల మురిసే పిల్లా
మంటల మెరిసే పిల్లా
జంటగ నా
వెంటనె రా!

శ్రీ పురిపండా అప్పలస్వామి.

# జలియన్‌వాలాబాగ్

నాడందరి మనసుల అందలాలలో
స్మృతులాసీనాలై స్వారీ చేశాయ్—
నేడే కొందరి మనసుల మారుమూలలో
బ్రదికిచెడిన మారాజుల్లాగా
ఒదిగి చితికి దోబూచాడును.
భారతి గర్భంలోనపు
డభిమన్యు వీరకుమారుణ్ణి,
బ్రతుకో చావో తేలని నెత్తుటిముద్దను ;
డయ్యరుదార సైంధవుడై
అన్నలపై కెగబడితే
కన్నతల్లి నిండుగుండె
గుభిల్ గుభిల్ గుభిల్లంది !
పాలగుండె నాదికూడ
క్షణంసేపు వ్రణ మయింది !
తల్లిగర్భ క్షీరధారలన్ని
యింకియెండి నాయి
ఎంతవిశాలా లయినా దారిగనక కంటినీళ్లు
పోటునాటితరహాగా,
మాతృగర్భమహాం బోధి
మధ్యమధ్య గుండాలకు
సుమపేశల నా ళాలకు
ఉబికి ఉబికి యెగబడితే
నాబంటిని కంటిని:నీళ్లే !
వేడివేడి నీటి యేట నాడు
జలకమాడి నాను,
వేడికి వాడిన నా కడుపాకటితో
మాడి నాను ;
నాటి స్మృతులు మఱపుదాటి మార్మ్రో
గును మనసంతా

వాడనికలగా నేటికి
నాయెదలో రొద సేయును,
నా ఊహకు నా శక్తికి
చేజిక్కక పైకెగురును,
మహాగాథ కాదా అది,
శిశువునెట్లు చెప్ప గలను ?
అగ్రజులందరు మరువగ
కలుగునాకు ఆగ్రహంబు !
ఆగ్రహోదగ్రుడు
పీడితతాడిత శిశువీరుడు చెప్పవినుడు:
" చేయిపోదు
కాలు లేవదా గోడకు,
నలువైపుల నాల్కలూపు నల్లగోడ—
ప్రజహృదయం పెనుతుఫాను—
ఊగుబడ భవిష్యత్తు—
మరఫిరంగి ప్రభంజనం—
భువి యీనినలా పౌరులు—
గోడమీద ఆవులించి
గాండ్రించే చావు గుహాలు—
'ఎటుపోవలె ? నేది దారి?
యను కేకలు వేనవేలు,
వేనవేల కేకలన్ని ఫిరంగి గర్జను
గుసగు సలే!
డొక్కల నెగదన్నివచ్చు
పిక్కల గుర్రపు డెక్కలు.—
కక్కుతుంద ధూమ్రధూళి
పట్టలేక యిరుకుచోటు !
యముడిలాగ మొగసిపడే
ఎర్రబుట్ట గుర్రంపై—

పాశంలో పెనుకమ్చీ
ఉరిమి ఉరిమి చూస్తోన్నది !
బట్ట చిరిగి పమిట తప్పి
బట్టబయలు జనుల ఒడలు—
వీపున గుర్రపు తాపులు !
మూపున లక్షల గుర్తులు !
'ధాం ధాం ధమా ధాం !
ధాం ధాం ధమా ధాం !'
ఆగోన్నది పెనురక్కసి,
ఖదం త్రొక్కె సముదాశ్వం,
ఫెళాఫెళాత్రోలు కమ్చి :
ప్రజలు వధ్యల కింధనాలు !
కన్ను చన్ను రుధిరమయం,
ఒళ్లు పళ్లు చూర్ణమయం,
కీళ్లు కాళ్లు బురద రొంపి !
మాతృ మృతకళేబరాన్ని
తడిమినాడు ముద్దుకొడుకు ;
క్షీణించని క్షీరధార కాణాచికి కరువయింది :
చన్ను మొనను నెత్తుటేరు
తన్నుకుంటు ప్రవహిస్తే,
పసినాలుక సొంగ కార్చి
మసిపూసెను తల్లి ఒంట.
చేతితోడ ధ్వజం వ్రాలి మన్నును
మూచూచింది,
ధ్వజమంతా రుధిరాంబుధి...
చేయి మారి మింటికెగయ మిన్నంతా
ప్రళయ సంధ్య మృత్యుగహ్వరంలాగా !
ఎముకలపొడి తెల్లముసుగు
వేసుకుంది విధవ ధరణి.
నాటిస్మృతులు మృతినికూడ ఓర్కొంటవి.
నాటివధలు నేటికి కథ—
నేటి కథలు ముందుకు ప్రథ—

నా జెగిరిన వీరధ్వజం నేను అరువదేళ్ల వృద్ధ!
ఒరగబోతు సొరగబోతు
కొసకునుకులు పడుతోన్నది !
నాడు తెల్లదయ్యంతో
కయ్యానికి చరిచె భుజం—
నేడు తెల్లభూతంతో నెయ్యానికి భళీభళీ !
వియ్యానికి భళీభళీ !
నాటి నిజం రుజనొందెను !
ఈనాడో మనం మనం
ఈతకల్లు మతం తాగి
తథం తక్కతందనాలు—
పెరవానికి చిరవైరికి భోజనాలు,
వాయనాలు, రాజనాలు;
దరిద్రులం మృతాంగులం
మాతృద్రోహులం సయితం!
మూలుగు వాగుల జలాల తడితో
ఎముకలపొడి సత్తువతో
తొలివీరులు వరివెన్నై పునర్జన్మిస్తే...
తలలు వంచి రోదింతురు!
తరకగింజలే రాల్తురు !
నాటి ధ్వజం బరువు కొరిగి సొరిగిననుసరే...
నాటి సంస్థ భీరువై వెనుదిరిగిననుసరే...
మేము మేము పసికందులమైకూడా
భీరువులము కాము కాము !!
శతపత్రపు పద్మవ్యూహామయితే నేం ?
పుటుకతోటి ఒక్కొక్క డొక అభిమన్యుడు !
రేకు రేకు నూడబెరికి పగలి
తరిమి ఎగబడుతాం !
మాతృశ్రేణి విడిపిస్తాం !
స్వాతంత్ర్యం సమవాదం సాధిస్తాం !!

శ్రీ రమణా రెడ్డి.

# నగ్న సత్యాలు

శ్రీ 'సదాశివ'

అయితే! గోపాలం కాఫీహోటల్లో అంతకాలం పనిలోవున్నవాడివి మాయింట్లో వట్టి కాఫీతో యెల్లా సంతుష్టి పొందుతున్నావోయి! అన్నా యేదో సందర్భవశాత్తూను.

'బాబూ! కాఫీహోటల్లో వున్నంత మాత్రాన్న అన్నీ తింటామనుకున్నారా? అవన్నీ అమ్మకం కోసమే గాని మేం తిండానికి కాదండి. నిజంగా ఆకలివేసినా అవి తినలేమండి. కాస్త చద్దన్నం అయినా యింత చల్లోసుకు తినాలని వుంటుందిగానండి ఆ ఫలహారాల జోలికి పోవాలని వుండదండి' అన్నాడు. ఏం యెందుచేతను అన్నా. అవి తయారయ్యే పద్ధతులూ, వాటి మంచిచెడ్డలూ తెలియడం మాటకేంగానండి, మొహం మొత్తికూడానండి అన్నాడు. అకలివేస్తుంటే మొహం మొత్తడంయేమిటన్నా. నిజమేనండి, హోటల్లో జేరిన కొత్తలో సాధారణంగా యేహోటలు యజమానీకూడా తన హోటల్లో జేరినవాడు యెంత తిన్నా చూచీ చూడనట్టు వూరుకుంటాడండి. మహా అంటే పదిరోజుల పాటండి. తర్వాత మరింక బంగారం పెట్టండి! యేహోటలు పనివాడయినాసరే దాన్ని ముట్టి అనుభవించి హాయిహాయి అనుకోలేడండన్నాడు. ఎంచేతనన్నాను. తయారయ్యే నాలుగు వంటకాల సంగతీ పూర్తిగా తెలియడాన్నేనండి మూడువంతులు. కాగా నిజంగా తయారుచేసే జాగాలో వక్క పూట కూర్చుంటే యెవరయినాసరే వాటిని వేటినీ ముట్టగండన్నాడు. అదేం అన్నాను. శుచి శుభ్రాల మాటకేంలెండి! అవియెప్పుడూ శూన్యమే ననుకోండి.

కాగా తయారీలోవున్న మహాత్మ్యమే సందన్నాడు. కాస్త వివరంగా చెప్పమూ అన్నాను. ఏవస్తువయినాసరే సక్రమంగా తయారు కాకపోవడమే నండి కారణం అన్నాడు. అంటే? అన్నాను. మీ కిష్టమయిన వస్తువు లేవో ఒకటిరెండు చెప్పండి అవి తయారయ్యే పద్ధతి చెప్తా. అప్పుడు మీకే తెలుస్తుందండి సంగతి సందర్భం అంతా నన్నాడు.

పకోడీలు అన్నా. ఎందుచేతనండీ అవి మీ కిష్టం అన్నాడు. వుల్లిపాయ వుండడాన్ని నిలవవుంచడానికి వీలులేక యెప్పటికప్పుడు తాజాగా తయారుజేసి అమ్ముతారుగనుక దాంట్లో నిలవసరుకన్నది కలియడానికి అవకాశం ఉండదు గనుకనన్నాను. రామరామా! యెంత వెర్రివారండీ అన్నాడు. అదేం అన్నాను. చెప్తా వినండి. సర్వసాధారణంగా వనస్పతో వేరుశనగ నూనో వాడడం చాల్దాండి వంటడానికి అన్నాడు. వేరుశనగనూని సురగగట్టిదా అన్నాను. దాని కేముటండది వక్క నిమ్మకాయతో పడుస లన్నాడు. బాగా కాగుతున్న నూనెలో నిమ్మకాయ చెక్కలు రెండు వేయించేశాం అంటే సురగా లేదు యేమీలేదు నూనె రకమే మారిపోతుందండన్నాడు. కాగా అన్ని రకాలవంటకాలూ అయ్యాక నేనండి పకోడీ తయారుకారణమూ, తతిమ్మా వాటికి ఉల్లివాసన రాకుండానూ పకోడీకి ఎల్లాంటినూనె అయినా సరే రుచి లోటులేక పోవడమూనండి. కాగా పూసాబూంది వగైరాలన్నీ దూసేసినతర్వాత ఆ ట్రూన్నిబట్టి కారే చమురూ, అడుగూ బొడుగూ

రమే లేదంటున్నాడు. అల్లాగా అన్నా. ఒకసారి రేమయిందనుకున్నారండి! తీపి ఒకటి చేద్దామని సెనగ పిండి పంచదార వగైరాలు గుచ్చెత్తడంలో యెల్లా కలిసిపోయిందో గానండి పొరబాటున టేబిలుసాల్టు కలిసిపోయిందండి. నాడు తయారయిన తీపిలో ఉప్పు కూడా ఉందన్నమాటండి! ఈ సంగతి ఒకళ్ళు దాని తిన్నదాకా మాకు తెలియనేలేదండి. వెంటనే యజమానితో ఈసంగతి చెప్పేశా, అని యేదో పొరబాటు జరిగుంటుందని. ఒక్క అరఘంట అటూ యిటూ తిరిగి తయారయిన పాతిక రూపాయిల సరుకూ పోగొట్టుకోలేక దాన్నంతా చిదిపేసి పాకం చెయ్యమన్నాడండి. కాగా మాచేత బుద్ధిపూర్వకంగా యింత కారప్పొడి కలిపించాడండి. నాటి స్వీట్సు లిస్టులో కొత్తపేరు "బాంబేమిక్సరు"! చూడండి దాని మజా! సాయంత్రానికి శాంపిల్ కికూడా మిగల్లేదండన్నాడు.

కొత్తసంగతులే చెపుతున్నావే అన్నా. యిన్నేళ్ళు హోటల్లో పనిచేసి యిదేమిట్రా యిల్లాచేశావు యీ వేళ అన్నమాట మీకు తెలుపడాన్ని, హోటలు రుచి వస్తే యింటివద్దరాదని మీకు నచ్చచెప్పడానికి, నగ్నసత్యాలు కొద్దిగా బైటపెట్టవలసి వచ్చిందండి. ఆరకంగా కొత్తరుచులు కావలసివుంటే హోటల్లోనే తెప్పించుకోండి, నన్ను చంపక. యెంత హోటల్లో బ్రతికినా యింటిపట్టున అల్లా చెయ్యడం నాచేతా గాదండి నాతరమూ గాదండి అన్నాడు మా గోపాలం.

బాగానే వుందిగాని ఆఖరికి నీవు చేసే సాంబారు కూడా పాకాన్ని పడదేం అన్నా. చెప్పాను కానండి కిలకం, అన్నింటికీ ఒకటే మంత్రంఅండి. సాధారణంగా హోటలుసాంబారు తరివాణీలాంటి దండి. కుండ మార్చినంతసేపూ నిజానికి దాంట్లో పదేళ్ళక్రితం బాపతు నశేషంకూడా, విశేషమయి వున్నదన్నమాటే నండి. మిగిలిన పప్పూ, అదీ రసరూ కలగలుపై వుండిపోయిన ఇంగాణీ గుంపులు లగాయితు వంకాయి కాకరకాయ వగైరా గూనకత్తిరి కాలకూరల తాలూకు నశేషాలతో కలసిపోయిన విశేషమే యిడ్లీలోని సాంబారం టన్నాడు. కాగా యిన్ని కొత్తవుల్లిపాయ ముక్కలతోపాటు మళ్ళీ ఒకసారి పోయిపూద కెక్కుతుందండి. అవసరాన్నిబట్టి ఉప్పూ కారం వగైరాలు దాని మొఖాన్ని కొడతాంఅండి. అదీరసం, మైసూరు రసంలాంటివి కలవడాన్నేనండి ఒక్కొక్కప్పుడు సంగాయంసాంబారులో యింగువవాసనన్నాడు. కాగా వేడి ఒకరుచి, కొత్తఒక వింతా అంటాన్నండి హాట్ హాట్ యిడ్లీతో కలిపి అక్కడ వెడితేనండి రుమద్దాకా పోకుండానే గుటకాయ స్వాహా అయిపోతుందండన్నాడు.

ఇంకయేం అడుగుతే యేంవిని, వాటన్నింటిపైనా పుట్టబోయ్యే అసహ్యంచేత, మళ్ళీ యేకాశీ దాకా పోవాలో వాటినివదిలి పెట్టడానికని మరింక పలకరించలేదు మా గోపాలాన్ని, కాశీదాకా యెందుకంటారా? మరి అక్కడేగా మనకయిష్టమయినవీ జన్మలో అంతవరకూ తిననివీ యింకముందు తింటాం అని తోచనివీ వదిలెయ్యడం! దేముని మీద వుండుకున్న పరమభక్తి శ్రద్ధలతో!! మోక్షార్థులమై !!.



# సాహిత్యోద్యమం

శ్రీ పిల్లలమర్రి వెంకట హనుమంతరావు.

'సాహిత్యోద్యమం' అనగానే - సాహిత్యమనే ఉద్యమం-అనే అర్థాన్ని వ్యక్తీకరిస్తుంది ఆపదం. లేకపోతే ఒక ఉద్యమం సాహిత్యపరంగా ఉన్నట్టిది అనీ అర్థంస్ఫురిస్తుంది. ఉద్యమం అనే పదం మన కెక్కువగా రాజకీయ రంగంలో అగుపిస్తున్నది. అక్కడే ఎక్కువగా చెల్లుబడి పొతున్నది. కాని సాహిత్యపరంగా వాడడం అంతగా సిద్ధముకాదు. అందుచేత సాహిత్యోద్యమం అనే పదం కొత్తగా కన్పిస్తుంది. అయినా దీని పరమార్థాన్ని గ్రహిద్దాం.

ఉద్యమంగా సాహిత్యాన్ని స్వీకరించాలి అనే సిద్ధాంతం యీనాడులోకంలో బలీయంగాఉన్నట్లు చూస్తున్నాము. రాజకీయ ఉద్యమాలను ఉద్దీపనం చేసుకోవడానికి సాహిత్యం ఉపయోగపడాలి అనే సూత్రాన్నీసిద్ధాంతీకరిస్తున్నారు నవ్యులు. ఈవిధంగా సాహిత్యాని ఉద్యమంగాను - తదితరోద్యమాలకు సాహిత్యాన్ని ముఖ్యాంగంగాను గ్రహించాలి అనే భావం చక్కగా ఉద్భవించింది. ఈ రెంటిలోఉన్న రహస్యాన్ని పరిశీలించుదాం.

నన్నయభట్టు దగ్గర్నుంచి నాటాకొచ్చిన సాహిత్యంలో ఎన్నెన్ని మార్గాలో అగుపిస్తున్నవి. వివిధ మతాలకు అవకాశం ఇచ్చిన వివిధ రచనల్ని చూడ గల్గుతాం. ఉపనిషత్తులలో సత్యం - శివం-సుందరం అనే పరమాశయాలను ఇముడ్చుకున్న మహాతత్త్వాన్ని వదిలపరిచారు పూర్వులు. తరువాతవచ్చిన పురాణాల లో దాన్నే మరోవిధంగా ప్రదర్శించారు. అట్లు తర్వాతవచ్చిన ప్రబంధాలలో లౌకిక సుఖాన్ని చిత్రించి అలౌకికానందం ఎంత మహత్తరమైనదో తారతమ్య వర్ణనపైన ప్రకటించే ప్రయత్నం చేశారు. 'తుచ్ఛసుఖముల్ నిరాశాలపై తేనియల్' అనే భావాన్ని ప్రకటించి ఉత్తమ ఆనందసిద్ధికై యత్నించాలి అని ప్రబోధ సలపడంలోకూడా పై ఉపనిషత్సారం లీలగా ప్రతీయమానం అవుతూ నేఉంది. తర్వాతవచ్చిన వచన గ్రంథాలలో - యక్ష గానాలలో - గేయాలలోకూడ ఉత్తమ మానవత్వాన్ని గుర్తించేటందుకు సాధనం జరగకపోలేదు. ఇటీవల వచ్చిన నవ్య కవిత్వంలోకూడా కావ్యభాషకే ముఖ్యంగా భేదించినా, అందులో నిగూఢంగా దాగిఉన్న సూత్రం సౌందర్యోపాసనమే. ఈవిధంగా విశ్వ సత్యాన్ని, సౌందర్యాన్ని, ప్రకటించడంలో ఏనాటి కవులైనా ప్రయత్నిస్తూనేవచ్చారు. కనుక కవితా వ్యాపారం అంతా ప్రధానంగా ఒకే సంప్రదాయం మీద ఆధారపడింది. మానవతత్వాన్ని విశదంగా ప్రకటించి అందులోనుంచి ఉద్భవిస్తున్న [illegible] పొందించి పరతత్వంలో ఉన్నతి కల్పించడమే ప్రధానంగా కవియొక్క కర్తవ్యం. ఈ ప్రధాన సూత్రాన్ని ఉపనిషత్తులకు-శాస్త్రాలకు-పురాణాలకు ప్రబోధించడానికి [illegible]. అంటే ఈ సూత్రపు [illegible] సాహిత్యాన్ని ఉద్యమంగా స్వీకరించాలి [illegible]. [illegible] అను [illegible] ఉండడంవల్లనే సాహిత్యంలో [illegible] ఉద్యమాలు వచ్చినట్లు తెలుస్తున్నాయి. [illegible]

సాహిత్యాన్ని విభజించినా ప్రయత్నం అంతా ఒకే లక్ష్యానికి కేంద్రీకరింపబడిందని చెప్పుకోవాలి. కనుక ఉత్తమ మానవధర్మాలను ఉపదేశించడానికి వివిధ కవులు వివిధ పద్ధతుల సాహిత్యాన్ని నడిపించి వివిధోద్యమకారులైనారు. సాహిత్యాన్ని ఉద్యమంగా గ్రహించిన పద్ధతిలో రహస్యం ఇది.

ఇక సాహిత్యాన్ని తదితరోద్యమాలకు ముఖ్యాంగంగా గ్రహించాలి అనే విషయాన్ని ఆలోచించుదాం. రాజకీయము - వాణిజ్యము - మొదలైన విషయాలలో ఉద్బోధ కల్గించడానికి సాహిత్యాన్ని ఉపయోగించుకోవలెనని ఇటీవలవారి కుతూహలం ; అనగా ఒక్కొక్క ఉద్యమానికి ప్రచారం కల్గించుకునే నిమిత్తం సాహిత్యాన్ని ఆశ్రయించడం అన్నమాట. ఆవిధంగా బయలుదేరే 'సాహిత్యం' పరిమితావకాశం కలిగింది అవుతుంది. ఆ ఉద్యమం ప్రాచుర్యంపొంది ఫలవంతమయ్యేదాకా నేగదా ఆ విధమైన సాహిత్యం పనికివచ్చేది? ప్రయోజనం నెరవేరిం తర్వాత ఆవిధమైన ప్రచారకసాహిత్యం స్థితిలేక పోయిందే అవుతుంది గదా ! అందుచేత ప్రచారక సాహిత్యం ఆనేటటువంటిదాన్ని 'సాహిత్యం' అనే పదంతో వ్యవహరించడం పొరబాటే అవుతుంది. అది వాఙ్మయం - సారస్వతం - అవుతుందేమో కాని, శాశ్వతత్వం కలగిన కావ్యసంచయానికి వర్తించే 'సాహిత్యం' మటుకు కాదు. ఉద్యమప్రచారం నిమిత్తం వాఙ్మయాన్ని ఆశ్రయించవచ్చు ; కాని ఆ వాఙ్మయం తాత్కాలిక ప్రయోజనంకలదై కాల గర్భంలో కలిసిపోతుంది. శాశ్వతత్వంకలిగి సర్వమానవ సముద్ధరణం - నిమిత్తంగా జనితమైనది కాక పోవడంవల్ల ప్రచారక వాఙ్మయం సాహిత్యస్థితిని అందలేదు. ఇది తదితరోద్యమాలకు వాఙ్మయాన్ని వినియోగించుకున్నందువల్ల కలిగేస్థితి.

సాహిత్యం సాహిత్యంకోసమని ఉపయోగించుకుంటే అప్పుడు తత్ప్రచారానికి సాహిత్యాన్ని ఉద్యమంగా స్వీకరించుకోవచ్చు. ఇంటింటా, ఊరూరా సాహిత్య దీపాలను వెలిగించవలసిన కర్తవ్యం ఈనాడు అధికంగా మనమీద ఉన్నది. సాహిత్యాభిరుచి కల్గించాలి. అందుకోసం ఉద్యమంగా సాహిత్యాన్ని గ్రహించాలి కాని సాహిత్యాన్ని రాజకీయోద్యమాలకు ప్రచారంగంగా స్వీకరిస్తే కలిగే పర్యవసానాన్ని ముందే చెప్పాను.

ముఖ్యంగా సాహిత్యార్చకులీనాడు సార్వకాలికముగా-సార్వజనీనముగా అభిమానింపబడే రచనావ్యాపారంలో ఎక్కువగా కృషిచేయవలసి ఉన్నది తాత్కాలిక ప్రయోజనాన్ని అపేక్షించి, మానవ సూత్ర గ్రథనంలో ఉపేక్షచేయరాదు. ఉత్తమ మానవులనుగా సంస్కరించేరచనలు అవతరించాల్సిన అవసరం ఎంతైనావున్నది యీనాడు, ప్రపంచశాంతికి పాటుపడవలసిన బాధ్యత కవిపై వున్నది ; కుల తత్వ భేదాలను వర్గవైమనస్యాలను - తొలగించి సంఘంలో శాంతిని నెలకొల్పాల్సిన అవసరం ఎంతైనా వున్నది. దీనికంతకూ ఉత్తమాధికారి సాహిత్యరంగంలో ప్రవేశించాలి. ప్రబోధ వాఙ్మయంకన్న మానవత్వాన్ని నిలిపే సాహిత్యం శాశ్వతత్వం పొందుతుంది. కాబట్టి సాహిత్యంపైన అభిరుచి కల్గించే రచనలు. సాహిత్య సౌందర్యాన్ని వ్యక్తీకరించే రచనలు-సాహిత్యార్చకులు చేయవలసివున్నది. అంటే సాహిత్యాన్ని ప్రచారంచేసే నిమిత్తం పాటుపడాలి అన్నమాట, 'సాహిత్యోద్యమం' ఈ అర్థంలో చాల అవసరం. సాహిత్యం వుద్యమంగా పరిణమించాలి. అంతేగాని వాఙ్మయాన్ని ఒక ఉద్యమ ప్రచారానికి అంగంగా స్వీకరించి దాన్నే సాహిత్యం అనడం చాలా పొరపాటవుతుంది.

